ప్రథమ ముద్రణ : వృష, కార్తీకము

ప్రతులు : 1000




ప్రతులకు :

**ఇ.యస్.యల్. నారాయణ**

C/o మాస్టర్ ఇ. కె. పబ్లికేషన్స్

శ్వేత ద్వీపము, చినముషిడివాడ

(వయా) పెందుర్తి, విశాఖపట్నం - 531 173.

ఫోన్ : 764273

**మైత్రేయ ప్రచురణలు**

5-78-21, 3/4 అశోక్‌నగర్,

గుంటూరు - 522 002.

ఫోన్ : 240872




ముఖచిత్రం : దేవీప్రసాద్

**వెల : 50/-**

*This book is Published with the financial assistance of* **Tirumala Tirupathi Devasthanams** *under the scheme* **AID To PUBLISH RELIGIOUS BOOKS**

ముద్రణ :

**లక్ష్మీ గణపతి ఆర్ట్ ప్రింటర్స్**

2/1, బ్రాడీపేట, గుంటూరు - 2

ఫోన్ : 235036



# గురుస్తుతి

నమస్తే విశ్వరూపాయ కుంభకోణ నివాసినే
నమస్తే బ్రహ్మ రూపాయ సి.వి.వి. గురవే నమః

నమస్తే ప్రేమ రూపాయ రాజయోగ ప్రబోధినే
నమస్తే కర్మనాశాయ సి.వి.వి. గురవే నమః

నమస్తే పరతత్త్వాయ నమఃపూర్ణ తేజసే
నమో గ్రహాధినాథాయ సి.వి.వి. గురవే నమః

నమస్తే అణురూపాయ కుండలినీ స్వరూపిణే
ప్రణత జనార్తినాశాయ సి.వి.వి. నమోనమః

ఆ బ్రహ్మాండ పరివ్యాప్త సూక్ష్మ దేహస్థితాయచ
ప్రాణశక్తి ప్రసారాయ సి.వి.వి. గురవే నమః

# కృష్ణమ్ వందే జగద్గురుమ్

ఎవరయ్యా స్వామి  నీవు ఎవరయ్యా నీవు ?
ఉద్యోగివా సద్యోగివా ?
మానవుడివా మహాత్ముడివా ?
ఆత్మవా పరమాత్మవా ?
అచ్ఛమైన జ్ఞాన శిఖవా ?
స్వచ్ఛమైన ప్రేమ ఝురివా ?
వెన్నుడవా వ్యాసుడవా ?
ఈశుడవా జీససువా ?
ఎవరయ్యా స్వామి నీవు ఎవరయ్యా నీవు ?
సర్వజీవ చైతన్యపు సమాహార స్ఫూర్తివా ?
సర్వదేవ హృదయ స్థిత కారుణ్యపు మూర్తివా ?
ప్రాక్ పశ్చిమముల నడుమ  వారధి సంధించినావు
ప్రాక్ దిశ వెలిగెడి సూర్యుని  పడమట పొడిపించినావు
మానవతా సౌరభాలు గుబాళించు గురుమూర్తివి !
మమతల సిరివెన్నెలలను చిందించే చిన్మూర్తివి !
నీ వెలుగును అందరిలో నింపినట్టి మహాత్మవు
మానవ మానస హంసవు  మహిలో వెలసిన వేల్పువు
అందుకొనుము మా అక్కతో భావార్ధ ప్రకాశమాల
కురిపింపుము మాపై నీ ఆశిష కరుణార్ద్ర లీల !
కురిపింపుము  జగతిపైన నీ ఆశిష ప్రసూనహేల !

# అంకితం



శ్రీమాన్ ఎక్కిరాల కృష్ణమాచార్య శ్రీమతి అప్పమ్మ దంపతులు

ఏజన్మల మా అమ్మవో ఈ జన్మన మా అక్కవు
మక్కువతో నీ కిచ్చితి అక్కా నీ కీ యుపదను
నీ హృదిలో అధివసించు మా దేవునితో స్వీకరించు
భావార్థ ప్రకాశహేల వేదార్థ ప్రసూనమాల !

తమ్ముడు

ధారా రాధాకృష్ణమూర్తి

# HYMN TO ASWINS

*Hail to you, O Pair Divine,*
*With Prayers and Hymns of mine,*
*You are the first-born Priests,*
*O Rays Variegated and to the East, Pre-Easts.*
*Spreading your wings of splendour,*
*You preside over and move the worlds under,*
*And ever move, far and asunder.*
*Untouched by the states atomic, O Lords of Measures,*
*You bless the Cosmos with Pleasures and Treasures.*
*With golden light around unfurled,*
*You traverse from world to world.*
*With noses well shaped and bright,*
*You with your wings the web of the world weave straight,*
*Maiking the rays, warp and weft, black and white.*
*I pray to you, O Symbols of Success,*
*To shower your blessings in excess.*
*You bring out our powers latent,*
*And for the welfare of the world use our talent.*
*In shimmering red you move up and down to bless,*
*And make the worlds, Abodes of Bilss.*

*One wheel Eternal, rotates on Truth's axis,*
*With divisions twelve and centres six,*
*The gods preside over the wheel and form a plexus,*
*Merging and emerging as per the nexus.*
*O Aswins, as you perform duties diurnal at the wheel as sport,*
*I pray for liberation from misery and with you an eternal rapport.*

**- *Vedavyasa*** **(Mahabharatha)**

*English Rendering :* Dhara Radha Krishna Murthy

# ఋషిఋణం

"నాట్యావధాన స్రష్ట"
డా॥ ధారా రామనాథశాస్త్రి

ఇ.కె. నివాస్,
మామిడి పాలెం, ఒంగోలు

ఒక సందర్భంలో ఇష్టాగోష్ఠిలో ఉన్నప్పుడు తమ్ముడు చి॥రాధాకృష్ణమూర్తితో అన్నాను. "మాస్టరుగారు తమ గ్రంథాల్లో సందర్భానుసారంగా వేద, పురాణేతిహాస, కావ్య, తత్త్వ శాస్త్రాల్లోని మాటలకి మంచి వివరణ ఇచ్చారు. వాటిని సంకలనం చేస్తే అది "ఆధ్యాత్మిక భావసర్వస్వము'' అనదగిన ఉద్గ్రంథముగా రూపొందుతుంది''-అని. బహుశా అలా అంటున్నప్పుడు మాస్టరుగారు నా వాక్కున అధివసించారేమో అదే ఇచ్ఛాశక్తిగా పనిచేసి తమ్ముడికి క్రియాజ్ఞాన శక్తులను ప్రసాదించి ఒంటి చేతిమీదుగా ఇంతమంచి సంకలనాన్ని రూపొందించేట్లు చేసింది. అకారాది క్షకారాంతం పదాలని క్రోడీకరించి మాస్టరుగారి మాటల్లోనే వివరణ అనుసంధించి మహత్తర గ్రంథం రూపొందించాడు. ఈ గ్రంథం అనర్ఘములైన మణిమాణిక్యాలతో నిండిన హారంలాగ గురురూప శారదాగళ సీమ ముప్పేట తారహారంగా మురువులొలుకుతూ సంకలనకర్తకి అనన్యగణ్యాత, ధన్యత అనుగ్రహిస్తుంది.

తమ్ముడికి పరిశోధన విద్యలో మంచి చొరవ ఉన్నది. బదిలీల వంటి ఔద్యోగిక అవరోధాల వల్ల తన డాక్టరేటు కృషి కడ ముట్టలేదు. కాని అరవిందుల సావిత్రి పై క్షోదక్షమమైన పరిశోధన చేశాడు. మరో మిత్రుడు చేసిన గోదావైభవ పరిశోధనకు సంపూర్ణ సహాయ సహకారాలందించాడు. ఇటీవల నా నాట్యావధాన, సాహిత్యాల మీద పరిశోధన చేస్తున్న విదుషికి సాయపడుతున్నాడు. విద్యలలో గుప్తవిద్య, దానములలో విద్యాదానము మేలైనవి. అంచేత కూడా తమ్ముడు ధన్యుడు.

మానవుడు తన జీవితకాలంలో ఋణత్రయ విమోచనం చేసుకోవాలి అని పెద్దలు చెప్పారు. యజ్ఞయాగాది క్రతువులు, దేవతారాధన దేవఋణానికి, ప్రజాతంతువును విచ్ఛేదం చేయకుండటం పితౄణానికి, పెద్దల గ్రంథాలని చదివి, చదివించి అందలి సద్భావాలను వ్యాప్తి చెందించటం ఋషిఋణానికి విమోచన మార్గాలు. బహుకాలం అధ్యాపకుడై ఉన్నందున, సద్గ్రంథ పఠనము, రచనము చేసి ఉన్నందున కళాకృషిలో అంతర్దర్శనాన్ని పొందటం వలన, ప్రత్యేకం ఈ సంకలన గ్రంథం వల్ల నిస్సందేహంగా అతని ఋషిఋణం తీరిందనుకుంటాను. ఇతడు ఆంధ్రాంగ్లసాహిత్యాలను కూలంకషంగా అధ్యయనం చేశాడు. శ్రీ, జంటపక్షులు, మనిషి మొదలైన ఉత్తమ నాటకాలు సృష్టించాడు. వ్యాసునిస్వప్నం లాంటి మంచి కావ్యాన్ని రచించి పీనుమిగిలిన కవిపండితుల ఆశీస్సులందుకున్నాడు. అనేకానేక వేద ఋక్కులను మధురమైన ఆంధ్రభాషలోకి అనువదించి వైదిక విద్యా వ్యాప్తికి దోహదం చేశాడు. ఆంధ్రాంగ్లాలలో ఉదాత్త విషయాలపై పఠన యోగ్యమైన వ్యాస పరంపర

వెలయించాడు. గురువుగారు నిర్దేశించిన మార్గంలో హోమియోవిద్యను అభ్యసించి రోగార్తులను సేవిస్తున్నాడు. మంచి గృహస్తు. ఇవన్నీ కాక నాకు నాట్యావధాన విద్యలో అనుచరుడై తన కళాకౌశలానికి వన్నె తెచ్చుకుంటున్నాడు. సాధకుడు, మంచినటుడు, ప్రయోక్త. ఇన్ని సంగతులు ఇంత వివరంగా చెప్పింది ప్రశంసకై కాక ఋణత్రయ విమోచనానికి ప్రస్తుత జన్మను సంపూర్ణంగా వినియోగిస్తున్న తమ్ముని పట్ల నాకున్న ఆశీఃపూర్వకమైన వాత్సల్యభావం వల్ల, ఇతోధిక సన్మంగళాలు అతనికి సిద్ధించాలి అనే కోరిక వల్ల.

అది అలా వుంచి సంకలన కర్త తమ్ముడే కాబట్టి తెలిసిన మేరకు, వలసిన మేరకు అన్ని సంగతులూ చెప్పాను. మరి ఎవరి భావాలను ఇతడు సంకలనం చేశాడో వారిని గురించి ? చెప్పాలి, చెప్పగలనా ?

కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్యులవారి రంగప్రవేశంతో తత్త్వ, యోగ, సేవా, సృజనాది రంగాలలో అంతకుముందు అమలులో ఉన్న ప్రమాణాలు, చట్రాలు, మూసకట్లు అన్నీ పటాపంచలై, పంచబంగాళమై సూర్యకాంతికి మంచులాగా చెల్లాచెదరైనాయి. వాటి స్థానంలో అఖిలభారతంలోనే కాక అంతర్జాతీయ స్థాయిలో కూడా కొత్త విలువలు నెలకొన్నవి. కొత్తలోని వింతను, పాతలోని రోతను తొలగించి చూస్తే ఎల్లకాలాలకీ, ఎల్లదేశాలకీ, ఎల్ల జనాలకీ కార్యకారులైన ఈ విలువలను అస్మదాదులం - అనగా తొలినాళ్ళనుండి ఆయన చరణములే శరణములని భావించి జీవించుచున్న వారము - త్రికరణశుద్ధిగా స్వీకరించి సత్ఫలితాలను అనుభవిస్తున్నాం. అన్నిటినీ ఎన్నడం నా తరం కాదు. కానీ స్థూలారుంధతీ న్యాయంగా కొన్నిటిని పేర్కొంటాను. జీవితరంగంలో కలసివచ్చిన వారు అదృష్టాన్ని, రానివారు కర్మను కారణాలుగా చేసి కార్యదూరులై వ్యక్తిత్వాలని వమ్ముచేసికొని తమ సంకల్పాలనీ, కృషినీ ఒక ధ్యేయానికి ఉన్ముఖంగా నడిపించుకోలేని వారంటే మాస్టరుగారికి కోపం. అలాంటి వాళ్ళని శఠకోపయతి లాగా కోపించరు గానీ దగ్గరకు తీసి లాలించి, ప్రేమించి నవజీవన పథాన్ని నిర్దేశించి నడిపిస్తారు. అలా మాస్టరుగారి స్పర్శవల్ల ఉద్ధరింపబడ్డవాళ్ళని నేను కొన్నివందలమందిని ఎరుగుదును. ఆయనకి కృషిలో అపారమైన నమ్మకం. పుస్తకాలు చదవడం, ప్రవచనాలు చేయడం, విద్యావైద్యసేవ, సమస్యా పరిష్కారం అన్నింటినీ మించి తమ అమృతవాక్కులచేత, శీతల దృక్కుల చేత వ్యధిత హృదయాలను ఆశ్వాసించి ఆనంద కక్ష్యలకి తీసుకొని వెళ్ళడం- ఆయనకి ఇరవై నాలుగు గంటల కార్యక్రమం. కొలదిగా నిద్రించే వేళలు తప్ప ఆయనిది ఇదే చైతన్యం. ఆర్ష సంస్కారం అనుగ్రహించటంలో ఆయన బహుశా భగవద్రామానుజులకే ద్వితీయుడు. రోమన్ కాథలిక్ శిష్యులచే కూడా వేద పారాయణం చేయించి యజ్ఞయాగాది క్రతువులు జరిపించి వారికి భారతీయ మార్గంలో ఉపనయన వివాహాదులు జరిపించటం మా కళ్ళతో చూచాం. కొంపలంటుకోలేదు, వేదం

మైలపడలేదు, భారతీయత భ్రష్టుపట్టలేదు. ఆ మాటకి వస్తే సద్భావ బృంహణత్వం బ్రాహ్మణధర్మం అయితే అది అనంత ముఖాల విస్తరించి విశ్వాన్ని Brahminise చేస్తున్నది. బానిసత్వపుటుచ్చుల్లో ఉద్యోగాలవేటలో చిక్కుకుని యువకులు వడియాలలాగా ఎండిపోవటం మాస్టారికి సుతరామూ ఇష్టంలేదు. కృషి - స్వయం ఉపాధి- పరోపకారం అన్న మూడు కేంద్రాల మధ్య యువకులు తాము జీవించి మరికొందరిని పోషించే ప్రణాళికలు తయారు చేసి అమలులో పెట్టి చూపారు. ఆయన పిల్లల్ని కూడా ఉద్యోగాల జోలిపోనీక సద్యోగవిలసన్మూర్తులుగా మలచారు. అందరూ హోమియో అధ్యయనం చేయాలని, వైద్యాలయాలు ఉచితంగా నడిపి, కులమత వర్గ భేదం లేకుండా సమాజంలో అందరికీ సేవ చేయాలని ఆయన ఆశయం. హోమియో ఎందుకంటే అది సశాస్త్రీయమై అందరికీ అందుబాటులో వుండే వైద్యవిధానం కాబట్టి. అందరూ జ్యోతిషం చదవాలి.జ్యోతిషం అంటే మన Idle curiosity ని రెచ్చగొట్టి నిర్వీర్యులను చేసే విద్యకాదు. వరాహమిహిరాది ఋషీంద్రులు దర్శించిన మార్గంలో మానవులకి తమ జీవితవిధానాన్ని మలచుకునే ఉపాయం చెప్పే వెలుగుబాట. ఆయన ఎందరికో ఈ విద్య నేర్పగా వారందరూ హేతుబద్ధము, శాస్త్రీయము అయిన పై దృక్పథంతో సమాజాన్ని సేవిస్తున్నారు. సర్వమత సమన్వయానికి, వేదం బాగా అర్థం కావటానికి అందరూ థియాసఫీ చదవాలంటారు మాస్టరుగారు. ఆయన చదివారు, చదివించారు. మాస్టరుగారి యోగసాధన అనన్యమైనది. నవయుగానికి అనుకూలమైన మాస్టర్ C.V.V. భృక్తరహిత తారక రాజయోగాన్ని సాధనచేసి విశేషానుభూతిని పొంది ఆ యోగంలోని సౌలభ్యమూ, సంభావ్యత, శాస్త్రప్రామాణ్యం మొదలైన అంశాలమీద అనేక గ్రంథాలు రచించారు. అంతకుముందు ఏ కొద్దిమందికో పరిమితమైన మాస్టర్ CVV యోగాన్ని విశ్వవిశాలం కావించి ఇప్పుడాయోగ పరంపరలో తాను మాస్టర్ EK గా ప్రకాశిస్తూ సాధకుల్ని అనుగ్రహిస్తున్నారు.

ఈ మొత్తం వివేచననీ విహంగవీక్షణం చేసుకుంటే విశ్వప్రేమశీలి అయిన ఒక కర్మయోగి, ఒక జ్ఞానమూర్తి విశ్వశ్రేయంకోసం తన సర్వస్వాన్ని సమర్పించి అమృతత్త్వం అందినట్లు ఈయుగంలో ఆ వెలుగు పేరు లౌకికంగా కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్యులనీ, యౌగికంగా మాస్టర్ EK అనీ తెలుస్తుంది.

ఆయన లోకానికి చేసిన మేలును గురించి, ఆయన ప్రతిభా విశేషాలను గురించీ ఎంత చెప్పినా యశోదమ్మ కన్నయ్యను కట్టెయ్యడానికి తెచ్చిన త్రాడులాగా కొంచెం తగ్గుతుంది. పెద్దత్రాడు తెస్తే మూర్తి పెరుగుతుంది కానీ మనత్రాడు అంటే మన విశ్లేషణ పద్ధతులు, వివేచన ప్రమాణాలు చాలవు. అయినా సరే ఎక్కడో ఒక పథనిర్దేశం చేసికొని ఆలోచించి వీలైనంత వరకూ నలుగురికీ తెలియజెప్పడం మన సంప్రదాయం కదా! ముఖ్యంగా

సాధుపుంగవుల సంస్మరణంలో. అది ఎలాంటిదంటే వాక్కుకీ మనస్సుకూ అందని విషయాన్ని వాక్కుతోనే చెప్పటం, మనస్సుతోనే మననం చెయ్యడంలాంటిది. "యతోవాచో నివర్తంతే అప్రాప్య మనసాసహ...." అన్నట్టు.

మాస్టరుగారి విద్య గొప్పది. లోకవృత్తానికి ఆయన ఎం.ఏ. చదివి కొన్నాళ్ళు అస్మదాదులకు తెలుగుపాఠం చెప్పి అటుపైన డాక్టరేటు పొంది విశ్వవిద్యాలయంలో ఆచార్యులై - ఇది మామూలు బయోడేటా. అసలు విషయమేమిటంటే: వేదమూ, ఆయుర్వేదము, చప్పన్న శాస్త్రాలు ఆపోశన పట్టటమేకాక కొత్త కోణంలో వ్యాఖ్యానించగల పితృపాదులు అనంతాచార్యులు ప్రసాదించిన విద్య ఒకవైపు, ఏ పుస్తకంపైన చెయ్యివేసినా, ఏ శాస్త్రాన్ని పరిశీలించినా అందలి ఆంతర్యాలన్నీ ఆయన సంస్కారంలో భాగంగా ఇట్టే ఒదిగిపోయే జన్మాంతరాగత ప్రతిభ మరొకవైపు, గురుమూర్తులు, దృశ్యాదృశ్య సిద్ధపురుషులు అనుగ్రహించిన ఆధ్యాత్మిక విద్యా వైశద్యం ఒకవైపు, ఆయన్ని మనముందు నడుస్తున్న సజీవ విద్యాసర్వస్వంగా నిలిపాయి. అంచేత ఆయన ప్రతిభా విశేషాలనిగానీ, చదువు సాముల్నిగానీ, ఋషిత్వంతో పెనవేసుకున్న సృజనని కాని త్రైపారువేసి చూపడం నాలాంటి వాళ్ళకే కాదు కొమ్ములు తిరిగిన వాళ్ళకి కూడా కుదరదు. ఎందుకని ?

కవిత్వము అందామా అంతర్గతానంద భూమికలను ఆవిష్కరించి ఆధ్యాత్మిక ప్రబోధంచేసే స్థాయి "రాసలీల" "గోదావైభ"వాది కావ్యాలలో గోచరిస్తుంది. జ్యోతిర్విద్య అందామా మామూలు శాస్త్ర కక్ష్యలను దాటి ఆధ్యాత్మిక జ్యోతిషాన్ని ప్రతిపాదిస్తారు. హోమియో అందామా అదొక దర్శనంగా, సాధనగా స్వీకరించి లక్షలాది రోగార్తులకు ఆరోగ్య భిక్ష పెట్టడమేకాక ఆ విద్యలో ఒక కొత్తకోణం దర్శించి ప్రామాణిక గ్రంథాలు వ్రాశారు. భాగవత రహస్యార్థాలు చెప్పబూనితే అయిదువేల ఏళ్ళ అనంతరం ఆ కథానాయకుడో, ఆ వ్రాయసగాడో మళ్ళీ అవతరించి సన్నిధి ప్రసాదించాడనిపిస్తుంది. వేద ఋక్కులు వ్యాఖ్యానించినా, సూక్తులను వివరించినా, స్తోత్రాలకు అర్థం చెప్పినా తొలినాటి యాస్కాదులు, అలనాటి ఆదిశంకరాదులు, ఈనాటి అరవిందాదులేకాక దివ్యజ్ఞాన సమాజం తాలూకు సిద్ధ పురుషులు ఎందరెందరో తమ మహస్సు, తపస్సు, వచస్సు ఓ తావున నిలిపి ఆధునిక సాధక బృందాన్ని ఆయన రూపంలో అనుగ్రహించారనిపిస్తుంది.

ఇలా ఆయన వాఙ్మయసృష్టిలో లోక హితార్థం ప్రవర్తిల్లిన ఒక అనుగ్రహవిశేషం అనంత ముఖాల్లో భాసించగా అందు కొన్ని అనర్ఘ రత్నాలని తమ్ముడు సేకరించి ఈ రత్నమాల కూర్చాడు. ఇందులో ఉన్న పదక్రమము, వివరణ, భావప్రకాశనము తర్కసహంగా, శాస్త్రబద్ధంగా ఉన్నది. అది కేవలం అకారాది క్షకారాంత క్రమం వల్లనే రాలేదు. గ్రంథం చదివి అర్థవివరణ ఆకళింపు చేసికొని పదేపదే మననం చేస్తూ వుంటే పూజా పురస్కారాల్లోనో,

పఠన పాఠనాల్లోనో ఆ పదం దొర్లినప్పుడు సాధకునికి మదిలో అర్థం భాసించి అనుభూతి నావిష్కరించే అవకాశం ఉన్నది. అయితే అందుకై ఆసక్తి, అనవరతకృషి అవసరం. ఒక ఉదాహరణాన్ని పరిశీలిద్దాం.

గకారాదిలో గణములు, గణపతులు, గాయత్రీ ఛందస్సు, గోపుడు, గోవు, గోళము, గంగ- అన్న వరుస పరిశీలించండి. ఉచ్ఛ్వాస నిశ్వాసాత్మకములైన ఉచ్చారణ రూపంలో నున్న వాగ్గణాధిపతుల సాధన, అటుపై గాయత్రి (మూడు లోకములతో కూడిన అష్టవసువుల ప్రవృత్తి సూచించు ఛందస్సు), ఆ పిమ్మట గీత (శ్లోకరూపము, సంగీతరూపము మాత్రమే కాక జీవుడు అలవరచుకొనవలసిన గానం), అనంతరము గోపుడు అనువాని దయ (భువనములకు రక్షకుడు ఇన్నిటియందు అంతర్యామి), పిమ్మట గోవు కేంద్రముగా గవాం అయనము, అటుపై మనలోనున్న "గోళములు" యజ్ఞపురుష ప్రతీకలై మానవ శరీరమున ఆవిష్కృతము లగుట, తుదకు దివ్య ప్రేమకు నివాసమైన జ్ఞాన "గంగ" యొక్క అవతరణము, అటుపై తాళ లయాత్మకమైన గాంధర్వ విద్యయందు లీనమగుట - అను ఒక క్రమాన్ని గమనిస్తే ఈ గ్రంథంలో విషయాలు సాధనకి సోపానాలుగా, మననమునకు మంత్రాలుగా ఉపకరిస్తవి. అవి వాఙ్మయసృష్టిలో మాస్టరుగారి అనుగ్రహ బుద్ధి.

దానిని పాఠకులకు సులభసుందర సంకలనంగా అందించిన చి. రాధాకృష్ణమూర్తిని అభినందిస్తూ అతనికి సకుటుంబంగా సమస్త సన్మంగళాలను ఆశంసిస్తున్నాను.

# నామాటలు

"నేను భూమికిదిగివచ్చిన కారణము రచనా వ్యాసంగము. ఇది తరతరములకు, రాబోవు యుగములకు సంబంధించినది" అని వ్రాశారు మాస్టరు ఇ.కె. మానవజాతిపై అపారకరుణతో, రాబోయే యుగాల్లో మానవజాతి సాధించబోయే ఆధ్యాత్మిక పురోగతి పట్ల అచంచల విశ్వాసంతో వారీ కార్యక్రమాన్ని నిర్వహించారు. ఆ పురోగతి దిశను, దశను నిర్దేశించేవి ఆయన గ్రంథాలు. నిజానికవి ఆయన రచనలనే కంటే ఆయన చేసిన దర్శనాలని అనటం సబబుగా వుంటుంది. ఆయన గ్రంథాలే దానికి నిదర్శనాలు. వేదద్రష్టలైన ఋషులు అపౌరుషేయ విజ్ఞానాన్ని తాము దర్శించి మనకందించినట్లు ఈ ఆధునిక ఋషి తాను పొందిన దర్శనాన్ని మనకందించారు. "జ్యోతిర్విద్య" (Spiritual Astrology) గ్రంథ పరిచయంలో ఈ విషయాన్ని చమత్కారంతో జోడించి మరీ చెప్పారు. "These are from those whom I follow to those who follow me".

కాలక్రమంలో తెగిపోయిన ఋషి సంప్రదాయానికీ, నవీన విజ్ఞానానికీ ప్రాచ్య పాశ్చాత్య సమన్వయ ప్రతీక అయిన మాస్టరు గారు వారధిగా నిలిచారు. పాశ్చాత్యులకు వైభవోపేతమైన వేదవిద్యను విప్పి చెప్పారు. వేదాలపట్ల, భారతదేశం పట్ల, వారికున్న అపోహలను పారద్రోలారు. భూమ్యాకాశాల సృష్టి క్రీ.పూ. 4004లో జరిగిందని నమ్మేవారికి ఇలా నచ్చ చెప్పారు. "ఇది నవీన శాస్త్రముతో గాని ప్రాచీన జాతుల వేద గ్రంథములతో గాని సరిపడదు. సృష్ట్యాది సంవత్సరములసంఖ్య పురాణముల గణనముతోను, నవీన జీవశాస్త్రకారులతోను (Natural Philosophers) విప్రతిపత్తి లేకుండ సరిపోవు చున్నది". (భావార్థప్రకాశిక పే. 90)

వారు కలం కదిలిస్తే అనేక శాస్త్రాలు, విద్యలు వారి ఎదుట చేతులు కట్టుకుని నిలుస్తాయి. ఒక జ్యోతిషమేమిటి? ఖగోళమేమిటి? మానవ శరీరతత్త్వ శాస్త్రమేమిటి? జీవశాస్త్రమేమిటి? గణితమేమిటి? వైద్యశాస్త్ర మేమిటి? యోగమేమిటి? అన్నిటిని సమన్వయిస్తారు. సమన్వయం ఆయన జీవలక్షణం. ఆయన సమన్వయమూర్తి! ఉదాహరణప్రాయంగా రెండు విషయాలు మనవి చేస్తాను. అత్యతిష్ఠత్ దశాంగులం - పైథగోరియన్ డెకాడ్, అన్న విషయాన్ని పదిచుక్కల బొమ్మగా వివరిస్తూ ఈక్రింది బహుశాస్త్రార్థ సమన్వయాన్ని అందించారు.

(1) ఈ పదిచుక్కల బొమ్మను ధ్యానమున కొక యంత్రముగా పూర్వులుపయోగించెడివారు. ఈ ధ్యానమున కాలగర్భితములైన యోగరహస్యములు, అనేక శక్తులు మానవునిలో మేల్కొనును. సరియైన నిగ్రహము లేనివారికి ఈ శక్తులు మేల్కొనినచో ఆపదలు కలుగును గనుక ఈ బొమ్మను రహస్యముగా దాచిరి. దీనికే మూడుతలల

దైవము లేక దత్తాత్రేయుడని ప్రాచీనులు, మణిపద్మడను పేరుగల సిద్ధరూపుడైన బుద్ధదైవముగా బౌద్ధులు ధ్యానించిరి. ఋషులు దత్తాత్రేయ మంత్రమును, బౌద్ధులు మణిపద్మ మంత్రమును ఉపయోగించిరి.

(2) ప్రాచీన కాలమున ఋషుల దగ్గర వేదరహస్యము పరమోపదేశము పొందిన పైథాగరస్ అన్న సిద్ధుడు దీనిని 'Decad' అనుమంత్రముగా పేర్కొని త్రిభుజముల మంత్ర రహస్యములను వివరించెను.

(3) కృతయుగము - 4 : త్రేతాయుగము - 3, ద్వాపరయుగము - 2, కలియుగము - 1. ఈ మొత్తము 4+3+2+1 = 10. ఈ మహాయుగము కలియుగమునకు 10రెట్లుండును. వేదములలో దీనిని 'దశాంగులమ్' అందురు. దీనిని సూచించుచు వేదములందు కాలపురుషుడు విరాట్ పురుషుడిగా దిగి వచ్చినపుడు రెండుచేతులకు గల పదివ్రేళ్ళ నొక్కమారుగా తెరచి చూపునని చెప్పబడినది.

అలాగే మహాన్యాసం గురించి వివరిస్తూ ఇలా అన్నారు : సదాశివలింగంలో 4 దిక్కులు, ఊర్ధ్వదిక్కు, అధోదిక్కు శివమయముగా నిర్మాణము చేయబడుచున్నది. ఈ నిర్మాణము శివాలయమునకు మూలప్రతీక. ఇందు నాలుగు దిక్కుల అంచులతో కూడిన నలుచదరమైన పీఠము, ఆ దిక్కులను బంధించు శిఖరములే ఊర్ధ్వమున, అధస్సున గోపురములుగా నేర్పడుచున్నవి. ఇందలి ఊర్ధ్వభాగమైన సగభాగమే స్వీకరింపబడి ప్రాచీన ఈజిప్టు ఆగమశాస్త్రమున 'పిరమిడ్' అను స్థూపముగా రూపొందినది. దక్షిణ భారతదేశము నుండి ప్రాచీన కాలమున వైవస్వతమనువు సకలయజ్ఞ విద్యలతోపాటు ఈవిద్యనుకూడా ఈజిప్టు దేశమునకు నడిపించు కొని పోయి స్థాపించెను.

ఎప్పుడో సోదరులు డా॥ రామనాథశాస్త్రి గారు నాతో అన్నారు. 'మాష్టరుగారు వారి గ్రంథాలలో చేసిన విషయ వివరణలను అకారాదిక్షకారాంతంగా కూర్చుచేస్తే మంచిగ్రంథమవుతుంది'. నేను 'తప్పకుండా చెయ్యి' అన్నాను. కొంతకాలం తర్వాత ఆప్రస్తావనవస్తే 'చెయ్యి' అన్నాను. సోదరుడు 'నువ్వేచెయ్యి, నేను కావలసిన సహాయాన్ని అందిస్తాను' అన్నారు. అలా చెయ్యడానికి నాకేవిధమైన అర్హతా లేకపోయినా, దాన్ని మాస్టరు గారి ఆదేశంగా భావించి 'గోదా' లోకి దిగాను. (అప్పుడు H.P. Blavatsky రచించిన A Theosophical Glossary అన్నగ్రంథం, Alice A. Bailey గ్రంథాలనుంచి ఒక అజ్ఞాతశిష్యుడు సంకలనం చేసిన 'Ponder on This' నా మనసులో మెదిలాయి. అందులో మొదటి గ్రంథం సంక్షిప్త వివరాల నందిస్తే, రెండోపుస్తకం ఒకేవిషయం మీద వివిధ గ్రంథాలలో చేసిన వివిధ వివరణలను అందించింది. ఈరెండింటికి మధ్యే మార్గంగా 'భావార్థ ప్రకాశిక' లో చిన్న వివరణ దగ్గరనుండి సుమారు తొమ్మిది పేజీల వివరణ వరకూ కూర్చాను.

బ్రహ్మముఖములు-వేదములు - విద్యలు అన్నది తొమ్మిది పేజీలు సాగిన వివరణ. గ్రంథ సమగ్రత్వం కోసం ఇలాంటి వివరణలను దీంట్లో చేర్చాను. ఈ విధంగా కూర్పుచేయబడిన అంశాలను పరిశీలిస్తే నాలుగు రకాలుగా వర్గీకరణం చేయడానికి వీలవుతుంది. (ఇదికేవలం విశ్లేషణా సౌలభ్యం కోసం మాత్రమేనని మనవి చేస్తున్నాను).

(I) బహుశాస్త్రార్థ సమన్వయం చేసే వివరణలు : సప్తర్షులు - సూర్యులు; అశ్వినీదేవతలు, జీవపరిణామము; భాగవతము; జీవుని సృష్టిరహస్యము; శింశుమారచక్రము; జగదండము; నాభి; కుమారస్వామి - కృత్తికలు; సగర పుత్రుల కథ - అంతరార్థము; సప్త వ్యాహృతులు; శ్రీచక్రము- ఒకసమన్వయము; ధనుర్విద్య - అస్త్రములు; సుపర్ణుడు - మనువులు మొ॥నవి.

(II) దార్శనిక సంకేతార్థ అర్థవాద వివరణములు : జయవిజయుల కథ - భాగవత సర్వస్వ రహస్యము; దక్షయజ్ఞ కథ - రహస్యార్థము; పదునెనిమిది- కీలక సంఖ్య; పంచారము - ఇతిహాసము; పక్షిలోకము- సుపర్ణుడు; తైత్తరీయము - పిట్టకథలు; దహరాకాశము; వృత్తుని కథ - అంతరార్థము.

(III) బ్రహ్మాండ-పిండాండ సమన్వయాత్మక వివరణలు: అణువు- బ్రహ్మాండ ధర్మములు - మానవుడు; అండము; అయోధ్య; బృహత్సామ - రథంతరీ సామ; సంధ్య; గోవు; గోళము; ప్రళయములు; అగ్నులు; వేదము (2); వృత్రాసురుడు; సృష్టి యజ్ఞము మొ॥నవి.

(IV) సంప్రదాయపు మడతల్లో మరుగుపడిన రహస్యార్థాలు : అత్యతిష్టత్ దశాంగులమ్ - పైథగోరియన్ డెకాడ్; ఆదిత్య వర్ణము; చిక్లీతుడు; రామంభజేశ్యామలమ్; నాగములు - సర్పములు; ఛందస్సులు; అశ్వమేధము; దేవాలయము; భద్రంకర్ణేభిః మొ॥నవి.

ఈ గ్రంథాన్ని కూర్పు చేసే సమయంలో మాస్టరుగారి సన్నిధి అనుక్షణమూ లభించింది. ఏరోజు ఏ గ్రంథం నాచేతికి రావాలో అది వచ్చేది. చిత్రంగా నాకన్ను పడవలసిన పేజి మీదే పడేది. ఒక అంశం వ్రాస్తున్నప్పుడు ఎక్కడ ప్రారంభించాలో, ఎక్కడ ఆపాలో వెంటవుండి వారు నిర్దేశించి నడుపుతున్నట్టుండేది. వారి మూల గ్రంథాలతో, కూర్చిన అంశాలను సరిపోల్చి చూచుకునేటప్పుడూ, ప్రెస్‌లో కూర్చొని ప్రూఫులు దిద్దేటప్పుడూ కూడా నాకు, సోదరుడు చి॥ రాఘవరావుకీ, అదే అనుభూతిని నిరంతరంగా అందించారు. 1988 గురుపూజల్లో శ్రీమాన్ అనంతకృష్ణకు చూపించాను. 'త్వరగా పూర్తి చేయండి వేసేద్దాం' అన్నారు. (మాష్టరుగారు కూడా సరిగ్గా అలానే అనుండేవారు.) ఆ సందర్భంలోనే మాస్టరుగారి ఆత్మీయులు, వారి హృదయమెరిగిన మనస్వి, మహాపండితులు శివశ్రీ మల్లంపల్లి శరభయ్య శర్మగారికి చూపించాను. వారు కొన్ని అంశాలు చదివి "అగ్ని తో ప్రారంభమై హరితో ముగించటం అద్భుతం" అంటూ తెగ సంబరపడ్డారు. (పుస్తకం పెరిగి పెరిగి 'ఓం' తో ప్రారంభమై "హ్రీం- హిరణ్య వర్ణాం"తో ముగిసిందనుకోండి. అది వేరే సంగతి.)

ముద్రణ పూర్తయిన తర్వాత ఆమూలాగ్రం చదివినప్పుడు భాగవతం గురించి మాస్టరుగారి వాక్యాలు గుర్తుకొచ్చాయి. "గ్రంథమంతయు ప్రత్యేకములైన జీవుని యుపదేశగుప్త విద్యలతో నిండియున్నది. ఇన్నియు భగవంతుని స్మరణలేనిచో కేవల శాస్త్రములగును. భాగవతమున కిది పనికి రాదు. అన్నియు వాని లీలలుగ గుర్తుంచు కొనినచో ఆడుచు పాడుచు విద్యలందు విప్పారుట జరుగును. ఇందేవిద్యకు స్వతంత్రమైన అస్తిత్వము లేదు. ఉన్నట్లు కనిపించినచో అది ద్రష్ట యొక్క అజ్ఞానము లేక బంధము అనబడును". (భావార్థప్రకాశిక 123-4 పేజి) ఈ వాక్యాలు ఈ గ్రంథం పట్ల యథార్థాలని నిర్మమంగా నిరహంకారంగా మనవి చేస్తున్నాను.

ఈ గ్రంథాన్ని కూర్పు చేసే అదృష్టాన్ని కల్గించిన మాస్టరు గారి దివ్యస్ఫూర్తికీ, మూర్తికీ శతకోటి నమస్కారాలు. దీని ప్రచురణకు ఉదారంగా ఆర్థికంగా సహాయ మందించిన తిరుమల తిరుపతి దేవస్థానం వారికి కృతజ్ఞతలు.

ఋషి ఋణం అనే పీఠికను కూర్చిన పూజ్య సోదరులు డా॥ ధారా రామనాథశాస్త్రిగార్కి నమస్సులు. ఈ గ్రంథాన్ని మాస్టర్ ఇ.కె. బుక్ ట్రస్ట్ ద్వారా ప్రచురిస్తున్న గురుపుత్రులు శ్రీమాన్ అనంతకృష్ణకు ప్రేమపూర్వక అభినందనలు అందజేస్తున్నాను.

శుద్ధప్రతి తయారుచేయుటంలో శ్రమించిన మా కోడలు చి॥సౌ॥ రేవతికి మాష్టరుగారి శుభాశంసనములు అందజేస్తూ, అహరహమూ ఈ ముద్రణా యజ్ఞంలో శ్రమంచిన సోదరులు చి॥ జి. వి. రాఘవరావుకు, గ్రంథాన్ని అద్భుతంగా ముద్రించాలని పట్టుదలతో కృషి సల్పిన శ్రీ బి.వి.యస్. శాస్త్రి గారికీ, ఈ గ్రంథ ముఖచిత్రాన్ని ఇంత సుందరంగా చిత్రించిన చిత్రకారులు దేవీప్రసాద్‌గారికి అభినందనలర్పిస్తూ సహాయసహకారాలందించిన దృశ్యాదృశ్యమూర్తులకు అంజలి ఘటిస్తూ, మాష్టరుగారి విశ్వరూపంలాంటి సహృదయ సోదరులకు ఈ గ్రంథాన్ని సమర్పిస్తున్నాను.

- ధారా రాధాకృష్ణమూర్తి

# అభినందన

బ్రహ్మశ్రీ ధారా రాధాకృష్ణమూర్తి గారి ద్వారమున ప్రకాశములోకి వచ్చిన **భావార్థ ప్రకాశిక** మాస్టరు గారి అనుగ్రహానికి ఒక చిహ్నము. మాస్టరు ఇ.కె. గారి గ్రంథాలలో వేదవిజ్ఞానము ఆసాంతము విస్తరించి యున్నదన్న సత్యము పాఠకులెల్లరకు అనుభూతము. సమగ్రమైన ఈ విజ్ఞానపు ఖనిలో అనేకమైన పదములకు యెచ్చటను లభ్యముకాని నిగూఢమైన సమన్వయాత్మకమైన అర్థములు పొందు పరుపబడి యున్నవి. ఈవిధమైన సమన్వయము వారి తండ్రిగారైన భగవాన్ శ్రీ అనంతాచార్యుల వారినుండి తమకు సంక్రమించినట్లు తమ రచనలలో మాస్టరు గారే తెలిపియుండిరి. ఆయా పదములు మనము బహుళముగా ప్రయోగించునవి, అధ్యయనము చేయునవియైనను మాస్టరుగారు తమ గ్రంథములలో వెలువరించిన వివరణము చూసిన తరువాత వాటి భావము ప్రకాశితమై మనకు దర్శనమిచ్చును. అయినను అస్మదాదులు ఇన్ని గ్రంథములను అధ్యయనము చేసి ఆయా వివరణములను హృదయస్థము చేసికొని వలసిన చోట ఇతరులకు వివరించు ప్రయత్నము ఇంకనూ తగినంత చేయుటలేదని మాస్టరు గారు గ్రహించిరి కాబోలు. అందువలన ఈ ప్రక్రియను సులభతరం చేయుటకు మాస్టరుగారు అనేకమైన గ్రంథములలో ఆయా పదములకిచ్చిన వివరణములను ఒకచోట వరుసక్రమములో చేర్చు ఈ ప్రయత్నము చేయునట్లుగా తమ ప్రియశిష్యులయిన శ్రీ రాధాకృష్ణమూర్తి గారి బుద్ధిని ప్రచోదనము గావించిరి. తత్ ఫలితముగా ఈ **భావర్థ ప్రకాశిక** మొదటి ప్రయత్నముగా ఆయన ద్వారా వెలువడినది. మాస్టర్ జ్వాల్‌కూల్ గారు ఏలిస్.ఏ. బెయిలీ ద్వారమున ప్రసాదించిన ఇరువది నాలుగు గ్రంథములలో వివరింపబడిన విషయములకు కూడా ఈ విధముగనే ఆంగ్లమున PONDER ON THIS అనే గ్రంథము వెలువడినది. ఆ గ్రంథము రాధాకృష్ణమూర్తి గారి ఈ ప్రయత్నమునకు స్ఫూర్తిని కలుగజేసినది అనికూడా చెప్పవచ్చును.

ఈ విధముగా ఒక యజ్ఞార్థమైనకర్మకు ఫలితముగా వెలువడిన ఈ గ్రంథము తప్పక పాఠకులకు ఎంతగానో మాస్టరుగారి గ్రంథములలోనికి ప్రవేశించుటకు మార్గదర్శకము, ప్రకాశికము అగునని భావిస్తున్నాను. మాస్టరుగారు శ్రీ రాధాకృష్ణమూర్తిగారికి దీర్ఘాయురారోగ్యములు ప్రసాదించి ఇంకయూ ఎన్నో ఇటువంటి గ్రంథములు వెలువరింప జేస్తారని ఆశిస్తున్నాను. శ్రీ రాధాకృష్ణమూర్తి గారిని హృదయపూర్వకముగా అభినందిస్తున్నాను.

ఎక్కిరాల అనంత కృష్ణ

# భావార్థ ప్రకాశిక

## ఓం

నీవెరిగిన మొత్తము, నీవు కలసి 'ఓం' అనబడును. ఈ విధముగా 'ఓం' మంత్రార్థమును ధ్యానము చేయవలెను. అది నీలో నిలబడవలెనన్నచో నీ శ్వాస "ఓం" మంత్రముగ ధ్యానము చేయవలెను.

– [ప్రా.ప. పే. 337]

## అగ్ని (I)

వేడి, వెలుతురు, విద్యుత్తు, అయస్కాంతశక్తి దేని వ్యక్తరూపాలో అది అగ్ని. అగ్ని అంటే నిప్పు, మంట కాదు (Fire but not flame).

– [శ. ని. త. శా. పే. 53]

## అగ్ని (II)

ఈ సృష్టియను జగత్కర్మ ప్రారంభమైన తరువాత, దానినుండి దాని లోని భాగముగా పుట్టినవాడు అగ్ని. ఇది వేదములందు చెప్పబడిన అగ్నియే కాని, మనమెరిగిన పంచభూతములలోని అగ్ని కాదు. సృష్టిలోనిమొట్టమొదటి సంచలనమును అగ్ని (Ignition) అని వేదములు వర్ణించును. ఆ యగ్ని వ్యాపనశీలము కలదై సృష్టికి ఆధారభూతమైన స్థితిలో ఆ ప్రజ్ఞను అగ్నా-విష్ణువు అను జంట దేవతలుగా వేదములు వర్ణించును. సృష్టిలోని భాగము లుగా పంచభూతములు, అందు అగ్ని ఉద్భవించును. ఒక్కొక్క సౌర కుటుంబమునకు కేంద్రమైన సూర్యుడు ఆ అగ్నికి వ్యక్తరూపము. మనభూమికి సంబంధించినంత వరకు భూ పరిభ్రమణాదులు, చంద్రుని పరిభ్రమణాదుల వలన సూర్యకాంతి చంద్రునియందు ప్రతిఫలించి భూమి జీవులకు వెలుగు నిచ్చును. జగత్కర్మకు కేంద్రమైన 'నేన'నుపరమపదమునుసూర్యచంద్రాదులు, అగ్ని వెలిగించుటకు సాధ్యముకాదు. "లోకములు, లోకస్థులు, లోకేశులు తెగిన పిమ్మట, వెనుకనున్న పెంచీకటి కవ్వల" ఈ పరమపదముండునని భాగవతము వర్ణించును. మనయందు సూర్యుడు "నేను" అను జీవప్రజ్ఞాస్వరూ పముగాను, చంద్రుడు మనస్సుగాను, పావకుడనబడు అగ్ని ప్రాణశక్తిగాను పనిచేయును.

– [శం. రా. III పే. 72]

# అగ్నులు

అగ్నిదేవునకు స్వాహాదేవియను దక్షపుత్రికయందు పావకుడు, పవమానుడు, శుచియను ముగ్గురు కొడుకులు పుట్టిరి. వారు యజ్ఞమున హోమము చేయబడిన ద్రవ్యములను తిందురు. పావకుడనగా నిప్పు, పవమానుడనగా గాలి, శుచి అనగా జ్వాల. అగ్నినుండి ఆహారము పచనముచేసి, జీర్ణింప జేయునట్టి శక్తియు, గాలినుండి రక్తమును పరిశుద్ధిచేయు ప్రాణవాయువు, దేహమును పరిశుద్ధిచేయు వేడిమియు పుట్టినవి. ఇవి సృష్టిలోని వివిధములైన మార్పులు కలిగించుచుండును. ఉదాహరణమునకు సూర్యరశ్మియందలి అగ్ని భూమిపై మలినవస్తువులను భస్మముచేసి, మంచి వస్తువులుగామార్చును. జఠరాగ్ని ఆహారమును జీర్ణము చేయును. ఘర్షణ వలన పుట్టిన అగ్ని అన్నమువండుకొనుటకు, లోహాదిద్రవ్యములకు స్థితిభేదము కలిగించుటకు పని చేయును. ఆలోచనాగ్ని సృష్టి ధర్మములను ప్రకాశింపజేయును.

ఇట్లు నలుబది తొమ్మిదిమంది అగ్నులు మన భూమికి ఏడువిధములైన సూర్యకిరణములనుండి ఒక్కొక్కదానియందేడుగురుగా దిగివత్తురు. వీరి వలననే నరుని దేహతత్త్వమునందు సప్తధాతువులు, సప్తస్వరములు, ఏడు రంగులు మొదలగు విభాగములుకలుగును. సప్తలోకములును,సప్తజిహ్వలును కలుగుచున్నవి. ఈ నలుబదితొమ్మిది మంది అగ్నులును వేదనిష్ఠగల వారిచే యజ్ఞముల యందుపాసింపబడి, ప్రయోజనములను తీర్చుచున్నారు. ఈ నలుబదితొమ్మిది మందియు, ఏడు గణములుగా పనిచేయుచున్నారు.

1. అగ్నిష్వాత్తులు 2. బర్హిషదులు 3. సౌమ్యులు 4. పితరులు 5. ఆజ్యపులు 6. సాగ్నులు 7. నిరగ్నులు.

అగ్నిష్వాత్తులు అనగా ద్రవ్యమందలి అణువులయందిమిడియుండువారు.

బర్హిషదులు దర్భలు పరచుకొని కూర్చుండువారు. అనగా సూర్యాదికిరణములయందుండువారు.

సౌమ్యులు అనగా సోముని లోకమున పనిచేయువారు. వీరివలన దేహములకు, ప్రాణములకు సంబంధమేర్పడి, సస్యాదులనుండి దేహములు పోషింపబడును. "రసాత్మకుడనైన సోముడనై నేనోషధుల నన్నిటిని పోషించుచున్నాను" అని గీతలో కృష్ణుడు చెప్పెను.

పితరులనగా పిండోత్పత్తికై గర్భధారణాదులు కల్పించువారు.

ఆజ్యపులు అనగా నేయిత్రాగువారు. వీరు దేహములయందలి చమురు పదార్థమును కూడబెట్టి వినియోగము చేయుదురు.

సాగ్నులనగా జీవులలోని చైతన్యస్వరూపులు.

నిరగ్నులనగా జీవములేని ఖనిజాది పదార్థములను కాపాడువారు.

– [శ్రీ.భా. ప్ర. VIII పే. 20-21]

## అజాన దేవతలు

కర్మ దేవతలనియును, అజాన దేవతలనియును దేవతలు రెండు విధములు. (Gods of Execution and Gods of Contemplation). సృష్టిలోనికి రాకుండినప్పటి పరమపురుషునికీవిశ్వమంతయును అజానలోకము కనుక ఈయజ్ఞము (సర్వహుతము) ఆచరించిన వారుగూడ ఇహలోకమందే అజానలోకము ననుభవింతురు.

– [పు. సూ. పే. 44]

## అణువు-బ్రహ్మాండ ధర్మములు-మానవుడు

ఈసృష్టిలోని యణువులలో నొక్కొక్కటి బ్రహ్మాండధర్మములనన్నిటిని తనలో నిముడ్చుకొన్న మొగ్గ; అట్టి అణువుల పరిణామ దశలలో నొక దశయే మానవుడు. ఇతడుకూడ నొకదశలోనున్న బ్రహ్మాండపు మొగ్గ; మరియు భవిష్యద్బ్రహ్మాండములలో నొకడు. కనుక నితనిలో కూడ సూర్యుడును, గ్రహములును స్వభావరూపమున మొగ్గలై ప్రవర్తించుచున్నవి. మఱ్ఱిగింజలో నున్న చెట్టువలె మానవుని స్వభావముననున్న గ్రహలక్షణములు వాని కర్తృస్వరూపములుగా, ఫలములుగా, అనుభవములుగా పనిచేయుచుండును. ఉదాహరణకు 'నేను' అను ప్రజ్ఞ సూర్యుడుగను, మనస్సు చంద్రుడుగను, ధైర్యము కుజుడుగను, తెలివితేటలు బుధుడుగను, సుఖమును గూర్చిన జ్ఞానము బృహస్పతిగను, సౌందర్యబుద్ధి శుక్రుడుగను, కష్టసుఖముల సమన్వయము శనిగను మానవునిలో గ్రహ లక్షణములు బీజరూపము దాల్చియుండును. ఒక జీవి జన్మించినపుడు ఆకాశమునగల గ్రహగోళముల విన్యాస వైఖరులే

యొక సమన్వయాత్మకమగు చిత్రముగ నేర్పడును. అప్పటినుండి పురోగమించుచున్న వివిధ గ్రహగతులే, అతని శీల స్వభావాదులలోని పురోగతులై నూతన కర్మాచరణమున కాతని పురికొల్పుచుండును. (వీని ఆచరణీయమైన సమన్వయమును తెలుపునదియే జ్యోతిశ్శాస్త్రము.)

– [ప్రా. ప. పే. 93]

## అత్యతిష్ఠత్ దశాంగులమ్ - పైథగోరియన్ డెకాడ్

యుగముల పేర్లకుగూడ వాని పరిణామమునుబట్టి సార్థకత కనిపించును. కలియను పదమునకు కలనము లేక కొలత - Unit అని అర్థము. కలియుగమును కొలతగా గైకొన్నచో ద్వాపరయుగము దానికి రెండింతలుండును. ద్వాపరమనగా రెండింతలని యర్థము. త్రేతాయుగము మూడింతలని యర్థము. కనుక త్రేతాయుగము కలియుగమునకు మూడు రెట్లని యర్థము. కృతమనగా నాలుగురెట్లు. కలియుగమునకు కృతయుగము నాలుగు రెట్లుండును. ఈ విధముగా కృతయుగము - 4, త్రేతాయుగము - 3, ద్వాపరయుగము - 2, కలియుగము - 1 రెట్లున్నవి. ఈ మొత్తము $4 + 3 + 2 + 1 = 10$ కనుక మహాయుగము కలియుగమునకు పదిరెట్లుండును. ఈ యుగముల సంబంధమును తెలుపునట్టి పదిచుక్కల బొమ్మ యొకటి కలదు. అది యిట్లుండును.



ఈ బొమ్మను ధ్యానమున కాక యంత్రముగా పూర్వులుపయోగించెడివారు. ఈ ధ్యానము వలన కాలగర్భితములైన యోగరహస్యములు మానవునిలో మేల్కాంచును. దానితో అనేక శక్తులు మేల్కొనును. సరియైన మానసిక నిగ్రహము లేనివారికీశక్తులు మేల్కొన్నచో అపదలు కలుగును. దానినెరిగి పూర్వులీ బొమ్మను రహస్యముగ దాచి అర్హతనుబట్టి యుపదేశించెడివారు.

ఈ బొమ్మనే మూడు తలల దైవములేక దత్తాత్రేయుడని ప్రాచీనులు వివరించి ధ్యానించిరి. దీనినే మణిపద్మమను పేరుగల సిద్ధరూపుడైన బుద్ధదైవముగా బౌద్ధులు ధ్యానించిరి. దీనిని ధ్యానించుటకు ఋషులు దత్తాత్రేయ మంత్రము నుపయోగించిరి. బౌద్ధులు మణిపద్మ మంత్రమునుపయోగించిరి. ప్రాచీన భారతదేశమున ఋషుల దగ్గర వేదరహస్యములను పరమోపదేశము పొంది గ్రీసు దేశమున తన యాశ్రమమును స్థాపించిన యొక సిద్ధుడగు ఋషీంద్రుడు పీఠగురువని ఋషులచే బిరుదము నొందెను. ఆ బిరుదునే గ్రీకు భాషలో పైథాగరస్ అందురు. పైథాగరస్ మహాశయుడు ఈ బొమ్మనుండి త్రిభుజముల సృష్టిరహస్యములను వివరించెను. అతడు దీనిని "DECAD" అను మంత్రముగా పేర్కొనెను. Decad అను పదమునకు పది అంకెల తత్త్వము గలది అని యర్థము. దీనినే వేదములందు దశాంగులమందురు. కాలపురుషుడుగా విరాట్పురుషుడు దిగివచ్చినపుడు తన రెండు చేతులకు గల పదివ్రేళ్ళ నొక్కమారుగా తెరచి చూపునని చెప్పబడినది.

"అత్యతిష్టత్ దశాంగులమ్" అని ఋగ్వేదము. ఈ వ్రేళ్ళే మహాయుగము నందు చెప్పబడిన $4+3+2+1=10$ అను నిష్పత్తిలోనున్న యుగపరిణామము.

– [శ్రీ. భా. ప్ర. V పే. 53-54]

## అదితి

ఆదిలో సృష్టిగా దిగివచ్చిన వెలుగులే ఆదిత్యులు. సృష్టియే లేనపుడు తానుండునుగాని తానున్నట్లు తెలియదు. మనకు నిద్రాస్థితి యెట్టిదో సృష్టి మొత్తమునకు ప్రళయస్థితి యట్టిది. అదియే రాబోవు వెలుగులకు మూలము లేక తల్లి. అట్టి చీకటినే అదితియందురు. అదితినుండి పుట్టిన వెలుగులే ఆదిత్యులు.

– [శం. రా II పే. 88]

## అదితి-దితి

భూమిపై నిలబడి ఆకాశమువైపు చూడగా చూచువానికి అది యొక గోళము లోపలి భాగమువలె కనిపించును. చూచువానిని పశ్యకుడందురు.

గోళాకారమును కశ్యపుడందురు. అతనికిద్దరు భార్యలు. వారిపేర్లు అదితి, దితి. చీకటినుండి సూర్యోదయమున వెలుగులను ప్రకటింపజేయు సూర్యాస్తమయ సమయశక్తి దితి యనబడును. కనుక సూర్యోదయమునకు అదితి, సూర్యాస్తమయమునకు దితియు అధిదేవతలు. వీరే గరుత్మంతుని కథలో వినత,కద్రువ యను పేర్లతో చెప్పబడుదురు. నిద్రనుండి జీవులు మేల్కాంచుట అదితి శక్తి. మెలకువనుండి జీవులు నిద్రించుట దితి శక్తి. ఈ రెండు సమయములందును, చీకటులనుండి వెలుగులు, వెలుగులనుండి చీకటులు పుట్టుచు ఎఱ్ఱని రంగులేర్పడును. అవియే సంధ్యాగ్నులైన హోమములు. వాని నర్పించువారే దేవతలు. వానియందు జీవరాసుల యాత్మలు భూమిపై నుద్భవించుట, మరల మాయమగుట జరుగుచుండును. వెలుగులు చీకట్లనుండి మేల్కొనుసమయమున జీవులలో గూడ దేవతల గుణములు మేల్కొనును. వెలుగులనుండి చీకట్లు పుట్టుచున్న సమయమున నసురగుణములు మేల్కొనును. వీనివలన భూమిపై గలజీవులలో దైవగుణములు, అసురగుణములు వర్తించుచుండును. చీకట్లనుండి వెలుగులు పుట్టుట స్థూలసృష్టియైన ద్రవ్యాదుల నుండి సూక్ష్మతత్త్వములు మేల్కొనుట. వెలుగులనుండి చీకట్లు పుట్టుటయనగా సూక్ష్మగుణముల నుండి స్థూలతత్త్వములు దిగివచ్చుట. ఈ రెండును వరుసగా శుక్లగతి, కృష్ణగతి యని భగవద్గీతలో చెప్పబడినవి. అందు మొదటి దానివలన మోక్షము, రెండవదానివలన బంధము కలుగును.

– [శ్రీ. భా. ప్ర. V పే. 100]

## అన్నము

అన్నమనగా ఆహారమని సామాన్యార్థము. వేదశాస్త్రములలో దీనికి సృజింపబడి యక్కరకు వచ్చు వస్తువు (Matter) అని యర్థము. ఇమిడించుకొనునది, ఇముడునది యని యర్థము.

– [పు. సూ. పే. 6]

## అప్సరసలు

అప్సరసలనగా నీటిబిందువులు పుట్టుట కధిదేవతలు. అగ్నిసహాయమున వాయువు జలమగుట విద్యుత్తు వలన మేఘరూపమున జరుగుచున్నది. మేఘములు పుట్టుట యిట్లే జరుగుచున్నది. కనుకనే క్రొత్త మేఘములలో విద్యుత్తు మెరపులుగా, ఉరుములుగా వ్యక్తమగుచుండును.

సంగీతమున అప్సరసలు స్వరముల భేదములుగా వ్యక్తమగుదురు. వీరు ఏడుగురు అప్పచెల్లెండ్రుగా చైతన్యమను సూర్యుని రథమును నడుపు చున్నట్లు ఋగ్వేదము చెప్పుచున్నది. స్వరములు స్త్రీలుగా, ఛందస్సులనబడు తాళములు పురుషులుగా శాస్త్రపురాణాదులలో వర్ణింపబడిరి. రూపకల్పనలో పరమేశ్వరుడు శబ్దబ్రహ్మయై దిగివచ్చుచున్నప్పుడు నటరాజస్వామిగా డమరు కము ప్రయోగించుచునాట్యము ప్రారంభింపగా నొకప్రక్క ప్రమథులు మద్దెలలు ప్రయోగించుట, అప్సరసలు భంగిమలు చూపుట చెప్పబడినది. స్వరములుగ అప్సరసలును, తాళములుగ ప్రమథులును, శబ్దార్థరూపముగా డమరుకమున వ్యాకరణము దిగివచ్చినట్లు రూపకల్పనమున్నది.

– [శ్రీ. భా. ప్ర. VI పే. 97]

## అయోధ్య

భూమి సూర్యునిచుట్టూ పండ్రెండు మాసాలలో సంవత్సర రూపంగా సకల ఋతుధర్మాలతో తిరిగి వస్తుంది. ప్రతిమాసము చంద్రుడు సూర్యుని చుట్టూ పూర్ణిమ, అమావాస్యలతో కూడిన పదహారు కళల వైభవంతో తిరిగి వస్తూ ఉంటాడు. ఈమొత్తం నిర్మాణాన్ని హృదయంలో ఉంచుకొని ఋషులు పరమపురుషుడు శరీరమనే పురాన్ని నిర్మాణం చేసుకునే వైఖరిగా వర్ణించటం జరిగింది.

అయోధ్య నగరం చుట్టూ పన్నెండు విభాగాలుగా నిర్మాణం చేయ బడింది. సంవత్సరానికి 12 మాసాలు ఉన్నట్లు ఈ పుర నిర్మాణం ఉన్నది. ఒక మాసానికి రెండు పర్వములు. ఒకటి పూర్ణిమ, ఒకటి అమావాస్య. సంవ త్సరం మొత్తానికి 24 పర్వములు. దానిననుసరించి వాల్మీకి రామాయణంలో 24వేల శ్లోక విభాగం ఉన్నది. ప్రతి విభాగానికి మొదటి శ్లోకం మొదటి అక్షరం తీసి వ్రాసుకుంటే గాయత్రీ మంత్రం అంటారు. జీవులకు శరీరం ఒక్కొక్క రాజ్యం వంటిది. హృదయం ముఖ్యపట్టణం వంటిది. అది ప్రాణహాని కలిగించు రాక్షసశక్తులకు అధీనం కాకుండఅస్థిపంజరంమధ్య గుండె కాయలో ఉంచి రక్షింపబడుతూ ఉన్నది. కనుక దానికి అయోధ్య అని పేరు. యోధులకు జయింప శక్యము కానిది అని ఈ పదానికర్థము. ఈ కేంద్రంలో వున్న జీవుడే రాజు. అతడు సూర్యవంశపువాడు. అనగా సూర్యకిరణంలోని

అంశయే జీవుడుగా దిగివస్తుంది. దానిననుసరించియే దశరథుని అయోధ్య పట్టణ నిర్మాణం జరిగింది. అయోధ్యకు సప్త ప్రాకారములు. ఏడవది ప్రహరీ గోడ. అలాగే మన శరీరములో చర్మము సప్త ప్రాకారము.

– [రా. ప్ర. పే. 1-3]

## అరణి

అరణి యనగా యజ్ఞమునందు నిప్పు పుట్టించుటకు కొయ్యతో చేయ బడిన యొక సాధనము. అట్లే సర్వాత్మకుడయిన యజ్ఞమూర్తి తన తేజస్సును భూదేవియందు దాంపత్య రూపమున రగుల్కొల్పుట వలన జీవరాసుల యాత్మలు నిప్పురవ్వలై పుట్టును. భూమియందు భగవంతుని తేజస్సుధరించిన అణువులు, పరమాణువులు, పుట్టుకల పరిణామమునొంది జీవరాసులై వర్ధిల్లును. దీనిననుసరించియే జీవులలో గూడ తండ్రియొక్క తేజము శుక్రమార్గమున తల్లిగర్భమునబడి సంతతిగా జీవులు పుట్టుచున్నారు.

– [శ్రీ. భా. ప్ర. V సం॥ పే. 15]

## అవతారము

అవతారమూర్తిలో దేవుడు మనస్సుగా దేహేంద్రియములుగా దిగివచ్చి వర్తించుచుండును. జీవులలో దేహేంద్రియాదులవలన బంధింపబడిన మనస్సు, బుద్ధి మొదలగు సోపానముల మార్గమున సాధనచేసి ఆరోహణ చేయవలెను. కనుక జీవులలో ప్రజ్ఞ దేవునికొరకై పైకెక్కిపోవుట, అవతారమూర్తిలో దేవుడు క్రిందికి దిగివచ్చుట జరుగును. జీవుడు సాధన వలన తానెవరో తెలిసికొనును. అవతారమూర్తి సిద్ధి వలన తానెవడో తెలిసి వర్తించును. జీవుడు పూర్వ కర్మవశమున జన్మమెత్తగా, దేవుడు తాను కల్పించిన కర్మలోనికి సశరీరముగా దిగివచ్చును. జీవునకు జన్మ తప్పనిసరి లేక బంధము. దేవునకు జన్మమొక క్రీడ. జీవుని జనన మరణముల నడుమ స్వంతముగా చిక్కుపరుచుకొన్న కర్మ బంధములుండును. అవతారమూర్తికి తనచే కల్పింపబడిన క్రీడామయమైన కర్మయుండును గాని దాని బంధముండదు.... దీనినిబట్టి తెలియునదేమనగా జీవుల జన్మకర్మలు వేరు. భగవానుని జన్మకర్మలు వేరు. ఈ భేదము తెలియుటకే "నా జన్మ, నాకర్మ దివ్యములు" అని కృష్ణుడు వివరించెను.

– [శం. రా. I పే -134]

## అశ్వత్థము

అశ్వత్థమనగా రావిచెట్టు. రావిచెట్టు సూర్యదేవతాత్మకము. కనుకనే యజ్ఞహోమాదులలో అశ్వత్థ సమిధలకు అత్యంతప్రాధాన్యమున్నది. ఈసృష్టి మహావృక్షమును సూర్యదేవతాత్మకమైన అశ్వత్థ వృక్షముగా ఉపమానము చేయుట చక్కని భావన.

"పైన మూలము, క్రింద శాఖలు కలిగియున్న ఒక అశ్వత్థ వృక్షమును గూర్చి పెద్దలు చెప్పుదురు. అయిపోవుట యనునది ఆ వృక్షమునకుండదు. ఛందస్సులే దాని ఆకులు. దాని నెరిగినవాడే వేదములు నెరిగినవాడు" అని కృష్ణుడు దీనినొక పొడుపు కథగా వర్ణించినాడు. ఛందస్సులనగా వేదములు.... అట్లే బ్రహ్మదేవుని యుచ్చారణమగు ఈ సృష్టియను వాక్కునందుగల లయ, శృతి, గమనములను ఛందస్సులందురు. దేశము-కాలము (Space &Time) అనువానితో కూడిన సృష్టిలో ఛందస్సులు లేక గమనములు కొన్ని వేలు కలవు. ఇవన్నియు ఈ అశ్వత్థ వృక్షమునకు ఆకులుగా యున్నవి. సృష్టిశక్తుల సమన్వయ సమాహారమే ఈ వృక్షము. దీనికి మొదలు, చివర యనియుండవు. భావములకు, ఆవేశాదులకు, సంకల్పవికల్పములకు మొదలు చివర యన్నవి యుండవు. ఒకదానియందు మరియొకటి అల్లుకొని యుండును.... భావము నుండి సంకల్పము,సంకల్పమునుండి ఆదేశము, ఆదేశమునుండి తానాచరించు కర్మపుట్టుకొని వచ్చును. ఆ కర్మ తన స్వభావమునుండి ప్రచోదితమై, మరల నొక భావము పుట్టుకొనివచ్చును. ఈ శాఖాచంక్రమణమునుండి బయట పడుటకు అసంగమను ఖడ్గమవసరము. కార్యకారణ సంబంధములోని సూక్ష్మ గతులన్నియు నెరిగినవానికి సృష్టిలోని రహస్యములన్నియు అరచేతిలోని యుసిరిక పండు వంటివి. ఈ వృక్షము నామూలాగ్రము నెరిగినవానికి ఖండ దృష్టికాక, సమస్తదృష్టియు నొక్కచూపున దర్శనమిచ్చును.

– [శం. రా. III పే. 60-67]

## అశ్వము

ఇది ప్రాణాగ్నికి సంకేతము. సూర్యునినుండి వెలువడు అగ్నిలో కొంత భాగము భూమిపై ప్రాణశక్తిగా దిగివచ్చి, జీవులకు ప్రాణమయ కోశముగా

పనిచేయుచున్నది. దీనినే ఇతిహాస పురాణములలో, సూర్యుని భార్య ఆడు గుఱ్ఱమై భూమికి దిగివచ్చెనని కీర్తించిరి. అశ్వమేధము మున్నగు యజ్ఞము లన్నియును దీనిని స్థాపించునట్టి విద్యలు.

– [సు. సూ. పరిచయం VIII]

## అశ్వమేధము

అశ్వమేధమనగా అశ్వమును పెంచి పోషించి వినియోగించుట. పశు మేధమనగా పశువులను పోషించి యజ్ఞార్థముగా సంపదను పెంచుట. నరమేధ మనగా నరుడు బ్రహ్మయొక్క అంతర్యామికర్మకు తన్నుతానర్పించుకొనుట. ఇది వేదమందు నిహితమైయున్న సనాతన యజ్ఞస్వరూపము. యజ్ఞార్థకర్మము నకై వినియోగించు జంతువైనను, నరుడైనను యజ్ఞస్వరూపుడే. ఇవికాక జంతువులను వధించు యజ్ఞములు పాషండులైన మాంసభక్షకులచే కల్పింప బడినవి. ఇంద్రియలోలురై తుచ్ఛులైన భ్రష్ట బ్రాహ్మణులు కొందరు పశు బలులను యజ్ఞములని వ్యవహరించి వేదగ్రంథములతో ముడిపెట్టిరి.

– [పు. మే. పే. 196]

## అశ్వినీ దేవతలు

సూర్యమండలములు పుట్టకముందే సూర్యులకు గూడ ఉత్పత్తి కారణ ములైన రంగుల కిరణములుగా దేశము, కాలము రూపమున వెలువడుచున్న దేశ కాలాతీతులైన దేవతలు అశ్వినులు. ప్రతిదినము సూర్యోదయమునకు ముందు రంగుల కిరణములుగా మనకు దర్శనమిత్తురు. అహోరాత్రములు కృష్ణ శుక్ల పక్షములు, ఉత్తర దక్షిణాయనములు, జాగ్రత్ సుషుప్తులు, ఉచ్ఛ్వాస నిశ్వాసములు, జనన మరణములు, సృష్టిప్రళయములు మున్నగు జంటల రూపమున వీరి రెక్కలు కదలుచుండును. వీరినుండియే చోటులోని కొలతలు కాలముల కొలతలు పుట్టుచుండును. నాసత్యులు అనగా (న+అ+సత్) సృష్టి అస్తిత్వమునందు, నాస్తిత్వమునందుకూడా అస్తిత్వముకలవారు. భావము, అభావము అనురెండింటికిని, మూలమయిన ఆకాశము వంటివారు. ["సత్యము, అనృతము కలిసి మా దృష్టిలో సత్యము" అని వేదమార్గము.] దస్రులుఅనగా విభాగములు చేయువారు. సాంప్రదాయులు అనగా (సం+పర+అయ) తమ కన్న వేరుగా లోకములను వెలువరించునట్టి ప్రయాణము కలవారు.

నీటిని ఆవిరిచేసి మేఘములను వర్షింపజేయు ధర్మము వలన వేద ఋషుల పరిభాషలో సూర్యకిరణములు గోవులనబడుచున్నవి."గచ్ఛతి ఇతిగౌః" అని యాస్కమహర్షి నిరుక్తమున ఉపదేశించెను. సూర్యునిచుట్టును ఏర్పడు చున్న వెలుగుల దారులనియు, గ్రహముల గమనమునకు కక్ష్యలేర్పరచునవి అనియు దీని భావము. చోటులో ఏ బిందువునందైనను అట్టివి 360 దాగి యుండును. ఈ దాగియుండుట సాధ్యులనబడు స్థితి. అట్టి సాధ్యులు సిద్ధు లనబడు దేవతలుగా వ్యక్తమగుటయే మన సూర్యగోళమేర్పడుట. ఏర్పడిన సూర్యునిచుట్టును, 360 చైతన్య విభాగములు దేవతలుగా పనిచేయును. వానినే వేదశాస్త్రమున గోవులందురు.... వేదభాషలో చెప్పబడిన ఈ 360 గోవులే ఒక వత్సమును ప్రసవించుచున్నవి. వత్సమనగా వత్సరము. అంత ర్యామినుండి భూమి కేంద్రముగా సృష్టిని పుట్టించునదియని సంవత్సరమునకు అర్థము. అశ్వినీదేవతలు అయనములుగను, ఋతువులుగను, మాసములుగను, పక్షములుగను, వారములుగను, అహోరాత్రములుగను సంవత్సరమును విభజించి ఇచ్చుచున్నారని అర్థము. ఇన్నిటికి ఒకే పొదుగు. అదే సూర్యుడు. దానినుండి ఎండ అను పాలు పిండబడుచున్నవి. అనగా సూర్యరశ్మి చెట్టు కాహారము కాగా, చెట్లు, సూర్యరశ్మి మిగిలినవానికి ఆహారమగుచున్నవి.

పన్నెండు మాసములుగల సంవత్సర చక్రమున ఆరు ఋతువులున్నవి. ఒక్కొక్క ఋతువును పుట్టించుటకొక్కొక్క గ్రహము. సూర్యునిచుట్టును ఆరు గ్రహములు తిరుగుచున్నవి.... ఒక్కొక్క గ్రహము తన చుట్టును తాను తిరుగుచున్నది గనుక సుడిగా వర్ణింపబడినది. ఇన్నిటికి ఇరుసుగా పనిచేయు చున్న కన్నము సూర్యుడే. సూర్యునియందు వెలుగే కాని ద్రవ్యము లేదు. చోటులో వెలుగుల నూలుపోగులతో అల్లుకొన్న వస్త్రమువంటి భాగము సూర్యుడు (వివస్వంతుడు). అంటున్నది ఆకాశమేగాని ద్రవ్యము కాదు. మన కన్ను గోళమువలెనున్నది కనుక కంటికి సూర్యుడు గోళముగా కనిపించును. మన దేహములో మనమున్నట్లు ఈ కన్పించు గోళాకారములో సూర్యుడు ప్రజ్ఞామయుడైన కన్నముగా వున్నాడు. ఈ చక్రమునకు ఋతము అంచుగా నున్నది. [ఋతమనగా అప్రయత్నముగా వెలువడుచున్న సత్యము].

అశ్వినులిద్దరును వృత్తాకార గమనమును కల్పించి, చంద్రుని పుట్టించుచు మాయము చేయుచున్నారు. భూమిచుట్టును కనిపించు గ్రహగోళముల మార్గ

ములను రెండు సమభాగములుగా (సౌర, చాంద్ర విభాగములుగా) విడదీయు చున్నారు.... జీవులకు పగటివేళ సౌరము (Solar Consciousness), రాత్రివేళ చాంద్రము(Lunar Consciousness), అను రెండు భాగములుగా నేర్పడినవి. అందు సౌరము ఆత్మదర్శనమునకు, చాంద్రము దేహ కల్పనమునకు వినియోగపడుచున్నది. సూర్యుడు, గ్రహములు ఉదయించి అస్తమించు దారికి ఛాయాగ్రహణముగా తల్లిగర్భమున వెన్నెముక ఏర్పడుచున్నది. అందు గ్రహముల ప్రజ్ఞలు, శక్తులు పంచేంద్రియ ప్రవృత్తులుగా పుట్టునట్టి కేంద్రము లిమిడియున్నవి. ఈ కేంద్రములే షట్చక్రములు. అశ్వినులిద్దరును సూర్యోదయ, సూర్యాస్తమయములచే తూర్పుపడమరలను, అర్ధరాత్ర మధ్యాహ్నములచే ఊర్ధ్వాధస్సులను మొదలుగా భూమి జీవులకు పది దిక్కులను కల్పించిరి. ప్రతి జీవికిని నెత్తికి సూటిగా మధ్యాహ్నమునకు అటునిటు సమానమైన కొలతలతో అహస్సునందలి సూర్యగతిని ఒక రథముగా కల్పించిరి. ఈ రథము భూమధ్య రేఖకు సూటిగా భూమిచుట్టును తిరుగుచుండును. దానిలో భాగములై, దానిలో తిరుగుచు దేవతలు సృష్టిధర్మములను కల్పించుచున్నారు. ఋషులుకూడ ఆ మార్గముననే చరించుచు జ్ఞానమునకు, శాస్త్రాది గ్రహణమునకు, మంచిచెడ్డలను తెలిసికొనుటకు, వేదమును దర్శించుటకు, బంధవిమోచనము పొందుటకు కావలసిన ప్రజ్ఞలుగా జీవుల మనోధర్మములను కల్పించుచున్నారు. ఇందరికిని ఆధారభూతమైన రథముగా మానవశరీరము కల్పింపబడినది. (కాని మానవుడు సృష్టి ధర్మముకన్న భిన్నముగా, స్వచ్ఛందముగా నానా దిక్కులకు గమనము చేయుచు కర్మబంధము కల్పించుకొనుచున్నాడు. ఇచట మనుష్యులనగా మనువు సంతతి లేక మనస్సుపై నాధారపడి జీవించువారు. దేవతలు స్వధర్మములపై నాధారపడియున్నారు గనుక వారికి మనస్సుండదు.)

రెండు సగముల మూర్తులైన ఈ అశ్వినీ దేవతలనుపిట్టలు వర్ణములను వెలువరించును. (వర్ణములనగా రంగులకును, ధ్వనులకును మూలమైన ఆకాశ ధర్మములు.) రంగులనుబట్టి వస్తువులు గుర్తింపబడుచున్నవి. కంఠధ్వనులను బట్టి ఆకలిదప్పులు, కష్టసుఖములు గుర్తింపబడుచున్నవి. ఈ రెండు విధములైన వ్యవహారములకును కారణములైన వర్ణములను అశ్వినీదేవతలు వెలువరించుచున్నారు. అందు రంగుల మార్గము ననుసరించి కిరణములు ప్రయాణము

చేయుచున్నవి. ఆ మార్గముననే దేవతలు ప్రయాణము చేయుచు సృష్టిని వెలువరించుచున్నారు. (శబ్దమును, నీటిని, ఖనిజములను గొనుటకు నోరేర్పడినది. ఆహారమునుండి సప్తధాతుమయమగు దేహము నిర్మాణమగును. అందు ఏడవ ధాతువు శుక్రము. దానివలన జీవులు గర్భస్థులగుచున్నారు. ఈ విధముగా నోరు కారణముగా గర్భధారణము జరుగుచున్నది.) అశ్వినులు ఒక స్థితిలో పిట్టలుగను, మరియొక స్థితిలో గుఱ్ఱములుగను వర్ణింపబడిరి.

కథా సందర్భమును ఆధారముగా జేసికొని వ్యాసుడు సంసారబద్ధులైన మానవులకు తరణోపాయమైన శరణాగతిని ఈ స్తోత్రము రూపమున ప్రసాదించుచున్నాడు. కర్తవ్యనిర్వహణము, సత్కర్మాచరణము ఆలంబనములుగా కర్మనాశము పొందవలెను. దాని విశ్వరూప సందర్శనమనబడు సగుణోపాసనమే గతి. విశ్వరూపుని అన్ని రూపములలో సూర్యచంద్రులు, అహోరాత్రములు, ఉదయాస్తమయములు, జననమరణములు, జ్ఞానాజ్ఞానములు మున్నగు జంటల కధిదేవతలే అశ్వినీదేవతలు. వారియందు విశ్వరూపుని అంతర్యామిత్వమును సేవించునపుడు మాత్రమే ద్వంద్వములనుండి విమోచనము కలుగును.

– [అ. దే. పే. 5-34]

## అసావాదిత్యుడు

ఆదిత్య మండలమున యొక పురుషుడు జీవుడుగా పుట్టినపుడు తనకన్న వేరుగా ఈ మండలమును గుర్తించుచున్నాడు. "ఇతడు ఆదిత్యుడు" అని చెప్పగలుగుచున్నాడు. తన్ను తనకన్న వేరుగా ఇతడని చెప్పగలుగుటయే తండ్రినుండి పుత్రుడు పుట్టుట. దీనినే 'అసావాదిత్యుడు' అందురు. కంటితో చూచినపుడు కొడుకునకు తండ్రి వేరుగా కనపడును. కన్ను, చూచుట, సూర్యుని వెలుగు ఒకదానిలోని భాగములే అని చూడగలిగినపుడు తానే అతడని తెలియును. ఇట్లు కంటితో తెలియుటకాక, కన్ను తెలియుట కలవాడే నిజమైన కన్ను కలవాడు. అదిలేనివాడు కంటితో చూచినను తన విస్తృతిని గూర్చి గ్రుడ్డివాడే. తాను పుత్రుడుగా పుట్టుటయు, తనకొక పుత్రుడు పుట్టుటయు కంటితో చూడగలిగినవాడు సంసారమను చీకటిలో పడును. కన్నుగా చూడగలవాడు వెలుగున నుండును. అతడే తండ్రికి తండ్రి యగుచున్నాడు.

సృష్టిని తనకన్న వేరుగా కంటితో చూచువానికి ఈ దర్శనము కలుగదు. కనుక సంసారబద్ధుడగును. సృష్టియందలి అంతర్యామియైన సూర్యమండల పురుషత్వమును చూడగలవాడు సృష్టికతీతుడుగా వెలుగులో నుండును.

– [సు. సూ. పే. 84]

## అహంకారము

సత్త్వరజస్తమస్సులు అనబడు మూడు గుణములలో రజస్సు, సత్త్వము కలసి ఋడగలవలె నేర్పడి 'మహత్తు' అనబడు తత్త్వము కలిగినది. దాని యందు తమస్సు ప్రధానముగా పనిచేసినపుడు ఈ మూడింటి కలయికతో గూడిన అస్తిత్వము అహంకారముగా పరిణమించెను (పరిమిత వస్తువులలో నిమిడియున్న నేనను ప్రభావము). దీనివలన దివ్యత్వము జ్ఞానముగను, క్రియారూపముగను వర్తించినది.... ఈఅహంకారమే అనేక రూపాంతరములు బొంది మూడు విధములుగా నయ్యెను.

1) రాజసాహంకారము : ఇది ద్రవ్యమును పుట్టించు శక్తి. (The Birth of Matter)

2) తామసాహంకారము : ఇది క్రియను బుట్టించు శక్తి. (The Birth of Action)

3) సాత్త్వికాహంకారము : ఇది జ్ఞానమును పుట్టించు శక్తి. (The Birth of Knowing or Wisdom)

తామసాహంకారము నుండీ ఆకాశము బుట్టెను. దీని గుణము శబ్దమైనది. ఇది ఆకాశమునకు సూక్ష్మమైన రూపము. (Subtle State of Space in Sound). దీనివలననే ఏదైనా ఉన్నట్లు బోధపడును. ఇది సూక్ష్మ శబ్దము. (ఇది లేనిచో కంటికి వెలుగు, చెవికి వినిపించుట మున్నగునవి కలుగవు).

– [శ్రీ భా. ప్ర. III సం॥ పే. 81-82]

## అక్షన్వంతుడు

వేదభాషలో అక్షుశబ్దము, అక్షిశబ్దము ప్రత్యేకతలతో ప్రయోగింప బడినవి. సహస్రాక్షుడు మొదలగు ప్రయోగములలో అక్షములు లేక కిరణ

ములు కలవాడని అర్థముతో నెప్పుడును సమన్వయించుచుండును. పురాణాదులలో సహస్రాంశుడు అనగా సూర్యుడు; సహస్రాక్షుడనగా ఇంద్రుడు. వేదమున సహస్రాక్షుడను పదమే సామాన్యార్థమున సూర్యుని, అంతరార్థమున ఇంద్రుని సూచించునట్లు ప్రయోగింపబడినది. కన్నుగలవాడనుటకు అక్షివంతుడు అనవలసి వుండగా ఈ చమత్కృతిని పాటించుటకే అక్షన్వంతుడు అని వేదమంత్రములలో చాలచోట్ల ప్రయోగింపబడినది.

– [సు. సూ. పే. 84]

## అక్షరము

మనస్సును శ్వాసతో మైత్రి చేయించుచు, హృదయమున నిలుపుట నేర్చుకొనవలెను. అనగా మనస్సును హృదయమున నిరోధించుట నేర్చుకొనవలెను. ఇంద్రియ ప్రవృత్తులుకూడ హృదయమున కున్ముఖములై ప్రయాణము చేయును. తన శ్వాసరూపమైన వేదమును అక్షరమును గమనించుచునే సాధకుడందు ప్రవేశింప గలుగును. ఈ మార్గమున సాధన చేయువాడు తన ప్రాణమును, నేనను ప్రజ్ఞను ఒక్కటిగా నిలుపును. అపుడు హృదయమునుండి శిరస్సు వరకు తాను వెలుగుచుండుట క్రమముగా తెలియును. ఈ జ్యోతిని 'తాను'గా ధ్యానించుచు సాధకుడు ధారణ చేయును. ఈ జ్యోతిని 'నేను' అని స్మరించుచు తన్నుతాను ఉచ్చరించుటను గమనించవలెను.

అంతకుముందు శ్వాసగా పనిచేయుచున్న ప్రవృత్తి యిపుడు ఓంకారముగా నిలబడును. అందు కరిగిన మనస్సు ఓంకారమున కర్థముగా దర్శనమిచ్చును. తానను జ్యోతి 'నేను' అని తనను తాను ఉచ్చరించుటయే అక్షర స్వరూపమని గమనింపవలెను. ఈ అక్షర స్వరూపమునే 'ఓం' అని కంఠముతో నిదానముగా సుదీర్ఘముగా నుచ్చరింపవలెను. ఇది తాను యను మాటను ఉచ్చరించుటకాక, తన్ను ఉచ్చరించుట యగును. ఇట్లు ఉచ్చరించుచు తన దేహముకన్న తాను వేరైన అక్షరముగా తెలిసికొనును.

ఉచ్చరించుట యనగా ఉత్ + చరించుట; అనగా ఊర్ధ్వమార్గమున చరించుట. దానితో క్రమముగా దేహమునకును తనకునుగల సంబంధము

విడిపోవును. దేహమును విడచుట యనగా చచ్చుటయే కానక్కరలేదు. దేహముతో ముడిపెట్టుకుని ముక్కలు ముక్కలుగా జీవించుచున్న తాను, దేహస్థితికన్న అతీతుడుగా నీవలకు వచ్చుట.... ప్రయాణ కాలమనగా మనస్సు ప్రాణముతో కలసి దేహమును విడచి తనయందు పర్యవసానమగుట. ఇది ఉత్తమ గతిని కల్గించును. ఉత్తమ గతియనగా ప్రజ్ఞ స్థూలదేహమునుండి సూక్ష్మదేహమైన తన దగ్గరకు ప్రయాణము చేయుట. ఈ గమనములో మనపై పనిచేయుచున్న దేహము, ఇంద్రియములు, మనస్సు అనువాని సంబంధము తొలగును. ఇదియే వేదవిదులు అక్షరమును ప్రవేశించుట యనుచున్నారు.

– [శం. రా. ॥ పే. 33-34]

## అండము

పిట్టనుండి గుడ్డుపుట్టినట్లు, భగవంతునినుండి వాని రూపమునకు సంబంధించిన అండము పుట్టును. దానియందు వివిధ స్థితులలో సమస్త సృష్టియు జన్మించి, క్రమప్రవర్ధమానమై తనకు ప్రతిబింబముగా పరిణామము చెందుచు, తన సమగ్రత్వమునందు లీనమగుచుండును. ఇట్లు పరిణామము చెందు మొత్తమును 'విరాట్' అందురు. అతని విరాట్ విగ్రహమునందు జరిగినది, జరుగబోవునది, జరుగుచున్నది అను మూడు విభాగములు నిలబడియుండును. (విగ్రహమనగా విశేషముగా గ్రహింపబడినది, లేక నామరూపాత్మకమైన నిర్వచనమునకందునది అని యర్థము. ఈ విగ్రహమునందు భాగములై యున్న ప్రజ్ఞలకు భూతభవిష్యద్వర్తమానరూపమైన కాలముండును. మొత్తము రూపముగల భగవానునకు కాలము వర్తింపదు. అతడు దానికతీతుడై వర్తించును.).... ఈఅండము కేవలము కోడిగుడ్డువలె నుండక, నొకమొగ్గగా పొరలు పొరలుగా పువ్వుల రేకలవలె విచ్చుకొనుచుండును. విచ్చుకొనుచున్న రేకలు కాలమునందు విడిపోవుచుండగా, లోపలినుండి అనేక పొరలుద్భవించుచుండును. కుబుసము విడిచిన పామునకు మరల కుబుసమేర్పడుచుండును గదా! చిగుళ్ళనుండి విచ్చుకొనుచున్న యాకుల నడుమ మరల చిగుళ్ళు పొటమరించును గదా!

ఈ మొగ్గకున్న పొరలు ఏడు. 1) పృథివి 2) జలములు 3) తేజస్సు లేక అగ్ని 4) వాయువు 5) ఆకాశము 6) అహంకారము 7) మహత్తు. (ఇవి మన శరీరమునందు వెలుపలనుండి లోపలకు ఇదే క్రమమున ఏర్పడియుండును. బ్రహ్మాండమున భూమిపై నిలిచి గమనించిన వానికి కేంద్రము నుండి పరిధికి ఇదే క్రమమున ఏర్పడియుండును.) ఈ ఏడు పొరలనాశ్రయించి జీవుడుండును. వానియందతర్యామియై వానికతీతుడై దేవుడుండును.

– [శ్రీ. భా. ప్ర. III. పే. 16-17]

## అంతరాదిత్య విద్య

ఛందస్సులు వేదమున అనంతములుగా దర్శింపబడినవి. అందు ముఖ్యమైనవి ఏడు. ఇందలి అక్షర సంఖ్య ఒక్కొక్క పాదమునకు ఈ క్రింది విధముగా నుండును.

1. ప్రణవము — 1 అక్షరము
2. గాయత్రీ ఛందస్సు — 6 అక్షరములు
3. ఉష్ణిక్ ఛందస్సు — 7 అక్షరములు
4. అనుష్టుప్ ఛందస్సు — 8 అక్షరములు
5. బృహతీ ఛందస్సు — 9 అక్షరములు
6. త్రిష్టుప్ ఛందస్సు — 11 అక్షరములు
7. జగతీ ఛందస్సు — 12 అక్షరములు

ఇందు ప్రణవమునకు సూర్యరూపమైన అంతర్యామియే తాత్పర్యము. అతడు ఏకాక్షరమైన బ్రహ్మముగా సృష్టికి ముందు వ్యక్తమగుచున్నాడు, జీవులచే తెలియబడుచున్నాడు. "ఇదియే పరమాకాశమున ఋక్కురూపమైన అక్షరము" అనియు, "దానినుండి అక్షరము క్షరమగుచున్నది. అది ఈ సమస్తమును ఉపజీవింపజేయుచున్నది", అనియు సుపర్ణ సూక్తమున వర్ణింపబడినది. ఆకాశమున ఒక సూర్యుడుద్భవించుట, మన సూర్యోదయము, మన జననము ఈ ప్రణవ ఛందస్సు గానముగా వ్యక్తమగును. ఇది అన్ని ఛందస్సులకు మొదటిది, ఆధారమైనది. "ఛందస్సులలో ప్రణవము నేను" అని గీత చెప్పుచున్నది.

ఈ ఛందస్సులను గూర్చిన వృత్తాంతములే సృష్టి దేవతల వృత్తాంతములనియు, సృష్టిక్రమమే, ఛందస్సుల క్రమమనియు, అదియే సూర్యమండలమునను, ద్రష్టయైన తనయందును వున్నదనియు తెలియవలెను. "ఈ పురుషుని యందును, ఈ ఆదిత్యుని యందును ఎవడున్నాడో అతడొకడే యనియు, అతడే నేననియు తెలియవలెను", అని తైత్తరీయము అంతరాదిత్య విద్యగా నుపదేశముచేయుచున్నది. దీనిని తెలిసినవాడు అమృతత్వమనుభవించును.

– [సు. సూ. 109-113]

## ఆకాశము (I)

చోటులోని శక్తి ఆకాశము. "ఈథరు" అనికూడా అంటారు. ఆకాశమంటే "చోటు" కాదు. చోటులోని వ్యవహారం. చోటుని మన పురాణాల్లో "మహత్" అంటారు.

– [శ. ని. త.శా. పే. 53]

## ఆకాశము (II)

అన్నియు అకాశమునుండి పుట్టి ఆకాశములోనికి పోవుచుండును. కనుక ఆకాశమే అన్నిటికిని దారి. దానియందు సుపర్ణులై రంగుల కిరణములు ఉద్భవించుచున్నవి. అవి ఆకాశమునుండి ఏర్పడిన కదలికలలో చేయబడినవి. ఈ కదలికలే అపస్సులు. (ఇవి పంచభూతములలోని జలములు కావు.) అపస్సు అనగా ఆప్తి లేక పొందబడినవి. ఆకాశమునందు స్పందనమేర్పడగా స్పందన మందున్న ఆకాశము వెలుగుగా వచ్చును. దాని లేతముడుళ్ళే వెలుగునందలి రంగులు, లేక సుపర్ణములు. పక్షి రెక్కలు ఈకలతో అల్లిక చేయబడినట్లు ఇవి స్పందనములతోనే అల్లిక చేయబడియుండును. ఇందు మేల్కొనిన చైతన్యములే అపస్సులను తమ వస్త్రములుగా గల సుపర్ణములు. (వస్త్రమనగా వసించునట్టి దేహము. దేహమునందు కట్టుకొనబడుట వలననే దుస్తులకు వస్త్రములని పేరు వచ్చినది.)

ఈ సుపర్ణములే గుంపులుగా నేర్పడి సూర్యగోళముగా వసించుచున్నది. అంతర్యామి ప్రజ్ఞ అగ్ని అనుపేరుతో కేంద్రముగా మేల్కొనగా ఈ సుపర్ణములు దానియందు జ్యోతిర్మయ గోళము నేర్పరచుచున్నవి. పంచ

భూతములలోని జలములుకూడ స్థూలలోకములందు ఇట్లే ఏర్పడుటచేత సూర్య కిరణములచే, ఆవిరులుగా నాకర్షింపబడుచున్నవి. తమ నివాసములనుండి అటునిటు ఎగిరిపడుచున్నవి. అనగా జలములు మేఘములగుచు, మేఘములు జలములుగా వర్షించుచు, అటునిటు స్థితులుగా మారుచున్నవి. వెలుగుల రూపములైన సువర్ణములుకూడ చీకటినుండి వెలుగులుగా వచ్చుచున్నవి. వెలుగులనుండి చీకటులుగా పోవుచు అటునిటు తిరుగుచున్నవి. వానినుండి అల్లుకొన్న సృష్టికూడ వ్యక్తము, అవ్యక్తముల నడుమ తిరుగుచున్నది. జీవు లందరును స్థూలమునుండి సూక్ష్మమునకు, సూక్ష్మమునుండి స్థూలమునకు బంధమోక్షముల నడుమ ప్రయాణము చేయుచున్నారు. ఈ తిరుగుచున్న స్థూల సూక్ష్మ స్థితులలో నేదియును స్థిరముగాదు. వాని వెనుకనున్న ఈనల్లని దారియొక్కటే స్థిరమైనది. (దీనిని సువర్ణసూక్తము 'కృష్ణం నియానం' అని వర్ణించినది.) అది అమృతత్వము. దానియందే ఈ రెండు స్థితులును కలుగు చున్నవి.

– [సు. సూ. 169-70]

## ఆకూతి

కుతూహలము. మనస్సునకు కోరిక, కుతూహలము, సహజములు. వాక్కునకు సత్యము సహజము. అసత్యమాడిన వాక్కునందు కూడా అతడు అసత్యమాడెనను సత్యము సహజముగా వుండును. వాక్కు భావప్రకటన స్వరూపము. ఎట్లుద్దేశింపబడిన సత్యమట్లే వ్యక్తమగుట సత్యము. ఈ సహజ సంపదను లోకదృష్టి నానాత్వము వైపునకు చెదరనీయక నీయందు ప్రయో గింతుమని యర్థము.

– [శ్రీ. సూ. పే. 25]

## ఆతతావినే

ఆతతావినే అనగా విస్తారమైన అల్లెత్రాడు గలవాడని సామాన్యార్థము.

వెన్నెముక విల్లు : బ్రహ్మరంధ్రము, అల్లెత్రాడు. దానిని ధరించిన యోగవిద్యాధిదేవత రుద్రుడని విశేషార్థము.

క్షేత్రానాం : క్షేత్రమనగా శరీరములు. శరీరములలో జీవునిరూపమున వసించుచు, దేవుని రూపమున రక్షించువాడు.

సూ్రతాయ : జీవుని యాత్రకు శరీరము రథము. దానికి సారధి యనగా నియమమను పగ్గము పట్టి సాధనయను ప్రయాణమున మోక్షమను గమ్యమును జేర్చువాడు.

– [రు. సూ. 42-43]

## ఆదిత్య వర్ణము

అదితి యనగా సృష్టికి ముందున్నది, దేవతలకు తల్లి, వెలుగులకుతల్లి, మనము చీకటియని పిలుచునట్టి స్థితి. దానిసంతతియగు వెలుగులు ఆదిత్యులు. అందు సూర్యుడు మొదటివాడు. దాని వర్ణము అనగా రంగు లేక అక్షరము, ఓంకారము. అది సృష్టి మొదటి శోభ గనుక లక్ష్మియొక్క వర్ణము.

– [శ్రీ. సూ. పే. 18]

## ఆదిశేషుడు

శేషుని తోక భూగోళగర్భమైన పాతాళమందున్నది. అది చుట్టలు చుట్టలుగా వ్యాపించి భూపద్మ మనబడు సప్తద్వీపముల చివరిభాగముచుట్టును తన తేజస్సులతో వ్యాపించియుండును. ఈ తేజస్సులే పడగలుగా వర్ణింప బడెను. ఒక పడగ పరిణామముతో పోల్చినచో మనభూగోళము ఆవగింజంత యుండునని వర్ణింపబడెను.

– [శ్రీ. భా. ప్ర. XIII. ఐదవ చిత్రము]

## ఆపస్సులు

ఆకాశమున ఏర్పడిన కదలికలను ఆపస్సులందురు. ఆపస్సు అనగా ఆప్తి లేక పొందబడినది. (చూ. ఆకాశము)

– [సు. సూ. 169]

## ఆరణ్యములు-వాయవ్యములు-గ్రామ్యములు

ఆరణ్యములు, పశువులు, గ్రామ్యములు, వాయుచరములు అని చెప్పిన చోట భౌతిక శరీరసృష్టి యొక్కటియే తాత్పర్యము కాదు. అంతకుముందా కాశమున బీజప్రాయముగా వాని రూపశాఖలను నాటెను. అవి ఆయాకాలము లందు జీవుల శరీరములకు మూసలుగా పనిచేయును. ఈ మూసలలో జీవుల

పాంచభౌతిక శరీరములు వెలువడుచు, నశించుచుండును. ఈ నూనెలుగల వారినే భూమి చుట్టునున్న రాశిచక్రము, శింశుమారచక్రము, సప్తర్షిమండలము మున్నగు తావులందు గమనింపవచ్చును.

వాయువునుండి పుట్టిన వివిధ వాయువులు (Gases); ఆరణ్యకములు, అరణినుండి పుట్టినవి (అగ్నికి సంబంధించిన జీవసృష్టి).

గ్రామమనగా గుంపు. గ్రామ్యములనగా గుమిగూడిన కొన్ని శరీరములుగా వసించు జీవాత్మకలవి (Group Souls). జీవరాసుల ప్రాథమిక సృష్టిలో నిట్టివి హెచ్చుగా నుండును.

– [పు. సూ. పే. 25-26]

## ఆహారము-పితృదేవతలు

జీవుల దేహములయందు ఆహారమునుండి బలమును స్వీకరించునట్టి శక్తులే పితృదేవతలు. వీరివలన విత్తనములు మొలకలెత్తుటయు, వృక్షములు ఆహారముగ స్వీకరించబడుటయు, ఆహారమునుండి దేహపోషణము జరుగుటయు సంభవించుచున్నది.

– [శ్రీ. భా. ప్ర. VI. పే. 98]

## ఇనుడు

ఇనుడనగా ఇతడు అని అర్థము. ఇతడు సూర్యుడుగా దిగివచ్చిన తరువాత సృష్టి నేర్పరచును. కనుక ఇనుడనగా సూర్యుడని యర్థము. ప్రతి హృదయము నందును తానుగా నున్నాడు గనుక ఆత్మ అనియు అర్థము. సూర్యుడే జీవరాశులకు ఆత్మ అని వేదమంత్రములే చెప్పుచున్నవి. సూర్యుడే ఆత్మకారకుడని జ్యోతిర్విద్య చెప్పుచున్నది.

– [సు. సూ. 103]

## ఇతిహాసము

మానవునిలో అంతర్లీనములైన శాశ్వత శక్తుల సంఘర్షణకు బహిర్గతముగా జరిగిన కథయే సంగ్రామముగా పరిణమించును. బాహ్యమైన సన్నివేశము తాత్కాలికము. ఈ తాత్కాలిక శాశ్వత శక్తుల సమన్వయమునే

ఇతిహాసమందురు. "ఇతి+హ+ఆస= ఈ విధముగా జరిగెను సుమా!" అని ఈ పదమున కర్థము. "Thus the Scripture is Fulfilled" అను బైబిలు లోని వాక్యమునకు కూడ అంతరార్థమిదియే.

– [శం. రా. I. నేపథ్యము పే. 4]

## ఇషుధి

ఇషుధి అనగా అమ్ముల పొది. ఇది మనస్సుకు సంకేతము. పంచేంద్రియములు అమ్ములుగను, మనస్సు తూణీరముగను చెప్పబడును. రుద్రుడు నూరు ధనుస్సులు కలవాడు అనగా మనస్సునసున్న అనేకమైన ప్రజ్ఞల కధిపతి.

–[రు. సూ. పే.37]

## ఉచ్ఛిష్టము

ఉచ్ఛిష్టమనగా ఎంగిలి అని లోకార్థము. ఉత్+శిష్టము లేక ఉపరితలముగా మిగిలినది అని వేదముల యందర్థము. నామము, రూపము, స్థూల దేహము ఉచ్ఛిష్టములని అధర్వణవేదము చెప్పుచున్నది.

– [సు. సూ. పే. 63]

## ఉపవాకము

అనగా దగ్గరకుబోయి ఉపదేశముపొందు వాక్కు. అదియే నేనను ప్రజ్ఞ. దానినుపదేశమంది, తండ్రినుండి పుత్రుడును, గురువునుండి శిష్యుడును, యజ్ఞపురుషునినుండి జీవుడును అస్తిత్వము నొందుచున్నారు.

– [సు. సూ. పే. 56]

## ఉపాశ్రయము

ఉపాశ్రయమనగా సమర్పణము. ఈ సాధనకు రాగము, భయము, క్రోధము పోగొట్టుకొనవలెను. తపస్సుచే జ్ఞానమును పొందవలెను. రాగము అనగా వ్యక్తులపట్ల లేక పదార్థములయొక్క ప్రత్యేక స్వభావములయందు, పేర్లయందు, ఆకారములయందు కోరికను స్థాపించుకొనుట, దానియందు సుఖమును పొందజూచుట. భయమనగా అవి తమకు దూరమగునని తలచి

దూరము కాకుండుటకు ప్రయత్నించుట. క్రోధమనగా వానిని మనసుండి దూరముచేయు కారణములను ఇష్టము లేకయే స్మరించుట. పేర్లు,ఆకారములు ప్రత్యేక వ్యక్తుల స్వభావములు, పదార్థముల ధర్మములు మనచుట్టును నిండి యున్నవి. వానిలోపల నున్నదికూడ నీలోనున్నదే. అందరిలో అంతర్యామిగ నున్న 'నన్ను' స్మరించుట వలన 'నా' యందుండి 'నా' స్థితిలో నుండుట జరుగును. ఈ ప్రయత్నమునే ఉపాశ్రయము లేక సమర్పణము అని వ్యవహరింతురు. దీనికి కావలసిన సామర్థ్యము తపస్సు వలన కలుగును.

– [శం. రా. 1 పే. 136-37]

## ఋషులు

జ్ఞాన స్వరూపశక్తులు. వీరు సృష్టిలో వెలుగులుగా పొడసూపి జీవుల లోని జ్ఞానలోకముల నధిష్ఠించియుండి, ధర్మాధర్మ నిర్ణయములు చేయుచు, వేదమును శాశ్వతముగా పాడుచుందురు. వీరినే మంత్రద్రష్టలందురు.

– [పు. సూ. పే. 18]

## కకుభాయ

సర్వాంతర్యామి యొక్క సగుణ స్వరూపమే రుద్రుడు. కనుక నతడు సృష్టిలోని నానా స్వరూపములుగా పూజింపదగినవాడు. కకుభ స్వరూపు డనగా దిక్కుల నడుమనున్న అంతర్యామి. చోటులో దిక్కుల విభాగము చేయునట్టి ప్రజ్ఞ అతని స్వరూపము. కకుభ మనగా సౌందర్యము, సంపద, శిఖరము, శాస్త్రతత్త్వము అనిగూడ అర్థము.

(ఈ పదమునకు సామాన్యార్థము మద్దిచెట్టు)

– [రు. సూ. 54]

## కఠశాఖ

కఠశాఖ లేక కాఠకశాఖ అని ప్రాచీన వేదాధ్యయన శాఖలలో ఒక శాఖ వున్నది. (శాఖలనగా వేదాన్ని అధ్యయనం చేసే విధానములు. వీటినే తైత్తిరీయోపనిషత్తు "తస్మిన్ సహస్రశాఖే"....అని కీర్తించినది.) తిత్తిరి పక్షి రూపంలో ఒక మహానుభావుడు కృష్ణ యజుర్వేదం ఇచ్చి వర్ధిల్ల చేశాడు. కనుక అది తైత్తిరీయం అయింది. అలాగే కఠశాఖ అనేటువంటి దాంట్లో కఠము అనే

మార్గాన్ని మనకిచ్చిన మహానుభావులు కఠులు లేక కాఠకులు. ఒకే గుంపులో వున్న జాతి సంబంధమైన వాచకంగా పెద్దలు ఈ కాఠకాన్ని చెప్పారు. "శతపథం" అనే శాఖ వున్నది. శతపథం అంటే నూరు మార్గములలో అధ్యయనం చేయు విధానము. అలాగే "గోపథము" అనే శాఖ. గోపథము అంటే "వెలుగులబాట". ఋగ్వేదంలోను, యజుర్వేదంలోను చాలా శాఖలున్నాయి.

కఠశాఖకు సంబంధించినటువంటి ఉపనిషత్తును "కాఠకోపనిషత్తు" లేక "కఠోపనిషత్తు" అంటారు. కాఠకులు అని పేరుగల ఋషుల గణములు ప్రసాదించిన విధానమున వేదగ్రంథములను మనచేత అధ్యయనం చేయించే ఉపనిషత్తే ఇది.

(ఐతరేయులు అనే ఋషులు సృష్టిలో పరబ్రహ్మముకన్న ఇతరము అనే భ్రాంతి ఎలా ఉద్భవిస్తుందో చెప్పే ఆ ఐతరేయ విద్యను ప్రసాదించిన ద్రష్టలు. వీరు ఐతరేయ శాఖకు చెందినవారు.) ఈ కఠశాఖలో కొన్ని ప్రత్యేక సంకేతములు వున్నాయి. ఇవి వేదంలో ఎక్కడ వచ్చినా కాఠకానికి సంబంధించిన సంకేతాలని తెలుసుకోవాలి. వాటిలో మృత్యువు అనేటువంటి సంకేతం ఒకటి. మనం ఏదైతే మృత్యువనుకుంటున్నామో, అది మృత్యువు కాదని తెలియజేయటం దీనిలో ప్రధానాంశం. మానవులంతా మృత్యుభీతి కలవారు. గనుక, మృత్యుభావనచేత బద్ధులయినవారే. కాని వాస్తవానికి మృత్యువనేది ఏదీలేదు. బ్రహ్మవిద్యాభ్యాసం చేసేవానికి ముందుగా ఉపదేశించాల్సిన ప్రధానాంశాల్లో ఇది ఒకటి. కనుక కాఠకులు మృత్యువును తప్పనిసరిగా ఉపదేశించవలసిన సంకేతాల్లో ఒకటిగా స్వీకరించారు.

– [క. ఉ. పే. 4-5]

## కపిలుడు

సిద్ధులలో కపిలుడు భగవంతుని యవతారము. ఇతడు కర్దమ ప్రజాపతికి, దేవహూతికి జన్మించెను. సంసార తరణోపాయమగు మోక్ష విద్యా సర్వస్వమును సాంఖ్యశాస్త్రమను తత్త్వము, యోగవిద్యయను విభాగములుగా నుపదేశించి, భక్తియోగముతో సర్వమును సమన్వయించెను. అంతేకాక, తల్లిగర్భమున, పిండోత్పత్తియందు ఇరువదినాలుగు తత్త్వముల దేహరూపము ప దేశించి, అందుపురుషుడను పేర తాను ఇరువదియైదవవాడుగా నవతరించెను.

జీవులలో తత్త్వదర్శన సామర్థ్యమున కధిపతియై అంకములనబడు ప్రజ్ఞలను మేలుకొలుపువాడై వర్తించుచున్నాడు. దేహ నిర్మాణమునందు దేహభాగములను లెక్కల ప్రకారమేర్పరచి, జీవులమనస్సులకు అంకెల విలువలను గణిత శాస్త్రమును నేర్చు సామర్థ్యము నిచ్చుచున్నాడు.

ఈ విధముగా కపిలుడు సర్వ మానవజన్మలందును వికాసము కలిగించు సిద్ధుడేగాని, ఒక వ్యక్తికాడు. (దీనిని గ్రహింపనివారు ఇతడొక వ్యక్తియనియు, సాంఖ్యమను శాస్త్రమును స్థాపించెననియు భావింతురు. భాగవతము ప్రకారము సిద్ధుడగు కపిలుడు అధ్యాత్మిక విద్యాసమస్తమును విస్తరించెను గాని సాంఖ్యదర్శనము మాత్రమే బోధింపలేదు.

– [శం. రా || పే. 96-97]

## కర్దముడు

కర్దముడు సృష్టికి కారకులగు ప్రజాపతులలో నొకడు. ఇతడు తన భార్యయందు సృష్టి సమస్తమును శ్రీకళయైన హిరణ్యకర్దమముగా నుద్భవింపజేసెను. ఇతని మహిమ వలన సూర్యకిరణముల నుండి యుద్భవించిన మరుత్తులు వాయువులైనవి. అవే సూర్యకిరణములనుండి పుట్టిన అగ్నివలన వాయువులు జలములైనవి. జలము పృథ్వీతత్త్వమైనది. వాయు, జల, పృథ్వీ తత్త్వముల సమ్మిశ్రమగు కర్దమముపై (బురదపై)సూర్యకిరణములు ప్రసరించి జీవసృష్టిని కలిగించినవి. ఇదియంతయు కర్దమప్రజాపతి ప్రభావము. ప్రకృతి శ్రీ స్వరూపిణి గనుక కర్దముని సంతతిగ ఉద్భవించినదని పురాణములందు రూపించబడినది.

– [శ్రీ. సూ. పే. 26-27]

## కర్మ

పూర్వ కర్మకూడ మనమాచరించినదే. దానికి మనస్సు కర్మాధీనమై ప్రవర్తించి, మరల కర్మను మంచిచెడ్డ ఫలితములిచ్చుదానిని పెంచుకొనుచుండును. కాని గ్రహములు మన మనస్సును కర్మాధీనముగా ప్రేరేపించునే గాని కర్మచేయించవు. జీవుడు మనస్సు, ఇంద్రియముల, సంబంధము కలిగియున్నప్పుడు కర్మాధీనుడై కర్తృత్వమారోపించుకొనుచు, వాతావరణమునకు లొంగి ప్రేరేపింపబడిన విధమున కర్మబద్ధుడై కర్మాచరణము చేయుచున్నాడు.

ఇంద్రియములకు, మనస్సునకు అతీతుడైనపుడు పూర్వ కర్మనుండి విమోచనము చెందుచున్నాడు. అపుడు కర్తృత్వములేని నిమిత్తకారణమగుచున్నాడు. ఈ విధముగా సత్కర్మాచరణము చేసి,పూర్వదుష్కర్మ వాసనలను రహితము చేసుకొనుచున్నాడు. (దీనికి ఒక దీపమువలె జ్యోతిశ్శాస్త్రము సహాయము చేయుచున్నది. కనుక 'జ్యోతి' శ్శాస్త్రము లేక వెలుగు అని వ్యవహరించిరి).

–[ప్రా. ప్ర. 97]

## కవి

కవియను పదమునకు వేదమున ప్రత్యేకమైన అర్థమున్నది. దానినిబట్టి కవి యనగా పద్యములల్లువాడుగాక సత్యములల్లువాడు లేక చూచువాడు లేక చూచునట్టి వెలుగు. అతడే ఈ సృష్టిలోని రూపములను 'కనును'. కనుట యనగా చూచుటయే గాక 'బిడ్డగా పొందుట' కూడ.

వేద పరిభాషలో సూర్యుడు మొదటికవి, ఏకర్షి "కవిర్మనీషీ పరిభూః స్వయంభూః" అని మంత్రము. 'పరిసరములను పుట్టించువాడు'. అందు స్వయముగా పుట్టువాడు అగు సూర్యుడే సృష్టిలోనిరూపములను వర్ణించిన కవి. అటుపైన తన కిరణములను గణములుగా విభజించునపుడు ఋతువులు మున్నగువాని కధిపతియై గణపతి యనబడును. సప్తస్వరములను గణములుగా నేర్పరచి అక్షరముల ఉచ్చారణ నేర్పుటలో వాగ్గణముల కధిపతియగును. "కవిం కవీనాం ఉపమశ్రవస్తమమ్," అని గణపతి వర్ణనము. అటుపైన అతడే ఉచ్చారణ కధిపతిగా దిగివచ్చునపుడు బృహస్పతి యనబడును. ఉచ్చరింపబడు వాక్కులలోని అర్థమునందు అంతర్యామిగా దిగివచ్చునపుడు పురాణములలో బృహస్పతి కొడుకైన కచుడుగా వర్ణింపబడెను.

ఉచ్చారణమునకు అర్థము పిలకవంటిదని తాత్పర్యము. ఇది దేవలోక సృష్టి. ఇక స్థూలసృష్టి దీనికన్న భిన్నముగ జరిగి జీవుల దేహము లేర్పడవలెను. వానికి ఆకారములను కల్పించునట్టిది శుక్రధాతువు. దాని కధిపతియైన శుక్రుడు కూడా కవియని వర్ణింపబడెను. ఇతడు వేదములలో 'ఉశనసుడు' అనబడును. 'కవులలో నేను ఉశనసుడను'. అని భగవద్గీతలో కృష్ణుడు ఉపదేశించెను.

– [సు. సూ. పే. 46-47]

## కవిత్వము

కవిత్వము రెండువిధములు. ఒకటి ప్రతిభకు గోచరించిన దానిని వాగర్థములలో నలంకరించుట. రెండవది సృష్టి కల్పనముయొక్క సౌందర్యము నర్థముగా వాక్కులలో పొదుగుట. మొదటి మార్గము నవలంబించిన వారు లౌకికులగు మహాకవులు. వారిరచనలలో ఎంతగొప్పతనమున్నను 'నన్నుచూడు, నా అందముచూడు' అన్నట్లుగా నుండును. దీనినే 'గమిష్యామి అపహాస్యతాం' అని కాళిదాసు సున్నితముగ మందలించెను. ఇక రెండవ మార్గము నవలంబించిన కవులు మొదటి తరగతికి చెందినవారు. వారి రచన వేదములు. అవి 'వారిరచనలు' కావుగనుక అపౌరుషేయములు. అందలి శబ్దములు అంతర్యామి నుండి బయలుదేరి వారి కంఠములను వరించి వెలయును. అందలి శబ్దములు సృష్టియందలి అర్థములే.

-[వి. సూ. పీఠిక.]

## కార్యంకర్మ

ప్రకృతిచే ప్రేరేపింపబడి జీవులాయాకర్మలనాచరించుదురు. ఆచరించుటకుగాని మానుటకుగాని యెవ్వరికిని తరముకాదు. ఇచ్చట నిగ్రహము పని చేయదు. అహంకారముయొక్క ప్రేరణను శమింపజేయుటకు ఇంద్రియనిగ్రహము, యోగాభ్యాసము పనిచేయవలెను. ప్రకృతి చేయించు పనులలో కార్యములు, అకార్యములు అని యుండవు. జగద్వ్యూహము మొత్తమునందు జరుగవలసిన విధానము ననుసరించి, జరుగుచు వ్యక్తులద్వారా వ్యక్తమగు చుండును. వ్యక్తులు కేవలము ఉపకరణములు గనుక, వారు చేయుపనుల కును, సిద్ధించు ఫలితములకును సంబంధములేదు. వారు చేయుపనులు వారిచే చేయింపబడునవి, ఫలితములు జగద్వ్యూహమునకు సంబంధించినవి.

కర్మఫలముల నాశ్రయింపనిచో కర్మాచరణ మెందుకని ప్రశ్నించుట మాని కార్యమైన కర్మను, అనగా లోకశ్రేయస్సునకు పనికి వచ్చు సత్కర్మను చేయుటారంభింపవలెను. ఈ విధమైన కర్మాచరణము వలన మొదట మన పరిసరములకును, తరువాత మనకును శ్రేయస్సు కలుగుచుండును. మనము దేవతల వ్యూహముల నర్థము చేసికొని సత్కర్మాచరణము ప్రారంభించినచో,

దేవతలిచ్చు సత్ఫలితములు మనకు కూడ సంక్రమించును. ఈ విధమైన కర్మాచరణము నలవరచుకొనినవాడు సరియైన యర్థమున సన్యాసియు, యోగియునగుచున్నాడు. అంతేకాని వర్ణాశ్రమ ధర్మములు మానినవాడు పనులు మానినవాడు మాత్రము కాడు.

- [శం. రా I. 198-201.]

## కీర్తి

గుణమయమైన తన సృష్టిధర్మముల సంపదచే పరోక్షముగా లేక వ్యంగ్యముగా సృష్టిలోని జీవులకు, దేవతలు తమ అస్తిత్వమును తెలియజేయు చుందురు. ఈ లక్షణమును కీర్తియందురు. దేవయజ్ఞము అనబడు జీవుల శ్రేయస్సు నవలంబించినచో మానవులు కూడా కీర్తిమంతులగురు.కీర్తికామము మంచిదికాదుగాని కీర్తిగలుగుట శుభలక్షణము.

– [శ్రీ. సూ. పే. 20]

## కుమారస్వామి - కృత్తికలు

పార్వతీపరమేశ్వరుల కల్యాణంతో పరమాత్మ ప్రకృతితో కలసి సృష్టికి ఉన్ముఖత్వం సిద్ధిస్తుంది. అప్పటికి రుద్రుని తేజస్సువల్ల పార్వతీదేవిగర్భం ధరించినది. కాని ఆ తేజస్సును ఆమె భరించలేకపోయినది. అప్పుడు వాయు దేవుని సహాయ మర్థించి వానిమూలమున ఆ తేజస్సును అగ్నిహోత్రుని దగ్గరకు పంపినది. అగ్నికూడ ఆ తేజస్సును భరించలేకపోయెను. వానినుండి చింది, చెదరి ఆ తేజస్సు అగ్నిశకలములుగా వెలిగింది. అప్పుడు అగ్ని ఏడు రంగుల జ్వాలలుగా తన భార్య అయిన స్వాహాదేవితో సుఖమనుభవించాడు. అందు ఆరు రకముల మంటలుగా మాత్రము స్వాహాదేవి అగ్నితో విహరించి నది. ఆ మంటలు కృత్తికల రంగులతో వ్యక్తమైనవి. కృత్తికలను సప్తఋషుల భార్యలని శాస్త్రములు చెప్పును. కృత్తికా నక్షత్ర వ్యూహంలో ఆరు నక్షత్ర ములు దృశ్యములు, ఒకటి అదృశ్యము. ఆ ఒకటి అరుంధతి అయి వశిష్ఠ నక్షత్రం ప్రక్కనే వెలుగుతూ ఉంటుంది. ఈ కారణంగా అగ్నిజ్వాలలలో కృత్తికలో గల ఆరునక్షత్రములిమిడియున్నవి. కాని ఏడవదైన అరుంధతీ తత్త్వము లోపించినది. దీనినే మన పురాణములు ఒక చక్కని కథగా బోధ చేస్తాయి. అదేమనగా పూర్వము అగ్నిహోత్రుడికి సప్తఋషుల భార్యలపై

మనస్సు కలిగిందట. అతని భార్య అయిన స్వాహాదేవి అపచారం నుండి కాపాడడానికి తానే సప్తఋషుల భార్యల రూపం ధరించి తన భర్తతో విహరింప యత్నించిందట. ఒక్క అరుంధతీదేవి రూపం మాత్రం ధరించలేక పోయినదట. మానవుని యోగ సాధనలోని ధ్యానగతమైన తేజస్సు షట్చక్రాలలో సిద్ధులుగా అనుభవించబడుతుంది. ఏడవది సహస్రారంలో మానవుని ప్రజ్ఞ కందని వెలుగులో తప్ప దర్శింపబడదు. ఇది యోగులకు అనుభవైకవేద్యమైన సత్యము.

ఆకాశంలో గ్రహములు కాక నక్షత్రములు వేరుగా కనిపిస్తాయి. ఒక్కొక్క నక్షత్రం ఒక్కొక్క సూర్యుడు. అందులో కొన్ని మన సూర్యుని కన్నా ఉత్తమమైనవి. కొన్ని తక్కువయినవి వున్నాయి. ఈ ఉత్తమత్వం కాంతి విషయములో కాదు, ఆధ్యాత్మిక జ్ఞాన దర్శనాదుల విషయములో. ఒక సూర్యుని ఆధ్యాత్మిక శక్తి ననుసరించె అతని సౌరకుటుంబంలో వున్న గ్రహాలపైన నివశించు జీవుల ఆధ్యాత్మిక జ్ఞానానందానుభూతికి పరిమితి ఏర్పడుతుంది. ఈ విషయములో సూర్యునకు సూర్యునకు నడుమ తేజో రూపంగా ఆధ్యాత్మికతకు ఇచ్చిపుచ్చుకోవటాలు జరుగును. అందు గురు శిష్య సంబంధము వంటి సంబంధము వర్తిస్తూ వుంటుంది. ఏడుగురు ఉత్తమ ఆధ్యాత్మిక సూర్యులు, అయిదుగురు తక్కువశక్తికల సూర్యులు కలసి ఒక పెద్ద కేంద్రముచుట్టూ తిరుగుతూ వుంటాయి. (ఈ శాస్త్రాన్ని గురించిన వివరణములకు ఏలిస్. ఏ బెయిలీ అను బ్రహ్మవాదిని రచించిన ఈసోటరిక్ ఎస్ట్రాలజీ, అను ఆంగ్ల గ్రంథమున చూడనగును.)మన భూమిపైగల జీవులకు మన సప్తఋషిమండలము అనబడే క్షేత్రాలు, ఆధ్యాత్మిక సూర్యులు. అలాగే కృత్తికలు అనబడే నక్షత్రాలు కూడాను. ఈ నక్షత్రాల నుండి ఆశీర్వచన రూపమున వ్యక్తం చేయబడే ఆధ్యాత్మికరణ పుంజములతో ప్రతియోగి బ్రహ్మరంధ్రము వెంట వున్న చక్రములకు సంబంధము వున్నది. ఈ సంబంధాన్ని అనుసరించి జరిగే ఉపదేశ రహస్యాలయిన అనుభూతులన్నీ కుమార సంభవం కథలో ఇమిడి వున్నాయి. కనుకనే అగ్నిదేవునిద్వారా (యోగశక్తి ద్వారా) పుట్టిన కుమారస్వామికి (ఆధ్యాత్మిక జన్మమెత్తిన యోగికి)కృత్తికలు పాలిచ్చిపెంచినవి. అందుద్భవించిన కుమారస్వామికి ఆరు ముఖములున్నవి.

(అవే షట్చక్రముల మూలమున అనుభూతములగు ఆరు యోగానుభూతులు). ఆరుగురు కృత్తికలు ఒక్కమారుగ కుమారస్వామికి పాలిచ్చి పెంచినవట. ఆయన పుట్టిన వెంటనే తారకాసురుని సంహరించెను.

కుమారుడనగా పిల్లవాడు అని అర్థము. మన మనస్సు యోగసాధనచేత పరిపూరితమైన పూర్ణ సంకల్పంతో నిండి దివ్యసంకల్పంతో నిండివున్నప్పుడు అనుక్షణము కుమారత్వంలో వుంటుంది. అనగా నిస్సంగమైన మహాశక్తి వంతమై వుంటుంది. అందువలననే కుమారస్వామి ఆయుధము పేరు శక్తి అని చెప్పబడినది. బాహ్యప్రపంచంలో శక్తి అనగా బరువైన ఒక ఆయుధము. మానసిక ప్రపంచంలో శక్తి అనగా సంకల్ప శక్తి. రాగద్వేష స్పర్శలేకుండ, వ్యాజస్పర్శ లేకుండా దివ్య సంకల్పంతో మనస్సునిండి వున్నంతసేపు మనలో కుమారస్వామి ఉద్భవిస్తూ వుంటాడు. అతడు ఎప్పుడూ నిత్యనూతనుడు అయిన కుఱ్ఱవాడు. సాధకులకు అతని ఆరాధనము వలన ఎదురులేనటువంటి సంకల్ప శక్తి సిద్ధిస్తుంది. (చూ. సప్తర్షులు-సూర్యులు)

– [రా. ప్ర. 82-85]

## కుమారులు

సనకుడు, సనందనుడు, సనత్కుమారుడు, సనత్సుజాతుడు అను వారు కుమారులనబడుదురు. నారదుడును, ఈ నలుగురును మానససృష్టి. 'వీరు నా భావమునందు పుట్టినవారు, లేక నా మనసునుండి పుట్టినవారు,' అని భగవద్గీతలో వివరింపబడినది. వీరు కేవలము జ్ఞానమూర్తులై అంతర్యాములుగా చరింతురు. వీరిని పంచభూతములుగాని మిగిలిన సృష్టిగాని యంటదు. వీరి భావముల తోనే కావలసిన తావులందు భావముల అంశలుగా శరీరములేర్పడునుగాని భౌతిక, మానసిక శరీరములుండవు. యోగసాధనలో మోక్షము కోరినవారి మనస్సులలో వీరు సన్నిధిచేసి, ఊర్ధ్వగతికి సహకరింతురు. భక్తియోగమునకు సృష్టియందాచార్యులు. భక్తియనునది యున్నదని మానవుని మనస్సునకు తట్టుట వీరి వలననే.

– [శ్రీ. భా. ప్ర. III సం॥ పే. 102-103]

## కురుక్షేత్రము

వేదములో మంత్రభాగమున కురుక్షేత్రమను పదమున్నది. అచట అది సకల ధర్మములకు క్షేత్రమైన యాకాశమునకు సూచకముగా వాడబడినది. సర్వసృష్టియు ఆకాశమునుండి దిగివచ్చి ఆకాశములో లీనమగుచుండును. కనుక అందు సకల సృష్టి ధర్మములు అంతర్లీనమై యుండును. దీనికి సూచకముగా కురుక్షేత్రము ధర్మక్షేత్రముగా కీర్తింపబడినది. "అవిముక్తమనబడు క్షేత్రమే కురుక్షేత్రము. అందు దేవయజ్ఞము జరిగినది" అని బ్రాహ్మణములు చెప్పుచున్నవి. ("అవిముక్తంవై కురుక్షేత్రమ్; తస్మిన్ దేవయజనమాస".) అవిముక్తమనగా హద్దులు లేనిది. ఇది ఆకాశమునే సూచించును. అది యొక పురుషుని దేహము వంటిదిగాను, ఆ పురుషుడు పుట్టుకలేని వాడై యుండియు భిన్న జీవులుగా పుట్టుచుండుటకు అండము వంటివాడుగాను పురుషసూక్తమున కీర్తింపబడినది. ధీరులు దానిని ఉత్పత్తి స్థానముగా చూచురనియు, కిరణముల మార్గమును సృష్టికర్తలు అందు అన్వేషింతురనియు కూడా చెప్పబడినది. ఈ జీవుల యుత్పత్తి జరుగుటకు సంకల్పముగా బయలుదేరి విడివడిన వారే దేవతలనబడు ప్రజ్ఞలు. వారు చేయు జగత్కర్మయే పురుషమేధమనబడు యజ్ఞముగా వర్ణింపబడినది.

కనుక సృష్టి సమస్తము జరిగి, జీవులు వేరై, సంఘర్షణ సంభవించి యుద్ధములు సాధింపబడి, మరల లీనమగునట్టి ప్రదేశమని కురుక్షేత్రమను పదమునకు వేదముల భావపరంపర అర్థము చెప్పుచున్నది. కనుకనే కురుక్షేత్రము భారత యుద్ధమునకు కూడా రంగమని వ్యాసుడు చిత్రించుటలో, జరిగిన సంఘటన, కవితా కల్పనము జతపడినది.

– [శం. రా. 1 పే 4-5]

## కుండలిని I

కుండలిని యన్నది భౌతికముగా పాముకాదు. పామువలె ప్రాకి, వ్యాపించునట్టి మన చైతన్యము. అది ప్రాణమయ, విజ్ఞానమయ కోశములు ప్రాకి వచ్చి, ఆనందమయముగా సహస్రారమునందు పరిపూర్తి చెంది, మరల హృదయ కమలమునకు దిగివచ్చి ప్రేమగా వ్యక్తమగును. వాక్కునుండి వెలువడునప్పుడు ఆశీర్వాదముగా పనిచేయును. చూపునుండి వెలు

పడునపుడు కటాక్షముగా పని చేయును. కోరికలతో ధ్యానసాధన చేయువారికి నాభిస్థానము నుండి కామ క్రోధాత్మకమగు శక్తిగా వెలువడును. సాధన లేని సామాన్యులకు మూలాధారము నుండి స్త్రీ పురుష సంబంధమైన వాంఛగా పనిచేయును. జగన్మాతకు జీవుల దేహనిర్మాణలీలగా పనిచేయును. సాధననుబట్టి చక్రమున ఒక్కొక్కశక్తిగా వ్యక్తమగును.

– [ప్రా.ప. పే. 322-23]

## కుండలిని II

సుషుమ్న అనబడు అగ్ని నాడికి ఒక గొట్టమున్నది. వెన్నెముకకు నడుమ ఆసన్నని గొట్టముంటుంది. అందులో పనిచేస్తూ ఒకానొక శక్తి, ప్రజ్ఞ కలిసినది ఉంటుంది. శక్తి, ప్రజ్ఞ కలిసినటువంటి ఒక అస్తిత్వముంటుంది. వెన్నెముక కన్నములో గుండా వెళ్తూఉన్నదే కుండలిని. ఇచ్చట వెన్నెముక కన్నములోగుండా వెళ్తూ ఉన్న 'ఆయన' అనిగాని 'ఆవిడ' అనిగాని అనాలి. అందులో వెళ్తున్న 'ఆవిడ' అనాలి. 'ఆవిడ' వంటి స్థితిలో ప్రజ్ఞ అందులో ప్రయాణం చేయుచున్నది. ఒక విద్యుత్ప్రవాహముతో పోల్చ వచ్చును. 'విద్యుదయస్కాంతీకరణము, చెందిన కార్యరూపము, అనవచ్చును. విద్యుదయస్కాంతీకరణ చెందిన ప్రజ్ఞ. అంటే శక్తి, ప్రజ్ఞ స్వరూపములలో నున్న ఒక్కరే పనిచేయుచున్నారు. దానిని అనుభవించుటకు వీలగునుగాని, చూపించుటకు వీలులేదు. ఈ కుండలిని చూచునట్టి, వినునట్టి మొదలుగాగల పంచేంద్రియముల శక్తులుగా పంచబడినప్పుడు దీనిని వినియోగించి నీవు కంటితో చూడగలుగుచున్నావు. నీవు చూడగలుగుటను ఇతరులకు చూపించ లేకున్నావు. నీవు చూచుచున్నట్లు ఇతరులకు తెలియజేయగలవుగాని, నీ చూపును ఇతరులకు చూపలేవు.కుండలిని యొక్కతత్త్వము ఇది.సర్పముతో పోల్చబడినది గనుక దీనికి కుండలిని అని పేరు వచ్చినది. సర్పము చుట్టలు చుట్టుకొనియుండును గనుక కుండలిని అనబడినది.

ఇంకనూ సూక్ష్మముగా చెప్పవలెనన్నచో అది చుట్టలు చుట్టుకొని యున్న నీ యొక్క ప్రజ్ఞయే. ప్రాచీన శాస్త్రజ్ఞులు దానిని తామరతూడులోని దారముతో పోల్చిరి. తామరతూడులోవున్న దారం సున్నాలు, సున్నాలుగా

వుంటుంది. వేలకొలది దారములు చుట్టలుచుట్టుకొని అందులో వుండును. ప్రాచీనశాస్త్రజ్ఞులు కుండలినిగూర్చి 'బిసతంతు తనీయసి' అని పేర్కొనిరి. లలితా సహస్రనామములందు ఇది యొకటి. మనలో ఉన్న జగన్మాతయొక్క చాలనశక్తి స్వరూపమే కుండలిని. 'బిస' అనగా తామరతూడు, 'తంతు' అనగా దారము, 'తనీయసి' అనగా సూక్ష్మముగా నుండునది. చాల సన్నితము, సూక్ష్మములైనది. అంటే ఆ దారములు కొంత దూరము మాత్రమే భౌతికములు. అటుపైన ప్రజ్ఞామయములైన దారములతో చేయబడి యుండును. మన వెన్నెముక లోపలది ఎంత ప్రధానమైన భాగమో ఇప్పుడు మీకు తెలుస్తుంది. వెన్నెముక లోపలికి ఇంజక్షనుట్యూబు గ్రుచ్చి లాగినప్పుడు, ప్రజ్ఞయే భౌతికమైన ద్రవముగా వెలుపలికి తీయబడును. ఇంకొక శాస్త్ర రహస్యము, ఇంతవరకు దీనిని గురించి (నవీనులకు) తెలియనిది ఒకటి గలదు. ఒక జీవితమునకు ఒక పరిమాణమున ఇది ఇవ్వబడియుండును.

కుండలిని ఏడవ కక్ష్యలోనికి ప్రవేశించి అత్యున్నత ప్రజ్ఞా ప్రకాశ కేంద్రమును (జగత్తుకు మూలకారణమగు పరబ్రహ్మప్రజ్ఞ) చేరినప్పుడు విశ్వమంతయు మనస్సనేటువంటి తెరమీద పడుతుంది. పడ్డప్పుడు మనస్సు ఆ స్థితిలో 'శివుడ'నబడును. ఇది స్వచ్ఛప్రజ్ఞ. అది స్వచ్ఛమైన శక్తితో నిండి యుండును. శివుడు సమస్త సృష్టికి తండ్రి, శక్తి తల్లి. మనము 'శివుడు' కావలెను. శివస్థితి నందుటయే మన లక్ష్యము. ఈ లక్ష్యసాధనలో మన ప్రజ్ఞా బిందువు ప్రస్తుత పరిణామస్థితిపై నాధారపడియుండును. మన పూర్వజన్మలలో జరిగిన కార్యకారణ సంబంధముల సమాహారబిందువే ఇది. యోగమార్గ మనుసరించి జీవించినచో, ఒక జన్మలోనే ఈ రాబోవు జన్మల జీవపరిణామ మంతయును వికాసము చెందును. మనలో అనేక శ్రేణులలో పనిచేయుచున్న ప్రజ్ఞలు మొత్తము మన వ్యక్తిగతప్రజ్ఞకు తెలియబడుటకు అవకాశములేదు. ఈ ప్రజ్ఞా బిందువుయొక్క వికాసమును పెంచగలిగినచో ఈ బిందువు ఊర్ధ్వముగా ఆరోహణ చేయును. ఇది ఊర్ధ్వముగా ప్రయాణము చేసినకొలదియు మనకు సర్వజ్ఞత సంభవించును. మన స్వస్వరూపమే ఈ శివత్వము. మనల్నిమనము అనుభవించుట మొదలుపెట్టినచో ఈ స్థితిని అనుభవించెదము. మనము ఎంత ఎక్కువగా 'నేను' అను ప్రజ్ఞయందు స్వస్వరూపమునందు ఉందుమో,

అంతగా మనము ఈ స్థితిని (శివస్థితిని) అనుభవించెదము. అంతే మనం అది అంతా ధ్యానంచేస్తున్నకొద్దీ తెలుస్తుంది.

— [శ. ని. త. శా. పే. 39-42]

## కోశములు

అన్నమయకోశము అనగా భౌతికశరీరము. అది మనకు కనిపించే దేహము. ప్రాణమయ శరీరం అన్నమయాన్ని నడిపించే శక్తిమయ శరీరము. మనలోవున్న వేడి, రక్తప్రసారం, ఆహారాది పచనము మొదలైన వ్యాపారములు దీనివలన జరుగుతాయి. ఇలా జరిగించేందుకు కావలసిన మనస్సు, మన మనస్సు కలసి మనోమయ శరీరం అవుతుంది. ఈ మనస్సుకు కావలసిన విజ్ఞానం ఈ లోపల ఇమిడి వుంటుంది. దానివల్లనే మన ఉచ్ఛ్వాసనిశ్వాసములలోను, ఆహారపరిణామం మొదలైన వ్యాపారాల్లోనూ జరిగే రసాయనికములు మొదలైన మార్పులు నిర్ణయింపబడుతూ వుంటాయి. దీనికి కావలసిన విజ్ఞానము, మన చదువులకు కావలసిన విజ్ఞానము కలసి విజ్ఞానమయ శరీరం అవుతుంది.

ఈ మొత్తం సృష్టింపబడి నిర్వహింపబడడానికి అలా జరుగవలెననే ఇచ్ఛ లేక సంకల్పము కారణము. అదే ఆనందమయము. ఈ ఆనందమయ కోశముయొక్క పొరలే అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశములు. ఇవన్నియు ఆనందంలో పుట్టి వర్తించి లీనమౌతూ వుంటాయి.

— [రా. ప్ర. పే. 7-8]

## కోశములు, చక్రములు

కోశముల మధ్య గ్రంథులుండును. ఈ గ్రంథులు అన్నమయ శరీరమున కనిపించుచుండును. వీనిని నవీనశాస్త్రమున నిర్వ్యాహిక గ్రంథులు (Ductless glands) అందురు. ఇవి థైరాయిడ్ మొదలగు ఏడు ప్రధాన గ్రంథులు. వీనిని ఉద్దీపింపజేయుచు ప్రాణమయ మనోమయాది కోశములలో ఏడు కేంద్రములుండును. ఇవి వెన్నెముకలోని నాళమునకు లోపలిభాగమున పైనుంచి క్రిందికి వరుసగా స్థానములు కలిగియుండును. వీనివలన ప్రాణ

మయాది వ్యాపారములు నడుచును. అందు మూలాధారమువలన అన్నమయ శరీరమును నిలిపి పోషించుకేంద్రము వర్తించును. స్వాధిష్ఠానమువలన మనలోని ప్రాణమయ శరీరమునకు కావలసిన వేడిమి పుట్టుచుండును. కనుక ఇది అగ్నితత్త్వ మందురు. మణిపూరకము అనబడు చక్రమువలన రక్తప్రసారము మొదలగు ద్రవపదార్థముల ఉనికి వర్తించును. దీనిని జలతత్త్వ మందురు. అనాహత చక్రమువలన ఉచ్ఛ్వాసనిశ్వాసములు మొదలగు సంకోచ వ్యాకోచాత్మకములైన పంచప్రాణముల స్పందనములు (Pulsations) పనిచేయును. కనుక నిది వాయుతత్త్వమునకు కారణము. విశుద్ది చక్రమువలన మనలోనున్న ఆకాశమున మన శరీరము ప్రతిష్ఠ (stability) కలిగియుండును. స్పందనాత్మకమైన శబ్దము, వాక్కు దీనివలన పుట్టును. దీనిని ఆకాశతత్త్వమందురు. అజ్ఞాచక్రము వలన మన మనస్సునకును మన ఉనికికినిగల సంబంధము బిగింపబడియుండును. మనమున్నట్లు మనకు తెలియుట దీనివలననే. సహస్రారమున సర్వాంతర్యామి అనుభవముండును. మూలాధారమునుండి మన ప్రజ్ఞ సహస్రారమునకు చేరుదారి వెన్నెముకలో నుండి యుండును. ఈ విభాగములన్నియు మనస్సు, బుద్ధి, మొదలగు వాని వలె శక్తిమయములు, ప్రజ్ఞామయములు అగుటచే భౌతికశరీరమున కన్పించవు.

– (రా. ప్ర. పే. 13-14)

## గణములు - గణపతులు

గణములనగా రుద్రలోకము నందలి స్పందనాత్మకములయిన చైతన్యముల గణములు. వీరు పంచభూతముల గుంపులుగను, వీరితో నేర్పడు ఇంద్రియాదుల శక్తుల రూపముగను తిరుగుచుందురు. కనుకనే భూతగణములని పిలువబడుదురు. దేహములందు జీవుల మనస్సులను కర్మఫలముల ననుసరించి మథనము చేయుచుందురు. కనుక ప్రమథగణములని పేరు. ఈ గణముల కధిపతులే గణపతులు. ఉచ్ఛ్వాసనిశ్వాసాత్మకములయిన ఉచ్చారణ రూపములుగా నుందురు. కనుక శబ్దగణములకు, వాగ్గణములకు అధిపతులు. వీరి ఉచ్ఛ్వాసనిస్వాసాత్మకమైన మార్గమే తొండముగ రూపకల్పన చేయబడి

గజాననులుగ నారాధింపబడుచురు. శ్వాసకు మూలము ఓంకారము గనుక వీరు ప్రణవము యొక్క బాహ్యస్వరూపులు.

— [రు. సూ. 61-62]

## గాయత్రీ ఛందస్సు

గాయత్రీ ఛందస్సు ఎనిమిదేసి అక్షరములుగల మూడు పాదములు కలిగియుండును. ఎనిమిదిమంది వసువులు భౌతికసృష్టికి అధి దేవతలు. భూలోకమనగా భౌతికపదార్థము. అందలి కదలిక లేక ప్రాణశక్తి భువర్లోకము. అందలి ప్రజ్ఞయగు "నేను" అను కేంద్రకప్రజ్ఞ (Nuclear consciousness) సువర్లోకము. ప్రతి అణువునందును, జీవియందును, బ్రహ్మాండమునందును ఈ మూడు లోకములున్నవి. ఈ మూడు లోకములతో కూడిన అష్టవసువుల ప్రవృత్తిని సూచించునది గాయత్రీ ఛందస్సు. ఇట్టి సృష్టిని బట్టి ఈ ఛందస్సు ఏర్పడినదని యర్థముకాదు. గాయత్రీ ఛందస్సు అనబడు గమనము సృష్టిలోను, సృష్టికి పూర్వము కూడా నున్నది. దాని ప్రభావముననే ఈ గమనము సృష్టిలో వ్యక్తమై నడచుచున్నది. అట్లే సృష్టికి ముందునుండియున్న త్రిష్టుప్ అను ఛందస్సుయొక్క ప్రభావం వలన సృష్టిలో రుద్రలోకములు (Planes of vibration & forces) పుట్టి వర్తించుచుండును. శక్తి, శబ్దము, కాంతి మొదలైన యంశములలో నున్న ధర్మము లన్నియు రుద్రలోకమునకు చెందినవి. అవి ముఖ్యముగా పదునొకండు గణములుగా నుండును. దేవతలలో రుద్రులు పదునొకండు గణములుగా నున్నారు. ఈ విషయమును వివరించుటకుగాను 11 అక్షరముల త్రిష్టుప్ ఛందస్సులో కొన్ని వేదమంత్రముల రచన జరిగినది. అట్లే 12 అక్షరముల జగతీ ఛందస్సునుండి ఆదిత్యలోకములు సృష్టియై ప్రవర్తించుచున్నవి. దేవతలలో ఆదిత్యులు 12 గణములుగా నున్నారు. దేశము-కాలము (Space & Time) అనువానితో కూడిన సృష్టిలో ఇట్టి ఛందస్సులు లేక గమనములు కొన్నివేలు కలవు.

— [శం. రా. III పే. 63-64]

## గీత

ఉభయసైన్యముల మధ్య పొందిక కుదిరిన రథమునందు నారాయణుడు పూరించు శంఖారావము నరునకు (అనగా జీవునకు) ధర్మబోధయై వినిపించును. ఈ బోధనే వ్యాసుడు "భగవద్గీత" యని వ్యవహరించినాడు. గీత యనగా గానము చేయబడునది. అది శ్లోకరూపము, సంగీతరూపము మాత్రమే గాక, జీవుడు అలవరచుకొనవలసిన గానము. మనస్సునకు ఇంద్రియముల నుండి గోచరించు సృష్టియు అందలి సన్నివేశములును పరస్పర సంఘర్షణ లేక సంగీతమునందలి రాగ, తాళ, భావ, స్వరములవలె సామరస్య మొందవలెను. ఒక గ్రంథమును మనము అక్షరములను, పదములను, వాక్యములను చదువుచున్నను, అవిగాక, అందలి భావములుగాక, ఆ భావముల మొత్తము యొక్క సంస్కారమే ఎట్లు ప్రాధాన్యము వహించుచున్నదో, ఇదియునట్లే మొత్తము సామరస్యము ప్రాధాన్యము వహింపవలెను. ఆ సామరస్యమే దైవము. దానిలోని భిన్నాంశము జగత్తు. ఈ కారణముననే ధర్మసందేశమగు నీ శంఖారావము వ్యాసునిచే "గీత" యని వ్యవహరింపబడినది.

— [శంఖారావము 1-14]

## గోపుడు

గోపుడు - ఈ మొత్తము భువనములకు రక్షకుడు. ఇన్నిటియందు అంతర్యామియై యున్నాడు. ఇన్నిటియందు గోపనము చేయబడియున్నాడు. అనగా దేహాదులయందు వ్యూహములను పశువులను బంధించుచు ఇందరియందు తిరుగుచున్నాడు. గోపుడనగా గోవులను పాలించువాడు. ఈ యభిప్రాయమే పురాణఋషులచే కృష్ణకథయందు నిబద్ధము చేయబడినది.

గోపులనగా కిరణముల వ్యూహములను పాలించువారు. అట్టివాడు ఇందరిలో ప్రవేశించి అంతర్యామిగా యున్నాడు.

— [సు. సూ. 102]

# గోవు

ఛందస్సుల కూర్పు బుక్కల రూపముగా నున్నచో ఆ పేర్పును దేహముగా గలిగినవాడు సుపర్ణుడు. సామము రూపముగా కూర్పుచేసినచో ఆ కూర్పు దేహముగాగల వేదాత్మ గోవు అనబడును. దేహమందలి గ్రంథులు ఆయుర్వేదశాస్త్రమున గోవులనబడును. అవి వర్షించుటవలన ఆనందానుభూతి కలుగును. సంగీతమువలన నవి వర్షించును. కనుక సామగానము ఉపదేశించిన ఛందస్సులు గోవులు. వీనిని అంగిరసులనికూడ వర్ణించిరి. అంగములయందు ఆనందము వర్షించు వారంగిరసులని నిరుక్తవాక్యము. ఈ సామగాన ప్రక్రియయే గవామయన యజ్ఞము. దీని వైఖరిని గర్జితము చేసియే గోవులతో బృందావన విహారము, వేణునాదము దశమస్కంధమున వర్ణింపబడినవి.

— [సు. సూ. - 125]

# గోళము

ప్రతిగోళము పైననుగల జీవికి ఆ గోళము కేంద్రము. అందు నిలబడి పైకిచూడగా చుట్టునొక గొడుగువలె కనుపించు పొర (Vault or Arch) ద్యులోకము లేక వెలుగులలోకము. అందుండి యీ గోళముపైనున్న జీవులకు వెలుగులందింపబడును. ఈ నడుమనున్న చోటంతయు ఆ గోళమునకు సంబంధించిన ప్రాణతరంగములలో శబలితమై యుండును. ఆ ప్రాణవాహిని లోనికి జీవులయాకారములు వచ్చిపోవుచు రాశి చక్రగతి వర్తించుచుండును. ఈ నడుమనున్నచోటును అంతరిక్షము (Visibility or Transparency) అందురు. నరుని శరీరమున అంతరిక్షమటువంటిది. నరునికి శిరస్సునుండి జ్ఞానాదిజ్యోతులు, ఊహాదిశక్తులు సంక్రమించును గనుక ద్యులోకము యజ్ఞ పురుషుని శిరస్సు. శ్రోత్రమనగా వినగల యింద్రియము. శబ్దతరంగమే పురుషుని శ్రవణము. అది వర్తించునది యాకాశము. అందే దిగ్విభాగము కలుగు చున్నది. ఆకాశము, అంతరిక్షము అనునవి భిన్నలోకములయ్యు కలిసియే వర్తించును. చోటులో కుండ యీ కుండలో చోటుయు నున్నట్లుండును. భూమి యనగా నేగ్రహలోకము నందైనను దద్గ్రహ గోళముయొక్క భౌతికాకారమని యర్థము (Physical globe of any planet). మనకు శరీరమెట్టిదో గ్రహమునకా గోళమటువంటిది. భూమిమీద మన పాదములెట్లు మన దేహ

మునకు స్థిరత్వము గలిగించుచున్నదో యట్లే శరీరము మనము నిలుచుట కాధారమై యున్నది. అట్లే బహురూపములను గల్పించిన యజ్ఞపురుషునకు ఈ భూలోకము (Physical plane of existence) పాదముగా సృష్టించుకొన బడి స్థిరత్వము నిచ్చుచున్నది. (భూలోకమనగా భూగోళము కాదు.)

– [పు. సూ. పే. 34-35]

## గంగ

జీవులలోని జ్ఞానేంద్రియమైన సూడవకన్ను రుద్రస్థానము. దానినే కాశీఖండము, శివపురాణము, మొదలైన గ్రంథాలలో విశ్వేశ్వర జ్యోతిర్లింగము అని వ్యవహరించిరి. కామునిశక్తి శివుని మాటుపరచడానికి ప్రయత్నం చేస్తుంది. దానినుండి తప్పుకోడానికి యోగాభ్యాసమే మార్గము. యోగసిద్ధి కలిగేటప్పుడు మనలోవున్న పరమేశ్వరుడు సత్యగుణమనే కైలాసంలో తపస్సు చేస్తాడు. అప్పుడు కామదహనం జరుగుతుంది. శివపార్వతుల కళ్యాణం అంటే మనలోని ప్రకృతికి ఈశ్వరునితో జరిగే దివ్యవివాహము. అప్పుడు మనలో జ్ఞానలోకాలను వెలిగించే సప్తఋషిమండలము ఉద్బుద్ధమై ఉత్తమప్రజ్ఞను మేల్కొల్పుతుంది.

స్వర్గధామంలోని గంగను వియద్గంగ అని వ్యవహరిస్తారు. అక్కడ నుండి భగీరథుని వలన మందాకినిగా భూలోకానికి దిగివచ్చి భగీరథుని పితరులను తరింపజేసినది. అటుపైన పాతాళలోకానికి భోగవతి అనే పేరుతో చేరి ప్రసిద్ధిచెంది నాగులు మొదలైన జీవులకు నివాసమవుతుంది.

పంచభూతముల సృష్టికిపూర్వం అణువులుండవు. అంతకుముందు సృష్టిలోని అణువులన్నీ లయమయిపోతాయి. ప్రళయానికి అధిపతి అయిన శివుని జటాజూటంలో అణిగిపోతాయి. అప్పుడు కేవలం ఒక తేజోపదార్థము (సూర్యరశ్మివంటిది) సుడులు తిరుగుతూ వుంటుంది. దానినే వియద్గంగ అంటారు. ఇదే దేవలోకానికి పోయిన గంగ. మరల సృష్టి ప్రారంభమైనపుడు అణువులు తయారయేస్థితికి వచ్చిన ఆ కాంతిప్రవాహము మందాకిని అని పిలువబడుతుంది. ఇదే భూమికి దిగివచ్చిన గంగ. భౌతికపదార్థము (చేతనా

చేతనము) తయారైన వెనుక దానిలోకి అంతర్లీనంగా దిగిపోయిన ఆ ప్రవాహమే పాతాళగంగ లేక భోగవతి అవుతుంది.

మనశరీరంలో నాభికి దిగువను భోగలోకములు ఉన్నాయి. వానినే పాతాళాదులైన అధోలోకములు, జంతురాక్షసాది లోకములు అని యోగ విద్య సంకేతముగా బోధిస్తుంది. అచట శుక్రశోణితాత్మకమయిన శక్తియే పాతాళగంగ. ఇది జీవుల భోగమునకు కారణము కనుక భోగవతి అనబడుతుంది. జీవుల శుక్రకణములు సర్పాకృతులలో వుండును. కనుక ఇది నాగులకు నివాసమని కీర్తింపబడినది. తపస్సు, బ్రహ్మచర్యము, ఆత్మనిగ్రహము వలన ఈ గంగ ఊర్ధ్వమార్గముపట్టి సహస్రారానికి చేరుతుంది. అప్పుడది మనలో మందాకిని అవుతుంది. అక్కడనుండి యోగపరిపూర్ణత చెందే సమయానికి దివ్యప్రేమకు నివాసమైన హృదయపద్మానికి చేరుతుంది. అక్కడనుండి విశ్వప్రేమగా సంకల్పరూపాన వ్యక్తమవుతుంది. అప్పుడు ఆ అనుభూతిని వియద్గంగ అంటారు.

– [రా. ప్ర. పే. 79-82]

## గంధము - గాంధర్వ విద్య

పంచేంద్రియములలో వాసనచూచుట ముఖ్యముగా పృథివీ రేణువులకును, చైతన్యమునకునుగల సంబంధమును తెలుపును. కనుకనే పృథివి గంధవతియని చెప్పబడినది. అదృశ్యములైన సూక్ష్మరేణువులు తమ ధర్మములను ప్రజ్ఞకు తెలియజేయుటయే వాసన చూచుట. వాసన రెండువిధములు : సుగంధము, దుర్గంధము. అందు సుగంధము పృథివీరేణువుల సామ్యమైన సంబంధమును తెలియజేయును. రేణువులు సరియైనక్రమమున కదలుచున్నచో సుగంధమును, ఎగుడుదిగుడుగా కదలుచున్నచో దుర్గంధమును వ్యక్తముచేయును. అందు సమ విభాగమునకు, నాద విభాగమునకుకూడ గంధర్వులు అధిపతులై సంగీతమున కధిదేవతలగుచున్నారు. వీరివలననే తాళలయాత్మకమైన గాంధర్వ విద్య వ్యక్తమైనది.

– [శ్రీ. భా. ప్ర. VI పే. 69-79]

## చక్రము

చక్రము జగద్రహస్యముల వృత్తాంతములకు చిహ్నము. తనలోను, సృష్టిలోను, అదృశ్యముగా నొకచక్రము తిరుగుచున్నదని దర్శించియే మానవుడు చక్రము నిర్మాణముచేసెను. అన్నమువలన జీవుల శరీరములు పెరుగుచున్నవి. అన్నము జలముల పరిభ్రమణము వలన కలుగుచున్నది. భూమిపై జలములు పైకిపోయి మేఘములగుట, వర్షింప దిగివచ్చుట జలముల పరిభ్రమణము. ఈ దిగివచ్చుటలో విత్తనములు మొలకెత్తి అన్నము సిద్ధమగుచున్నది. కనుక ఈజలపరిభ్రమణమే "పర్జన్యము" లేక పరిసరములను పుట్టించుచున్నది. ఈ పరిభ్రమణము అదృశ్యశక్తివలన కలుగుచున్నది. ఈ అదృశ్యచక్రమే ప్రణాళిక లేక యజ్ఞము. ఇది తిరుగుటయను కర్మవలన అనగా క్రియాశక్తి వలన పనిచేయుచున్నది. ఈ దివ్యకర్మ ఆ బ్రహ్మమూర్తివలన పుట్టుచున్నది. అనేక ద్రవ్యములు శాస్త్రోక్తక్రమమున సమర్చినచో శక్తిపుట్టును. ఇట్లు కూర్చు మూర్తియే బ్రహ్మము. ఈ బ్రహ్మము అక్షరమువలన పుట్టుచున్నది. అనగా తననుండి తాను పుట్టుచున్నది. [దీనికి అ+క్షరము నశింపనిది, అక్ష+రము – అక్షము (కేంద్రము) నుండి గొనిరాబడినవియను విశేషార్థము లున్నవి.] ఆ చక్రమున కేంద్రమునుండి పరిధికి వివిధముగా అన్నము, మేఘములు, పర్జన్యుడు మొదలుగాగల సృష్టి దిగివచ్చుచుండును.

– [మం. గీ. పే. 131-132]

## చాతుర్వర్ణములు

ఏ భూఖండముననైనా మానవులు చేయు పనులు నాలుగు విధములుగా నుండును.

1. తెలిసికొనుట, తెలియజెప్పుట
2. కాపాడుకొనుట, కాపాడుట
3. ఉపయోగపడుట, ఉపయోగించుకొనుట
4. శరీరము నుపయోగించి పనులు సాధించుట

ప్రతి మానవుడు ఈ నాలుగింటిలో ఏదో ఒకదానికి పనికివచ్చు స్వభావము కలిగియుండును. ఈ స్వభావమునుబట్టి వానికి నచ్చిన మార్గము, దానియందు నిపుణత ఏర్పడును. దీనినిబట్టి వృత్తి కర్మ లేర్పడును. ఈ నాలుగు విధములు విభాగముననే పెద్దలు నాలుగు వర్ణములని పేర్కొనిరి. అవియే వరుసగా

1. బ్రాహ్మణ ధర్మము : తెలిసికొనుట, తెలియజెప్పుట
2. క్షత్రియ ధర్మము : కాపాడుట, కాపాడుకొనుట
3. వైశ్య ధర్మము : ఉపయోగపడుట, ఉపయోగం పొందుట
4. శూద్ర ధర్మము : శరీరబలముతో చేసిపెట్టుట, చేసికొనుట

ఏ వృత్తియైనను ఈ నాలుగింటిలో ఒకటియే అగును. దీనినిబట్టి ఏర్పడు విభాగమునకు వ్యక్తులే తమ స్వభావములచేత కారణములై యున్నను ఆ వ్యక్తులలో, స్వభావములలో అంతర్యామిగా నున్న భగవంతుడే దానికి కర్త. అయినను భగవంతున కిట్టి ప్రయోజనముతో నిమిత్తము లేదు. గనుక వీనికి కర్త కాకుండ గూడ నుండగలుగుచున్నాడు. ఇందు మానవులలో నంతర్యామిగా నుండి ఈ విభాగము చేయుచున్న రూపమైన దైవముగాను, వీని కతీతంగా నుండి వీనిని చేయకుండిన స్వరూపమైన దైవముగాను వున్నాడు. ఈ రెండును కలిపి దైవముయొక్క సమగ్ర స్వరూపము.

– [శం. రా. I పే. 140-141]

## చాతుర్హోత్రములు

సూర్యోదయము, మధ్యాహ్నము, సూర్యాస్తమయము, అర్ధరాత్రము అనబడు నాలుగు కాల స్వరూపులు ఈ సృష్టికి హోమము జరుగు స్థానములు. వాని నాధారముగా గొని ఏర్పడిన నాలుగు యజ్ఞములే చాతుర్హోత్రములు.

– [శ్రీ. భా. ప్ర. XI. పే. 22]

## చాక్షుషము

ఈ మన్వంతరమున భూమి జలమయమైనది. అందు భగవంతుడు మహామత్స్య రూపము ధరించి వైవస్వతమనువును నావపై కెక్కించి రక్షించెను. అప్పుడు నీటిలోనుండి మొదటి జీవియగు చేప పుట్టినది. దాని మనస్సుగా మనువు భద్రము చేయబడెను.

— [శ్రీ. భా. ప్ర I పే. 61]

## చిక్లీతుడు

లక్ష్మీపుత్రుల ముగ్గురిలో నొకడు. కర్దముడు, చిక్లీతుడు, ఆనందుడు అను ముగ్గురు లక్ష్మీపుత్రులు సృష్టికి ప్రజాపతులుగా పనిచేయుదురు. క్లిదనము అనగా తడుపుట. జలములకు తడుపునట్టి శక్తినిచ్చు దేవతయే చిక్లీతుడు. తడి యనునది జీవమునకు చిహ్నము. దానివలననే భూమి వర్షమున తడియుట, సృష్టి వితనమును మొలకెత్తించుట జరుగుచున్నవి. వర్షములు లేకుండుట క్షామమునకు సూచకము. చిక్లీతుడు అను ప్రజాపతి వర్షముచే భూమిని తడిపి పంట పండించు దేవత. పూర్వకాలమున నితడు రైతుల ఇష్టదైవముగా నారాధింపబడినాడు. ఇతడు ప్రసన్నమైనచో స్నిగ్ధములైన ఆపస్సులు ప్రసన్నమగును. అనగా మెరుపుకాంతులతో విద్యుత్ అనబడు ప్రాణశక్తిని తమలోని అంకురశక్తిగా పీల్చుకొని భూమికి దిగివచ్చు మేఘముల జలములివి. కనుకనే సంపదల నిచ్చు లక్ష్మికి రూపములై యున్నవి. తల్లి గర్భములో జలములు కారణముగా పిండము జీవించును గనుక మాతృస్వరూపిణియైన జలములను చిక్లీతుడు సకాలమున భూమికి గొని రావలెనని ఇందలి ప్రార్థన.

— [శ్రీ. సూ. పే. 27–28]

## ఛందస్సులు

ఇవి శ్లోకములకు, పాటలకు గల అక్షరగణ విభజనమని తప్ప, అంతకు ముందు సంప్రదాయము మరుగుపడినది. సృష్ట్యారంభమున దేశకాల విభజన

మేర్పడును. అనంతమైన ఆకాశము ఒక సౌరకుటుంబముగా కేటాయింపబడి అంటు కిరణములు, ఏడురంగులు, సంవత్సరకాల పరిమాణము, అయనములు, ఋతువులు మొదలులిప్తలు, విలిప్తలు వరకునుగల విభాగము ప్రకృతిలో నేర్పడును. అట్లే దాని ననుసరించి గోళములు, అంతర్గోళములు, సూర్య కేంద్రమైన జ్యోతిర్గోళము, భూకేంద్రమైన జ్యోతిర్గోళము, వాని కొలతలు నేర్పడును. దాని ననుసరించి జీవుల అయుర్దాయములు, వయోభేదములు నేర్పడుచున్నవి. వీనిని గమనించిన శాస్త్రజ్ఞులైన ఆదిఋషులు వీనినే ఛందస్సులనిరి. వాని గమనముతో నేర్పడిన గానముగా సృష్టి పోకడలను కీర్తించిరి. (సు. సూ. పరిచయం VIII) గాయత్రీ ఛందస్సుచే గాయత్రిలోని విషయము స్థాపించబడుట, త్రిష్టుప్ ఛందస్సులో త్రిష్టుప్‌ను గూర్చిన విషయము తొలిచి మలచబడుట, మరియు జగతి ఛందస్సులో జగద్విషయము పొదిగించుట అను విద్య తెలిసినచో అదియే ఇదియని తెలియును. దానిని తెలిసినవారే అమరత్వమనుభవించుచున్నారు.

(చూ॥ "అంతరాదిత్య విద్య")

– [సు. సూ. పే. 10)

## జగదంతము

జంబూద్వీపమైన భౌతిక భూగోళము చుట్టును మిగిలిన ద్వీపములు బహిరావరణములు. జంబూ ద్వీపమందలి లోపలి పొరలేడును బిలస్వర్గములు. ఇవి అంతరావరణములు లేక అధోలోకములు. ఉత్తరధ్రువమున కెదురుగా పైనున్నది ధ్రువతార దానిపైన వియద్గంగ. దానిపైన విష్ణుపదము. ఇక్కడ ఏర్పడిన శంఖువే మేరుశిఖరము లేక బ్రహ్మపదము. ధ్రువతారకు దిగువుగా సప్తర్షి మండలమున్నది. భూగోళముపై లంకమీదుగా (భూమధ్యరేఖ మీదుగా) రాశిచక్రము పరివర్తించును. దానినిబట్టి తూర్పు పడమర లేర్పడును.

– [శ్రీ. భా. ప్ర. XIII చూ. రెండవ చిత్రము]

# జయ విజయుల కథ - భాగవత రహస్య సర్వస్వము

జయ విజయుల కథలో విష్ణుమూర్తి చేసిన సంభాషణము యొక్క సారాంశము నీ దిగువ విధమున సంగ్రహింపవచ్చును.

1) తపస్సు చేయువారు దైవానుగ్రహమును ప్రత్యేకముగ మిగిలిన వారి కన్న నెక్కువ పొందుదురనుకొనుట పొరపాటు.

2) ఎవరు ఎంత నిష్ఠతో జపతపాదులు చేసినను దాని సత్ఫలితము వారికి ప్రత్యేకముగా నుపయోగపడక లోకహితమునకు మాత్రమే యుపయోగ పడును.

3) తప్పులు చేయనివారు మాత్రమే మోక్షమును దైవానుగ్రహమును పొందుదురనుకొనుట పొరపాటు. శుచిత్వము కలిగినను అహంకరించి నచో దైవానుగ్రహము కలుగదు. తప్పులుచేసిననుభగవంతునికి తమ్ము సమర్పించుకొను బుద్ధి యలవడినచో ఎంతటి పాపాత్ములైనను పవిత్రులై దైవానుగ్రహమునకు పాత్రులగుదురు. ఇక తప్పులు చేయరు. దైవమునకు శరణాగతి చెందక నేను తప్పులు చేయను అనువారు అహంకారపడి దెబ్బతిందురు.

4) పెద్దలను గౌరవించు వారిలో గూడ దైవముండును. గౌరవింపబడు పెద్దలయందు మాత్రమే యుండుననుకొనరాదు. పూజ్యులైన బ్రాహ్మణుల యెడ నెట్లు దైవముండునో అట్లే పూజించువారి యెడల గూడ నుండును. పూజించునట్టి శూద్రాదుల రూపమున దైవమే అంతర్యామిగా నుండి బ్రాహ్మణుల పాదరేణువులను శిరస్సున ధరించుచున్నాడు. కనుకనే విష్ణుపాదములందు పుట్టిన గంగవలె ఆ పాదమునందే పుట్టిన వినయవంతులగు శూద్రులు గూడ పవిత్రులై పాపములను హరించుచున్నారు. వారి కృషి కర్మవలననే సంపద రూపమున లక్ష్మి ఉద్భవించి అందరిలో నున్న విష్ణువును వరించుచున్నది.

5) బ్రాహ్మణుల పాదములను ఇతరులు పూజించి జ్ఞానులగుట, ఆ పూజించు వారిలో విష్ణువును చూచి బ్రాహ్మణు లాదరించుట అను రెండు ధర్మ

ములు నిర్వర్తింపబడినప్పుడే జగత్తునకు క్షేమము కలుగుచున్నది. అనగా విష్ణువు సంతోషించుచున్నాడు. అట్లుగాక తెలిసినవాడగు బ్రాహ్మణుడు ఇతరులపై కోపించినచో ఇతరుల యందు రాక్షసత్వము ప్రబలి భూలోకమున హిరణ్యాక్ష హిరణ్యకశిపుల వంటివారు తయారగుచున్నారు. వారు సజ్జనులను అవమానించుచు హింసించుచున్నారు. ఇట్టి దుష్కర్మల వలన విష్ణుని అనుగ్రహము తప్పును గనుక నరజాతి ఆపదల పాలగును. విష్ణుధర్మము ఒక దేశమునకు, ఒక కాలమునకు సంబంధించినది కాదు. ఏకాలమున నెవరు పాటించిన వారికి సుఖశాంతులు, మోక్షము కలుగును. ఈ వాక్కులు ఎవ్వరును కాదనుటకు వీలులేని శాశ్వత ధర్మములు గనుకను, వీనిని అవలంబింపనినాడు నరజాతి కష్టనష్టముల పాలగుచున్నది గనుకను, ఇదియే శాశ్వతధర్మము లేక వేదధర్మము. దీనిని భాగవత రహస్య సర్వస్వముగా నారాయణుడు సనకసనందనాదులకు నుపదేశించెను. తప్పు చేసినవారు మరల గ్రహించి సమర్పణ బుద్ధి చూపినచో అనుగ్రహము కలుగును కనుక నారాయణుడు సనకసనందనాదులను అనుగ్రహించినట్లుగా చెప్పబడినది. నరులలోగూడ ఇతరుల తప్పులను గుర్తించుకొనక వారు బాగుపడుట చూచి సంతోషించు వారియందు నారాయణుడు అనుగ్రహము చూపును.

ఈ సంభాషణమును నారాయణుని నుండి యుపదేశమందిన నారదుడు వ్యాసునకు చెప్పెను. వ్యాసుడు భాగవతముగా రచించెను. దీని వివరణము నుదాహరణ పూర్వకముగా చేయుటయే యిటువంటి భాగవత గ్రంథములోని కథయంతయు, దానికొరకే హిరణ్యాక్ష హిరణ్యకశిపులు, రావణ కుంభకర్ణులు, శిశుపాల దంతవక్త్రులు మున్నగువారి కథలు భాగవతమున స్థానము గొన్నవి. రాబోవు కథలలో ధ్రువుడు, పృథుచక్రవర్తి మున్నగు రాజర్షుల కథలును, పురంజనోపాఖ్యానము మున్నగు అర్థవాదములును, ప్రహ్లాదుడు, అంబరీషుడు మున్నగు ప్రపన్నుల కథలును విస్తరింపబడినవి. అటువంటి ఈ ధర్మము పరిపూర్ణమైన వారి జీవితము లెట్లుండునో తెలుపుటకై గోకులము, బృందావనము నందలి గోపకుల కథలు చెప్పబడినవి. అట్టివారితో

పాటు నారాయణుడు నరదేహమున భూమికి దిగివచ్చి దుష్టుల బాధలనుండి ప్రపన్నులను కాపాడుట యెట్లో తెలియజేయుటకై కృష్ణావతార కథ చెప్పబడి భాగవతము పూర్తియగుచున్నది.

– [శ్రీ. భా. ప్ర. VI పే. 44-46]

## జాతవేదుడు

వేదముల యందు పుట్టినవాడు. 'తన' యందు వేదములు పుట్టినవాడు. వేదములను పుట్టించువాడు. అనగా జీవులలో 'నేను' అను ప్రజ్ఞగా నున్న పురుష మూర్తియగు 'అగ్ని'. వాని నుండియే వానికి సమస్త జ్ఞానము భాసించును. (శక్కగా సంస్కరింపబడిన మనలోని ప్రజ్ఞతే మానవుడు వ్రాయని గ్రంథములు అనగా అపౌరుషేయములు.)

– [శ్రీ. సూ. పే. 10]

## జీవపరిణామము

జీవపరిణామ కథలో జీవులుగా నేర్పడినవారు దేవగణములైన ప్రజ్ఞలే. వానినే పితృదేవతలని వేదములు చెప్పుచున్నవి. వారు మనువు దేహము నుండి (శత రూపవలన) దిగివచ్చిరి. అనగా వందల రూపములు ధరించిరి అని అర్థము. మనువునుండి వచ్చిన నాటినుండియు వారు మన్వంతరులు లేక మానవులు అనబడిరి. (ఇచట మానవులనగా జీవాత్మలని అర్థమేగాని నరులని అర్థము కాదు.) ఈ పరిణామ దర్శనశాస్త్రము వేదోపనిషత్పురాణముల యందును, ఇతిహాసముల యందును చెప్పబడినది. క్రైస్తవమతమునకు ముందున్న అన్ని జాతులవారి పవిత్రగ్రంథములును దీని కథలే. ఈ దర్శన ప్రకారము మానవులు ముందుపుట్టి 1, 2, 3 జాతులు పరిణామమున తమ్ము తాము సమర్పణ జేసికొని అణువులను, పంచభూతములను పరిణమింప జేయుదురు. మానవులు ఈ పరిణామమును పూర్తిచేసి పాంచభౌతిక సృష్టికి కారకు లగుచున్నారు. ఈ దర్శనమున సృష్టి పరిణామము జీవాత్మలచే నిర్వహింప బడుచున్నదేగాని భౌతిక ద్రవ్యమునుండి ఊర్ధ్వముగ పరిణామము చెందుట లేదు. ద్రవ్యము జడమైనచో పరిణామము చెందుట ఎట్లు జరుగును ?

ఋషీంద్రులైన ద్రష్టల పరిణామ దర్శనము ప్రకారము మానవుడు ముందు పుట్టి సమస్త జీవ దేహరూపములను మన్వంతర తపస్సుచే సాధించి తెచ్చెను. భౌతిక ద్రవ్యసృష్టియు, దేహసృష్టియు పరిణామ వృక్షమునకు చిట్టచివరిగా నేర్పడిన పిందెలు. ఈ భౌతికదేహ సృష్టితోనే నరదేహ సృష్టిగూడ నొకటిగా నేర్పడెను గాని నరుడు చిట్టచివర పరిణమించిన ఉత్తమజాతి యనరాదు. అన్ని జీవులయందునుగల మానవ చైతన్యము నెరిగిన జీవియే ఉత్తముడు.

– [శ్రీ. భా. ప్ర. 13 సం. పంచమస్కంధము గ్రంథగ్రంథులు XIV-XV]

## జంబూద్వీపము

జంబూద్వీప మనగా సముద్రముతో కూడిన భూగోళము. ప్లక్ష ద్వీపము దానిచుట్టును ఆవరించికొని యున్న వాయుమయమైన మరియొక గోళము. ఇట్లే ఒకదానికన్న నొకటి పెద్దదిగా భూమిచుట్టును గోళములేర్పడి సప్తద్వీపములను పేరుతో వ్యవహరింపబడుచున్నవి. జంబూద్వీపము నందే కాక మిగిలిన ద్వీపములందు కూడ సూక్ష్మలోకములలో వృక్షములు మున్నగు నవన్నియు కలవు. అవి కేవలము వెలుగువంటి ద్రవ్యముచే చేయబడి యుండును గనుక అగ్నిహోత్రుడు దేవతయని చెప్పబడినది .... ఇంతేగాక మన సౌరకుటుంబముతో కలిసియున్న ఇట్టి తారకల గుంపునుగూడ జంబూ ద్వీపమందురు. ఇట్టి తారకల గుట్టలే ఇతర ద్వీపములుకూడ.

– [శ్రీ. భా. ప్ర. XI పే. 57]

## తారకలు

మనకు వలనే ఈ తారకలకును పుట్టుక, పెరుగుదల, లయము ఉన్నవి. ఇవి పుట్టుటకు ముందు తేజోమయమైన ధూళి యేర్పడును. దానిలో సుడిగుండములు పుట్టి చోటులో నొక మేరుదండము పుట్టి దానిచుట్టును తార కలతో కూడిన గోళమేర్పడును. ఈ పుట్టుకనే అమృతమథన కథగా పురాణ ములు వర్ణించును. అడుగున తావేలునుంచి మంథరపర్వతము దండముగా నిర్మించి అమృతమథనము జరిగినది. అటుపైన పుట్టిన తారకలు ఒక్కొక్కటే సూర్యమండలమై తన సృష్టిని ప్రారంభించెను. ఈ తారకల చక్రమును

భూమధ్యరేఖకు మీదుగా నున్న ఆకాశస్థానమును గుర్తించుటకే 360 భాగలు 27 సమభాగములు చేయబడినవి. ఒక్కొక్క విభాగమునగల తారకలకు వేరు వేరుగా పేర్లు పెట్టబడినవి. కాలక్రమమున ఈ పేర్లు ఈ 27 విభాగములకు సంక్రమించినవి. ఈ భేదము తెలియుటకై తారకల కన్న వేరుగా ఈ విభాగములు నక్షత్రములని పేర్కొనబడినవి.

ఈ నక్షత్రములు ఒక గుండ్రని యింటికిగల 27 కిటికీల వంటివి. అందుండి కనుపించునవి తారకలు. తారకలశాస్త్రము వేరు, నక్షత్రముల శాస్త్రము వేరు. నక్షత్రములు జీవరాసుల కర్మఫలములను గణించును. తారకలు యుగయుగాంతర కాలములలో మానవజాతి కథలను సూచించును. యుగములు మన్వంతరములు, వాని ఫలితములు లెక్కించునట్టి పురాణముల కథల లెక్కలు తారకలకును, జీవుల దినచర్యకు శుభాశుభములను ఆపాదించు లెక్కలు నక్షత్రములకు స్థిరపడినవి. తారకల జ్ఞానములేనిచో రాసులజ్ఞానము పనిచేయదు .... ఈ రాశిచక్రము నక్షత్రచక్రము యుగములలో మెల్లిగా వెనుకకు జరుగుచుండగా యీ కిటికీలలో నుండి కనిపించు తారకలు మారుచుండును. దానినిబట్టి జనుల పోకడలపై యుగధర్మము మారుచుండును. జాతులలో పొడుగు, పొట్టి, లావు, సన్నము మున్నగు ఆకృతుల వైఖరులు గూడ ఈ తారకలనుబట్టియే మారుచుండును. ఈ చక్రముల పరిభ్రమణము మొత్తము చరిత్రయే ఒక బ్రహ్మకల్పము. దానిని స్వయంసంపూర్ణముగా పంచలక్షణములతో కీర్తించి వివరణము చేయుటయే పురాణముల లక్ష్యము.

– [శ్రీ. భా. ప్ర. XIII పే. XX-XXII]

## త్రిగుణములు

త్రిగుణములలో రజస్సునకు, తమస్సునకు పరస్పర విరుద్ధములైన లక్షణములున్నవి. ఈ రెండును సామ్యము చెందిన వెనుక నేర్పడునట్టి నిర్మలస్థితియే సత్త్వము. రజస్తమస్సులతో పోల్చినచో సత్త్వముకూడ ఆ రెండింటికన్న భిన్నమైన యొకస్థితి గనుక మూడవగుణముగా చెప్పబడుచున్నది. రజోగుణమునకు మహావేగము ప్రత్యేకలక్షణము. తమోగుణమునకు స్థూలత, మందత ప్రత్యేకలక్షణములు. చూచుచున్నవారి కంటికి చీకటి

కనుపించుటకు తమోగుణము కారణము. వెలుతురు కనిపించుటకు రజోగుణము కారణము. అవి చూడబడుచున్న వస్తువులందుండక చూచుచున్న ఇంద్రియములకు గుణములై చీకటి, వెలుతురు అనిపించును. కనుక రజస్తమస్సులు తొలగించబడినప్పుడు సత్త్వము నిర్మలత్వము కలిగియుండును. అది ద్రష్టయొక్క ప్రకాశమే అయి ద్రష్టచే అనుభవింపబడును. సత్త్వసంపన్నునకు సృష్టిలో పరబ్రహ్మతత్త్వము సూటిగా అనుభవమునకు వచ్చును. సత్త్వగుణము సుఖసంగముతోను, జ్ఞానసంగముతోను బంధించును. (సుఖసంగము లేకుండుట నిజమైన సుఖముగాని, సుఖమునకై యత్నించుటకాదు. జ్ఞానసంగము లేకుండుట నిజమైన జ్ఞానముగాని, జ్ఞానమునకై యత్నించుట కాదు.) రజోగుణము కర్మసంగముతో బంధించును. తాను చేయదలచుకొనిన పనులకోసమై అహోరాత్రములు తపించుచు ప్రయత్నించును. తాను నమ్మిన పనులకై తృష్ణ పెరుగును. దానితో సుఖములేకుండ పోవును. తమోగుణము అజ్ఞానమునుండి పుట్టును. ఇది గలవారికి ఏమి చేయవలయునో తెలియదు. దీనినే సోమరితనమందురు. దానికి స్తబ్దత, నిర్లక్ష్యము తోడుకాగా అదియే వైరాగ్యమనుకొనును. తమోగుణమున చిక్కినవానిని ఆ గుణము మోహింపజేయును. కనుకనే సర్వదేవతలకును తమోగుణము మోహనమని భగవానుడు చెప్పెను.

సత్త్వరజస్తమస్సులు మూడును సంగము పుట్టించును. సంగదోషము మనస్సునకు సంబంధించినదిగాని, త్రిగుణములకు సంబంధించినది కాదు. సృష్టిలో త్రిగుణములుండుట యెందులకు ? అజ్ఞానములేనిదే జ్ఞానములేదు. ఈ రెండింటికి నడుమ కర్మసాధనముండును. త్రిగుణాత్మకమైన ప్రకృతితో నేర్పడిన దేహము నందుండియే త్రిగుణములబంధము లేకుండునట్టి యభ్యాసము చేయవలెను. అట్టి అభ్యాసము చేసినవాడు జననమరణముల కతీతుడగునని ఫలశ్రుతిగా చెప్పబడినది.

పుట్టుకచేతనే జీవికి త్రిగుణములలో నేదో యొకగుణము ప్రాధాన్యము వహించును. మిగిలిన రెండును దానితో కలియును. ఈ కలయికలోని భేదములే వ్యక్తిగతములైన స్వభావభేదములుగా నేర్పడుచున్నవి. వానిని బట్టియే చేష్టాభేదములుకూడ నేర్పడుచున్నవి. రాగద్వేషాదులు కలుగుచున్న

జన్మలలో కర్మబంధము మరల మరల పెరుగుచుండును. నివృత్తి యెట్టిన కొలదియు కర్మబంధము సడలి తొలగిపోవును. ఇన్నిటికి కారణము త్రిగుణముల స్వభావముకాదు. జీవియొక్క సామర్థ్యముకాదు. జీవపరిణామక్రమము లోని సామర్థ్యముకూడ కాదు. ఇన్నిటి యందంతర్యామిగా పనిచేయుచున్న దైవలీలయే కారణము. మొదటిదశలో నున్నవానికి ఈ సమాజము స్వార్థ భూయిష్టముగా కనిపించి స్వార్థపరునిగా ప్రవర్తింపజేయును. రెండవ స్థితిలో నున్నవానికి ధర్మాధర్మములు ఇచ్చిపుచ్చుకొనుటలో పురుషప్రయత్నముపై నమ్మకము దృఢముగా నేర్పడును. మూడవదశలో వానికి స్వధర్మాచరణ రూపమైన సత్కర్మాచరణము సాధనమార్గము కాగా, దైవానుగ్రహము, అంతర్యామిత్వము మోక్షధర్మము, బోధపడును. ఈ మూడుస్థితుల వారికిని కావలసిన పద్ధతిలో త్రిగుణములు పనిచేయుచు కావలసిన శిక్షణ మిచ్చుచుండును.

– [శం. రా. III 27-34]

## త్రిగుణాత్మక ప్రకృతి

పురుషునియొక్క ప్రకృతి మూడు విధములు. రజస్సు, తమస్సు, సత్త్వము. రజస్సనగా కార్యోత్సాహశీలము. తమస్సనగా జడత్వము. సత్త్వ మనగా సామ్యము. గుఱ్ఱము, బండి ఈ రెండూగనుక ఒకదానితో నొకటి. పొంతనతో వుంటే సాఫీగా వెళ్తుంది. సత్త్వగుణ ప్రధానుడలా వుంటాడు. గుఱ్ఱం మంచి సామర్థ్యం కలిగినటువంటిదై, బండి తుక్కైతే తొక్కేస్తుంది. బండి బరువై గుఱ్ఱం కుంటిదైతే బండి సాగదు. కనుక రజోగుణం ప్రధానమైనవాడు, తమోగుణం ప్రధానమైనవాడు వరుసగా ఇట్లా వుంటారు. సామ్యమున్నప్పుడు సత్త్వగుణ ప్రధానం వుంటుంది.

తమస్సునుండి ద్రవ్యం పుడుతుంది. రజస్సునుండి శక్తి పుడుతుంది. సత్త్వమునందు ప్రజ్ఞ పుట్టదు, వ్యక్తమవుతుంది. ప్రజ్ఞ అంటే మనకు నిద్ర లోంచి మెలకువ వచ్చినప్పుడు ఏంపని చేస్తుందో అది .... మనంతట మనకు తెలియుటయే ప్రజ్ఞ. ఖనిజముల నుండి నరజాతిదాకా వచ్చిన పరిణామదశలో

ప్రజ్ఞ క్రమక్రమంగా మేల్కొంటుంది. ప్రకృతి త్రిగుణాత్మకమైనది. త్రిగుణాత్మకమైన ప్రకృతి ఒకటే. ప్రకృతియొక్క ప్రవృత్తులు మూడు.

– [శ. ని. త. శా. పే. 3]

## త్రినేత్రుడు

శంకరునకు మూడు కన్నులు. అవియే సూర్యుడు, చంద్రుడు, అగ్ని యనునవి. ఇచ్చట సూర్యచంద్రులు గ్రహగోళాదులు కాదు. సూర్యత్వమనబడు కన్ను, చంద్రత్వమనబడు కన్ను, అగ్నియనబడు ప్రాణము అతని మూడు కన్నులు. ఇచ్చట చెప్పబడిన యగ్ని సర్వజీవరాసులలోని వేడిమి గనుక నతడందరి యందును తరంగమయ స్వరూపుడై సర్వాంతర్యామిగా నుండును.

– [శ్రీ. భా. ప్ర. V పే. 104]

## త్రిపురాసుర సంహారము

శంకరుడు త్రిపురాసురులనబడు రాక్షసులను సంహరించెను. త్రిపురాసురులనగా మూడు పురములు కట్టుకొనియున్న రాక్షసులు. ఆ పురములే భూతమయము, శక్తిమయము, ప్రజ్ఞామయ మనబడు సృష్టిలోకములు. వాని యందాశ్రయించుకొన్న రాక్షసత్వమును శంకరుడు దహించును. అనగా సృష్టిలో నున్న జీవులకుగల పాపములను హరించును. అతడెముకలను మాలికలుగా ధరించును. అనగా నెముకలతో గూడుకట్టుకొనిన శరీరములను ధరించి జీవులయందు వర్తించును. భిక్షాటనము చేయుట యనగా భక్తుల సమర్పణమును, సమర్పణ బుద్ధిని గోరుట. భస్మము ధరించుననగా పరమాణువులను తరంగములను దేహములుగా ధరించును. ప్రేతభూమి యందు వసించుట యనగా సృష్టి నెల్లప్పుడును మరల తనలోనికి హరించుచుండుట.

– [శ్రీ. భా. ప్ర. V పే. 106-107]

## త్రేతాగ్నులు

గార్హపత్యము, దక్షిణాగ్ని, ఆహవనీయములను త్రేతాగ్నులందురు.

1) గార్హపత్యమనగా గృహపతి వెలిగించు అగ్ని. గృహపతి యనగా ఇంటి యజమాని. ఇతడు ఆహారము పచనముచేయు జఠరాగ్ని. ఇంటి యజమానివలె తానార్జించిన సంపదలను దేహమందలి వారికి పంచి పెట్టుచుండును. దేహమున కెవ్వరికేమి కావలసి వచ్చినను వీనిముఖము ననే రావలయును కనుకనే దేవతలకు అగ్నిముఖులని పేరు వచ్చినది.

2) దక్షిణాగ్ని యనగా దక్షిణదిక్కున రగుల్కొల్పు అగ్ని. దేహమున శిరస్సు ఉత్తరభాగమనియు, నడుము దక్షిణ దిక్కనియు సంకేతము. కామమనబడు దాంపత్య ధర్మమునకు దక్షిణాగ్నియని పేరు.

3) ఆహవనీయమనగా హోమముచేయు అగ్ని. ఇదియే బుద్ధిబలము. నేర్చినదెల్ల దీనియందు హోమము చేయబడి పవిత్రత చెంది అంగీ కరింపబడును.

– [శ్రీ. భా. ప్ర. VIII పే. 55]

## తైత్తిరీయము - పిట్టకథలు

వేదము మనలో నాలుగు విధములుగ ప్రవర్తించును. ఒకటి శ్వాస. రెండు కంఠనాదము, వాక్యము దానికర్థము. మూడు మనస్సు, నాలుగు దేహము. ఈ నాలుగు వరుసగా సామవేదము, ఋగ్వేదము, యజుర్వేదము, అథర్వణవేదము అని పెద్దలచే సంకేతము చేయబడినవి. వీనికి సంబంధించిన గ్రంథములను ఆ ఋషులే పలికియుండుటచేత ఆ గ్రంథములనుగూడ వేదము లందురు. అనేక రహస్యములను వివరించుటకు ఈ ఋషులు అనేక సంకేత ములను ఉదాహరణలుగా, ఉపమానములుగా, ఉపదేశములుగా సృష్టించి యిచ్చిరి. అట్టి సంకేతములు "విద్యలు" (Seeds of Wisdom) అనబడును. అందొక్కొక్క విద్య ఒక్కొక్క బీజమై, ఒక జాతివృక్షమువంటి మహా దర్శ నమును సాధకునియందు అంకురింపజేసి, విస్తరింపజేయును. ఇట్టి విద్యలు వేదవాఙ్మయమున కొన్నివేలున్నవి. ఈ మహావిద్యలన్నియు వేదదర్శనము

సకు, ఇహపర సాధనమునకు వినియోగపడి సాధకుని తరింపజేయును. దహరవిద్య, పంచాగ్నివిద్య, అక్షివిద్య, ఆయతన విద్య మొదలగునవి కొన్ని ముఖ్యమైన విద్యలకుదాహరణలు. వీనిలో పక్షులను సంకేతముగా స్వీకరించిన విద్యలు కొన్నియున్నవి. సుపర్ణవిద్య, త్రిసుపర్ణవిద్య, హంసవిద్య, కపింజల విద్య, తిత్తిరివిద్య, కుశికవిద్య అనునవి కొన్ని ముఖ్యమైన ఉదాహరణలు. "పిట్టకథలు" అను సంప్రదాయము వీనినుండియే ఏర్పడినవి.

విచిత్రమైన పిట్టకథలలో తిత్తిరి పిట్టకథ ముఖ్యమైనది. వేదవిద్యను వేగముగా భుజించి ఈ తిత్తిరిపిట్ట మరల క్రక్కినదట. దానిని పిట్టలరూపము స్వీకరించి, భుజించిన బ్రహ్మవేత్తలైన శిష్యులు 'తైత్తిరీయము' అనబడు కృష్ణ యజుర్వేదశాఖకు సంబంధించిన వారైరి. ఉచ్ఛ్వాసనిశ్వాసములకును, జీవ-దేహ సంబంధమునకు గల కథలు పిట్టకథలుగా బ్రహ్మవిద్యయందు సంకేతింపబడినవి. దేహమున ప్రాణప్రతిష్ఠ చేయుచు వచ్చుచు పోవుచున్న శ్వాసయే పక్షిగా నుపదేశింపబడినది. దానిని హంసమంత్రము రూపముగా నుపదేశించునపుడు హంసయను పిట్టగాను, హరిమంత్రముగా నుపదేశించునపుడు మూపున విష్ణువును ధరించిన గరుత్మంతునిగను, సంకేతించిరి. ఉచ్ఛ్వాసనిశ్వాసములు రెండును ఈ పక్షికి రెండురెక్కలు. ఆయుర్దాయమున గల సంవత్సరములు, మాసములు, పక్షములు, వారములు, అహోరాత్రములు, మున్నగునవి రెక్కలఈకలు. యుగములు, మహాయుగములు, మహాకల్పములు తోకయందలి ఈకలు. అంతర్యామి అనుభూతి కలవాని జీవితము గరుత్మంతుడు విష్ణువాహనముగా చెప్పబడెను. అదిలేనిజీవుల జీవితమున అమృతకుంభమును కొనితెచ్చుచున్న గరుడుడుగా సంకేతింపబడెను. తాను నేర్చుకొనిన అంశములనబడు దర్భలపై ఈ అమృతకుంభము దింపబడుటయు, కాలబద్ధులైన జీవులు పాములుగా దర్భలు నాకుటయు పిట్టకథగా పురాణవిద్యలలో ముఖ్యవిద్యగా సంకేతింపబడినది. పిప్పలవృక్షముపై నున్న ఒకే సుపర్ణుడు అంతర్యామి, బహిర్ణ్యములనబడు రెండు సుపర్ణములుగను, ఈ సృష్టిలో బహుశాఖల జ్ఞాన, కర్మల ననుభవించుచున్న రంగురంగుల రెక్కలుగల అనేక సుపర్ణములుగను ఋగ్వేదము వర్ణించుచున్నది. ఒకే సుపర్ణుని - ఇంద్రుడు, మిత్రుడు మున్నగు బహుదేవతలు బహువిధములుగా వర్ణించుచున్నారనిగూడ చెప్పబడినది.

జీవునకు దేహమునకు పెండ్లికుదుర్చు పురోహితునిగా సుపర్ణుడు చెప్ప బడినాడు. అదేవిధముగా కంఠస్వరమునకును, శ్వాసకునుగల సంబంధమును భూమికి దింపువాడుగా 'హంస' అను పక్షి వర్ణింపబడెను. ఈ హంస సృష్టి కర్త వాహనము. వాక్కు అనబడు సరస్వతి ఈ హంసవాహనము నెక్కి 'సోహం' అను శ్వాసయందు పచారులు చేయుచుండును. అదేవిధముగా కంఠనాదమునకును, మనస్సునకునుగల సంబంధము తిత్తిరిపిట్టగా వర్ణింప బడెను. ఉచ్చరించు ధ్వనినిబట్టి మనస్సుయొక్క అనుభవము మారును. పిడుగుపడినపుడు గుండెలదరును. మనస్సు దిమ్మరబోవును. సంగీతము విని పించినప్పుడు మనస్సు ప్రాణమునకు చక్కని కుటీరముగా కట్టుకొనును. ఇట్లే అకారాది క్షకారాంత ధ్వనులలో ఒక్కొక్కదాని యుచ్చారణమునకు మనస్సుపై నొక్కొక్క ప్రభావమున్నది. దీనిననుసరించి మరల ఈ మనస్సు ఎట్టి శబ్దములు నుచ్చరించవలయునో నిర్ణయించుకొనవలెను. దానితో భాష పుట్టును. పుట్టిన భాషలోని ధ్వనులు ప్రయోగముచే మరల ప్రభావితమైన మనస్సు ఆయా ధ్వనులను అర్థములను నిర్ణయించుకొనును. దీనితో శబ్దార్థ ములు సాహిత్యముగా దిగివచ్చును. దాని సంకేతము చిలుక. ఈ చిలుక జోస్యమే 'శుకమహర్షి' అను పదమునకు మంత్రార్థము. పరాశరుడు, వ్యాసుడు, శుకుడు అనునవి తండ్రి, కొడుకు, మనుమడు పేర్లుగా పెట్టుకొని ఉండవచ్చునుగాని అవి ఆ పేర్లకు వెనుకనున్న సంకేత విద్యలనుగూడ సూచించుటకు వాడబడినవి. అట్లే, పరాశరుని తండ్రియగు శక్తిపేరుకూడ. వశిష్ఠుడను పదము సౌరకుటుంబములోని ఒక వెలుగులముద్దకు సంకేతము. ఇది ధనిష్ఠుడో, బలిష్ఠుడోవంటి పదము. ఇంతకును ఒక్కొక్క పదము ఒక్కొక్కవిద్యకు సంకేతము. తిత్తిరిపిట్ట కథలోని, తైత్తిరీయముకూడ కృష్ణ యజుర్వేదము సంహితలోని ఉపదేశమునకు సంకేతము. నాలుగువేదము లలో నొక్కొక్కదానికి మోక్షవిద్యా రహస్యోపాసనము ఒక్కొక్క ఉపనిష త్తుగా నుపదేశింపబడినది. తైత్తిరీయవేదమగు కృష్ణ యజుర్వేదమునకు మోక్ష రహస్యమే తైత్తిరీయోపనిషత్తు.

— [తై. ఉ. పరిచయము 2-5]

# తంత్రములు

తంత్రములనగా ఒకజాతికి చెందిన శాస్త్రీయగ్రంథజాలము. ఎవరు వ్రాసే తంత్రగ్రంథములోనైనా ఉన్న తంత్రాలు అరవైనాలుగు అని చెప్ప వచ్చు. తంత్రాలంటే సృష్టిలోను, మనలోను ఉండేవి, కాని పుస్తకాల్లో వుండేవికావు. తంత్రము అనేమాటకు 'అల్లిక' అని అర్థము. ఏదైనా అల్లిక చేసినట్టిది తంత్రమే. 'తను' అంటే ఏమిటి ? దారాలు. తంత్రములంటే దారాలతో చేయబడిన అల్లిక. సృష్టియొక్క అల్లికనుగూర్చి తంత్రగ్రంథాలలో బోధింపబడినది. సృష్టిలో అరవైనాలుగు తంత్రాలు ఉన్నాయి. (అంటే అరవైనాలుగు పుస్తకాలు కాదు.) సృష్టి జరగడానికి ఆ అరవైనాలుగింటిని గూర్చి చెప్తూ, అరవైనాలుగు తంత్రాలు అంటారు.

అమ్మవారికి పదునారు అక్షరములనామము కలదు. అందువలన ఆమెను 'షోడశి' అంటారు. ఈ షోడశాక్షర నామమునందు పదునారుచంద్ర కళలు కలవు. నాడులనుగూర్చి ముచ్చటిస్తున్నప్పుడు "అరవైనాలుగు" సంఖ్య సూచించబడినది. పదునారు అక్షరాలపేరు ఉంటుంది. ప్రతిచంద్ర కళకున్నూ నాలుగు విభాగములుండును. అరవైనాలుగు మానసిక ప్రవృత్తులు లేదా వికృతులు లేదా వికారములంటారు. ఈ అరువదినాలుగు చంద్రకళలు కూడా అరవైనాలుగు తంత్రాలు. అందుకనే సౌందర్యలహరిలో శంకరా చార్యులవారు చెప్పారు, 'అమ్మా, ఈ సృష్టిలో అరవైనాలుగు తంత్రాలు ఉంటూ వుండగా, నీవు వాటన్నిటిలోను అంతర్యామిగా అరవై అయిదవ తంత్రంగా పనిచేస్తున్నావు.'—"స్వతంత్రంతే, తంత్రం జగదిద మహాతీతద్, చతుష్షష్ట్యా తంత్రైః" 'అరువదినాలుగు తంత్రాలు ఉంటూ వుండగా, అవి చాలక ఇందులో నీవు శక్తిగా పనిచేస్తూ అరవైఐదవదిగా పనిచేస్తున్నావు. ఏ తంత్రానికీ లొంగవు. స్వతంత్రం నీ తంత్రం' అన్నారు. ఈ తంత్రోపాస నలో వాసన, రూపము, రుచి, స్పర్శ, శబ్దము, ధ్యానము - వీటన్నిటికీ సము చితమైన ఉపయోగమున్నది. వీటిని నియమముతో ఎవరు ఎలా సద్విని యోగం చేసుకోవాలో చెప్పబడ్డది. సుగంధద్రవ్యాలు, రుచికరమైన ఆహా రము, రంగులబొమ్మలు, చిత్రలేఖనము, సంగీతము మొదలైనవన్నీ పనికి

రావచ్చును. అమ్మవారి చిత్తరువును అందమైన రంగుల సమ్మేళనంతో చిత్ర కారుడు చిత్రించటం - ఊర్ధ్వమార్గంలోకి వెళ్ళేటట్టు చేయడానికే తంత్రాలలో ఉద్దేశింపబడింది.

బ్రహ్మచర్యాశ్రమంలో తంత్రోపాసనకు, యోగాభ్యాసానికి పూర్వ రంగం తయారు చేసుకొనడమే కాని పరిపూర్తిలేదు. గృహస్థాశ్రమంలో పరి పూర్తి. యోగానికి స్త్రీసాంగత్య ముండకూడదు, పురుషసాంగత్య ముండ కూడదు అనరాదు. మొట్టమొదట అభ్యాసంలో ఇట్టి సాంగత్యం ఉండకూ డదు. బ్రహ్మచర్యాశ్రమంలో నిష్టగా ఉన్నవాండ్లకు, గృహస్థాశ్రమంలో యోగపరిపూర్తి వస్తుంది. ఈ తంత్రగ్రంథాలలో భార్యాభర్తలు జీవితం గడ పటంకూడ నిర్దేశింపబడినది. భౌతికమైన దాంపత్యజీవనం ఎలా గడపాలో, ఆనందంగా ఎలా జీవించాలో, ప్రణయాన్ని ఎలా వినోదించాలో ఇదంతా నిర్దేశించబడింది. తంత్రగ్రంథాలలో ప్రణయానికి (రొమాన్స్), కామానికి ఎట్టి సంబంధమూలేదు. ప్రణయానికీ, కామానికీ మధ్యగల తేడా ఎక్కువమందికి తెలీదు. సంభోగమనేది సాంసారికమయిన ఆనందమునకు భంగకరమయి నట్టిది. కాని సంతానానికి కావాలి గనుక సృష్టికి భగవంతుడిచ్చాడు సంభో గాన్ని. కాని సంభోగంలో ఉన్నది ఆనందంకాదు, ఆనందభంగం. దాంపత్య జీవనంకూడ పరమపవిత్రమైన, ఒకానొక యజ్ఞయాగాది క్రతువులలో ఒక భాగంగా, తంత్రగ్రంథమున స్వీకరించబడును.

— [శ్రీ. ని. త. శా. పే. 90-4]

## దహరాకాశము

వాక్కులకు హద్దయిన ఆకాశమెక్కడ అను ప్రశ్నకు వాక్కు ఎచ్చట పుట్టుచున్నదో ధ్యానము చేయుమను ఉపదేశమే సమాధానము. వాక్కు కంఠద్వారమున వెలువడుచున్నదిగాని, కంఠమున పుట్టుటలేదు. ఊపిరితిత్తుల లోను పుట్టుటలేదు. ఊపిరితిత్తులలో గాలి యున్నదేగాని ఉచ్చారణము సంక ల్పమున పుట్టుచున్నది. ఈ సంకల్పము హృదయమున పుట్టుచున్నది. గుండెకాయలో నెచ్చటను పుట్టుటలేదు. గుండెకాయ భౌతికము. అందుండి

మానసికమైన సంకల్ప మెట్లు పుట్టును ? గుండెకాయ హృదయమునకు స్థానము. గుండెకాయయే హృదయముకాదు. గుండెకాయలో హృదయమెచ్చట నుండును ? గుండెకాయలోని చోటులో నుండును. గుండెకాయలో కప్పబడిన చోటే హృదయముగా మేల్కొనుచున్నది. చోటును మేలుకొలిపి మాట్లాడించుటకే గుండెకాయ సృష్టింపబడినది. ఇట్లు మేల్కొనిన చోటునే గుండెకాయలో దహరాకాశమందురు. చోటులో ఇల్లుకట్టగా ఇంటిలోచోటు వేరుగా నేర్పడినట్లు గుండెకాయలో చోటు హృదయమై జీవుడుగా మేల్కొనుచున్నది. ఊపిరితిత్తులచేశ్వాసపీల్పించుచున్నది. శ్వాసచే కంఠధ్వని వెలువడుచున్నది. అదియే శబ్దబ్రహ్మము. అదియే వాక్కునకు ఉత్పత్తిస్థానము, పరమావధికూడ. ఇచ్చట పరమావధి ఈ వాక్కు వినునట్టి చెవి. అనగా దేహమునందు చెవిద్వారమున వినుచున్నవాడు. ఆకాశమున వాక్కు ఉచ్చరించువాడుగా మేల్కొని, వాక్కుగా వ్యాపించి, వినువాడుగ లీనమగుచున్నది.

– [సు. సూ. 141]

## దక్షయజ్ఞ కథ - రహస్యార్థము

ప్రాథమిక జీవరాసులైన జలచరములు దేహపరిణామములు పొంది అందుండి స్థలచరములు, వాయుచరములు, స్థావరములైన వృక్షజాతులు ఆరోహణక్రమమున పుట్టుటయు, అందు స్థలచరములలో వెన్నెముకగల జీవులు పుట్టుటయు, అందు నాలుగుకాళ్ళ జంతువులు పుట్టుటయు, అవి క్రమముగా కోతులు, కొండముచ్చులు మీదుగా మానవులు పరిణమించుటయు గుర్తెరిగినది పాశ్చాత్య జీవపరిణామ శాస్త్రజ్ఞులదృష్టి. ఈ దృక్పథమునకు డార్విన్, మెండెల్, లేమార్క్ మున్నగువారు మూలపురుషులు. వీరి దృక్పథమునుండి కొన్ని విచిత్ర సిద్ధాంతములు రూపొందినవి. మానవుడు అనాగరిక జంతుస్థితినుండి కాలక్రమమున నాగరికుడై వైజ్ఞానిక మానవుడుగా రూపొందెననుట ఒక సిద్ధాంతము. ఇది స్థూలదృష్టికి సత్యమనిపించుసుగాని దీనియందు కొన్నిప్రశ్నలకు సమాధానములు రావు. అనాగరిక స్థితినుండి నాగరికస్థితికి మానవుడే పరిణామము చెందినచో ఆదిమ మానవునకు పరిణామము చెందగల విజ్ఞానమెక్కడిది ? అను సందేహము తీరదు. ఇది తీరవలె

నన్నచో మానవుడు పరిణామము చెందెనని నమ్ముటమాని ప్రకృతి పరిణామము చెందించెనని నమ్మవలెను. దీనిని నమ్మవలెనన్నచో ప్రకృతిలో విజ్ఞానమంతయు అనాదిగా నిమిడియున్నదని నమ్మవలెను. దీనిని నమ్ముటకు తెల్ల జాతుల మనస్సు అంగీకరింపదు కనుక నవీనశాస్త్రమున దీనికెక్కువ స్థానము లేదు. కాని ప్రకృతి యందిమిడియిన్న విజ్ఞానకోశమును నమ్మనిచో మరియొక ఉపపత్తిలేదు కనుక నమ్మక గతిలేదు.

ప్రాచీన జీవపరిణామ సిద్ధాంతమువారు దీనిని నమ్మిరి. కనుకనే వారి ఉపపత్తులలో రంధ్రములు లేవు. మానవుడొకపని ఎట్లు సాధించుచున్నాడు అన్నచో తెలివితేటలవలన అని సమాధానము చెప్పవచ్చును. కాని రసాయన శాస్త్ర విజ్ఞానములేని మానవుడు ప్రాణవాయువును పీల్చి, బొగ్గుపులుసు వాయువునే విడువగల్గుట ఎట్లు జరుగుచున్నది ? అని ప్రశ్నించినచో మానవునిలో పనిచేయుచున్న ప్రకృతి యందిమిడియున్న విజ్ఞానకోశమని అంగీకరింపక తప్పదు. దీని నంగీకరించిన వారికి ఈ ప్రకృతిలోని విజ్ఞానకోశమే వేదము. మిగిలినవారికి వేదమొక గ్రంథము. దర్శించినవారికి వేదము శాశ్వత ధర్మముల పుటలతో కూడిన ప్రకృతి అనబడు విజ్ఞానగ్రంథము. దానిని చదువుటకు మానవుడే అక్కరలేదు. ప్రకృతిశక్తులును వానిని నడిపించుచున్న ప్రజ్ఞలును నిత్యము చదువుచున్నవి. ఈ ప్రజ్ఞలును, శక్తులును దేవతలుగా వారి భార్యలుగా దర్శింపబడినవి. వారిచేతనే సౌరకుటుంబములు నిర్మాణమగుటయు, భూగోళము నిర్మాణమగుటయు దానిపై అణుమయములైన పృథివి, జల వాయు తత్త్వములు నిర్మాణమగుటయు, వానికి మూలద్రవ్యముగా ఆకాశమనబడు ప్రకృతి వినియోగపడుచు అది గ్రంథముగా ప్రకాశించుటయు గమనింపదగును. ఈ దేవతల విజ్ఞానము కారణముగనే పైజెప్పిన జలచరములు మున్నగు జంతువులును, మానవులును, పరిణమించుట జరిగినది. దీనినిబట్టి ఆదిమ మానవునకు ముందు అనాగరిక జంతుజాలము కాక సర్వజ్ఞులైన దేవతలు, పరమగురువులుగా నిలబడి మానవుని విజ్ఞానసర్వస్వమును ఉపదేశరూపముగా ప్రసాదించుచున్నారని తెలియును. ఈ సిద్ధాంతము ననుసరించి మానవసృష్టి అనాగరిక జాతులతోకాక పరమగురువులతో ప్రారంభమైనదని తెలియుచున్నది. సృష్టింపబడిన మానవునకు లోపల్ల

వెలుపల ఈగురువులే పనిచేయుచున్నారు. మానవ శరీరతత్త్వము ఈగురువుల కొఠ నివాససౌధము వంటిది.

అంతర్యామి ప్రజ్ఞయందు దేవతాగణములు నిద్రనుండి మేల్కొనినట్లు పుట్టి, ఈ జీవులరూపములను కల్పించుచున్నారు. దీనిని శాస్త్రీయపరముగా పరిశీలింపగా అంతర్యామి మొదట రెండువిధములుగా నున్నట్లు తెలియును : (1) జీవరాసులలో అంతర్యామి. (2) జీవరాసులు లయమైన వెనుకగల అంతర్యామి. అందు మొదటివాడు మనకు లోపల - వెలుపల నుండును. రెండవవానికి లోపల - వెలుపల అన్న భేదములేదు. ఈ మొదటివాడు విష్ణువనియు, రెండవవాడు శివుడనియు పేర్కొనబడిరి. సృష్టి జరుగుటకు పని చేయుచున్న వేరగుప్రజ్ఞ చతుర్ముఖబ్రహ్మ అనబడెను. అతని సృష్టి సూక్ష్మము నుండి స్థూలలోకములోనికి దిగివచ్చుచు, ప్రజాపతులను, మనువును, శతరూపను కల్పించినది. మనువునుండి దిగివచ్చిన మానవులకు ప్రజాపతులలో నొకడగు దక్షుడు అహంకార దేవతగా ఎన్నుకొనబడెను. వెంటనే ప్రసూతి అనబడు దేవత అతని భార్యయై స్త్రీ-పురుష భేదమేర్పడి జీవులు ప్రసవింపబడిరి. అందు దేహకల్పనకు కావలసిన మనస్సు ఇంద్రియములు మున్నగు ప్రజ్ఞల కధిదేవతలై కొందరు దేవతలు సమావేశమైరి. వారికి ప్రయోగశాలగా మానవదేహము బ్రహ్మచే కల్పింపబడెను. ఈ కల్పనమునకు లోకహితము తప్ప స్వప్రయోజనము లేకుండుటచే ఇది యజ్ఞమనబడెను. యజ్ఞశాలయైన దేహమున దక్షుడు అధిపతిగా నేర్పడెను. అతడు దేవతలను ఋత్విక్కులుగా ఆహ్వానించి నియమించెను.

కాని యింతలో నొకదేహము ఒకవేరైన సృష్టిగా భావింపబడి అహంకారము ఘనీభవించెను. అందున్నది తానేయని మేల్కొనుట వలన అంతర్యామి నంగీకరింపనిస్థితి కలిగెను. దీనినిదక్షుడు తన యజ్ఞమునకు శివుని అంగీకరింపని కథగా వేదఋషులు మలచిరి. కాలక్రమమున దక్షయజ్ఞకథ సార్వకాలికమైన సృష్టికథగా నుపదేశింపబడెను.

అంతర్యామి నంగీకరింపని అహంకారమునకు తాను వేరు, ఇతరులు వేరు. అనగా కేవల భౌతికజీవితమునకు దారితీసెను. తత్ఫలితముగా జీవిత

మొక యుద్ధరంగమయ్యెను. దేవతల యజ్ఞశాల కర్మబంధమునకు కారణముగా చేయబడెను. దాని పరిణామము ఆ యజ్ఞము అసంపూర్ణముగా మిగులుటయే. ఇది దక్షయజ్ఞధ్వంస కథగా చెప్పబడెను. కర్మబద్ధులైన దుష్టుల శరీరములలో పనిచేయుచున్న ప్రకృతి ప్రజ్ఞలైన దేవతలు మృతమైన దేహము నుండి వెలువడి శివుని దర్శించి మరల జ్ఞానమూర్తులైరి. ఈ యజ్ఞమును చక్కగా పరిసమాప్తి చేయుమని ప్రార్థించిరి. అహంకారమగు దక్షుడు మరల బ్రతికింపబడెను. తండ్రులు చనిపోవులోపల బిడ్డలు పుట్టిరి. వారు తరతరములుగా అంతర్యామి నుపాసించు విద్య నార్జించిరి. దానితో శివునకు యజ్ఞమున స్థానము అంగీకరింపబడెను. మరల యజ్ఞశాలగు నూతనదేహము నిర్మాణమగుసరికి అందలి అంతర్యామి విష్ణువుగా దర్శింపబడెను. అతడు యజ్ఞస్వరూపుడు. జీవితము తనదిగా జీవించు స్థితినుండి అంతర్యామిగా జీవించు స్థితికి మానవుడు ఆరోహణము చేసెను. ఇదియే మోక్షవిద్య.

అంతర్యామియందు రెండు భాగములున్నవి : (1) ప్రజ్ఞ (2) శక్తి. అందు సృష్టికి కావలసినది శక్తి; ఆమె సతీదేవిగా ఈ జీవుల పుట్టినిల్లయిన దేహమునకు దిగివచ్చు విధానము వర్ణింపబడినది. అహంకారజీవులు ఒకరి నొకరు నిందించుకొని అవమానించుకొనుచుండగా ఆ నిందలు, అవమానములు వారిలోని శక్తియగు సతీదేవికే తగిలెను. ఆమె కర్మబద్ధమైన జీవదేహమును విడువవలసి వచ్చినది. అనగా భౌతికదేహములకు జననముతోపాటు మరణము తప్పనిసరియైనది.

ఈ కథలోని కూర్పు, ఇందలి ప్రకృతిశక్తుల చేర్పు, దానిని సమన్వయపరచిన నేర్పు, మరియే యితర కథలయందును కన్పింపవు. కథలోని పరమార్థమెంత గొప్పదో కథాసంధానముకూడ అంత గొప్పది. అది అద్వితీయము. కారణమేమనగా భూమిపై మానవునిసృష్టి అద్వితీయము. ఈ విధమైన కథా సంవిధానముయొక్క మార్గమే వేదార్థ ప్రతిపాదనము. ఇందు పదముల వాచ్యార్థములు, లక్షణార్థములు, వ్యంగ్యార్థములు ఏకత్వముచెంది పరమార్థముగా దర్శనమిచ్చినవి. అదియే వేదార్థము. ఈ కథను వ్యాఖ్యానించుట యనగా భూమిపై నరసృష్టిని వ్యాఖ్యానించుట. భాగవతగ్రంథమునగల రహస్యార్థములన్నిటిలో దక్షయజ్ఞము పరమావధియని అంగీకరింపక

తప్పదు. పెద్దలు దీనిని వివరించుటయందు బద్ధకించుటచే నిదికూడా నొక కట్టుకథగా చదువుకొనుటయు పండితుల వివిధ వ్యాఖ్యానములకు గురి యగుటయు జరిగినది. ఇందలి శివుడు, విష్ణువు పామరుల శైవ - వైష్ణవ - సంప్రదాయములుగా అర్థము చెప్పబడినారు. వారు అంతర్యాములుగాకాక దేవతా స్వరూపములుగా మాత్రమే అర్థము చేసికొనిరి. దానితో కేవల హేతు వాద పరిమితదృష్టి కల నవీనులదృష్టిలో నిదియొక కల్పితకథయైనది. వేద మననేమో తెలియకున్నను వెఱ్ఱియభిమానముచూపు ఆర్యసమాజమువారి వంటి వారికినిది వేదముకన్న వేఱైన మానవకల్పిత కథగా గోచరించినది. వేదము గ్రంథమందలిది కాదనియు, సృష్టిలోని అంతర్యామియనియు, దర్శించిన వారికి దక్షయజ్ఞకథ సర్వవేద సమన్వయ స్వరూపము.

— [శ్రీ. భా. ప్ర. VIII ఉపోద్ఘాతము]

## దీర్ఘతమసుడు

ఇతిహాసములలో దీర్ఘతమసునికథ యున్నది. మహాభారతమున ఆది పర్వమున దీనిని చూడవచ్చును. ఉచథ్యుడు, బృహస్పతి అను వారన్న దమ్ములు. ఉచథ్యుని భార్య మమత. ఆమె గర్భిణిగా నుండగా బృహస్పతి ఆమెవలన సంతతిని గోరెను. గర్భస్థుడగు శిశువు అన్యాయమని ఆక్రోశించెను. బృహస్పతి అతనిని అంధుడిగా పుట్టుమని శపించెను. అతడు పుట్టంధుడగుటచే దీర్ఘతమసు డనబడెను. అగ్నినుపాసించి యతడు దృష్టిని బొందెను. మహా జ్ఞానసంపన్నుడయ్యెను. అతడు వృద్ధుడైనపుడు అతనిభార్య కొందరు సేవకు లచే అతనినొక దుంగకుకట్టి నదిలోనికి నెట్టించెను. అశ్వినులు ప్రసన్నులై రక్షించిరి. అతడు గంగలో కొట్టుకొని పోవుచుండగా అంగరాజు చూచి కాపాడి తన రాజగృహమునకు గొనిపోయెను. తనభార్యయందు సంతతిని గల్గింపుమని ప్రార్థించెను. ఈ ముసలివాని నంగీకరింపక రాణి తన దాసీ దానిని పంపెను. దీర్ఘతమసుడు ఆమెనభిమంత్రించి పవిత్రురాలుగా జేసి ఆమెగర్భమున కాక్షీవంతుడను ఋషిని ఉత్పాదించెను. కాక్షీవంతుడు ఋగ్వేదమున దశమ మండలమున పది సూక్తములను దర్శించెను.

ఈ కథ సంకేతార్థము కలది. ఇట్టికథలు ఇతిహాసములనబడును. ఒక సంవత్సర పురుషుడు ముసలివాడుకాగా, మరల దీర్ఘతమస్సు అనబడు మకర సంక్రమణమున అవిర్భవించును. ఇది ఇతిహాసములలోని దక్షుని కథవంటిది. దీర్ఘతమస్సు అనగా సంవత్సరము మొత్తముమీద దీర్ఘమైనరాత్రి. అది సాయన మకరరాశి ప్రారంభము. మకరము దేవతలకు సూర్యోదయము. అనగా దినమునకు సూర్యోదయమెట్లో సంవత్సరమునకు, దీర్ఘతమస్సు మరునాటి సూర్యోదయమట్లే. అప్పటినుండి అహస్సు ప్రమాణము పెరుగును. ఉత్తర విషువము అనబడు మేషరాశికి దారితీయును. మేషరాశియే కాక్షీవంతుడు. వేద కాలమున మకరము, మేషము అను పేర్లు లేవు. వేదపరిభాషలో అన్నిటికన్న పెద్దరాత్రి తరువాత జరుగు సూర్యోదయమునకు దీర్ఘతమసుడనియును, అన్నిటికన్న పెద్ద పగలుగల దినము తర్వాత సూర్యోదయమునకు హిరణ్య స్తూపుడనియు పేర్లు. ఈ దినములే నేడు వరుసగా Winter Solstice, Summer Solstice అనుపేర్లతో డిసెంబరు 22, జూన్ 22 తేదీలలో వచ్చును. ఈ దినమున సూర్యోదయమును అందుద్భవించు దేవతలను వర్ణించిన ఋషులు అవే తమపేర్లుగా పెట్టుకొనిరి.

ఇచ్చట దీర్ఘతమసుడు వర్ణించిన సుపర్ణుడు నేటి మకర సంక్రాంతి పురుషుడు. ఈ సంక్రాంతి నేటి పంచాంగములలోవలె జనవరి 14వ తేదినాడు గాక డిసెంబరు 22 మరుసటి సూర్యోదయమునాడు వచ్చును. వేదకాలపు లెక్కలన్నియు సాయన సిద్ధాంతము ననుసరించినవియే అనియును, అపుడు నిరయన సిద్ధాంతము లేదనియు చెప్పుటకు లగధమహర్షి రచించిన వేదాంగ జ్యోతిషమన్న గ్రంథమే సాక్షి.

— [సు. సూ. అనుబంధము 184-85]



## దేవతలు (1)

సృష్టి ద్రవ్యముల కధికారులు. వీరు సృష్టిలోని జీవుల యింద్రియ యాదుల నధిష్ఠించి యుందురు.

— [పు. సూ. పే. 18]

## దేవతలు (2)

జీవుల దేహాణువుల యందును, సృష్టిలోని పంచభూతముల యందును, మనోబుద్ధ్యహంకారాదుల యందును పనిచేయుచున్న ధర్మముల వెలుగులే దేవతలు. వారి యజ్ఞకర్మచే నిర్మాణమైన మనకు తెలిసినదానికన్న, మనలను గూర్చి వారికే ఎక్కువ తెలియును. మనకు మనస్సున్నది కనుక స్పష్టముగా తెలియును. కాని ఈ తెలివి మనస్సుకే పరిమితము. దేవతలకు మనస్సు లేదు గనుక (మనస్సుగూడ దేవతలచే నిర్మింపబడినది గనుక) వారికి సృష్టిధర్మములు స్వయముగా అనుభవములగును గాని మనస్సునకు తెలియుట యుండదు. అట్టి దేవతలకు తెలిసినవి ధర్మములేగాని, అభిప్రాయములు మొదలగు ధర్మేతరములుండవు. ఏమరుపాటున అధర్మప్రవర్తనము మానవులకేగాని దేవతలకుండదు. నిప్పు వేడిగా నుండుట, మంచుగడ్డ చల్లగా నుండుట మున్నగు ధర్మములను నిర్వహించు దేవతలకు పొరపాటుండదు. మానవులకు పరిసరములనుబట్టి, మానసిక స్థితినిబట్టి, మంచి చెడ్డలున్నట్లు గోచరించి ప్రవర్తనలో మంచిచెడ్డలు ఏమరుపాటు కలుగుచుండుట సాధ్యము.

ఐనను దేవతలు నిర్వహించు ధర్మములు వారికి స్వభావ సిద్ధములే గాని, వారికి తెలిసినవికావు. వారికికూడా తెలియకుండ వారియందు నిహితములై యున్నవి. (పిల్లవానియందు క్రీడాలక్షణము నిహితమై యున్నట్లు). ఈ ధర్మములు మానవులచే అభిప్రాయపడుచున్నవిగాని, మానవులకు తెలిసినవికావు. ఆకలి, దప్పిక, కోపము, నిద్ర, గర్భధారణము, జననము, మరణము మున్నగునవి మానవులచే అభిప్రాయ రూపమున గమనింపబడి, అనుభవములైన గమనికకందని స్థితిలో వర్తించును. తనకు కొడుకు పుట్టినట్లు తెలియవచ్చునుగాని కొడుకననేమో, పుట్టుటయననేమో తెలియుట సాధ్యము

గాదు. వీనిని గూర్చిన అభిప్రాయముల లోకములలోగాని, పదములు, అర్థములు, మున్నగు శబ్దమయ లోకములలోగాని మానవుడు జీవించును. దీనికి అతీతముగా వర్తించునవి ధర్మములు. అవి స్వాభావికములైన సత్యములు. అనగా తమంతట తాము వర్తించునవి. ఈ సత్యముల అస్తిత్వమునే పెద్దలు వేదమనిరి. ఇది వర్తించునట్టి ప్రజ్ఞయే సత్యముల ప్రజ్ఞ లేక సత్యలోకము. కనుక వేదములు సత్యలోకవాసుడగు బ్రహ్మయందుద్భవించి జీవులయందు వాక్కులచే, అభిప్రాయములచే అర్చించబడుచున్నవి. ఆ వాక్కులు ఆ వేదము నుచ్చరింపలేక వెనుదిరిగి మరలివచ్చుచున్నవి.

"యతోవాచో నివర్తంతే అప్రాప్య మనసాసహ." [తై. ఉ.]

– [సు. సూ. పే. 43-44]

## దేవతలు - విభాగము

దేవతలు ఎనిమిది విధములు.

1) విబుధులు (Intelligences).

2) పితృదేవతలు (Architects).

3) సురలు (Lord of Experiencing).

4) గంధర్వులు, అప్సరసలు (Gods of Rhythm and Periodicity and Goddesses of Liquifaction.)

5) యక్షులు, రక్షసులు (Group souls and Elementals).

6) భూతములు, ప్రేతములు, పిశాచములు : ఇందు భూతములు, పంచభూతములచే చేయబడిన శక్తులు. ప్రేతములనగా దేహములు విడిచిన జీవులు. పిశాచములనగా జీవుల మాంసము తినువారు. వ్యాధులు, సూక్ష్మజీవులు మున్నగునవి.

7) సిద్ధులు, చారణులు, విద్యాధరులు : సిద్ధులనగా కార్యసిద్ధిని కలిగించువారు. పంచభూతములను మార్పుచేయగల జీవులు. చారణులనగా

గమనములకు అధిపతులు. విద్యాధరులనగా విద్యలను ధరించువారు. శాస్త్రము లభ్యసించుటయను శక్తులు పొందుట వీరివలననే.

8) కిన్నరులు, కింపురుషులు : కిన్నరులనగా కంఠధ్వనులను శ్రుతులుగా మార్చువారు. కింపురుషులనగా అంగవిన్యాసములు, ముఖకవళికలు, భావప్రకటనలు కలిగించువారు.

– [శ్రీ. భా. ప్ర. V పే. 46]

## దేవయజ్ఞము

సూర్యరశ్మి, వాయువు, జలము, బీజములలోని అంకురశక్తి, మనలోని ప్రాణశక్తి, ఆహారస్వీకరణాది శక్తులును దేవతలు. వారి శక్తివలన మనము ఉన్నాముగాని, మనముండుట వలన తమకు ప్రయోజనము కలిగి దానికై దేవతలుండుటలేదు. కనుక దేవతల సృష్టి యజ్ఞము వలన మనము పొందు ఫలితములన్నియు దేవయజ్ఞము వలన కలుగుచున్నవి. వారియెడల మనము చేయవలసినదేమి ? దాని కుపయోగించు పనులేవియు మనవశమున లేవు గనుక, మనకుపయోగించు పనులనే వారిమార్గము ననుసరించి పొందు చున్నాము. అట్టియెడల వారియందు మనకుండవలసిన గౌరవము, విశ్వాసము, ఆరాధనబుద్ధి మాత్రమే మనము చేయగల యజ్ఞము.

ఎంతశ్రద్ధగా దేవతలయందు ఎంత గౌరవముతో మనపనులు నాచరింతుమో అంత హెచ్చుగా ఫలితము మనకే కలుగుచుండును. విద్యుచ్ఛక్తి ధర్మములను మానవుడనుసరించుట వలన వాడుకొనగలుగుచున్నాడు గదా ! దేవతలను గౌరవించుట, వారు మనలను సంభావించుట యనగా నిట్టిదే. తత్ఫలితముల కొరకుగాక, యజ్ఞార్థముగా గౌరవించ గలిగినచో ఉత్తమ మగు విశేషము కలుగును. సృష్టిలోని దేవతలను మనము పూజ్యభావముతో నారాధించినచో వారు మనయెడల పూజ్యభావముతో ప్రవర్తింతురు. వారికి శక్తులు, అనుభావములు తప్ప భావములుండవు. కనుక మనము చూపిన గౌరవభావమే తిరిగి మనకున్ముఖముగా దేవతల భావమై సంక్రమించును. ఇదియే దేవయజ్ఞము.

– [శం. రా. I. పే. 85-86]

## దేవసఖుడు

దేవతలకు సఖుడు. దేవతలు సృష్టికాములు. ప్రకృతియొక్క మహా కామము (సోఽకామయత) నుండి పుట్టినవారు. సృష్టిలో ధర్మసాధకమగు ఐహికాభివృద్ధియంతయు దేవతల మనస్సున నుద్భవించిన కామస్వరూపము. దీనినే శుభము, వేడుక, ముచ్చట అని పిలుచుచున్నాము.

– [శ్రీ. సూ. పే. 20]

## దేవాలయము

కవులనగా సృష్టిని దర్శించి రూపకల్పనచేయు వెలుగులు. సప్త తంతువులోని ఏడుగురును ఏడుగురు కవులుగా సృష్టిలోని నిలువు దారము లుగా వర్ణింపబడిరి. వారే తమ రూపములైన దారములను పేనుచున్నారు. మొదట తలపుట్టి దానినుండి వెన్నెముక పంపుగా సాగును. తలలో నింద్రి యములకు కావలసిన ప్రజ్ఞ ముడివైచుకొని యుండును. వెన్నెముకలో మిగి లిన భాగములను కల్పించుటకు కావలసిన ప్రజ్ఞలు వరుసగా ముడిపెట్టుకొని యుండును. ఈ ముడులనుంచి ఈ ప్రజ్ఞలదారము పురిత్రిప్పబడినట్లు సాగి, వానివెంట భౌతిక శరీరావయవములు ప్రాణమయకోశపు దారులుగా మెత్తి ముగ్గులుపెట్టినట్లు ఏర్పడును.

ఇవియే ఏడు దారములు లేక సప్తతంతువులు. ఇది తయారగునట్టి పిండము యజ్ఞవేదికకు సంకేతము. వెన్నెముక యూపస్తంభము. దీని నను సరించియే దేవాలయ నిర్మాణము దర్శించబడినది. గర్భాలయము తల్లిగర్భ మునకును, ప్రదక్షిణము జీవుని జన్మమార్గమునకును, దైవదర్శనము ఆత్మ దర్శనమునకును, ధ్వజస్తంభము వెన్నెముకకును చిహ్నములు. నరుడు నిల బడిన ఊర్ధ్వరేఖకు చిహ్నమే గోపురము. అందువలననే వెన్నెముకవలెనే ధ్వజస్తంభమునుకూడ చిన్నచిన్న గొట్టములతో కూర్తురు.

(చూ. సప్తతంతు)

– [స. సూ. పే. 47-48]

## ద్వంద్వములు

మనస్సునుండి పనిచేయు కామాత్మునకు ద్వంద్వములు సాక్షాత్కరించును. ద్వంద్వములనగా సుఖదుఃఖములు, లాభాలాభములు, జయాపజయములు మున్నగు జంటలు. మనస్సుతో పనిచేయుచున్నంత కాలము నివి తప్పవు. వీనినుండి బుద్ధిలోనికి చేరుకొనుటయే నిత్యసత్త్వస్థితి. ఫలితమునుండి లోకహితమునకు చేరుకొన్ననేగాని ఇది సాధ్యముకాదు. ఇట్లు చేరుకొన్నప్పుడు గల సమాధిస్థితి సత్త్వము అందురు. ఇది రజస్తమస్సులు కరిగిన వెనుక నిలబడు సత్త్వము గనుక శ్రీకృష్ణుడు దీనిని నిత్యసత్త్వము అనెను. ద్వంద్వమున రజస్తమస్సులు పనిచేయును. ద్వంద్వములు కరగినపుడు శుద్ధ సత్త్వము పనిచేయును. అప్పుడున్న జీవి మనస్సు కలవాడు, ఇంద్రియములు కలవాడుకాక, తానుకలవాడు అగును. అతడే ఆత్మవంతుడు. రామాయణమున రాముని సత్త్వస్థితిని వర్ణించుచూ వాల్మీకి "ఆత్మవాన్ కో జితక్రోధః" అని కీర్తించెను. సమాధియను పదమునకు తనయందు తానధిష్ఠించి యుండుట యని యర్థము.

– [శం. రా. I. పే. 36-37]

## ధన్వంతరి

దేవతలు, రాక్షసులు సముద్రమును మథించుచుండగా అమృత కలశము ధరించి, ధన్వంతరి అవతరించెను. (దేవతలు, అసురులు అనగా జీవుల నాశ్రయించు సద్గుణములు, దుర్గుణములు.) ధన్వంతరి అనగా దేహమును నిలుపరించు ధర్మముల సృష్టి : అమృత కలశమనగా ప్రాణము నిలుపుట కేర్పడిన హృదయము.

– [శ్రీ. భా. ప్ర. I. పే. 61]

## ధనుర్విద్య - అస్త్రములు

తపస్సు అనగా ఒక వెలుగును ధ్యానించుట. సామాన్య మానవులు జన్మించిన దగ్గరనుంచి ఇంద్రియార్థములలో మునిగి తేలి, ఇదే ప్రపంచమనీ,

పురుషార్థమనీ ప్రవర్తిస్తూ ఉంటారు. కొన్నిజన్మల తరువాత భగవంతుని అనుగ్రహము వలన, గురుబోధ జరుగును. అపుడు ఇంద్రియార్థ విషయము లను త్యజించి బ్రహ్మవిద్యా అభ్యాసము చేయుట మొదలుపెట్టును. అదే రెండవజన్మ; ఒకటి : తల్లి గర్భమునుండి మాచి చీల్చుకునివచ్చుట, రెండు : గురుబోధ వలన ఇంద్రియార్థములను త్యజించి బ్రహ్మవిద్యను అభ్యసించుట. అలా రెండవజన్మ ఎత్తినవారికే ద్విజులనే పేరువచ్చినది. పరమాత్మ మానవ శరీరముతో అవతారము దాల్చినపుడు ఇవి యావత్తు సంకల్పమాత్రముగ వానిలో ఇమిడియుండును. అటువంటి అవతారమూర్తి అయిన రామునికి తాను విద్య బోధించుటకన్న జన్మసార్ధకత ఇంకేమున్నది అని విశ్వామిత్రుడు సంతసించెను. కాబట్టి వెలుగును ధ్యానించి చూచినట్టు, విశ్వామిత్రుని వలన గ్రహించి అస్త్రములను ధ్యానించి రామలక్ష్మణులు తమలో చూశారు. ఆ అస్త్రములలో —

(1) దండ చక్రము : తన ప్రవర్తనలో తప్పు జరిగినప్పుడు తన్నుతాను దండించుకొనుట. ఈ దండనవలన ఇతరులను దండింపగలశక్తి కలుగును. అప్పుడతడు ప్రభువు కాగలడు. అవతారమూర్తిలో ఈ శక్తి సహజముగా ఉండును.

(2) ధర్మచక్రము : పైవిధముగా తన మనస్సును దండించు కొన్నవారు ధర్మచక్రమునకు అర్హులు. వారిలో ఆ చక్రము ఉండును. (బుద్ధభగవానుడు కూడా ఈ ధర్మచక్రమును ఉపాసించి తన శిష్యులలో ప్రవర్తింప జేసినాడు.)

(3) కాలచక్రము : సంవత్సర రూపుడైన పరమాత్మను మాస రూపునిగా, పక్ష రూపునిగా, అయనంగా, దినముగా, జాములు, గంటలు, ఘడియలు, నిమేషములు, క్షణములుగాను ధ్యానించి, వాటికి అతీతముగా ఉండే కాలపురుషుని ధ్యానించుట.

(4) విష్ణుచక్రము : భూమి, ఆకాశము అంతా నిండి మన అహం కారమును అణచునది. భూమి, ఆకాశము కలసినరేఖ మనచుట్టూ చక్రంగా ఉంటుంది. దానినడుమ సర్వాంతర్యామిగా భగవంతుని ధ్యానంచేస్తూ

దేశమూ, కాలమూ చక్రంగా తిరుగుతూ ఉండుటను చూస్తూ దాంట్లోనే తిరగకుండా స్థిరముగా ఉన్న వెలుగునుచూచుట ఒక తపస్సు. దీనివన విష్ణు దర్శనమౌతుంది. ఇదే సుదర్శనచక్రము. దీనిని గూర్చిన ప్రజ్ఞ మనకు సహస్రార మనబడే చక్రముగా పనిచేస్తుంది. దీనిని యోగులు దర్శనం చేస్తారు. ఇట్టి కారణాల వలననే సుదర్శనమును సహస్రారమనే పేరుతో మంత్రశాస్త్ర ద్రష్టలైన ఋషులు దర్శనముచేసి జపించారు. దీనికి పైని ఆకాశము తాబేటి డిప్పలాగ ఉంటుంది. దీనికి జ్యోతిశ్చక్రం లేక శింశుమార చక్రము అనిపేరు. ఈ తాబేటికి నడుమ గీయబడిన మధ్యరేఖగా (భూమధ్య రేఖకు సూటిగా పైన తిరుగుతూ) రాశిచక్రము రూపంలో కాలచక్రము ఉంటుంది. దానిని బాటగా చేసుకుని కర్మాధీనమైన గ్రహముల చక్రము తిరుగుతూ భూమి జీవుల కర్మలకు పంచాంగముగా పనిచేస్తూ ఉంటుంది. ఈ విష్ణుచక్రాన్ని ధ్యానించుట చాల ఉగ్రము. ఇతరుల మేలుకొరకు తప్ప స్వార్థము కొరకు ఉపయోగిస్తే మొదట శత్రుసంహారము, పిదప తన సంహారము చేయును.

(5) ఇంద్రచక్రం, (6) వజ్రాయుధం, (7) త్రిశూలము, (8) బ్రహ్మశిరోనామాస్త్రము, (9) ఇషీకము : బ్రహ్మతేజస్సును పొందించునది. ఇది నకులీవాగేశ్వరీ అని చెప్పబడు మంత్రదేవత. రెండు పెదవులు, రెండు పలువరుసలచేత మూయబడిన నాలుకమీద రక్షింపబడు వాక్కుగా దీనిని ధ్యానిస్తూ అవసరమునకు తప్ప తక్కిన సమయములందు వాడకుండినచో అదే బ్రహ్మాస్త్రమనబడును. అదే బ్రహ్మవర్చస్సు చేకూర్చును. రెండునాడులు మనలో అస్త్రములుగా ఉన్నవి. ఒకటి కౌముది, రెండవది శాఖరీ. ఇవి మంచి తేజోమయమైనవి. ఎక్కడతాకితే అక్కడ తేజోమయమైన వెలుగు నిచ్చునవి.

ఇవికాక ధర్మపాశము, కాలపాశము, వామనాస్త్రములు. ఇవి వాక్కుచేత వాతావరణమును బంధించుట, కాలపరిస్థితిని బట్టి వాతావరణమును నియమించుట చేయును. ఇవికాక శత్రువులకు భయము కలిగించేవి కపాలము, కంకాళము.

విశ్వామిత్రుడు మంత్రమయమైన తన మొత్తము ప్రజ్ఞను మంత్రముగా రామునకు ఇచ్చెను. భౌతికశరీరము కాక మంత్రమయశరీరము ఉండును. దీనినే కవచము అందురు. సూక్ష్మశరీర పవిత్రీకరణ జరిగిన తర్వాత మంత్రమందు లయించుటతో మంత్రమయ కవచశరీరము సృష్టింపబడును. రాముడు విశ్వామిత్రుని వలన తన శరీరములో వున్న మంత్రమయ శరీరములోనికి అస్త్రదేవతలను స్వీకరించెను.

– [రా. ప్ర. పే. 48-51]

## ధేనువు

ధేనువులనగా గోవులు. ఇవి శరీరములోని గ్రంథులకును, అందుండి వర్షించు రసములకును, వాని వలన కల్పితములగు తన్మయీకరణ ప్రజ్ఞకును సూచకములు. సంగీతమునకును వీనికి సంబంధమున్నది, గనుక గంధర్వులు గోగణముల పరిపాలకులుగా వేద కవి సమయము. ఆకాశమున సూర్యుడు అంతర్గూఢ తత్వములను వివరణములుగా వ్యక్తము చేయు గ్రంథి. ఆవు శరీరమున ఆహారపానీయాదులు రక్తాదిధాతువులుగా మారిన వెనుక అందుండి క్షీరధాతువును వ్యక్తముచేయు గ్రంథి పేరు గోవు.

మానవుని కంఠమునుండి వచ్చు వైఖరీ వాగ్ధ్వనిని గాంధర్వ విద్యగా శ్రుతిలయబద్ధము చేయు శక్తికిని గోవు అని పేరు. లయ విభేదములే గోరూపములైన ఛందస్సులుగా చెప్పబడినవి. వాని వలన తన్మయీకరణము కలుగును గనుక, ఈ స్థితిలోని సామవాక్కు కామధేనువు అనబడినది. లౌకిక సంభాషణాదికములలో శబ్దార్థములను నిర్వహించి ప్రయోజనములను ప్రశ్నోత్తర రూపమున సాధించు జ్ఞానముకూడ యీ గంధర్వ శక్తివలననే ఏర్పడుచున్నది. కనుకనే వాక్కు కామధేనువని వేద కవి సమయము.

– [మం. గీ. పే. 233]

## నరజాతి - స్థూల శరీర నిర్మాణము

నరజాతి భూమిపై పుట్టినపుడు మొదట తేజోమయ సూక్ష్మశరీరములే గాని స్థూల శరీరములు లేవు. అపుడు శిరస్సునుండి వక్షస్సు దిగువ భాగము వరకే తేజోమయ రూపములైన వెన్నెముక లేర్పడినవి. తర్వాత కర్దమునితో కూడిన సప్తధాతువులతో శరీరము లేర్పడి స్త్రీ, పురుష భేదమేర్పడుటలో వెన్నెముక దిగువభాగము సృష్టింపబడినది. భూగోళమున గూడ అంతకు ముందు భూమధ్యరేఖ నుండి ఉత్తరధ్రువము వరకునుగల దిప్పమాత్రమే యుండెడిది. ఆ కాలమున వరాహమూర్తిచే ఉద్ధరింపబడిన భూమి ఈ దిప్ప మాత్రమే. అపుడు మన ఉత్తరధ్రువము సూర్యునివైపు తిరిగియుండెడిది. భూమి యొక పాత్రవలె దొరలుచున్నట్లు సూర్యునిచుట్టును తిరుగుచుండెడిది. మనువు సృష్టిలో కర్దముని కాలమునుండి దక్షిణధ్రువ మేర్పడి గోళము పూర్తి యగుటయు, నరులకు భౌతిక శరీరములు కల్పింపబడి దిగువభాగము లేర్పడి, స్త్రీ, పురుష భేదము కల్పింపబడుటయు, గర్భధారణము సంభవించుటయు నొకేమారు జరిగెను.

– [శ్రీ. భా. ప్ర. VI పే. 113]

## నరనారాయణులు

ఈ దేహమున వినిపించు వాడొకడును, విని పూరించు వాడొకడును వుండుట నారాయణుని మాయ. ఈ విధముగా వేరైన జీవుని సృష్టి నారాయణుని నుండి దిగివచ్చిన సంకల్పము. అతడెన్నడును సంకల్పించడు, కాని వానినుండి సంకల్పము వెలువడుచుండును. ఈ దేహమున ధర్మమనబడు శంఖారావము నారాయణునిచే చేయబడును. ఆ రావము మనస్సునుండి పంచేంద్రియములలోనికి దిగివచ్చి, పంచభూతాత్మకమైన శరీరమును నిర్వహించుచు, పంచతన్మాత్రల మూలమున జన్యమైన సమన్వయముగా వినబడవలెను కనుక శ్రీకృష్ణుడు ఊదిన శంఖముపేరు "పాంచజన్యము".

ఇక నరుడు పూరించు శంఖము తన స్వంతముకాదు. దేవునిచే దత్తము. కనుక అర్జును డూదిన శంఖముపేరు 'దేవదత్తము'. ప్రతిదేహము

నందును నరనారాయణు లుందురు గనుక ఒకరినుండి యింకొకరీయుద్బోధ నందుకొనును గనుక, అందించిన వానిలోని నారాయణుడు గురువు. అందు కొనిన వానిలోని నరుడు శిష్యుడు. ఈ సంబంధమునే గురుశిష్య సంబంధ మందురు. అందరిలోనున్న నారాయణుడు జగద్గురువనియు, మన కందించిన వాడు గురువనియు, సంప్రదాయము. ఈ గురు పరంపరకు మూల పురుషుడు కనుకనే కృష్ణుడు జగద్గురువని వ్యవహరింపబడినాడు. గురు పరంపర లేనిదే గురుశిష్య సంసర్గమైన యోగము లేదు.

– [శంఖారావము I. పే. 14-15]

## నవవర్షములు - భారత వర్షము

ఈ భూమిని పద్మముగా నూహించినచో దానిమధ్య జంబూద్వీప ముండును. అది లక్షయోజనముల వెడల్పు, అంతే పొడుగు కలిగి తామరాకు వలె గుండ్రముగా నున్నది. అందు వర్షము లనబడు విభాగములు తొమ్మిది ఉన్నవి. ఒక్కొక్క వర్షము తొమ్మిది యోజనముల విస్తారత కలిగియున్నది. వర్షములకు సరిహద్దులలో గల పర్వతము లెనిమిది యున్నవి.

జంబూద్వీపమందు ఈ తొమ్మిది వర్షములున్నవి :

1) ఇలావృత వర్షము : ఇచట స్త్రీ, పురుష భేదములేని దేహము లుండును. ఒక్కొక్కటి చీలి రెండు దేహములగును. ప్రతిదాని యందును గల జీవుడొక్కడే అందలి పురుషుడు.

2) భద్రాశ్వము : ఇచ్చటి జీవులకు ప్రాణమయకోశము మిగిలిన వాని కన్న మిక్కిలి ప్రాధాన్యము వహించుటచే గుఱ్ఱమువలె జీవింతురు. గుఱ్ఱము పండుకొనదు. నిద్రకూడ నిలబడియే పోవును. చెవులెప్పుడును శబ్దమునందు మేల్కొని నిక్కపొడుచుకొని యుండును. దేహము, చర్మముగూడ యెచ్చటనైనను స్వతంత్రముగా కదలించ గలదు.

3) హరివర్షము : ఎదుటివారిలో భగవంతుని అస్తిత్వమును ధ్యానించు వారికి పతనముండదు. నరజాతి పరిణామమున మొట్టమొదట కొన్ని జన్మలు అసురగుణములు కలిగి వర్తించి, అటుపైన దైవానుగ్రహ

ముచే ప్రహ్లాదునివంటి గురువు లభించి శాంతస్వభావులై భాగవతోత్తము లగుచున్నారు. ఈ పరిణామము చెందిన వారందరును హరివర్షమున జన్మింతురు.

4) కేతుమాలా వర్షము : రాత్రి భాగమున జీవులు మాయమోహితు లగుట, నిద్రకు వశులగుట, కామచేష్టలతో వర్తించుట మున్నగు జీవ ధర్మము లిచ్చట వర్ణింపబడినవి. రాత్రికి అధిదేవతలైన ప్రజాపతి పుత్రికలు కామమునే గర్భముగా ధరింతురు. తెల్లవారుసరికి చైతన్య ముద్భవించును గనుక జీవులకు మాయతొలగును. జీవ పరిణామమున సుఖేచ్ఛను, కామమును దాటుచున్న వారందరును కేతుమాలా వర్షమున పుట్టుదురు.

5) రమ్యక వర్షము : ఇందలి ప్రజలకు ప్రభువు మనువు. అతడు తన కొడుకులు, మనుమలు మొదలగు బంధువులతో మంత్రులు మున్నగు వారితో మత్స్యమూర్తిని మహాభక్తితో నారాధించును.

6) హిరణ్మయ వర్షము : హిరణ్మయ వర్షమునగల ప్రజలకు దేవుడు కూర్మావతారము. వారికి పితృపతియగు అర్యముడు రాజై పరిపాలించు చున్నాడు. ఇచ్చట ప్రజలు విష్ణువును ధ్యానించుచు ఇహపర సౌఖ్య మందుచుందురు.

7) కురువర్షము : ఇచ్చట ప్రజలు వరాహమూర్తిని ఆరాధించుచు ఇహపర సౌఖ్యముల పొందుచుందురు.

8) కింపురుష వర్షము : ఇచ్చటి ప్రజలకు సీతాలక్ష్మణ సహితుడైన శ్రీరాముడు కులదైవము. అచ్చట ఆంజనేయుడు ఆ ప్రజలతో గలిసి శ్రీరామచంద్రుని మంత్రతంత్ర ధ్యానాదికములతో నారాధించు చుండును.

9) భారత వర్షము : ఈ భారత వర్షమును భౌతిక దేహధారులు మొదట నరులుగా దిగిన భూమి యందురు. ఇందే భౌతికకర్మలు ప్రారంభమైనవి. కనుక నిది కర్మభూమి. మిగిలిన వర్షములవారు

2) పుణ్యము ననుభవించుచు కర్మాచరణ మక్కరలేక జీవించుచున్నారు. అట్టివారు వేల సంవత్సరములు జీవింతురు. ఒక్కొక్కరికి కొన్ని ఏనుగుల బలముండును. దేవతలతో సమానులై వజ్రమయ దేహాము లతో జీవించుచుందురు. ఎప్పుడును సంతోషముతో నుందురు. భయముండదు కనుక అసత్యము, కపటము అవశ్యకములు కావు.

ఇది కలియుగమునకు వర్తింపదు. కలియుగమున భారతవర్ష ప్రజలు ధర్మమును విడిచి కష్టజీవులు, దుర్బలులు, రోగులు, నీచబుద్ధి గలవారుగా జీవింతురని ఈ గ్రంథముననే చెప్పబడినది. మరియు బ్రాహ్మణులు వేదము, ఆచారము, శుచిత్వము విడిచి మద్యమాంసాదుల కాసక్తులై చెడిపోయి, ఉదరపోషణ కొరకు తిరుగుచుందురనియు, క్షత్రియులు ధర్మభ్రష్టులగుదు రనియు, శూద్రులు ప్రభువులై పరిపాలింతురనియు, ప్రజలను పన్నులపేర దోచుకొని తిందురనియు మహాభారతమున యుగధర్మములందు చెప్పబడినవి. కనుక ఈ నవవర్షముల వృత్తాంతములును కలియుగమునకు వర్తింపవు.

– [శ్రీ. భా. ప్ర. XIII. పే. 31-50 సంగ్రహింపబడినది]

## నవవిధ సృష్టి

ఈ సృష్టియంతయు తొమ్మిది విధములు. ఈ తొమ్మిది విధములలో కొంత సృష్టి ప్రాకృతమనియు, కొంత వైకృతమనియు వర్గీకరింపబడినది. అదియే మరల కాలము, ద్రవ్యము, గుణము లనబడు మూడు భేదములతో వచ్చుచు పోవుచుండును. తొమ్మిది విధముల సృష్టిని గూర్చిన వివరములు :

1) మహత్+తత్త్వము అనబడునది మొదటి సృష్టి. అది నారాయణుని సన్నిధియందే యుండును. కాని గుణములచే భేదములు గలిగి యుండును. (The base of creation undergoing change according to qualities.)

2) అహంకార తత్త్వము రెండవసృష్టి. అది ద్రవ్యము, జ్ఞానము, క్రియ అను మూడు భేదములతో జరుగును. (Matter, Consciousness and Activity).

3) పంచభూతములు, ఐదుతన్మాత్రల సృష్టి మూడవది. ఇందు శబ్దము, స్పర్శము, రూపము, రుచి, వాసనయనబడు తన్మాత్రలైదును పుట్టును. ఇవి శక్తిమయములు (Energy Units). మరియు పృథివి, జలములు, అగ్ని, వాయువు, ఆకాశము అనబడు పంచభూతముల సృష్టికూడ ఇందే జరుగును. ఇది ద్రవ్యము (Matter) యొక్క సృష్టి. ఈ విధముగా ఈ మూడవసృష్టి శక్త్యాత్మకము, ద్రవ్యాత్మకమై యున్నది.

4) ఇంద్రియముల సృష్టి నాలుగవది. అందు జ్ఞానేంద్రియములైదును, కర్మేంద్రియములైదును, మొత్తము పది యింద్రియములు పుట్టును. వానిలో స్పర్శ, చూపు, వినుట, రుచి చూచుట, వాసన చూచుట యనబడునవి జ్ఞానేంద్రియములైదు. వీని స్థానములే చర్మము, కన్ను, చెవి, నాలుక, ముక్కు అనునవి. ఇక వాక్కునకు నోరు, గమనమునకు పాదములు, పనులకు చేతులు, శుక్రమూత్రములకు గుహ్యము, మలమునకు మలావయవము అనునవి అయిదు కర్మేంద్రియములు.

5) మనస్సు యొక్క సృష్టి ఐదవది. ఇది సాత్వికాహంకారముల నుండి పుట్టును. ఇందు మనసున పనిచేయు దేవతలు పుట్టుదురు. కనుకనే యీ దేవతలకు మనస్సులు అని పేరు వచ్చినది. (ఆలోచించుట, ఇంద్రియముల ద్వారమున పరిసరములను గమనించుట మున్నగు పనులు వీరిచే చేయబడును.)

6) ఆవరణ సృష్టి అనునది ఆరవది. జీవుల బుద్ధితో సంబంధము లేకయే దేహనిర్మాణాదులు పొరలుగా నేర్పడుట జరుగును. అందలి భాగములు పనులు, ఉత్పత్తియగును. (The makers of the flame and the engine) ఇది జీవులకు తెలియకుండ జరుగును. కనుక తామస సృష్టి యనబడును. అనగా తమోగుణము పనిచేయుట వలన నిది ఏర్పడును.

ఈ ఆరును ప్రాకృత సృష్టులనబడును.

(Natural outpouring of the Creation). ఈశ్వరుడు లీలార్థము దేహమునందు విహరించుటకై దేహనిర్మాణమునకై యిది తోడ్పడును.

ఇక మిగిలినవి వైకృత సృష్టులనబడును. (Secondary outpouring of the Creation).

7) స్థావరముల సృష్టి లేక ఊర్ధ్వస్రోతస్సు ఏడవది. (Vertical Creation) ఇందు ఈ దిగువ విభాగములున్నవి.

A) వనస్పతులు : అనగా పువ్వులు లేకుండ కాయలు పండ్లుగల చెట్లు. రావి, జువ్వి, అత్తి, పనస, మొదలగు జాతుల వృక్షముల గుంపు.

B) ఓషధులు (Herbs) : అనగా పుష్పించి పంటపండును. కానీ పంట పండుసరికి మొక్క చనిపోవును. వరి, గోధుమ, పెసర, మినుము మొనలగు ధాన్యము లీజాతికి చెందును.

C) లతలు (Creepers) : ఇవి సున్నితములైన తీగలు. ప్రాకుచు పెరుగును. మాలతీ, మల్లె మొదలగునవి.

D) త్వక్సారములు లేక గట్టిపడిన చర్మముగల చెట్లు : ఇందు వెదురు మున్నగునవియును, మానుగట్టు టేకు, దేవదారు మున్నగు వృక్షములుండును.

E) వీరుధములు లేక పొదలు (Shrubs) : ఇవి గన్నేరు, గులాబి మొదలగునవి.

F) ద్రుమములు : అనగా బలమైన, లావైన మానుకట్టి ఎక్కుటకు వీలైనవి. పువ్వులు, పండ్లు గలవి యగు వృక్షములు. మామిడి, వేప మొదలగు జాతులు. ఈ ఆరు విధములైన వృక్షజాతులను గలసి స్థావరములనబడును. (స్థావరములనగా నొకచోటనుండి మరియొక చోటికి పోలేనివి). ఈ జాతులకు స్పర్శజ్ఞానము, నొప్పి మొదలగునవి తెలియునుగాని మనసుండదు గనుక మనవలె బాధ ననుభవింపలేవు. బాధ యనునది మొత్తము చెట్టునకు ఒకే అనుభవముగా నుండును. అట్లే సుఖము, వేడిమి, చల్లన మొదలైనవి గూడ యనుభవింపబడును గాని తెలియవు. కనుకనే వీనిని అంతఃస్పర్శము లందురు. ఊర్ధ్వ స్రోతస్సులనగా నేలనుండి పైకి దారిచేసికొను శక్తి పీడనము వలన

పుట్టిన సృష్టి ఇది. అందువలననే చెట్లన్నియు భూమినుండి పైకి పెరుగును. ఇవిగూడ తమోగుణమునందు జీవించును. ఇందు చెప్ప బడిన వృక్షముల వర్గీకరణము ప్రవృత్తి భేదము ననుసరించినదేకాని, గోత్రము ననుసరించినదికాదు. అనగా Taxanomy కాదు. ఇది వైఖరి లేక Analogy ననుసరించినదేగాని ఉత్పత్తి ధర్మము Homology ననుసరించినదికాదు.

8) తిర్యక్‌సృష్టి లేక అడ్డముగా పెరుగునది (Horizontal Creation). ఇందు ఈ దిగువ భాగములున్నవి :

A) కాలియందు చీలిన గిట్టలుగల ఎద్దు, ఆవులు, దున్నలు, గేదెలు, గొర్రెలు, మేకలు, జింకలు, పందులు, ఒంటెలు, దుప్పులు, లేళ్ళు మున్నగు జంతువులు.

B) చీలని యొకే గిట్టగల గుర్రములు, గాడిదలు, కంచర గాడిదలు, గౌరములు, శరభములు, చామర మృగములు మున్నగు జంతువులు.

C) ఐదుగోళ్ళ పాదమునకు గల కుక్కలు, నక్కలు, తోడేళ్ళు, పులులు, పిల్లులు, కుందేళ్లు, సింహములు, కోతులు, ముండ్లపందులు, ఏనుగులు, తాబేళ్లు, ఉడుములు, తొండలు మొదలగు భూచరములయిన మృగములు.

D) మొసళ్ళు మొదలగు జలచరములు.

E) పావురములు, గ్రద్దలు, కొంగలు, డేగలు, తెల్లపక్షులు, భల్లూకపక్షులు, నెమళ్లు, హంసలు, బెగ్గురుపిట్టలు, జక్కువలు, కాకులు, గుడ్లగూబలు మొదలగు పక్షులజాతులు. ఇవి ఆకాశమున తిరుగును గనుక ఖేచరము లనబడును.

ఈ ఎనిమిదవ సృష్టియందు పుట్టిన తిర్యక్కులనబడు జీవులన్నింటికిని వెన్నెముక అడ్డము తిరిగియుండును (Horizontal). వీనికి జ్ఞానము ఆహార మునుగూర్చి మాత్రమే విస్ఫారియుండును. మిగిలిన జ్ఞానము విశేషముగా విస్ఫారదు. వాసనచూచు నింద్రియములు హెచ్చుగా పనిచేయును. ఇవి

ముక్కువలన నెక్కువగా తెలిసికొని అహోరాదులయందు మెలగుచుండును. హృదయమున నెక్కువ కాలము జ్ఞప్తియుండవలసిన విషయములంటవు. అనగా నెప్పటి కప్పుడు గుర్తుండునేగాని, దినముల తరబడి విషయములు గుర్తుండవు. రేపటి విషయమును గూర్చిన కార్యక్రమముగాని, నిన్నటి విషయమును నేడు చూచుకొనుటగాని చేతకాదు. వీనిలో ఇరువదిఎనిమిది భేదములున్నవని శాస్త్రజ్ఞులు చెప్పుదురు.

9) అర్వాక్ స్రోతము అనబడు సృష్టి తొమ్మిదవది. ఇది ఒకేవిధము. ఇదియే మానవుల సృష్టి. ఇది రజోగుణముచే ప్రేరేపింపబడి జరుగును. ఇందు జీవులు అన్నిపనులు జేయగలిగియుందురు. సుఖము, దుఃఖము విశదముగా ననుభవింతురు. దుఃఖమునందు గూడ సుఖమును గోరి పనిచేయుచుందురు.

ఈ ఏడవ, ఎనిమిదవ, తొమ్మిదవ సృష్టులు మూడును వైకృత సృష్టి అనబడును. ఈ విధముగా జీవుల సృష్టి తొమ్మిది విధములు.

– [శ్రీ. భా. ప్ర. V. పే. 42-45]

## నవసూర్యులు - కర్దముని పుత్రికలు

కళ, అనసూయ, శ్రద్ధ, హవిర్భువు, గతి, క్రియ, ఖ్యాతి, అరుంధతి, శాంతి అను కర్దముని తొమ్మిదిమంది పుత్రికలును మానవజాతి వరించవలసిన తొమ్మిది సద్గుణములు. వారి భర్తలైన తొమ్మిదిమంది మునులును ఆకాశమున గల అసంఖ్యాకములైన సూర్యమూర్తులలో తొమ్మిదిమంది సూర్యులు. వారి కిరణముల తేజస్సులుగా వారిభార్యలు ప్రకాశించుచుందురు. ఒక్కొక్క సూర్య మండలము నందొక్కొక్క సద్గుణము ప్రధాన లక్షణమై ప్రకాశించి, తన చుట్టును తిరుగు గ్రహముల పైని జీవులకు ఆ సద్గుణము ముఖ్యలక్షణముగా వర్తించును. ఆ సూర్యులు మన సూర్యునికన్న ఆధ్యాత్మిక పరిణామమున చాలా పురోగమించినవారు. కనుక వారి సౌరకుటుంబముల యందలి జీవులు కూడ మనకన్న చాలా పురోగమించినవారు. మరియు మన సూర్యుడును మరికొందరు సూర్యులును ఈ మరీచి మున్నగువారికి శిష్యులై కిరణరూపమున

బ్రహ్మవిద్య నుపాసించుచు, మన భూమిపై జన్మించు మానవులకు తగినంతగా బ్రహ్మవిద్య నందించుచున్నారు. అంతేకాక మరీచి మొదలగు సూర్యులనుండి అంశలై కిరణములు దిగివచ్చి మన సూర్యుని ద్వారమున మన భూమిపై నివసించి దేహములు ధరించుచు, ఆయా కాలములలో ఆయా ఋషులుగా పుట్టి పెరిగి బ్రహ్మవిద్య నుపదేశించుచున్నారు. అట్లే సనత్కుమారుడు అనబడు నొక పవిత్ర సూర్యమూర్తి నుంచి యొక అంశ దిగివచ్చి మన శుక్ర గ్రహము మీదుగా మన భూమిని చేరుకొని యిప్పటికిని సనత్కుమారుడను పేర బ్రహ్మర్షియై వర్తించుచు మనువుయొక్క సృష్టి వ్యూహమును ప్రవర్తింప జేయుచున్నాడు. ఇంకను ఇందలి వివరములు తెలియవలెనన్నచో జ్వాలాకూలుడను మహర్షి యుపదేశమున Alice A. Bailey రచించిన 'గుప్తజ్యోతిర్విద్య' (Esoteric Astrology) అను గ్రంథమును చూడ వచ్చును.

– [శ్రీ. భా. ప్ర. VI. పే. 146-147]

## నాగములు, సర్పములు

నాగములు, సర్పములు అనగా పాములు కావు. ఖనిజాదులలో జలము సహాయముగా ప్రవాహరూపమున ప్రసరించు మహాచైతన్యములే నాగములు. వీరు మనదేహములందు రక్తనాళములుగా పనిచేయుచున్నారు. అధోలోకము లలో వీరికి కామగమనమున్నది. అనగా ఖనిజముల యందు కావలసినంత దూరము ప్రసరింపగలరు. మనకుగూడ మనసు, కన్ను, చెవి, ముక్కు అను వానిలో కొంత కామగమనము మిగిలిపోయినది. ఆదియుగములలో నదులు, కాలువలు, మున్నగు జలప్రవాహములను మలచునట్టి మొదటి నరజాతికి నాగజాతియని పేరు వచ్చినది.

– [శ్రీ. భా. ప్ర. I గ్రంథగ్రంథులు పే. XXII]

## నాభి

నాభి యనగా కేంద్రము. కేంద్రమేర్పడుటయే సూర్యమండల మేర్పడుట. బంధువనగా బంధించి చెదరిపోకుండ పట్టియుంచువాడు. సూర్యుని చుట్టును, సౌరకుటుంబము బంధించి చెదరకుండ పరిభ్రమింప జేయబడుచున్నది. దీనినుండి మూడు నాభులు పుట్టినవని చెప్పబడినది. అవియే సూర్యుడు, భూమి, చంద్రుడు అనబడు కేంద్రములు. ఈ మూడింటి నుండియే జీవులేర్పడి దేహము, మనస్సు, ఆత్మ యను మూడు నాభులు గలిగి చెదరిపోకుండ జీవించుచున్నారు. వీనినుండి ఆరు నాభులు చక్రములుగా నేర్పడి, తిరుగుచున్నవనియును, ఆరును వేరువేరు చక్రములై తిరుగుచున్న వనియును చెప్పబడినది. సూర్యునిచుట్టును ఐదు గ్రహములు, చంద్రుడు కలసి దేనికది పరిభ్రమించుచు, సూర్యునిచుట్టును తిరుగుచున్నారు. దీనివలన సృష్టి జీవులేర్పడి భూమిపై శిరస్సు సూర్యునకును, షట్చక్రములు మిగిలిన గ్రహములకును, సంకేతములుగా వెన్నెముక ఏర్పడినది. అది తల్లిగర్భమున సప్తతంతులై మండలాకృతిగా చుట్టుకొనియుండగా, దానిని నిర్మించు రాశి చక్రము భూమధ్యరేఖ చుట్టును ఆకాశముగా నేర్పడినది. ఇట్లు నాభు లేర్పడు టయే జీవుని దేహమున బంధించుటకు కారణము.

— [సు. సూ. పే. 137-138]

## నారాశంసి

వేదములయందు అగ్ని, వాయువు, వరుణుడు మున్నగు వివిధ దేవతలు మంత్రములుగా రూపొందుచున్నారు. అనగా సృష్టియందు వర్తించు చున్నారు. సృష్టియను వేదమునకు మంత్రరూపమే శ్రుతియగు వేదము. ఇందలి దేవతలందరు పురుషుడను ఈశ్వరునియందు అంగాంగీ భావము చెందియున్నారు. ఈ అంగములలో అంతర్యామి యగు ఈశ్వరుడే బ్రహ్మాండ పిండాండములుగా సృష్టియై దిగివచ్చుచున్నాడు.

నరుడుగా వేదము చదువు జీవుడును, ప్రకృతియందు వర్తించు ఈశ్వరుడే గనుక వేదముచదివి తెలిసినవాడనుకూడ "నేనే", "దీనినెవ్వడు

తెలిసికొనునో వాడు శోకము తరించును. అమృతత్వము ననుభవించును.'' అని వేదమంత్రములలో అనేకములు కీర్తించుచున్నవి. వాచ్యముగాకూడ నరుని ఈశ్వరునిగా కీర్తించు మంత్రములు 'నారాశంసి' అను పేరున నున్నవి.

— [మం. గీ. పే. 316]

## న్యాసవిద్య

యోగవిద్య నభ్యసించువానికి ప్రాణ స్పందనముల రూపమున వాయువులు మూలాధారము నుండి ఊర్ధ్వగమనము చేయును. ప్రజ్ఞలు శిరస్సు నుండి దిగువకు ప్రసరించుచు వాయువుల గతులను కలసికొని సమీకరణము చేయును. భరతభూమియందు దక్షిణసముద్రము నుండి బయలుదేరిన వాయువు ఉత్తరముగా ప్రయాణము చేయును. హిమాలయముల నుండి ఋషుల ప్రజ్ఞలు దక్షిణాభిముఖముగా దిగివచ్చి వాయువులను కలసికొని ఆకాశపథములలో ప్రణవమును సమీకరణము చేయును. కనుకనే యోగ సిద్ధులైన ఋషీంద్రులు తమ దేహముల యందలి వివిధ స్థానములలో భరత భూమియందలి వివిధ ప్రాంతముల చైతన్యమును న్యాసము చేసికొనుట నేర్చిరి. తమ సహస్రారమందలి ప్రజ్ఞలకును హిమాలయపర్వత గుహలలోని చైతన్యమునకును గల సంబంధము వారికి తెలియును. బదరికాశ్రమము నకును, కైలాస శిఖరమునకును తమ శిరస్సులలోగల స్థానమును గుర్తించిన వారు ఋషులు. ఈ సంబంధము ననుసరించియే దేహములలోనికి జీవులుగా దిగివచ్చు పురుషుడు రుద్రుడుగను, నారాయణుడుగను దర్శింపబడెను. వేదములందు రుద్రసూక్తములు, విష్ణుసూక్తములు న్యాసవిద్యకు మొదటి మంత్రములై రూపొందినవి.

— [పు. పు. పే. 42-43]

## నిష్కామ కర్మ

చాలాకాలము సత్కర్మలాచరించిన వానియందు ప్రజలకు గౌరవము కలిగి వాని అడుగుజాడల వెంట నడిచెదరు. జ్ఞానము కలిగినదనుకొని అతడు సత్కర్మలను మానినచో మిగిలినవారును మానుదురు. కనుక సత్కర్మలను

మానకుండుట నిష్కామకర్మ యోగమే. లోకము క్రమబద్ధముగా నడువ వలెనన్నచో ఆర్జనము, జీవనోపాధి, సాంఘికవ్యవస్థ, పౌరధర్మములు క్రమ బద్ధముగ నిర్వర్తింపబడవలెను. దానికొరకే నిరంతర సత్కర్మాచరణము ఆవశ్యకము. తన మనోవాక్కర్మలు నిమిత్తములుగ ఇతరులుద్ధరింపబడ వలెనను సంకల్పమే వాస్తవమైన నిష్కామకర్మ యోగము. కనుక సత్కర్మా చరణము వలననే ఈ సిద్ధి సాధ్యము. దాని నెరిగియే జనకాదులు నైష్కర్మ్య సిద్ధిని తమ ప్రజలకు సాధించి పెట్టిరి.

– [శం. రా. I. పే. 97-98]

## పదునెనిమిది (18) - కీలక సూత్రము

భగవద్గీతకు పదునెనిమిది అధ్యాయములు కలవు. దీని నిముడ్చు కొనిన మహాభారతమునకు పదునెనిమిది పర్వములు కలవు. యుద్ధము జరిగినది పదునెనిమిది దినములు. అందు పాల్గొనినది పదునెనిమిది యక్షౌహి ణుల సైన్యము. సంఖ్యాక్షర నిఘంటువు ననుసరించి 'జ–య' అను అక్షరము లకు 8, 1 సంఖ్యలు సంకేతింపబడినవి. "అంకానాం వామతో గతిః" అను సంప్రదాయముచే 'జయ' శబ్దమునకు '18' అని అర్థము. ఈ '18' సంఖ్య భారతములోని వివిధార్థములను విన్యాసము చేయు సంకేతములలో నొకటి. దీనిని విడదీయు సుళువు 'పర్వము' అను పదములోని శ్లేషార్థమున గలదు. పూర్ణిమ, అమావాస్యలను పర్వములందురు. ఒక చంద్ర సంవత్సరమున 12 పూర్ణిములు, 12 అమావాస్యలు నుండును. మొత్తము 24 పర్వములు. దీనినే సంవత్సర పురుషుడగు ప్రజాపతి నామాంకితమైన గాయత్రీ ఛందస్సు అందురు. ఇందు నాలుగింట మూడువంతులు 18 అగును. ఇందు చెప్పబోవు సమన్వయమునకు వ్యాఖ్యానప్రాయమైన పునాదిని నిలుపుటకే సూతుడు మహా భారతము మొదట సంవత్సర చక్రమును కీర్తించి జ్యోతిర్విద్యా విన్యాసము చేసినాడు.

ఈ సృష్టి మొత్తమునకు సంవత్సరము చిన్న చిత్రపటము (Blue Print) వంటిది. మానవజన్మకు గర్భధారణము నుండి జననము వరకుగల నగటు కాలము తొమ్మిది సౌరమాసములు. అనగా సంవత్సరమున 3/4వ

వంతు. ఇది జీవి శరీరము పెరుగుదలను, అహంకారము పెరుగుదలను సూచించును. మరియు పంచేంద్రియ ప్రవృత్తులు; దానితోబాటు పిండమును అవయవములుగా బద్దలుకొట్టు శక్తి (గాంధారి)ని, ఈ విభజనలో నుద్భవించు మామకులు అనబడు అహంకారాది అంధసంతతి జననమును తెలియజేయును. దీనికి వివరణముగనే దైవాసురాంశలు భూమికి దిగివచ్చు కథ భారతమున నున్నది. వీరి నడుమనే "నేను"గా దిగివచ్చువాడు శ్రీకృష్ణుడు. కురుపాండవ శక్తులు గల ఈ క్షేత్రముననే ధర్మగ్లాని కలిగినపుడెల్ల, అధర్మము పెచ్చు పెరిగినపుడెల్ల "నేను"గా తాను దిగివచ్చుచుందునని భగవద్గీతలో "నా" వాగ్దానము. ఈ వాగ్దానమే సర్వజాతుల పవిత్రగ్రంథముల యందు ప్రతిధ్వనించు "నా వాణి". ఇట్లు ప్రతిజీవి యందును సంవత్సర పరిభ్రమణమున దిగివచ్చు జనన మరణాత్మకమైన అంశములను తదతీతమైన అంశమును సమన్వయించుట వేదపురాణ వాఙ్మయమునందు పైజెప్పిన నాలుగింట మూడు భాగములుగా సంకేతింపబడినది. ఈ మొత్తమునందు అంతర్గూఢముగా జరుగు ప్రక్రియ మూడువంతులుగను, బహిర్గతముగా జరుగునది నాల్గవవంతుగను చెప్పబడినది. ఇందు అంతర్గూఢమగు మూడు వంతులును జీవి గర్భస్థుడై యున్న తొమ్మిది మాసములతో ఉపమానము చేయబడినది. ఈ తొమ్మిది మాసములలో తొమ్మిది పూర్ణిమలు, తొమ్మిది అమావాస్యలు వచ్చును. అవియే పదునెనిమిది పర్వములుగా భారతమున నిబద్ధము చేయబడినవి.

నాలుగింట మూడువంతులు సూక్ష్మలోకములలో అనగా కారణ లోకములలో అమృతత్వమున నున్నవి. మిగిలిన నాలుగవవంతు మాత్రము సృష్టిగా వ్యక్తమై వర్తించుచుండును. ఈ వ్యక్త సృష్టికి; ఆది; అంతము ఉండును. సూక్ష్మకారణ లోకములలో ఆది, అంతము ఉండవు. అవి అమృతమయములు. భౌతికలోకములో నున్న సమస్యలకు పరిష్కారము కావలెనన్నచో, సూక్ష్మకారణ లోకముల వెలుగులో నన్వేషించవలెను గాని; భౌతిక సన్నివేశముల చీకటిలో తడవుకొనరాదు. సర్వసమస్యలకు పరిష్కారము చూపగల సూక్ష్మకారణ లోకములను అద్భుతముగా, సంపూర్ణముగా విన్యసించిన గ్రంథము ప్రపంచ వాఙ్మయమున మహాభారత మొక్కటే!

అందు కేంద్రబిందువుగా నున్నది భగవద్గీత ! వీని వినియోగమును సూచించుటకే '18' అను సంఖ్య మరల మరల స్ఫురింప జేయబడినది.

– [శం. రా. I. నేపథ్యము పే. 8-10]

## పశువులు

పశువులు జీవులలో కోరికలుగను కామక్రోధాదిరస భావములుగను వృద్ధి పొందుశక్తులు. ఇవి సత్త్వశుద్ధిని పొందించునపుడు రససిద్ధి (పశుపాలకత్వము, గోపాలకత్వము) జీవికి కలిగించి మోక్షప్రదములగును. పొందనపుడివి దోషగ్రస్తములై దుఃఖహేతువులగును.

– [పు. సూ. 25-26]

## పక్షిలోకము - సుపర్ణుడు

పక్షిలోక మనగా రెక్కలుగల పక్షులని యర్థముకాదు. రెక్కలు భౌతికమైన భూలోకమునకు సంబంధించినవి. ఖగ లోకమనగా ఆకాశమునందు ప్రయాణము చేయునట్టి దేవతల లోకము. ఈ దేవతలు మండలాత్మకులై నిరంతర ప్రయాణములు చేయుచు, గ్రహ, తారకముల గమనములకు దారులు కల్పింతురు. సూర్యునిచుట్టును గ్రహములు తిరుగుచుండుట భూమి తనచుట్టు తాను తిరుగుచుండుట, పండ్రెండుగురు సూర్యులొక్కొక్క గుంపుగా కూడి తమతమ సౌరకుటుంబముతో కలసి మరియొక కేంద్రము చుట్టును తిరుగుచుండుట, యిట్టి సూర్యుల గుంపులు పండ్రెండు కలసి మరియొక పెద్ద కేంద్రము చుట్టును తిరుగుచుండుట, యిట్టి గమనముల యల్లికతో బ్రహ్మాండ గోళము నిలబడియుండుట, ఈ మూర్తులవలననే జరుగుచున్నది. అందరికన్న పెద్ద మండలాత్మక గమనమున తిరుగుచు, బ్రహ్మాండములను తన రెక్కలతో కూర్పు చేయుచున్న మహాదైవమే "సుపర్ణుడు" అనబడు గరుత్మంతుడు. "Garuda is the symbol of the great cycle – SECRET DOCTRINE (III - 323)" మనమెరిగిన చిన్న మండలాకృతులలో అహోరాత్రముల యొక్క గమనమునకు గరుడుడధిపతి, సూర్యోదయము నుండి సూర్యాస్తమయము వరకుగల నగము మండలమునకు "అరుణుడు"

లేక ఎర్రనికిరణము అధిపతి. కనుకనే యతనికి గ్రుడ్డునందు శరీరము పైభాగము మాత్రమే యేర్పడి, నడుమునుండి క్రిందిభాగ మేర్పడకముందే తల్లియగు వినత యా గ్రుడ్డును బ్రద్దలు గొట్టెననియు, అతడు తొడలులేనివాడై అనూరుడను పేర సూర్యరథమునకు సారథి యయ్యెననియు పురాణసంకేతము చెప్పుచున్నది. వినత యనగా విశేషముగా వంగి, భూమికంటినట్లు కనిపించు చున్న భూమ్యాకాశ విభాగరేఖ. జటాయువు, సంపాతి మొదలగు వారందరు ఖగములనబడెడి దేవతలే.

– [శ్రీ. భా. ప్ర. III. పే, 104-105]

## పాపస్వరూపము

నిప్పు పుట్టినచోట దగ్ధమగు పదార్థమేదో యుండును. ఏదియు దగ్ధము [illegible] నిప్పు మనకు కనిపించునట్లు పుట్టదు. కనుక నిప్పు కావలెనన్నచో [illegible], పొగ, మసి తప్పవు. అగ్ని యెప్పుడును ధూమముచే అపరింపబడి [illegible]. అగ్నిస్వరూపుడగు జీవుడుకూడ భౌతికపదార్థ శరీరముతోనే వ్యక్త [illegible]. అద్దముపై ప్రతిదినము ధూళిపొర కప్పుచుండును. దానిని తుడిచి [illegible] చేయనిచో ప్రతిబింబము ఉన్నది యున్నట్లు కనిపించదు. మసకగా [illegible]. గర్భస్థమగు పిండము మావిచే నావరింపబడి యుండును. అట్లే [illegible] జ్ఞానము కామక్రోధములచే నావరింపబడి యుండును. జ్ఞానము [illegible] ఏర్పడు కామరూపమైన పొర జ్ఞానమునకు శత్రువుగా పనిచేయు [illegible]. దీపము వెలుగుటవలన పుట్టినమసి ఆ దీపపు వెలుగునకు అడ్డు [illegible] గదా ! అట్లే కామము దోషమును పుట్టించును. ఇదియొక అగ్ని [illegible] వలె పనిచేయుచు, జ్ఞానమును తినుచుండును.

నిత్యము తయారగుచున్న యీ పాపమునకు మనస్సును ఇంద్రియము లును అధిష్ఠానములు. అనగా పాపము వానియందు ఏర్పడుచుండును. వీని నావరించిన పాపము వానిరూపముననే పనిచేయుచు మోహమును పుట్టించును. [illegible] ఒక వస్తువు ఇంకొక వస్తువువలె తోచుట. ఈ పాపము వలన సృష్టిలోని పదార్థముల రూపముననున్న భగవంతుడు స్మరణకురాక పదార్థ

ములే గోచరించును. అపుడు వాటితోటి "మన సంబంధము" భ్రాంతిని కలిగించి, శత్రుత్వ మిత్రత్వములను, సుఖదుఃఖములను, కలిమిలేములను సృష్టించుకొనును. కనుక మొట్టమొదటగా ఇంద్రియములను నియమించుకొనుట సాధకుడు చేయవలెను. ఇంద్రియములను నియమించుట యనగా నిగ్రహించుట కాదు. వచ్చిన సత్కర్మకు ఇంద్రియములను నియమించుటయే నియమము. దానివలన మనస్సునందు సత్కర్మ నిండును. పాపమునకు అభావము కలుగును. ఈ విధముగా జ్ఞాన, విజ్ఞాన నాశనకారణమగు పాపమును జయింపవలెను.

– [శం. రా. I. పే. 117-120]

## పిప్పలము (రావిచెట్టు)

సృష్టియందలి అనంతత్వము అను ధర్మముకూడ ఉపమానమునకు సరిపోవుటకే పిప్పలము స్వీకరింపబడినది. (పిట్టలుతిన్న రావిపండ్లలోని గింజలు భూమిపై పడి మరల మొలచును.) బ్రహ్మవర్చస్సునకు రావిచెట్టును, శాస్త్రముల స్వయంబోధకమునకు మర్రిచెట్టును సంకేతములు. సంకేతములే ఈ స్థితులను సాధించుటకు కూడ కావలసిన వృక్షములు. రావిచెట్టు క్రింద కూర్చుండి వేదమంత్ర దీక్ష చేయువాడు బ్రహ్మవర్చస్సు మూలమ్మున వేదవిదుడగును. మర్రిచెట్టు క్రింద కూర్చుండి సాధించువాడు స్వయంబోధక శక్తివలన వేదవిదుడగును. అందు మొదటిది వెలుగువలె సిద్ధించును. రెండవది మౌనరూపమున సిద్ధించును. ఈ రెండునూ క్రమముగా హయగ్రీవుడు, దక్షిణామూర్తి అను విద్యాధిదేవతలు. హయగ్రీవమంత్రదీక్ష చేయువాడు ఇంటనుండక, రావిచెట్టు క్రింద నివసించుచు, రావిపండ్లు తిని, నీరు త్రాగవలెను. ఈ రహస్యమునకు సంకేతముగనే రావిచెట్టును అశ్వత్థమనిరి.

(చూ. అశ్వత్థము)

– [సు. సూ. పే. 99]

## పురాణము

సర్గము, ప్రతిసర్గము, వంశము, మన్వంతరము, రాజానుచరితము అను ఐదు లక్షణములతో కూడిన అపురూపమైన కూర్పును పురాణమందురు. ఈ కూర్పుకు రచనలో కవితాపద్ధతి యుండును. కవితా పద్ధతిలో రెండు విధములు కనిపించును. అందు మొదటిది సృష్టి స్వభావమును దర్శించి కవి తాను మరియొక సృష్టిని కల్పనచేయుట, రెండవది ఈ సృష్టినే కవితా వస్తువుగా స్వీకరించి అందిమిడియున్న కావ్యత్వమును ప్రకాశింపజేయుట. ఈ రెండింటిలో మొదటిది కేవలము మహాకవులకును, రెండవది ఋషులకును వర్తించును. పురాణకర్తలు ఈ రెండవ పద్ధతిలో కావ్యసృష్టి చేసినవారు. అనగా సృష్టికర్మ యందలి కావ్యత్వమును ప్రకాశింప జేసినవారు. ఇందలి పాత్రలు సృష్టి కర్మకు సంబంధించిన అధిదేవతలు. గనుక సహజముగానే శాశ్వతములు. భాగవతమునందు ఇట్టి సహజకావ్య నిర్మాణము పరిపూర్ణత చెందినదని చెప్పవలెను. సృష్టిలోని అంతర్యామియే ఈ కావ్యమునకు కథా నాయకుడు. అతడు సృష్టి జీవులయందు ప్రత్యేకముగను అంతర్యామిత్వము నందు అతీతముగను గోచరించుచుండును. గనుక ఈ రెండు విధములైన ఆహార్యములతో ఏకకాలికముగా చేష్టలు చూపును. ఈ పాత్ర యందుగల ప్రత్యేక రసానుభూతి ఏకకాలికముగా రెండువిధములై భాసించి సహృదయు లకు ఆనందము ద్విగుణీకృతము చేయుచున్నది. చదివినవారెల్ల ఈ భాగవత మందు పాత్రగా తన్నుతాను గుర్తుపట్టును. ఇట్టి పురాణకావ్యమందలి పాత్రలు పూర్వమొక కాలమున నున్నవారేనా అను ప్రశ్నపుట్టదు. ఒక కాలమందున్న వ్యక్తులు ఈ భాగవతమున భాగములు కనుక కావ్యమునకు నాయకులు కాజాలరు. వారుగా దిగివచ్చిన అంతర్యామియే నాయకుడు. ఎవని యందీ సృష్టి భాసించుచున్నదో అతడొక్కడే ఇట్టి కావ్యములకు నాయకుడగుట తప్పనిసరి అని తెలియును. వానినుండి దిగివచ్చిన చతుర్ముఖుడు, ప్రజా పతులు, మనువులు, మనుపుత్రులు ఇందలి కథావస్తువులగుచున్నారు.

— [శ్రీ. భా. ప్ర. XII. ఉపోద్ఘాతము]

# పురాణములు - భారతీయ విజ్ఞానము

ప్రాచీన భారతీయ విజ్ఞానమునకు, బ్రహ్మవిద్యకు ప్రకాశకములు పురాణములు, ఇతిహాసములు. ఇవి వేదకాలమున ప్రారంభదశనుండియో, అంతకు కొంచెము ముందుకాలము నుండియో రచింపబడినవి. కాల కాలముల యందు విజ్ఞానము వర్ధిల్లుచున్న కొలదియు నివి పెంచి తిరిగి వ్రాయబడు చుండెడివి. వేదములతోపాటు పెరిగినవి గనుక వేదవిజ్ఞానమంతయు వీనియందు సుబోధకముగా నుండును. అంతేగాక వేదవాఙ్మయమును దర్శించిన ఋషుల సంప్రదాయములు, వారి కుటుంబములలోని సన్నివేశములు, వంశవృక్షములు తరతరములుగా కూర్చుచేసి రక్షింపబడినవి. రాజు లేర్పడినప్పటినుండి రాజవంశముల చరిత్రలు కూడ వీనిలో కూర్చుచేయబడినవి. ఎప్పటి కప్పుడు రచింపబడుట వలన వీనిలో తప్పులుండుట సాధ్యముకాదు. ఇప్పటికి పదివేల సంవత్సరములకు వెనుక, మిగిలిన జాతుల, దేశముల చరిత్రలు లేవు. ఈజిప్టు, భారతదేశము, ఛాల్డియా, బాబిలోనియా, క్రీటు, అట్లాంటిస్ దేశములును వాని నాగరికతలును అంతకన్న ముందునుండి యున్నవి. అందు భారతదేశ సంస్కృతి నేటివరకు ధారావాహికముగా వచ్చుచున్నది. మిగిలినవి నడుమ అంతరించుటయు వాని నెరుగని నవీనజాతులు పుట్టి నూతనముగా నాగరికత ప్రారంభమగుటయు జరిగినవి. కనుక అట్టిదేశముల వారికి ఈ ప్రాచీన విషయములు క్రొత్తగా నుండును. ఆంగ్లేయులు భారతదేశమునకు వచ్చి వేద పురాణాదులను చూచినపుడు క్రొత్తగా నుండుటయేగాక అసత్యములనియు, పండితుల యూహాకల్పితములనియు కూడ అనిపించినవి. అజ్ఞాన స్థితిలో అట్లనిపించుట సహజము. అతి ప్రాచీన మానవ నాగరికతాగ్రంథములలో నొకటియు, క్రీస్తుకు పూర్వము వేల సంవత్సరముల ముందు పుట్టినదియు నగు ప్రాత నిబంధన గ్రంథము (Old Testament) ను తెల్లవారు మొదటగా చదివినపుడు వారి కది యిట్టి అజ్ఞానముతోనే బోధపడెను. నేటికిని అది క్రైస్తవ గ్రంథమని పొరపడువారు గలరు. ఈ పరిమిత జ్ఞానముతోనే వారాగ్రంథమును దిద్ది అనువదించుకొనుటలో ఈ భూమ్యాకాశాదుల సృష్టి క్రీస్తుకు పూర్వము 4004 సంవత్సరమున పుట్టినదని రచించిరి. ఇది నవీన శాస్త్రముతోగాని, ప్రాచీన జాతుల వేదగ్రంథములతో గాని సరిపడదు.

సృష్ట్యాది సంవత్సరముల సంఖ్య పురాణముల గణనముతోను, పంచాఙ్గ గణితముతోను, నవీన జీవశాస్త్రకారులతోను, (Natural Philosophers) విప్రతిపత్తి లేకుండ సరిపోవుచున్నది. (చూ. "Secret Doctrine" అను గ్రంథమున How old is the Universe ? అను నధ్యాయము.)

పురాణములలో నరజాతి చరిత్ర సమగ్రముగా నున్నది. కాలకాలముల యందును పెరుగుచున్న విజ్ఞానమును చేర్చి తిరుగవ్రాయబడిన పురాణేతి హాసములలో వ్యాసుని కాలమున చేయబడిన కూర్పు చిట్టచివరిది. అది దాదాపు క్రీస్తుకు పూర్వము 3500 సంవత్సరముల ప్రాంతమునుండి నూరు వందల సంవత్సరములపాటు జరిగినది. పరాశరుడు, వాని కుమారుడు వ్యాసుడు సకలవిజ్ఞానమూర్తులైన ఋషులను సమావేశపరచి నైమిషారణ్య మున శిష్యగణముల నేర్పరచి ఇంత ప్రయత్నము చేసిరి. తత్ఫలితముగనే ఇతిహాసమగు మహాభారతము, పదునెనిమిది పురాణములును పుట్టినవి. ఇవి గుప్తవంశపురాజుల కాలమున రచింపబడినవని చరిత్ర పరిశోధకులు వ్రాసిన వ్రాతలు నిరాధారములు.

– [పు. పు. అనుబంధము పే. 293-295]

## పురీషము

వేదముల, ఉపనిషత్తుల ప్రయోగమున ఈ పదమునకు పుర + ఈషము లేక నివాసస్థానము కోరునది. అనగా స్థూలదేహమని అర్థము. అందున్న వాడు గనుకనే పురుషుడని జీవుడు చెప్పబడెను.

– [సు. సూ. పే. 63]

## పురుషుడు

ప్రతిజీవిలో నుండు "నేను" అనుప్రజ్ఞ. ఇతడు తనంతట తా నున్నాడు. ఇతడు జీవులలోనున్న దేవుడు. జీవుడు చేయుచున్న మంచిచెడ్డ లను గమనించుచు, జీవుల హృదయములలో సాక్షిగా నున్నాడు. కనుకనే హృదయము ప్రాణమునకు ముఖ్యస్థానము. ఇతడందరిలో నుండుటచేత అందరి శిరస్సులు, కన్నులు, పాదములు ఒక్కనివే. అందరిలో నున్న యీ

పురుషుడొక్కడే గనుక బ్రహ్మాండమంతయు వ్యాపించి యున్నాడు. అతనిలో నందరున్నారు. అందరికన్న నుత్తముడగు భగవంతుడు పురుషుడని చెప్పబడి నాడు. ఈ దేవునకే యొక్కొక్క మతము వారు తమ కిష్టమగు పేరుపెట్టి పిలుచుచున్నారు.

– [పు. సూ. పే. 4]

## పురుషోత్తముడు

(జగత్కర్మకు అతీతముగను, జగత్కర్మగాను ఉన్న ఆ ఉత్తమ పురుషుడే, మనలోని అక్షరపురుషునికి (Soul) వెనుక పురుషోత్తముడుగా (Spirit) నుండి నడిపించుచున్నాడు. ఇట్టి పురుషోత్తముడు తనయందు "నేను" అను ప్రజ్ఞగానే యుండును. తనయందు మాత్రమే గాక, సర్వజీవ రాసుల యందును "నేను" అను ప్రజ్ఞగానే యున్నాడు.) ''నేను క్షర పురుషునికన్నను, అక్షర పురుషునికన్నను కూడ ఉత్తముడను. వేదములలోను, లోకములలోను కూడ పురుషోత్తముడని ప్రసిద్ధి చెందినవాడను నేనే'' అని భగవద్గీతలో కృష్ణుడు పలికెను.

లోకమునందును, వేదమునందును అనగా వ్యక్తులు పిలుచుకొనుట, తెలిసికొనుట, సృష్టిగా వ్యవహరించుట యందును, వేదమూర్తులుగా కీర్తింప బడుట యందును సమానులేయని అర్థము. లోకమునందు క్షర పురుషుడు వ్యవహరించును, అక్షరుడు వ్యవహరింప జేయును, పురుషోత్తముడు వారి ప్రవర్తనమున తేజరిల్లును. అనగా వారిచే ప్రవర్తన రూపమున ప్రశంసించ బడును. ఈ మూడో విభూతియే వేదము.

లోకమునందు అనగా లోకభాషా వాఙ్మయము అను పురాణకావ్యాదుల యందు అని అర్థము. వేదమునందు అనగా వేదోపనిషద్బ్రాహ్మణ అరణ్యక ముల యందు అనిఅర్థము. కృష్ణుడు, రాముడు మున్నగుపదములు వ్యక్తులను నిర్దేశించినపుడు లోకభాష యగును. అట్లుకాక సంకర్షణాపకర్షణాదికర్ష ణములకు కారణభూతుడు, ధర్మమునందు రమించువాడు మున్నగు మంత్రా ర్థములతో వ్రాయబడినపుడును వేదార్థము అనబడును. అందు లోకార్థము

నామరూప దేశకాల బద్ధుడగు క్షరపురుషుని, కర్మక్రియా స్వరూపుడగు అక్షర పురుషుని కీర్తించును. వేదార్థము తదతీతుడైన పురుషోత్తముని మాత్రమే సూచించును. వ్యక్తుల నామములన్నియు గుణములచేవేరువేరుగా వినియోగింప బడి, గౌణము లగుచున్నవనియు, ఆత్మలకు చెందుచున్నవనియు, స్మరణనిచ్చు నపుడు మహా+ఆత్మ యగు పరమపురుషుని కీర్తించుచున్నవనియు విష్ణు సహస్రనామమున భీష్ముడు చెప్పెను. కనుక ప్రతి పదమును లౌకికముగను, అలౌకికముగను (వేదార్థమున) పురుషోత్తమునే స్ఫురింపజేయును.

— [మం. గీ. పే. 318-319]

## పృథు

ఋషులు కోరగా అవతరించి భూమిని గోవుగా జేసి వస్తువులను పిండెను.

(పృథువనగా స్థూలమని అర్థము)

— [శ్రీ. భా. ప్ర. I. పే. 60]

## పృషదాజ్యము

అనగా పెరుగుతో గలిసియున్న వెన్న. ఇచ్చట జగత్కారణ భూతమగు శుక్లశోణిత స్థానముని యొక్క సమన్వయము. మహత్తు అహం కారము మున్నగువాని జననమునకు హేతువైన ప్రకృతిలో గలియుటకు జగత్కారణ భూతమగు వీర్యముద్భవించినదని వివరణము. దాని శక్తివలన చతుర్ముఖుడు జీవులను సృష్టించెను.

— [పు. సూ. పే. 20]

## ప్రణిధానము (I)

"ప్రణిధానము" అను పదమునకు ఈశ్వరునకు తనకున్నది మొత్తము సమర్పణము చేయుట అని అర్థము. ఇది పతంజలి యోగదర్శనమున ఇచ్చిన నిర్వచనము. ఈశ్వరుడు అను పదము యోగశాస్త్ర సంప్రదాయము ప్రకారము

అర్థము చేసికొనవలెను. ప్రతి మానవుని యందును రెండు భాగములున్నవి : తనది, తాను. 'తనది' అనగా శరీరము, ప్రాణము, ఇంద్రియములు, మనస్సు, అందలి అభిప్రాయములు, నమ్మకములు, ఆశలు, ఆశయములు, వివిధశాస్త్రముల వివరములు, స్మరణలు మొదలగువాని మొత్తము. ఇవికాక మిగిలినది 'తాను'. ఇది ప్రజ్ఞామయము. ఇది కేవలము వెలుగు. ఈ వెలుగునే 'ఈశ్వరు' డందురు. ఇతని నుండియే మిగిలిన భాగమంతయు నుద్భవించి జననమరణముల నడుమ జీవిత సర్వస్వముగా నడచుచుండును. జ్ఞానము అను పదమునకు రెండవభాగమైన ఈశ్వరుడని సరియైన అర్థము. మొదటి భాగమున జ్ఞానమని పిలువదగినదేదియు లేదు. అయినను, ఇందలి భావములు, అభిప్రాయములు, ఆశలు, ఆశయములు, శాస్త్రసంచయము అనువానియందే సామాన్యులు జ్ఞానమను పదమును వాడుదురు. అట్లు వాడినచో తెలిసికొన దగిన విషయము, తెలిసికొనువాడు వేర్వేరుగా గుర్తింపబడును. మనస్సును తెలిసినవాడుగా భ్రాంతిపడుటయు, బాహ్యప్రపంచము వలన నేర్పడు ఇంద్రియార్థముల తెలిసికొనదగిన విషయములుగా భ్రాంతిపడుట జరుగును. యోగసాధన పొందినవానికి తెలిసికొనబడునది, తెలిసికొనువాడు కూడ 'నే' నను వెలుగే. ఈ వెలుగునందే మనస్సు మేల్కొనినపుడు మనస్సుకూడ ఈ వెలుగుగనే మారును.

— [శం. ధా. I. 159-160]

## ప్రణిధానము (II)

మొదట భ్రూమధ్యమునందు దృష్టిని నిలుపవలెను. దానితో మనసు ఊర్ధ్వముఖము పట్టును. లోనున్న తనను స్మరించుట ద్వారా తన ఉచ్ఛ్వాస నిశ్వాసములను గమనించుట నారంభించవలెను. ఉచ్ఛ్వాసనిశ్వాసలు నేను చేయుచుంటినా ? అవి జరుగుచున్నవా ? నాచే చేయించుచున్నవా ? అని ప్రశ్నించుకొనుచుండవలెను. అప్పుడు రెండుశక్తులు మనస్సునకు గోచరమగును. అందొక శక్తివలన శ్వాసపీల్చుట, రెండవ శక్తివలన శ్వాసవిడచుట జరుగుచున్నది. ఈ రెండు శక్తులే వరుసగా ప్రాణాపానములు. వీని అస్తిత్వమును గమనించుకొని మెల్లిగా వీనిని సమానములుగా చేయవలెను. అనగా

నెగుడు దిగుడు లేక సమవేగమున ప్రశాంతముగ, సుదీర్ఘముగ శ్వాసను పీల్చుట, విడచుట చేయుచు స్మరించుచుండవలెను. ఇట్లు చేయుచుండగా కాలక్రమమున ఈ రెండు శక్తులకును సామ్యము సిద్ధించును. అఖండమైన యొకేశక్తి ఈ రెండుపనులు చేయుట జరుగును. అటుపైన మనస్సునకు శ్వాసతో సామ్యము సిద్ధించును. అనగా ప్రాణశక్తియు, మనస్సును ఒక దానిలో నొకటి లీనమై నిలబడును. ఇట్లు నిలబడినంతసేపు శ్వాస జరుగదు. ఐనను తాను జీవించియే యుండును. మనస్సులేక తానుండుట సిద్ధించును. ఇంద్రియములు, మనస్సు, బుద్ధి అను ప్రవర్తనములు తనయందు నియతము లగును. అనగా లయమగుటచే నియమింపబడి యుండును. ఆ స్థితిలో అతని ప్రజ్ఞ మౌనమున నుండును. ప్రవర్తనలన్నియు కరిగిపోయినవి గనుక అప్పుడున్న స్థితి మోక్షమునకు ఛాదితీయును. మోక్షమనగా ప్రవర్తనలో చిక్కక మేల్కొనియున్న స్థితి.

— [శం. రా. I. పే. 195-196]

## ప్రళయములు

బ్రహ్మకు రాత్రి కలుగుసరికి అన్ని లోకములును, సూర్యుడును, చంద్రుడును చీకటిలో లీనమై పోవుదురు. అప్పుడు విష్ణువు తన మహాశక్తిని సంకర్షణాగ్నిగా వ్యాపింపజేయును. ప్రళయాగ్ని మూడు లోకములను దహించును. ఆ మంటలవేడి మహర్లోకము వరకును సోకును. దానిని తాళలేక మహర్లోకవాసులు జనలోకమునకు పోవుదురు. అపుడు భయంకర మైన వాయువొకటి వీచును. అది ప్రళయసముద్రమున పెద్దపెద్ద అలలను లేపును. అలలతోనిండి దరిజేరరాని స్థితిలోనున్న సముద్రము మిగిలిన లోకములను ముంచును. ఆ సముద్రముపై నారాయణుడు పవళించును.

బ్రహ్మ రాత్రికాలమున సూర్యచంద్రులు గూడ మాయమగుట యనగా వారినుండి వెలుగులు ఉపసంహరింపబడుట. మూడు లోకములను ప్రళయాగ్ని దహించునని చెప్పబడినది. సూర్యచంద్రాదులలో నున్న అగ్నిని తనలో కలుపుకొను నగ్నియు, వాయువును తనలో కలుపుకొను వాయువును, జల ములు తనలో కలుపుకొను జలములు అను మూడు రూపములును చీకటి యొక్క రూపాంతరములు.

భూమిని జలములు హరించుట, జలమును వాయువు హరించుట, వాయువును నగ్ని హరించుట జరుగును. ఘనపదార్థము ద్రవమగుననియు, ద్రవము వాయువగుననియును, వాయువు అగ్ని యగుననియును భావము. ఇక మిగిలియున్నది ఆకాశము. అందు మహర్లోక ముండును. దానికి దిగువ మూడు లోకములును పైన మూడు లోకములును గలవు. దిగువ మూడు లోకములను తనలో కలుపుకొనునపుడు ఆ లోకమందలి జీవులు దానిపై లోకములకు పోవుదురు. లోకమున పాంచ భౌతికమైన వస్తువేది దగ్ధమైనను వేడిమిగా వెలువడి వెలుగుగా మారును. దీనినే పైలోకమునకు బోవుట అందురు.

మన దేహమందుకూడ యిట్లే జరుగును. ఆహారము దగ్ధమై వేడిమి కారణముగా సప్తధాతుమయ శరీరముగా మారును. అందలి వేడిమి వలన మన ప్రాణము పోషింపబడును. అనగా వేడిమి ప్రాణముగా మారును. దాని నుండి ప్రజ్ఞ వ్యక్తమగును. ఇదియే మహర్లోకము నుండి జనలోకమునకు పోవుట. మనచే విడువబడిన దేహములకు గూడ నిట్టూర్ధ్వగతి కల్పించుటకే దేహమును దగ్ధము చేయుట.

ఇందు వర్ణింపబడిన ప్రళయము అనుదినము ఆహారాదుల పరిణామమున జరుగుచున్నది. దేహమువిడచునపుడు జరుగుచున్నది. ఆరోగ్యవంతుడు నిద్రించుచున్నప్పుడును జరుగుచున్నది. బ్రహ్మ నిద్రించుచున్నపుడు వాని దేహమందలి లోకములకును జరుగుచున్నది.

— [శ్రీ. భా. ప్ర. V. పే. 276-78]

## పంక్తిచ్ఛందస్సు

యజుర్వేద సంప్రదాయమున పంచపాదమును 5 అక్షరములు ఛందస్సు అనియు పంక్తిచ్ఛందస్సు అనియు వివరించిరి. (పాంక్తమ్ వా ఇదగ్ం సర్వమ్ – తైత్తరీయము) ఈ సృష్టి ప్రక్రియ మొత్తము 5 అధికరణములలో (ఆధారములైన 5 లోకములలో) గ్రంథమువలె సంహితగా చేయబడినది. (పంచస్వధికరణేషు - తై.) అనగా సృష్టిలో కూర్పు చేయబడినది. ఈ ఆధారములైదును ఈ దిగువవిధముగా వివరింపబడినవి.

1. అధిలోకము (Arrangement of Planes)
2. అధిజ్యౌతిషము (Arrangement of Lights)
3. అధివిద్యము (Arrangement of Utterance)
4. అధిప్రజము (Arrangement of Reproduction)
5. అధ్యాత్మము (Arrangement of the Vehicle of utterance)

ఇందు ఒక్కొక్కటి భూతసృష్టి ప్రణాళికకు ఆధారము. అందు ఒక్కొక్క దానిలో నాలుగంశములున్నవి.

1. పూర్వరూపము (Transmitting Principle)
2. ఉత్తరరూపము (Receiving Principle)
3. సంధి (Meeting Place)
4. సంధానము (Fitness)

— [సు. సూ. పే. 65]

## పంచకోశములు

భౌతిక దేహమంతయు ద్రవ్యమయము (Matter). ఈ ద్రవ్యము భూమియందలి ఖనిజములలో రసాయనిక పదార్థములతో ముఖ్యముగా నిండి యున్నది. వివిధ ద్రవ్యముల పరస్పర సంబంధమును పరిశీలించినచో, అది గుణాత్మకము (Properties), ప్రవృత్తిమయము (Behaviour) అని తెలును. ఈ గుణములు, ప్రవృత్తులు ద్రవ్యలోకమునకు కాక, శక్తిమయ లోకము (Plane of Force) నకు చెందినవి. మానవతత్త్వమునందు ద్రవ్యము, శక్తి, మనస్సు అను మూడును వేరువేరు లోకములకు సంబంధించినవి (Matter, Force and Mind). మనలోని ఇంద్రియ ప్రవృత్తులు శక్తిమయ లోకము. నకు సంబంధించినవి. కనుక ద్రవ్యముకన్న ఇవి పరములు (Higher). అనగా శక్తికి ద్రవ్యనిర్వహణ సామర్థ్యమున్నది. మనలోని ఇంద్రియ

ప్రవృత్తులకు దేహరక్షణ శిక్షణ సామర్థ్యమున్నది. ఇంద్రియముల కన్న మనస్సు పరమైనది. అనగా మనస్సునకు శక్తిని నిగ్రహించి నిర్వహింపగల సామర్థ్యమున్నది. కనుకనే భావనాబలముచే మానవుడు ప్రకృతిలోని శక్తులను నిగ్రహింప గలుగుచున్నాడు. అట్లే మనస్సు ఇంద్రియ ప్రవృత్తులను నిగ్రహింప గలిగియున్నది. యోగశాస్త్రద్రష్టలు ఈ మూడులోకములకు సంబంధించిన శరీరవిభాగములను అన్నమయ, ప్రాణమయ, మనోమయ కోశములని నిర్వచించిరి (Physical, Vital & Mental Sheaths). ద్రవ్యమయ దేహము భౌతికము గనుక అన్నమయకోశమని చెప్పబడినది. భౌతిక పదార్థమును స్వీకరించుట, విసర్జించుట, (Metabolic Activity) వలన అన్నమయము నిలబడుచున్నది. ఈ స్వీకరణ విసర్జనలు చేయునది ప్రాణమయ కోశము (Vital Body). కనుకనే ఇంద్రియ ప్రవృత్తుల వలన ఆహారవిహారాదులు అభ్యాసములుగా నిలబడుచున్నవి. మనస్సు శక్తికన్న పరమైనది. ఈ మూడు కోశములును సామాన్యముగా సకలప్రాణి వ్యాపారమును నడుపుచుండును.

మనస్సుకన్న పరమైనది బుద్ధి. ఇది కేవలము ప్రజ్ఞామయము (Pure Consciousness). దీనిచే మిగిలిన మూడు లోకములును నిర్వహింపబడవలెను. మంచిచెడ్డలు నిర్ణయించు సామర్థ్యము బుద్ధికి సంబంధించినది. అట్లే నియమించు సామర్థ్యముకూడా మనస్సునకు లేదు. మనస్సు కేవలము ఇంద్రియముల సహాయమున బాహ్యప్రపంచమును గుర్తించుట మాత్రము చేయును. గుర్తింపబడిన పరిసరములు, వ్యక్తులు మున్నగువానియెడల ప్రవర్తింపవలసిన విధానము నిర్ణయించుకొనునది బుద్ధియేగాని మనస్సుకాదు. మనస్సునకు ప్రాణశక్తి సాంగత్యమువలన ప్రయత్నము పుట్టును. ఈ ప్రయత్నము వలన బుద్ధితో సాంగత్యము కలుగవలెను. దీనిని కలిగించు క్రమశిక్షణయే యోగాభ్యాసము. ఇది జరిగినపుడు బుద్ధి మనస్సునందు వెలుగుగా ప్రసరించి, క్రమనిర్వహణము చేయుట ఆరంభించును. ఈ ఆరంభము వలన దేహము ఇంద్రియములు మనస్సు, బుద్ధితో కూర్పుచెందును. ఈ కూర్పు దారమునకు పూసలు గ్రుచ్చినట్లు ఏర్పడవలెను. ఈ దారము బుద్ధికికూడా లేదు. బుద్ధి ప్రజ్ఞామయమేగాని మిగిలిన వానికాధారము కాదు. కనుక బుద్ధికన్న పైన

ధారమైన ప్రజ్ఞ "ఉన్నాడు". దానినే "నేను" అని మనము వ్యవహరింతుము. ఈ "నేను" బుద్ధికన్న పరమైనది. ఈ "నాకు" పరమైనదేదియు లేదు. ఇది వెలుగుతో చేయబడిన దారము. కన్ను వేరుగా చూచినపుడు కనిపించు వెలుగు, సూర్యరశ్మి మొదలైన వెలుగు. దానినే మనసుతో చూచినపుడు భావనగా వెలుగును. బుద్ధితో చూచినపుడు జ్ఞానముగా వెలుగును. దానిపై నున్న దారమును గుర్తించినపుడు చూడబడునది యొకే వెలుగని తెలియును. ఈ వెలుగుయొక్క దారమే "నేను" అనబడు ప్రజ్ఞ. దానియందు పూసలు గ్రుచ్చినట్లు బుద్ధి, మనస్సు, ఇంద్రియ ప్రవృత్తులు కూర్చుచేయబడి దేహము నధిష్ఠించుటయే యోగము.

– [శం. రా. I. పే. 121-122]

## పంచప్రాణములు

వాయువులనగా పంచప్రాణములనబడు సంకోచ వ్యాకోచాత్మకము లైన స్పందనములు. ఇవి శ్వాసతో మిశితములై నిలబడును. వాయువును నియమము చేయుట యనగా పంచప్రాణములను క్రమబద్ధముగా నిలిపి వేయుట. ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానము అనునవి పంచప్రాణములు. వీనినే పంచవాయువులని కూడా అందురు. ఇవి స్పంద నాత్మకములై, సంకోచ వ్యాకోచ వ్యాపారములు కలిగియుండును. ఇందు మొదటి రెండును అనగా ప్రాణాపానములు మన ఉచ్ఛ్వాసనిశ్వాసములకు కారణములు. ప్రాణశక్తి వలన మనము శ్వాస పీల్చుటయు, అపాన శక్తి వలన విడుచుటయు జరుగుచున్నది. ఉచ్ఛ్వాస నిశ్వాసములు మనచే చేయించు నవిగాని, మనము చేయునవి కావు. అనగా కర్తృత్వము మన మనస్సునకు లేదు. ఐనను మనస్సును వానియందు పెట్టినపుడు కొంతవరకు మనము చేయుపనిగా వర్తించును. కొంతవరకనగా ప్రాణమునకు ముప్పువాటిల్లకుండు నంతవరకే. అంతకన్న నెక్కువకాలము మనము బంధింపదలచినచో నుక్కిరి బిక్కిరి యగును. దేహములోని ప్రాణశక్తిగాని, భౌతిక దేహముగాని, ఈ రెండింటికిని గల సంబంధము గాని, మనస్సునకు సంబంధించినది కాదు. మనపూర్వ కర్మకు సంబంధించినది. ఈ కర్మ జగత్కర్మనుంచి మనమనస్సు

మూటగట్టుకొనినది. జగత్కర్మ దైవమున కధీనము. ఇన్నిటితో మన మనస్సునకు గల సంబంధము, మనలో నడచుచున్న ప్రాణాపాన శక్తులతో ముడిపెట్టుకొని యున్నవి.

మనస్సును మన ఉచ్ఛ్వాస నిశ్వాసములపై నిలుపుట వలన మన ఉచ్ఛ్వాస నిశ్వాసములు క్రమబద్ధములగును. నిలుపనపుడు మన కోప తాపాదులకు, భయభ్రాంతులకు బెదరుచు, క్రమములేని పద్ధతిలో లయ తప్పి వర్తించుచుండును. దానివలన హృదయ స్పందనముగూడ లయ తప్పు చుండును. ఇది రోగమునకు, శోకానుభూతికి కారణమగును. ఇట్టి శోకాను భూతినుండి విమోచనము చెందదలచిన సాధకుడు మొదట మనసు నుచ్ఛ్వాస నిశ్వాసలపై నిలుపవలెను. అనగా నవియెట్లు జరుగుచున్నవో మనస్సుతో గమనింపవలెను. గమనించుచు ప్రశాంతముగా, ప్రసన్నముగా, మృదువుగా, మందగమనమున శ్వాసపీల్చుట, విడుచుట చేయవలెను. శుచియైన ప్రదేశమున గూర్చుండి అనుదినము నొకే సమయమునకు సాధకుడీ సాధన చేయవలెను. మరల మరల చేయుచుండుటను అభ్యాసమందురు. దీనివలన మనస్సు ప్రాణా పాన శక్తులతో సఖ్యము చేయును. కొంతకాలమునకు ఏకమగును. ఈ విధ ముగా వాయువులను నియమింపవలెను. మొదటి రెండువాయువులైన ప్రాణా పానములతోనే మనస్సుకు సంబంధము. మిగిలినవి మనస్సుతో ముడిపెట్టుకొన లేదు గనుక, వానినిగూర్చి చింతింప బనిలేదు. మనస్సు లయమగుచున్న కొలదియు మిగిలిన వాయువులుకూడ క్రమబద్ధములగును.

– [శ్రీ. భా. ప్ర. III. పే. 12-13]

## పంచభూతములు

ద్రవ్యము, పంచభూతాత్మకము. ద్రవ్యముయొక్క మొదటి స్థితిని "పృథ్వి" అంటారు. అనగా ఘనపదార్థము. రెండవది 'అపస్సు' అనగా ద్రవములు, జలములు. మూడవది 'తేజస్సు' లేక 'అగ్ని'. నాలుగవది వాయువు. ఐదవది ఆకాశము. ఆకాశమంటే చోటుకాదు. చోటులో నిహిత మైనదేదో అది. అగ్ని ద్రవ్యమేనా ?

ఈ ఐదింటిలో అగ్నికూడా ఒకటి. వేడి, వెలుతురు, విద్యుత్తు, అయస్కాంతశక్తి – ఈ నాలుగు దేని వ్యక్తస్వరూపాలో అది అగ్ని. ప్రాచీన శాస్త్రవేత్తలు అగ్ని అంటే నిప్పు, మంటకాదు అని నిర్వచించారు. మంట దేని వల్ల వస్తూవుందో అది అగ్ని. అగ్నిని గూర్చి, మంటను గూర్చి, వెలుతురును గూర్చిన విశేషాలు ప్రాచీన గ్రంథాల్లో మనం పరిశీలించవచ్చు. కానీ నవీన శాస్త్రంలో వీటికి నిర్వచనము లేదు. వివరణమూ లేదు. ప్రపంచంలో మహోన్నత శాస్త్రవేత్తకుకూడా వెలుగనేది ద్రవ్యమనిగాని, శక్తి అనిగాని, ఇంకేదైనా అనిగానీ ఇతమిత్థంగా తెలీదు. మానసిక మైనటువంటి వెలుతురు వుండి, దాని భౌతికరూపంలో చాక్షుషమైనటువంటి కాంతి ఇప్పుడు చూస్తోంది. మానసికమైన వెలుతురు వున్నదనే సంగతి నవీనశాస్త్రవేత్తలకు అందలేదు. జ్వాల్ కూల్ మహర్షి ఏలిస్. ఎ. బెయిలీకి చెప్పి వ్రాయించిన "A Treatise on Cosmic Fire" అను గ్రంథమునందు ఈ వివరము లన్నియు కలవు.

భౌతిక కక్ష్యలో చలనము, మానసిక కక్ష్యలో చలనము, భౌతిక కక్ష్యలో వెలుతురు లేక చాక్షుషమైన కాంతి, మానసిక కక్ష్యలో వెలుతురు - ఇలాంటివెన్నో నిగూఢవిషయాలు ఈ పుస్తకంలో విపులీకరించబడ్డాయి. వివరణమంతా అయిన తరువాత జ్వాల్‌కూల్ మహర్షి మనకొక సవాలు ఇట్లా విసిరాడు. 21వ శతాబ్దపు మూడవ విభాగము వచ్చేదాకా మీరు ఈ విషయము అవగాహన చేసికొనుటకై వేచియుండక తప్పదు. అప్పటికి ఈ గ్రంథము విద్యాలయాల్లో బోధనాంశముగా రూపొందుతుంది.

– [శ. ని. త. శా. పే. 4-5]

## పంచార చక్రము

ఈ పంచార చక్రమును సౌరకుటుంబమున ఇంద్రుడు, వాయువు, యముడు, అశ్వినులు అను దేవతలు పుట్టించిరి. వారు దానిని సూర్యుడను యజ్ఞగుండము నుండి పుట్టించి ప్రవర్తింప చేసిరి. దానియందు ఈ సృష్టిలోని లోకములన్నియును సమగ్రముగా పొదుగబడి అస్తిత్వము పొందియున్నవి. ఈ చక్రమునకు కేంద్రమున ఇరుసు కన్నమున్నది. అదియే అక్షము. ఇది

సూర్యునినుండి సమస్త లోకముల చివరివరకు కిరణపుంజముల రూపమున వర్తించుచున్నది. ఇది మిక్కిలి భారమైనదనగా సృష్టిజీవుల భారములన్నియు నిదియే మోయుచున్నది. భూరిభారము అనగా భూ+రి=పుట్టుకలను కలుగజేయునది. భారమనగా భరించునది. మరియు భా+ర=జ్యోతిని బహిర్గతము చేయు లక్షణము గలది. దీని ఇతిహాసము కనుకనే వ్యాసుడు చెప్పిన నరుని గేయగాథ అతని శిష్యులచే భారతమని పేర్కొనబడినది. భరతుడనురాజు సూర్యుని వెలుగులో భూగోళమందలి సప్తద్వీపములను నిర్మించి పరిపాలించెను. కనుక భా+రతము అనగా ఇది అంతయు కిరణముల క్రీడ అని అర్థము.

– [ను. సూ. 71-72]

## పంచార చక్రము - ఇతిహాసము

మనస్సు యముడనబడు తండ్రిగా, జ్ఞానేంద్రియములైదును వాని పుత్రులుగా నొక ఇతిహాసము వేద వాఙ్మయమున నున్నది. దానికి సంబంధించినదే ఈ అయిదంచుల చక్రము. ఆ పంచార చక్రమునకు సంబంధించిన ఇతిహాసమును ప్రత్యేకముగా మహాభారతమను పేర వ్యాసుడు వివరించెను.

అందు ఇంద్రియములలో నొక్కొక్కటి యొక్కొక్క దేవతవలన జన్మించును. శ్రవణము యమునివలనను, దృష్టి ఇంద్రునివలనను, వాసనచూచుట వాయువు వలనను, రుచియు, స్పర్శయు అశ్వినుల వలనను కలిగినవి.

అందు ఇంద్రియములు పనిచేయుచున్నపుడు వానిలోని మనస్సు మాయమగును. గనుక, పాండవుల జననము తరువాత పాండురాజు మరణించెనని చెప్పబడినది. ఈ అయిదుగురును ప్రయాణము చేసి తల్లియగు ప్రకృతి రక్షణమున ఋషుల మార్గదర్శకత్వమున రాజధానికి (ప్రజ్ఞా కేంద్రమునకు) చేరుకుందురు. అచట నేనను ప్రజ్ఞ మమకారమును పొరగా పనిచేయుచుండును. అతడు ధృతరాష్ట్రుడుగా చెప్పబడినది. జన్మముయొక్క ప్రణాళిక సమస్తమును తన రాష్ట్రముగా పట్టియుంచిన వాడని యర్థము. ఇతర వ్యక్తులను పరిసర ప్రపంచమును గమనించుచున్నప్పుడు గమనించు

వాడగు తాను అడ్డుపోరగా నిలబడి, తన యభిప్రాయములనే గమనించుకొని, అవి యితరుల స్వభావములనుకొని దుఃఖించుచుండును. గనుక నితడు గుడ్డి వాడని చెప్పబడినది. వానివలన ఇంద్రియశక్తులు బహిర్ముఖముగా చెదరగొట్ట బడును. ఇదియే పాండవులు ధృతరాష్ట్రునిచే వెడలగొట్టబడుట.

వెడలగొట్టబడిన బహిర్ముఖ ప్రవృత్తులు రాక్షసశక్తుల నెదుర్కొనును. బకాసుర, హిడింబ వధలు దీనిని సూచించును. అటుపైన వారు పాంచాల రాజ్యము చేరుదురు. ఇది అయిదింద్రియముల ప్రవృత్తులకును ఏకముఖము చేయించు సంకల్పము. ఈ సంకల్పశక్తియే ద్రౌపది. దానిని సాధించుటకే కనుబొమ్మలు ధనుస్సుగా స్వీకరించి, దానినడిమి మార్గమునందు దృష్టిని నిలిపి, ఇంద్రియ ప్రవృత్తులను అయిదు బాణములుగా గొని మత్స్యము లక్ష్యముగా ప్రయోగించి సిద్ధసంకల్పుడగును. రాశిచక్రమున మీనరాశిచే సూచింపబడు మూడవకన్ను మనశిరస్సున భ్రూమధ్యమునకు లోపలనుండును. అదియే మత్స్యము.

అటుపైన యజ్ఞవేదికయందుద్భవించిన కృష్ణయను సంకల్పశక్తిని వివాహమాడుదురు. ఆ సందర్భమున మొట్టమొదటగా వారికి శ్రీకృష్ణదర్శ నము కలుగును. అనగా హృదయస్థుడగు పురుషుడు సాక్షాత్కరించును. అతని సంకల్పమున అయిదుగురి రాజ్యము గుడ్డివాని నుండి రెండుగా పంచ బడి యొకభాగము తమదియగును. ఇదియే మంచిచెడ్డలను తెలియుట, మంచిని స్వీకరించుట. దీనినే వివేకమందురు.

అటుపైన ఇంద్రప్రస్థము వారి రాజధానిగా నిర్మింపబడును. శిరస్సు నందలి ఇంద్రగ్రంథి సకల సంకల్పములకు కేంద్రమగును. దానితో కర్మ ఫలములు దగ్ధమగును. అదియే ఖాండవదహనము. జ్యోతిర్మయమగు అంతః కరణ శరీరము ఇంద్రగ్రంథి సమీపమునకు నిర్మించుకొని రాబడును. అదియే మయసభ. అపుడు ఇంద్రియములు, ఇంద్రియార్థములు, ప్రాణప్రవృ త్తులు మున్నగువానిపై సంపూర్ణాధికారము సిద్ధించును. ఇదే రాజసూయము.

ఇన్నిటికి పరమావధిగా శరీరమనబడు రథమున ఈశ్వరుడు సారథిగా నిర్వహించుచు పరమోపదేశము చేయుచుండును. ఇదియే గీతోపదేశము.

ఇట్టి జీవితముతో జయము సంపూర్ణమగును. జయమను పేర రచింపబడిన ఈ కథనము మొదట యజ్ఞస్వరూపమైన నాటకముగా వ్యాసుడు రచించెను. అతని శిష్యులు శ్రావ్యమైన ఇతిహాసముగా వ్యాఖ్యానించి, విస్తృతి జేసిరి.

– [సు. సూ. పే. 69-71]

## పంచార ముద్ర

నరుడు రెండుపాదము లెడముగా నుంచి, నిలబడి, చేతుల నడ్డముగా బారచాపగా వాని యాకారమును ఈ చక్రము తెలియజేయును. శిరస్సు, 2 చేతులు, 2 పాదములు ఇందలి అయిదంచులలో న్యాసము చేయవలెను. లగ్నము శిరస్సుగా స్వీకరించి దాని కటునిటుగల రెండు కోణములు కుడి ఎడమ చేతులుగా (తృతీయభావము కుడిచెయ్యి, ఏకాదశము ఎడమచెయ్యి) మిగిలిన రెండు కోణములును రెండు పాదములను తెలియజేయును. (షష్ఠము కుడిపాదముగను, నవమము ఎడమ పాదముగను స్వీకరింపవలెను.) దీనియందలి గ్రహస్థితినిబట్టి శిరస్సు, హస్తములు, పాదములు అనుభవించు పుష్టిని, కృశత్వమును, ఆరోగ్యమును, అనారోగ్యమును, అనారోగ్యాదుల కాలములను తెలియజేయును.

పై చెప్పబడిన విధమున నిలబడినచో దానిని పంచారముద్ర అందురు. తూర్పుదిక్కుగా తిరిగి ఈ ముద్రలో నిలబడి ధ్యానము, ప్రార్థనము, ప్రాణాయామము మున్నగువాని నాచరించినచో పంచేంద్రియముల సూక్ష్మముల ములు ప్రాణమయకోశ మందలి అయిదంచుల నుండి బహిష్కరించబడును. ఆకాశమందలి ప్రాణము ఈ కోణములనుండి ప్రవేశించి, ఆరోగ్యము, తుష్టి, పుష్టి కలుగజేయును. మరియు ఈ ముద్రలో నిలబడి వంగి లేచుచు కుడిచేతి వ్రేళ్ళతో ఎడమకాలి బొటనవ్రేలును, ఎడమచేతి వ్రేళ్ళతో కుడికాలి బొటన వ్రేలును స్పృశించుట నభ్యసించినచో మనస్సు, బుద్ధి శాళనమై, ప్రసన్నమై సామర్థ్యము పెరిగి, ఇంద్రియముల చురుకుదనము పెరుగును. ఇతరుల మనస్సు అర్థమగును. మనస్సును నియమించుట చేతనగును.

– [సు. సూ, పే. 68-69]

## ప్రాచీన బర్హి

జీవులకు భూమిపై ప్రాంతీయములైన తూర్పుపడమర లేర్పరచి సూర్యోదయము, సూర్యాస్తమయములను నిర్ణయించిన సూర్యుడే "మనకు కనిపించు సూర్యుడు" లేక "అసావాదిత్యుడు" అని వేదములు చెప్పుచున్నవి. అసలు సూర్యుడు వేరు, భూమిపైనున్న జీవులు చూచునట్టి సూర్యుడు వేరు. అసలు సూర్యుడు కంటికి కనిపించక చూచువాని రూపమున అంతర్యామియై యుండును. వానినే "ఆత్మస్వరూపుడైన సూర్యుడు" అని వేదములు చెప్పుచున్నవి. కంటికి సూర్యుడు చాక్షుషమైన ప్రతిబింబము మాత్రమే. అసలు సూర్యుడు ఆదిత్యలోకమున తెలివిగా వెలుగుచుండును. మనలో గూడ తెలివియు, అర్థమగుటయు అతని వెలుగే. కంటికి కనిపించు సూర్యుడు రుద్రలోకమున వర్తించుచుండును. ఇతనిని భాగవతమున ప్రాచీన బర్హి లేక బర్హిష్మదుడు అని వ్యాసుడు వర్ణించెను.

– [శ్రీ. భా. ప్ర. II. పే. 31]

## ప్రాణాపానములు

జీవించుచుండుట వలన శ్వాస జరుగుచున్నది అనుట సత్యముగాని, శ్వాసవలన జీవించుచున్నామనుట సత్యముకాదు. ప్రాణశక్తి శ్వాసప్రక్రియను నడుపుచున్నది. దానికి అట్లు నడుపుటకు ప్రకృతిలో పనిచేయుచున్న ఇతర శరీరములకు సంబంధించిన వేరొక మనస్సు కలదు. అనగా ఎంతశ్వాస ఎన్నెన్నిమార్లు పీల్పించి విడిపించవలెను, ప్రాణవాయువు నెట్లు పీల్పించి బొగ్గుపులుసు వాయువు మున్నగు విషవాయువులను ఎట్లు విడిపించవలెను మున్నగు విజ్ఞానశాస్త్రమంతయు దీనిలో నిమిడియుండును.

ఉచ్ఛ్వాస నిశ్వాసములొక చక్కని యజ్ఞము. మనచే శ్వాస పీల్పించు శక్తిని ప్రాణమనియు, వదలించుశక్తిని అపానమనియు శాస్త్రజ్ఞులు వ్యవహరింతురు. యోగమార్గమున అనుష్ఠానము చేయువాడు శ్వాసనొక హోమద్రవ్యముగా ధ్యానము చేయును. ప్రాణశక్తి హోమము చేయువాడుగా ధ్యానింపబడును. ఉచ్ఛ్వాసమును నిశ్వాసమను అగ్నిహోత్రము నందును, నిశ్వాసమును ఉచ్ఛ్వాసమను అగ్నిహోత్రమునందును అతడు నిరంతరము

చేయుచుండును. దీనివలన ప్రాణాపానములకు సామ్యమేర్పడి ప్రవృత్తు లన్నియు సమానముగా నిలబడును. పరుగెత్తినపుడు, రాగద్వేషాదులు కలిగి నపుడు మున్నగు సమయములలో సామ్యము చెడుటవలన ప్రాణాపానములు సమానముగ నుండవు. దానినే ఆయాసపడుట యందుము. మనస్సును ఉచ్ఛ్వాస నిశ్వాసములతో జతపరిచి సామ్యమును సాధించుట ప్రాణాయామ మనబడును. యోగాభ్యాసము చేయుచున్నవాడీ విధముగా ప్రాణాపానము లతో సమానమను యజ్ఞము సాధించును.

– [శంఖారావము I. పే. 151-152]

## బర్హిర్ముఖులు

ప్రజాసర్గమునకై పనిచేయు దేవగణములే బర్హిర్ముఖులనబడువారు. వీరు పితృదేవతలలో నొక తెగవారు. వీరు సృష్టించుచున్న మనస్సను తెర, టార్చిలైటులో నుండి పడుచున్న వెలుగువంటిది. దానికి స్వతంత్రమైన అస్తిత్వముగాని, మారని స్థితిగాని యుండదు. కాని ఒక చేతనవంతమైన అస్తిత్వము (Dynamic Equilibrium) వున్నది. కాగా ఇన్నిటి ఫలితమే మనస్సుగాని అదియొక స్వతంత్రమైన వ్యక్తిత్వముకాదు. దానిపై పడుచున్న బొమ్మలే సుఖదుఃఖాది సన్నివేశములు.

– [శ్రీ. భా. ప్ర. XIII. పే. 31]

## బర్హిస్సు

బర్హిస్సులను పదమునకు కిరణములనియు, దర్భలనియు అర్థము. సూర్యకిరణములే ఆత్మలుగా దిగివచ్చి, పాంచభౌతిక శరీరములను ధరించి మనువు రాజ్యమున మానవులగుటయే యిందలి యజ్ఞము. అట్టి సూర్యకిర ణాంశమైన ఆత్మయే దేహధారుల మనస్సులను, ఇంద్రియములను ఆశ్రయిం చిన అసుర గుణములను పోగొట్టును. ఇట్టి పవిత్రలక్షణము దర్భలయందును, రెల్లు పొదలయందును అవి పెరిగిన ప్రదేశమునందును వ్యక్తమగును. కనుక దర్భలను పవిత్రమైన శత్రునాశక సాధనములుగ మనువు కల్పించి మానవుల కొసగెను. వేదమంత్రములతో దర్భలను చల్లిన ప్రదేశములును, పదార్థము

లును మానవులలోని అసురగుణములను పోగొట్టి సంకల్పశక్తిని వృద్ధి చేయును. (18వ శతాబ్దమున గూడ పిలకలవారు పచ్చని బియ్యము గాలిలో చల్లి పిడుగులు పుట్టించిరని, గడ్డిపరకల నుపయోగించిరని అంగ్లసైనికులు వ్రాసిరి.)

– [శ్రీ. భా. ప్ర. VI. పే. 123-124]

## బష్కయము

బష్కయము అనగా సంవత్సరము వయసుగల దూడ. "బః+క= సత్యమను సూర్యరశ్మి రూపమున సృష్టిగా పిండునది లేక సంవత్సరము" అని అర్థము.

– [స. సూ. పే. 06]

## బాహువులు (బాహుభ్యాః)

బాహువులనగా ఒక కోణమందు రెండుప్రక్కల నుండు సరళరేఖలు. ఆకాశమున తూర్పునుండి పడమరకు సూర్యుడు ప్రొద్దుచూపుచు తిరుగు మార్గము రుద్రుని ధనస్సుగా ప్రశంసింపబడినది. రుద్రుడు కాలస్వరూపుడు. సూర్యోదయమున అరుణవర్ణుడు, సూర్యాస్తమయమున తామ్రవర్ణుడుగా అతడు వ్యక్తమగును. మననుండి తూర్పును గమనించుటకు ప్రసరించు దృష్టి బాహువుగా వర్ణింపబడినది. ఈ నడుమ సూర్యుని గమనముచే కాలము మన జీవితముగా కొలువబడును. ఈ ధనస్సు జననమరణముల రూపమున వయస్సు, వ్యాధి, కర్మఫలములు, ముసలితనము, ముసనగువాని రూపమున భయము కలిగించుచున్నను, రుద్రుని ధ్యానించువారికి కామక్రోధాది శత్రువుల నాశనము కలిగించి మనలను శాశ్వతస్వరూపులైన రుద్రమూర్తులుగా దర్శింపజేయును.

– [రు. సూ. పే. 34]

## బిల స్వర్గములు

భూమిపైపొరకు దిగువుగా భూగర్భము వరకును వరుసగా ఏడులోకములు వర్ణింపబడినవి. అవి : అతలము, వితలము, సుతలము, రసాతలము, తలాతలము, మహాతలము, పాతాళము అనబడునవి. అందు ఖనిజాదులలో గల ప్రాంతీయ సమాహార చైతన్యములే ఈ లోకముల జీవులుగా వర్తించుచుండునని చెప్పబడినది. ఈ చైతన్యములు మహాశక్తివంతములు (వీనినే దివ్యజ్ఞాన శాస్త్రకారులు 'ఎలిమెంటల్స్' అని పేర్కొనిరి). వీరికి వేరుగా దేహములుండవు. ఖనిజములలో చైతన్యము, గ్రహణశక్తి, సుఖదుఃఖానుభూతి ఎట్లుండునని సందేహము కలుగవచ్చును. మనదేహములలో నున్నవి ఖనిజాదులే కదా ! ఖనిజాదులతో చేయబడిన పాంచభౌతిక దేహమునగల అణువుల రసాయనిక ధర్మములనగానేమో నవీనులు గమనించుటకు నిదానించుట లేదు. నిదానించినచో, పైథాగరస్ చెప్పినట్లు రసాయనిక ధర్మములన్నియు సచేతనములేగాని అచేతనములు కావని తెలియును. దానికి ప్రజ్ఞ వున్నది. వాని ప్రజ్ఞకును, మన ప్రజ్ఞకును నడుమ వాడవలసిన భాష మనమింకను నేర్చుకొనలేదు.

ఇట్టి కక్ష్యలెన్నో దాటి, వైఖరీ మధ్యమా వాక్కులయెడ మనకుగల అజ్ఞానము దాటి పశ్యంతీ వాక్కు (Concept devoid of Vocal and Mental Sentence) బోధపరచుకొన కలిగినపుడు మాత్రమే అధోలోక జీవులతో మైత్రిచేయగల ఋషులదృష్టి మనకందును. ఆ దృష్టితో జీవ చైతన్యమును గమనించి చెప్పిన కథలే ఈ అధోలోక వృత్తాంతములు.

ఈ అధోలోక జీవుల ప్రభావమే అప్పుడప్పుడు భూలోకజీవుల మనస్సులపై కామక్రోధాధికమైన ఆకాశానుభవముగా అనుభవించబడునని చెప్పబడినది. మణిపూరక చక్రమునకు దిగువ మూలాధారము క్రిందివరకును ఈ అధోలోకముల చైతన్యములు మనలో పనిచేయును. ఇంద్రియలోలత, అన్నపానీయాదుల యెడల చాంచల్యము, వ్యభిచారబుద్ధి మున్నగు విచిత్రములన్నియు ఈ అధోలోక జీవుల మాయవలననే మనపై ప్రసరించుచుండును.

– [శ్రీ. భా. ప్ర. XIII. పే. 29-30]

## బుద్ధియోగము

కర్మాచరణమున కెప్పుడును బుద్ధితో యోగము ఆవశ్యకము. బుద్ధి నుండి కర్మ యెప్పుడును వేరుచేయబడరాదు. మనస్సు, ఇంద్రియములు కలిసి యొక గోడవలె బుద్ధినుండి కర్మను వేరు చేయుచుండును. అప్పుడు ఎడనెడ కలుగుచుండు ఫలాసక్తి దీనత్వము కలిగించుచుండును. బుద్ధిమంతుడు నిరంతరము బుద్ధినే శరణము పొందవలెను. బుద్ధినుండియే దైవము కర్తవ్యమును నిరంతరము బోధించుచుండును. బుద్ధియోగము గలవానికి కర్తవ్యాకర్తవ్య వివేచనమునకై శాస్త్రపరిశీలనా క్లేశము అనావశ్యకము. బుద్ధియోగము చేసినవాడు అప్రయత్నముగనే కర్మఫలితములను విడిచిపెట్టుచున్నాడు. ఈ మార్గమున కర్మాచరణమునందు అప్రయత్నమైన నేర్పరితనముకూడ నిరంతర విజయమునకు దారితీయును. సర్వకర్మలయందు ఏర్పడిన యీ నేర్పరితనమే యోగమనవచ్చును. యోగులనగా బుద్ధిమంతులని యర్థము. వారికికల ఫల బంధచ్ఛేదము కలుగుటతో జన్మబంధమునుండి కూడ విమోచనము కలుగును. రైలుబండిలో దూరప్రయాణము చేయువాడు సద్గ్రంథ పఠనమో, తోటి ప్రయాణీకులతో చతుర సంభాషణమో చేయ ప్రారంభించిన ప్రయాణము జరుగుట తెలియదు. అట్టి ప్రయాణము ఒక బంధముకాదు. అట్లే యోగికి కూడ జన్మ బంధము కాదు.

— [శం. రా. I. పే. 42-43]

## బృహత్సామ - రథంతరీసామ

సామవేదమునందు గానముచేయు సామలనేకములున్నవి. అందు రెండే ప్రాముఖ్యము వహించును. ఒకటి బృహత్సామ, రెండవది రథంతరీసామ. అందు రథంతరీసామతో మిట్టమధ్యాహ్నము పెద్దగొంతుతో గానము చేయుదురు. బృహత్సామతో అర్ధరాత్రమున మంద్ర కంఠధ్వనితో గానము చేయుదురు. ఇవికాక సూర్యోదయ సూర్యాస్తమయములందు చేయువానిని సవనము లందురు.

మిట్టమధ్యాహ్న కాలమునే రథంతరీసామ యనుట యిందలి రహస్యము. రథమును తరణము చేయించునది యని యర్థము. సూర్యుడు తూర్పునుండి ఆరోహణము చేసి, పడమటి కవరోహణము చేయబోవుటకు దాటునట్టి ప్రదేశము. ఇది కొంచెగా కొన్ని తావులందు వర్ణింపబడినది. ప్రతి దినము దేవతలందరును దీని నారోహించి అధిరోహణము చేయుచున్నారు. మనలో ఉచ్ఛ్వాస నిశ్వాసలు సామవేదము. వైఖరీవాక్కు నుచ్చరించుటకై నిశ్వాస మారంభించు కాలము సూర్యోదయము. అందు ఋక్కుగా అర్కుడుదయించును. ఈ కంఠధ్వని తారస్థాయి నందుకొను ప్రయత్నము రథంతరీసామ. ఇది మిట్టమధ్యాహ్నముతో సమానము. రథంతరమునందు సూర్యుని పరికించెననగా పెద్దగా మంత్రము నుచ్చరించి, తన కంఠధ్వని తానే విని, అందు సూర్యుడున్నాడని ఉపాసించెను. దీనినే ఉద్గీథ విద్య యందురు.

– [సు. సూ. పే. 117-118]

## బ్రహ్మముఖములు - వేదములు - విద్యలు

1) ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అధర్వణవేదము అనునవి నాలుగు వేదములు. ఈ నాలుగును బ్రహ్మముఖములలో వరుసగా తూర్పు, దక్షిణము, పశ్చిమము, ఉత్తరము అను ముఖములనుండి పుట్టినవి.

2) యజ్ఞమునందు హోత యనువాడు వినియోగించునట్టి శస్త్రములనబడు మంత్రములు తూర్పుముఖము నుండి పుట్టెను. ఇవి స్తోత్రరూపములు. వీనియందు గీతధర్మము లేదు. (అనగా పాడుటకు పనికివచ్చునవి కాక కేవలముచ్చరించుటకు పనికివచ్చునవి. The birth of non musical or intentional expression. శస్త్రములనగా శంసనము చేయునవి. శంసనము అనగా ప్రశంస).

3) అధ్వర్యుడను వాడుపయోగించు ఇజ్యమనబడు విధానము, స్తుతియనబడు వేదము దక్షిణ ముఖమునుండి పుట్టినవి. అవి సంప్రగీతము,

స్తోత్రము అనబడు రూపములతో గూడినది. [ఇజ్య యనగా యజ్ఞము చేయు విధానము తెలుపునది. సంప్రగీతమనగా సంగీతరూపమున నున్నది. ఇందలి మంత్రములు గీతరూపములు, గద్యరూపములు కలసి యుండునని యర్థము. దీనినే యజుర్వేదమందురు.]

4) ఉద్గాత యనువాడు వినియోగించు స్తోమములు పశ్చిమ ముఖమున పుట్టినవి. ఇవి ఋక్కుల సముదాయముయొక్క రూపమే. [ఉద్గాత యనగా పైకి గానము చేయువాడు. స్తోమములనగా పాడదగిన యొక విధమైన స్తోత్రములు. ఋక్కులే పాటలుగా పాడబడునవని యర్థము. వీనినే సామలందురు].

5) ప్రాయశ్చిత్తమను కర్మకాండ బ్రహ్మ యనబడువాడు చేయునది. ఇది ఉత్తరముఖమున పుట్టినది.

6) ఆయుర్వేదము పూర్వముఖమున బుట్టినది.

7) గాంధర్వవేదము దక్షిణముఖమున బుట్టినది.

8) ధనుర్వేదము పశ్చిమముఖమున పుట్టినది.

9) విశ్వకర్మ నిర్మించిన స్థాపత్య మనబడునది ఉత్తరమున బుట్టినది.

[బ్రహ్మమనగా యజ్ఞమునందు ముఖ్యుడంటివాడు. ఇతడు మాటాడ కయే మౌనముగా కూర్చుండి, మిగిలినవారి మనస్సులలో పనిచేసి తప్పులను దిద్ది ప్రాయశ్చిత్త మనబడు విధానము నుపదేశించును. విశ్వకర్మ యనగా సృష్టియందలి ఆకారములకు సంబంధించిన దేవత. ఇతనినే దేవశిల్పి యందురు. ఇతడు స్థాపత్యమను శాస్త్రమును నిర్మించును. స్థాపత్యమనగా గృహనిర్మాణము, దేవాలయ నిర్మాణము, యజ్ఞశాలా నిర్మాణము, గోపురములు, మేడలు, గోడలు, ద్వారబంధములు, మున్నగునవి నిర్మించు విధానము, దేవతాప్రతిష్ఠ తెలుపునట్టి శాస్త్రము. మొదటి దేహనిర్మాణముగా నీవిద్య పుట్టెను. యజ్ఞము చేయువారిని ఋత్విక్కులందురు. అందు నలుగురు ప్రాముఖ్యము వహింతురు. వారిని హోత, అధ్వర్యువు, ఉద్గాత, బ్రహ్మ యందురు.

ఆయుర్వేదము, ధనుర్వేదము, గాంధర్వ వేదములను ఉపవేదము లందురు. అనగా వేదములనుండి పుట్టినవి. (కొందరు అశ్వవేదము, స్థాపత్యముగూడ ఉపవేదము లందురు.)

ధనుర్వేదమనగా ధనుర్విద్య నుపదేశించునది. ఆయుర్వేదమనగా ఆయువును, ఆరోగ్యమును, బలమును కాపాడుకొను విధానము నుపదేశించు నది. గాంధర్వ వేదమనగా సంగీతశాస్త్రము నుద్దేశించునది.

ఇతిహాసములు, పురాణములును బ్రహ్మముఖములు నాలుగింటియందును పుట్టెను. (ఇతిహాస పురాణములు సకలవేదముల సమన్వయ రూపమని యర్థము. ఇది వేద వాఙ్మయమైన ఆరణ్యకములు, బ్రాహ్మణములు, ఉప నిషత్తులు ననువానియందు అనేకసంఖ్యలో నున్నవి. వానినుండి పదునెనిమిది పురాణములను ముఖ్యముగా వేరుచేసి, పరాశరుడును, వేదవ్యాసుడును లోకమున కిచ్చిరి. ఇతిహాసము : ఇతి+హ+అస=ఈ విధముగా జరిగెనని నిదర్శనపూర్వకముగా ధర్మాధర్మములను వివరించి చెప్పు గ్రంథములు. జరిగిన కథను ఆధారము జేసికొని ధర్మము నుపదేశించునవి. ఇవికూడ పూర్వ వాఙ్మయమున కొన్ని వందలున్నవి. మనకు ముఖ్యమైన ఇతిహాస ములు రెండు 1) వాల్మీకి రచించిన రామాయణము. 2) వ్యాసుడు రచించిన మహాభారతము].

ఇంకను చతుర్ముఖుని నాలుగు ముఖములనుండి యుద్భవించిన సంప్రదాయములు అనేకములు గలవు. అందు కొన్ని కర్మ తంత్రములు. అనగా వేదోక్తములయిన కర్మలను సృష్టి తంత్రముతో సమన్వయించి అల్లిక చేయబడినది. అవి ఈ దిగువ విధములుగా నుండును :—

1. షోడశి : పదునారు తిథులయందలి విధానము.

2. ఉక్థ్రము : వాక్కును ఆహారముగా దేవతలు తయారుచేయు విధానము.

3. యజనము : పూజించు యజ్ఞములు చేయు విధానము.

4. అగ్నిష్టోమము : అగ్నిహోత్రము వివరించి చరించు విధానము.

5. అప్తోర్యామములు : దినమును యామములుగా విభజించి యందలి క్రమముల నేర్పరచుకొనుట.

6. అతిరాత్రము : రాత్రి గడుపునట్టి క్రతువిధానం. దీనినే శివరాత్రి మున్నగు జాగరణముల వ్రతములుగా కొందరాచరించు చున్నారు.

7. వాజపేయము : అన్నపానీయములకు సంబంధించిన దేవతల శాస్త్ర విధానము.

8. గోసవము : దీనినే గోయజ్ఞము, గవామయన మందురు. దీనివలన గోవులను పూజించుటయే గాక జ్యోతిశ్శాస్త్ర సిద్ధాంతము తెలియుట గూడ విజ్ఞానముగా కూర్చబడినది.

ఇవిగాక ధర్మపాదములనబడు సంప్రదాయములుగూడ బ్రహ్మ నాలుగు ముఖములనుండి పుట్టినవి. (ధర్మపాదములనగా ధర్మము మానవులలో చరించుటకు విధానములని యర్థము. అవి సామాన్యముగా నాలుగేసి యొక్కొక్క గుంపుగా నుండును. పాదమనగా నాలుగవవంతు గనుక అందు నొక్కొక్కదానిలో ధర్మాచరణము నాలుగవవంతు సిద్ధించును.)

అవి ఈ దిగువ విధములుగా నున్నవి. 1) విద్య నేర్చుకొనుట 2) దానము చేయుట 3) తపస్సు చేయుట 4) సత్యము పలుకుట. ఈ నాలుగు నొకగణము. అట్లే బ్రహ్మచర్యము, గృహస్థము, వానప్రస్థము, సన్యాసము అనునవి నాలుగాశ్రమముల గుంపు. వీనిలో ఒక్కొక్కటి ఒక్కొక్క వయస్సున నవలంబింపబడినవి. ఒక్కొక్క యాశ్రమ మవలంబించుచున్న ప్పుడు ఒక్కొక్కవిధమైన ప్రవర్తనము నవలంబించవలెను. ఆ ప్రవర్తనములు గూడ బ్రహ్మ నాలుగుముఖములనుండి పుట్టినవి. అందు బ్రహ్మచర్యమునందు ఆచరించు విధానము సావిత్రమందురు. సావిత్రమనగా సవిత లేక సూర్యు నారాధించు విధానము. అది యుపనయనముతో ప్రారంభమగును. ఉప నయనము జరిగిన నాటినుండి మూడుదినములు వరుసగా గాయత్రి జపించు వ్రతమొకటి యున్నది. దానిని ప్రాజాపత్యమందురు.

వేదమునందు నాలుగు వ్రతములు చెప్పబడినవి. ఒక్కొక్క వ్రతము ఒక్కొక్క సంవత్సరము చొప్పున నాచరింపవలెను. దీని నాచరించువారు వ్రతులందురు. వానిలో బ్రాహ్మము అనబడు వ్రతమును వేదమును నేర్చుట పూర్తియగు వరకును ఆచరించవలెను. ఇదిగాక బృహత్తు అను వ్రతము, నైష్ఠికమను వ్రతము కలవు. వానినిగూడ బ్రహ్మచర్యాశ్రమము వారే ఆచరింపవలెను.

బ్రహ్మచారులకు నాలుగు వృత్తులు చెప్పబడినవి. అందు భూమిని దున్నునట్టి వృత్తి యేయాశ్రమము వారికిని, ఎవ్వరికిని, నిషేధము కాదు దానిని వార్త యందురు. దీనిని కొందరు బ్రహ్మచారు లాచరింతురు. మరి కొందరు భిక్షాటనవృత్తి నవలంబింతురు. అందు యాచించిన వస్తువులను, ధనమును యజ్ఞము లాచరించుటకు వినియోగింతురు. అనగా ఫలితముగోరక చేయు మంచిపనుల కుపయోగింతురు. ఇకమూడవది శిలోంఛనమనబడు వృత్తి. ఇందు బ్రహ్మచారులు యాచనచేయక పొలములలో రాలిపడిన శాలిధాన్యము కంకులు తెచ్చుకొని రాళ్ళతో నలిపి బియ్యము మున్నగువానిని బాగుచేసికొని వానితో జీవింతురు.

ఇక గృహస్థుల వృత్తులు నాలుగు. అవి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యా శూద్ర వృత్తులు. ఇక వానప్రస్థులలో వైఖానసులు అను దీక్షావంతులు మరి కొందరు గలరు. వీరు భూమి త్రవ్వుకొని యందు లభించిన దుంపలు మొదలగువానిని తిందురు. వాలఖిల్యులని మరియొక దీక్షవారుగలరు. వీరు క్రొత్త పంట వచ్చినపుడెల్ల పూర్వము మిగిలియున్న దానిని పంచిపెట్టెదరు. ఔదంబరులని మరియొకజాతివారు గలరు. వారు ఉదయమున నిద్రలేచి మొట్ట మొదట నేదిక్కును చూచెదరో ఆ దిక్కునకు పోయి అచట అయాచితముగా లభించు పదార్థములను భుజించి జీవింతురు.

ఇక ఫేనపులు యనబడు జాతివారు కలరు. వారు అప్రయత్నముగా చెట్లపైకాచి పండిన పండ్లను, రాలినవానిని స్వీకరించి భుజింతురు. వైఖానసులు, వాలఖిల్యులు, ఔదంబరులు, ఫేనపులు అను నాలుగు తెగలవారును వానప్రస్థాశ్రమమునకు చెందినవారు.

ఇక నాలుగు విధములయిన వృత్తులతో కూడిన సన్యాసులున్నారు. అనగా సన్యాసాశ్రమమునకు చెందినవారు.

1) కుటీచకుడు : తన సన్యాసాశ్రమమునందు చెప్పబడిన కర్మల నాచరించువాడు. ఇతనికొక కుటీరము, కాషాయములు, దండము, కమండలువు మున్నగు సాధనములుండును. జపము, నిష్ఠయుండును.

2) బహూదకుడు : ఇతడు సమస్త కర్మలను విడచి జ్ఞానమే ప్రధానముగా చరించుచుండును.

3) హంసుడు : ఇతడు కేవలము జ్ఞాన మభ్యసించుట యందు నిష్ఠ కలిగియుండును. ఇతనికి స్నానాదులతో గూడ నిమిత్తము లేదందురు.

4) నిష్క్రియుడు : ఇతడు పరబ్రహ్మ తత్త్వమునందు సమాధిస్థితి పొందినవాడు. ఇత డేపనిని ఆచరింపడు. దేహముతో కొన్ని మంచి పనులు జరిగినను ఇతనికంటవు.

మానవులందరికి సామాన్యములయిన నాలుగువిద్యలు వేరుగా సాధింపబడుచున్నవి.

1) అన్వీక్షకి : ఇది విద్యా స్వరూపము. ఇందు ఆత్మ, ఆత్మకానిది యనువాని వివేక మభ్యసింపబడును. అనగా నామము, రూపము, సంబంధము ఆత్మకాదనియు వీని యందంతర్యామి యొక్కటే ఆత్మ యనియు, అదియే నిత్యమనియు, మిగిలినవి అనిత్యమనియు నీ విద్య బోధించును.

2) త్రయీ విద్య : ఇందు వేదములయందు చెప్పబడిన కర్మలాచరించి స్వర్గము మొదలగు ఫలములను పొందునట్టి విధానము చెప్పబడును.

3) వార్త : వార్తయనగా జీవనోపాధికి చేయువృత్తియని అర్థము. భూమిదున్నుట మొదలగు ఏ వృత్తినైన నభ్యసించుట యిందు చెప్పబడును.

4) దండనీతి : ఇందు పౌరజనులెట్లు ప్రవర్తింపవలెనో, తమ ప్రయోజనములను సాధించుకొని ధనము మున్నగు ఆదాయము నెట్లువసూలు చేసికొనవలెనో తెలియును. మరియు నీ మార్గములలో క్రమముదప్పి అన్యాయముగా ప్రవర్తించువానిని దండించు విధానముగూడ చెప్ప

బడును. ఇవియన్నియు బ్రహ్మముఖమునుండి నాలుగు నాలుగుగా పుట్టిన విద్యలు.

ఇక ధర్మార్థకామ మోక్షములనబడు నాలుగు జీవన సాధనములున్నవి. అందు ధర్మము నాచరించుట, దానికొరకై అర్థము నార్జించుట, శరీరము నిలుపుటకొరకై కామములను పొందుట యను సమన్వయముతో జీవితసాధన చేసి మోక్షము పొందుట యున్నది. దీనికొరకు కావలసిన విద్యను న్యాయ విద్య యందురు. అదికూడ నాలుగు విధములుగా నున్నది. దీనిని సాధించి ధర్మముకొరకై అర్థకామములను సేవించుట, ధర్మోత్తరముగా జీవించుట యందురు. అట్లుగాక యర్థము కొరకో, కామము కొరకో, ధర్మము నాచరించి నచో క్రమము దెబ్బతిని జీవుడు కష్టముల పాలగును.

ఇవిగాక బ్రహ్మముఖమునుండి ఉద్భవించిన వ్యాహృతులు మూడు కలవు. వ్యాహృతులనగా ఉచ్చారణలు. వీనినే భూః, భువః, సువః అందురు. అందు బ్రహ్మ మొదటి దానివలన భూలోకము (Material Creation), భువః అను వ్యాహృతి వలన అంతరిక్షము (Creation of Power), సువః అను వ్యాహృతితో స్వర్లోకము (Creation of Light or Consciousness) ఉచ్చరించెను. ఈ ఉచ్చారణతో సమస్త సృష్టిని చతుర్ముఖుడు, తన వాక్కులుగా వెలిబుచ్చెను. దీని ననుసరించియే మన కంఠధ్వనిలో మూడు స్వరములు పుట్టుచున్నవి. అవియే ఉదాత్తము, అనుదాత్తము స్వరితము అనబడు స్వరములు. వీనినే సంగీతమున, మంద్రస్థాయి, మధ్యమ స్థాయి, తారస్థాయి అందురు.

1) బ్రహ్మ హృదయమునందలి ఆకాశమునుండి ప్రణవము పుట్టెను. దానిని ఓంకారమందురు. దానివలననే జీవుల ఉచ్ఛ్వాస, నిశ్వాస ములు జరుగుచున్నవి.

2) బ్రహ్మ రోమములనుండి ఉష్ణిక్ అను ఛందస్సు పుట్టినది.

3) చర్మమునుండి గాయత్రీ ఛందస్సు పుట్టినది.

4) మాంసము వలన త్రిష్టుప్ ఛందస్సు పుట్టినది.

5) స్నాయువు (కండరములు) వలన అనుష్టుప్ ఛందస్సు పుట్టెను.

6) ఎముకలవలన జగతీ ఛందస్సు పుట్టెను.

7) మజ్జవలన పంక్తీ ఛందస్సు పుట్టెను.

8) ప్రాణమునుండి బృహతీ ఛందస్సు పుట్టెను.

ఇందు ప్రణవము కాక మిగిలినవి సప్త ఛందస్సు లనబడును. ఇది దేశమును, కాలమును విభజించునట్టి కొలతలు.

బ్రహ్మనుండి కకారము మొదలు అయిదు వర్గములు పుట్టి, వానితో పంచ జ్ఞానేంద్రియములుగల జీవుడు పుట్టెను.

క ఖ గ ఘ జ — క వర్గము

చ ఛ జ ఝ ఞ — చ వర్గము

ట ఠ డ ఢ ణ — ట వర్గము

త థ ద ధ న — త వర్గము

ప ఫ బ భ మ — ప వర్గము

ఈ ఐదువర్గములును బ్రహ్మనుండి జీవుడు పుట్టుచున్నప్పుడు ఐదు జ్ఞానేంద్రియములుగా వెలువడెను. అకారము మొదలు అచ్చులుచ్చరింపబడి దేహమేర్పడినది. అ ఇ ఉ ఋ ఌ అను అక్షరములైదును నుచ్చరింపబడి, పంచభూతములతో దేహమేర్పడెను. మిగిలిన అచ్చులు వీని కలయికవలన నేర్పడినవి. శ, ష, స హ అను నక్షరములు ఊష్మములనబడును. వీని వలన అంతరింద్రియములనబడు అంతఃకరణ చతుష్టయ మేర్పడినది. (అంతఃకరణచతుష్టయమనగా జీవునియొక్క మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము).

య ర ల వ యను నాలుగక్షరములతోను ఆత్మబల మేర్పడినది. ఇవి అంతస్థము లనబడును. అనగా అచ్చులకు, హల్లులకు నడుమనున్నవి. వీనికి వరుసగా ఇ ఉ ఋ ఌ అను నచ్చులతో సంబంధమున్నది. కనుకనే దేహమునకును, జీవునకును గల సంబంధము వీనివలన నేర్పడి ఇవి ఆత్మ బలమునకు కారణములైనవి.

సప్తస్వరములుగూడ ఆత్మబలమునకు కారణముగా బ్రహ్మనుండి యుచ్చరింపబడినవి. [సప్తస్వరములనగా షడ్జము, ఋషభము, గాంధారము, మధ్యమము, పంచమము, ధైవతము, నిషాదము అను పేరుగల ఏడు అంతఃస్వరములు. వీనినే సంగీతమున వరుసగా సరిగమపదని యని గుర్తులతో చెప్పుదురు]. ఇవి శబ్దబ్రహ్మమును విస్తరింపజేయును. ఇవియన్నియు బ్రహ్మదేవుని ముఖమునుండి యుచ్చరింపబడినవి.

శబ్దబ్రహ్మము ప్రణవ స్వరూపము. దానిని వైఖరీ వాక్కుగా నుచ్చరించుట వలన అవ్యక్తమయిన బ్రహ్మస్థితినుండి వ్యక్తమయిన సృష్టిపుట్టినది. బ్రహ్మకుగూడ పైనున్న పరమాత్మ స్వరూపుడైన దైవము అవ్యక్తుడైయుండి, యీ ఉచ్చారణమువలన వైఖరీవాక్కు మూలమున వ్యక్తరూపుడైయున్నాడు. ఈ రెండు స్థితులలో నున్న మొత్తము పరమాత్మ పరిపూర్ణ స్వరూపుడు. ఇట్లు సృష్టిగా నతడుచ్చారణ రూపమున వెలువడుచున్నప్పుడే ఇంద్రాదులు తనయందు శక్తులుగా నిమిడియుండిరి. వారితో నిండియుండియే అతడు వ్యక్తస్వరూపుడగును.

అమితమైన శక్తిసామర్థ్యములు గల ఋషి గణములను సృష్టిచేసిన చతుర్ముఖుడు ఆ మునులసృష్టి (సనకసనందనాదుల సృష్టి) అభివృద్ధిచెందుట కాదని తెలిసి ఆ విధమైన సృష్టిని విడిచెను. దోషములేని కామము సృష్టికి తప్పదని యెరిగి మరియొక దేహము ధరించెను. ఐనను తానీవిధముగా సృష్టియందు ఎల్లప్పుడు ఆసక్తిగలిగి యున్నను, సృష్టి యభివృద్ధి జరుగుట లేదని గ్రహించెను. దీనికి కారణమేమని యాశ్చర్యపడెను. ఇంక నీ సృష్టి యభివృద్ధిచెందుట యెట్లని యాలోచించెను. దైవము తనకింకను అనుకూలము కావలసి యున్నాడని గ్రహించెను. దానికెదురు చూచుచు తనకు తగిన కార్యాచరణమందు నిమగ్నుడై యుండెను. అప్పుడతని దేహము రెండు సమ భాగములయ్యెను. అందొక భాగమునుండి స్వాయంభువ మనువు పుట్టెను. రెండవ భాగమునుండి మనువు భార్యయైన శతరూపయను కన్యపుట్టెను. వారిద్దరికిని ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడను నిద్దరుపుత్రులు గలిగిరి. మరియు ఆకూతి, దేవహూతి, ప్రసూతి యను ముగ్గురు కన్యలు పుట్టిరి. ఆకూతిని

రుచి యనువానికి, దేవహూతిని కర్దముడను ప్రజాపతికి, ప్రసూతిని దక్షుడను ప్రజాపతికి నిచ్చి పెండ్లిచేసెను. వీరివలన సృష్టి సమూహములు పుట్టి లోకములు నిండిపోయెను.

— [శ్రీ. భా. ప్ర. V. పే. 72-80]

## బ్రహ్మసూత్రములు

భగవద్గీతను రచించిన వ్యాసుడే బ్రహ్మసూత్రములను రచించెను. అందలి పదములుకూడ దీనిని గూర్చినవియే. హేతువాదమున నిశ్చయింపబడిన, నిరూపించబడిన యంశమెల్ల నీ రెండిటిలోనిదే. బ్రహ్మసూత్రములనగా బ్రహ్మనుండి వచ్చిన దారములు. అవి త్రిగుణములను మూడువిధములైన నూలుపోగుల వంటివి. జీవునిలో 'నే' నను ప్రజ్ఞనుండి పరబ్రహ్మము వరకు దారులుగా ఈ నూలుపోగులు అల్లుకొని యున్నవి. వానితోనే సృష్టి యంతయు నిర్మాణము చెందియున్నది. ఈ మొత్తము క్షేత్రము. అందు తెలియదగిన యంశముల రూపమున పరబ్రహ్మమున్నది. తెలిసికొనువాని రూపమున జీవుడు క్షేత్రజ్ఞుడుగా నున్నాడు. ఈ మొత్తమును తెలిసినవాని రూపమున పరబ్రహ్మము క్షేత్రజ్ఞుడుగా నున్నాడు.

— [మం. గీ. పే. 273]

## బ్రహ్మసృష్టిలోని దశలు

1) అవిద్యా పంచకముతో కావించిన సృష్టియందు మోహము, కామము, భోగేచ్ఛ, క్రోధము, మృత్యువు, చిత్తభ్రమ పుట్టినవి. సృష్టికి ప్రజ్ఞ కలుగుటకుముందు నిద్రావస్థ యుండును. దానికిముందు భగవంతుని అంతర్యామిత్వమయిన యోగనిద్రాస్థితి యుండును. దానినుండి సృష్టికి ముందున్న బ్రహ్మ నిద్రాస్థితిలోకి మారినప్పుడు అవిద్యా పంచకముతో కూడిన పాపసృష్టి ముందు పుట్టును. ఇది గర్భస్థుడగు జీవికిచుట్టు నేర్పడునట్టి మావివంటిది. ఇందలి లక్షణములు తరువాత పుట్టబోవు మానసిక, భౌతిక లోకములకు సంక్రమించును. కనుకనే సామాన్య జీవులందరు కామక్రోధములు, సుఖేచ్ఛ, మృత్యువు అనువానికి గురి యగుచుందురు.

2) అటుపైన స్వచ్ఛమైన జ్ఞానము బ్రహ్మమనసుగా బుట్టును. అది రాబోవు సృష్టికి ఆత్మగా పనిచేయును. అదియే కుమారుల సృష్టి. సనకుడు, సనందనుడు, సనత్కుమారుడు, సనత్సుజాతుడను నలుగురు కుమారులు రాబోవు జీవులలో మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము సను వానిలో నంతర్యామిత్వమొంది, సమయముచూచి, భక్తియోగ ముపదేశించి సత్త్వగుణము, చిత్తశాంతి, యోగసాధనము, మోక్షవిద్య ప్రసాదించు పరమగురువులై యంతర్యామిత్వము వహింతురు. జరిగిన సృష్టిలో వారు తమపని చేయుదురుగాని స్వయముగా వారు సృష్టిని వృద్ధిజేయు స్వభావము గలవారు కాదు.

3) అటుపైన నీలలోహితుడు, వానినుండి ఏకాదశరుద్రులు పుట్టి, జీవుల దేహమందలి వివిధశక్తుల సృష్టికి తోడ్పడుదురు. కాని వీరి సృష్టితో పాటు సృష్టిని భక్షించుట లేక కాల్చివేయుటగూడ నుండును. కనుకనే శక్తిమయ భౌతిక ప్రపంచములన్నియు నెప్పటికప్పుడు పుట్టి నశించు చుండును.

4) అటుపైన ప్రజాపతుల సృష్టి. వీరు సంఖ్యలై దేహముల యందలి భాగములను వృద్ధిచేసి యటుపైన దేహమున సంఖ్యలు నేర్చి యుపయోగించు ప్రజ్ఞలై యుందురు. "కబాలా" యను పాశ్చాత్యశాస్త్రము వీరిని SEPHEROTH అందురు.

5) అటుపైన బ్రహ్మ తననుండి సరస్వతిని సృష్టించి యామె వెంటబడి తరువాత సిగ్గుపడును. దీనివలన పైనచెప్పిన సృష్టి విభాగములన్నియు సృష్టికర్తనుండి యుచ్చరింపబడుట, లేక వేరుగా నేర్పడుట (Objectivity) చెప్పబడినది. మరియు పాపకార్యములను చూచి సిగ్గుపడుట యను లక్షణముగూడ నిందు సృష్టింపబడినది.

6) అటుపైన బ్రహ్మముఖము నుండి వేదములు, యజ్ఞములు, సమస్త శాస్త్రములు, సమస్త జీవరాసుల జీవనవృత్తులు, మానవులలో వయస్సులనుబట్టి వృత్తులనుబట్టి విభాగము చేసికొను జ్ఞానము సృష్టింపబడినది. ఈ స్థితిలో మన భూగోళముపై సృష్టి యేర్పడును. ఇట్లే ప్రతి సూర్య

మండల సృష్టియందును భూగోళముపై సృష్టి యేర్పడును. దీనియందే ఛందస్సులనబడు దేశకాల విభాగములుకూడ నేర్పడును. మానవులు మాటాడుకొనుటకు కావలసిన కంఠము, ముఖయంత్రము, ధ్వనులు, అక్షరములు నేర్పడును.

7) ఇన్నింటిని సృష్టించినను ఆ సృష్టి అట్లే నిలబడి పోవుచున్నదిగాని, సంఖ్య వృద్ధియగుటకు సాధనము బ్రహ్మకు గోచరింపలేదు. దానితో నతడు రెండు సగభాగములుగా విడిపోయెను. అనగా స్త్రీ, పురుష శరీరములు వేరువేరుగా నేర్పడి గర్భధారణమను ప్రక్రియ సృష్టింపబడినదని యర్థము. ఈ మొదటి దంపతులే మనువు శతరూప యను వారలు. వారినుండి పుత్రులు పుత్రికలు వేరుగా కలిగిరి. అందలి పుత్రికలను అంతకుముందుజన్మించిన ప్రజాపతులలో రుచి, కర్దముడు, దక్షుడు యనువారికిచ్చి మనువు వివాహము చేసెను. వారివలన జీవరాసులు పుట్టి, స్త్రీ పురుష భేదములతో తమంతతాము వృద్ధిచెందినవి.

– [శ్రీ. భా. ప్ర. V. పే. 80-82]

## బిందుసరము

బిందుసర మనగా యొక సరస్సు. దాని పేరు బిందువు. అది ఈశాన్య దిక్కుననున్నట్లు పురాణములు వర్ణించును. అందు బ్రహ్మ పూర్వము యజ్ఞము చేసిన యజ్ఞశాలల సామాగ్రియైన స్తంభములు, ద్వారములు మున్నగునవి నీటిలోదాచబడి యున్నవి. వానిని వెలుపలకుతీసి, వానితో చక్కని వింతలతో గూడిన సభాభవనమును నిర్మించి మయుడను రాక్షసుడు ఆ సభను రాక్షస గణములచే మోచికొని రప్పించి ధర్మజునకు బహూకరించెనని భారతము చెప్పుచున్నది. పూర్వమిచ్చటనే భగీరథుడు తపస్సుచేసి గంగను భూమి దింపెననిగూడ భారతము చెప్పుచున్నది.

దీనికొక సంకేతమున్నది. భ్రూమధ్య ప్రదేశమును తూర్పుదిక్కనియు, నడినెత్తికేంద్రము నుత్తరదిక్కనియు చెప్పుదురు. రెండును కలిపిన తావు ఈశాన్యదిక్కు. భ్రూమధ్యము నుండి లోపలిదిక్కున శిరస్సునకు సూటిగా

దిగువను ఈశానుడు నివసించు స్థలమున్నది. దీనినే విశ్వేశ్వర జ్యోతిర్లింగ మనియు, కాశీపట్టణమనియు పురాణములు వర్ణించును. ముఖ్యముగా కాశీ ఖండము వివరించును. దీనినే ఈశానుని స్థానమనియు, ఈశాన్యని దిక్కనియు సంకేతింతురు.

– [శ్రీ. భా. ప్ర. VI. పే. 111]

## భగవంతుడు

భగవంతుడను పదమునకు భ+గ+వంతుడు, అనగా తన వెలుగు లోనికి తాను గమనము చేయువాడు లేక జన్మించువాడు అని అర్థము. ఇతడు నిర్గుణుడు కాదు. ధర్మసంస్థాపనకు కావలసిన జ్ఞానబలైశ్వర్యములు, తేజస్సు, జీవులనుదమించు వైభవము కలిసియుండును. అతని దేహము, ఇంద్రియ ములు, ప్రాణము, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అన్నియు తన నుండి దిగివచ్చి, తనయందే యోగస్థితిలో నుండును. వీని కనేకత్వము సిద్ధింపదు. చూచువారికి మాత్రము తమయందువలెనే వారికికూడా దేహములు వేరువేరుగా నున్నట్లు, ఊహలు, సంకల్పములు, చిత్తవృత్తులు నున్నట్లు కనిపించును. నిద్రపోవుచున్నవాని మనస్సునకు దేహము లేకున్నను చూచు వాని దృష్టికి వాని దేహముండును. అట్లే భగవంతుడగు అవతారమూర్తి దేహాదులుకూడా చూచువారికి కనిపించి, వారును నలుగురితోపాటే యని తోచుచుండును.

– [శంఖారావము I. పే. 131-134]

## భద్రం కర్ణేభిః

వేదములలో కర్ణశబ్దము చెవియను సామాన్యార్థమునను, సమకోణమున కెదురుగా నున్న త్రిభుజమందలి బాహువని విశేషార్థమునను చాలచోట్ల వాడబడినది. అట్టి సందర్భములలో 'కర్ణేభిః' మున్నగు విచిత్రప్రయోగములు కనిపించును. ఇవి శాస్త్రప్రయోగములు కనుక, పాణిని తన వ్యాకరణమున స్వీకరింపలేదు. ఇట్లే భద్రమను పదముకూడ శుభమను సామాన్యార్థమునను, రెండు సరళరేఖల లంబకోణమున నొకదానితో నొకటి ఖండింపగా నేర్పడిన

రూపమని శాస్త్రార్థమునను ప్రయోగించుట జరిగినది. బిందువునందు సూర్యోదయ సూర్యాస్తమయములు కలుపు సరళరేఖను, మధ్యాహ్నము అర్థరాత్రములను కలుపు సరళరేఖతో ఖండింపగా భద్రము లేక జీవుల కస్తిత్వము కలుగును. ఖండింపబడినచోట పుట్టిన నాలుగు సమకోణముల కెదురుగా నాలుగు కర్ణము లేర్పడినవి. కేంద్రమునుండి ఏర్పడిన నాలుగు భుజముల నడుమను తొంబది చొప్పున అక్షము లేర్పడినవి. ఇది విష్ణుసూక్తమున "చతుర్భిః సాకం" అను మంత్రమున వివరించబడినది. ఈ మొత్తము ఆశీర్వచన మంత్రముగా "భద్రం కర్ణేభిః శృణు యామ దేవాః। భద్రం పశ్యేమ అక్షభిః యజత్రాః" అని వేదఋషులు దర్శించిరి. చెవులతో భద్రమైన విషయములను వినుదుము గాక ! కన్నులతో భద్రమైన విషయములను చూతుము గాక ! అని సామాన్యార్థములు. అక్షములు, భద్రములు అను చక్రనిర్మాణ వ్యూహములతో సూర్యకేంద్రకమైన దేహమేర్పడి స్థిరముగా నుందుము గాక ! అనియు, కంటితో చూచుట నుండి కంటిని చూచునట్టి, చెవితో వినుటనుండి చెవిని వినునట్టి శుభమైన పరమపురుష స్థితిని పొంది ఈ దేహమున నుందుము గాక అనియు విశేషార్థము.

— [సు. సూ. పే. 84-85]

## భాగవత మార్గము

మనస్సుయొక్క ప్రవర్తనము త్రిగుణముల నాశ్రయించి యుండును. సత్త్వము, రజస్సు, తమస్సు అనునవి త్రిగుణములు. వాని కతీతముగా నుండునది గుణాతీతము అనబడు నిర్గుణ పరబ్రహ్మము. దానిని పొందుటకు కొందరు నిర్గుణ తత్త్వమును సాధన చేయుదురు కాని సాధన యనునది గుణము గనుక, సాధించి నిర్గుణత్వము పొందుట కానిపని. కనుక సర్వాంతర్యామియైన విష్ణుని గుణములు భావించుటయే మార్గము. అనగా కనిపించిన వారలలోని గుణములన్నియు భగవంతుని గుణములుగా భావించుట సలవాటు చేసికొనవలెను. ఇదియే భాగవత మార్గము. దీనివలన నిర్గుణ పరబ్రహ్మము సిద్ధించును.

— [శ్రీ. భా. ప్ర. III. పే. 6]

# భాగవతము - జీవుని సృష్టి సమన్వయము

పరమ పురుషుడైన భగవంతుడు జీవుడుగ దిగివచ్చుట వాసుదేవుని అవతరణము అనబడును. అవతరించు స్థితిలో నున్న దేవుడు 'హరి' అను సంకేతపదమున చెప్పబడును. అతడు గర్భస్థుడై మొదటి మాసమున తన అంతర్యామి ప్రజ్ఞను కోల్పోయి జీవప్రజ్ఞను పొందుట 'భగవంతుని నిర్యాణము' అనబడును. దీని ననుసరించి ప్రథమ స్కంధమున శ్రీకృష్ణుని నిర్యాణమున్నది. పదియవ మాసమున జీవుడు సర్వాంగ పరిపుష్టి పొంది దిగివచ్చుట అవతరణము. దీని ననుసరించి దశమ స్కంధమున శ్రీకృష్ణుని జననమున్నది. గర్భస్థుడైన జీవునకు మూడవ మాసమున లోపలి అవయవముల విభాగము, పాంచభౌతిక స్థితుల వినియోగము జరుగును. దీనికి చిహ్నముగ సృష్టి నిర్మాణము చేయు దేవతల తత్త్వముల పరిగణనమును, సృష్టి విభాగమును కపిలుడు గర్భస్థుడై తల్లి కుపదేశించుట మూడవ స్కంధమున చెప్పబడినది. గర్భమున అండము నుండి శిశువు దేహాదులు సృష్టింపబడుట కూడ మూడవ మాసమున జరుగును. కనుక తృతీయ స్కంధముననే బ్రహ్మదేవుడు సృష్టి ఆరంభించిన విధానము వర్ణింపబడినది. అన్ని ప్రజ్ఞలకు మూలమైన శిరస్సు నుండి వెన్నెముక నాళముగ దిగివచ్చుటకూడ మూడవ మాసమున జరుగును. కనుక బ్రహ్మదేవుడు పద్మమునందు మేల్కొని పద్మనాళములో దిగువకు ప్రయాణముచేసి నాభి మూలమును తెలుసుకొనగోరి, చేతకాక తిరిగివచ్చుట మూడవ స్కంధమున వర్ణింపబడినది. అన్ని ప్రజ్ఞలకు సమన్వయము, బ్రహ్మజ్ఞాన వికాసమునకు మూలము, యోగాభ్యాస సాధనకు కావలసిన యంత్రము అగు వెన్నెముకలోని విభాగములు మూడవ మాసముననే యేర్పడును. కనుక మూడవ స్కంధముననే బ్రహ్మ నారాయణుని నుండి యోగవిద్యను, భాగవత రహస్యమును, స్వీకరించుట చెప్పబడినది.

ఇవి కేవలముదాహరణలు మాత్రమే. గ్రంథరచన మంతయు ప్రత్యేకమైన జీవుని యుపదేశ గుప్తవిద్యతో నిండియున్నది. ఇన్నియు అనుభూతితో జోడించి మాత్రమే ఉపదేశించబడును. వీనిని నేర్చుచున్నపుడు వీనియందు భగవంతుని స్మరణలేనిచో కేవల శాస్త్రములగును. భాగవతమునకది పనికి

రాదు. అన్నియు వాని లీలలుగా గుర్తించుకొనినచో ఆడుచుపాడుచు విద్య లందు విహ్వారుట జరుగును. ఇందే విద్యకు స్వతంత్రమైన అస్తిత్వము లేదు. ఉన్నట్లు కనిపించినచో అది ద్రష్టయొక్క అజ్ఞానము లేక బంధము అన బడును. విష్ణూపాసనమున కర్మయోగము, వాసుదేవోపాసనమున వైరాగ్య వివేకములతో గూడిన జ్ఞానయోగము, నారాయణోపాసనమున భక్తియోగము అను స్థితులు సమన్వయింపబడి అష్టాంగ యోగము భాగవత మూర్తియైన సాధకుని దివ్యదేహమున ఎనిమిది అంగములుగ సమన్వయము చూపబడినది. నవీనయుగమున ఈ సంపూర్ణ యోగమునే అరవిందయోగీంద్రులు మరల నొకమారు నొక్కి చెప్పిరి.

– [శ్రీ. భా. ప్ర. I. పే. 18-19]

## భాగవత సంప్రదాయము

సామవేదమున గల నాదోపాసన మూలమున పరబ్రహ్మమున లయమై యుండుట భక్తిమార్గ మనబడును. ఈ సామవేదమార్గమే భాగవత సంప్ర దాయముగ పరిణమించినది. వేదములలో సామవేదమును 'నేను' అని గీతలో కృష్ణు డుపదేశించెను. దానినుండియే సంకీర్తనలు, భజనలు, నాటక ములు మొదలగునవి సంప్రదాయములు వచ్చినవి. గ్రంథములందలి విజ్ఞా నము ప్రధానముకాక అదికూడ నాదము మున్నగువానితో ఆనందానుభూతికి సహకరించుట భాగవత సంప్రదాయము. ఏమి తెలిసినది అనుదానికి ప్రాధా న్యము లేక ఏమి రచించినది అనుదానికి ప్రాధాన్యము కలిగించి యుద్ధరించుట ఇందలి కొలికిపూస. సంగీతముతో సమానమైన స్థాయిని కుడి ఎడమగ సాహిత్యమునకుగూడ అబ్బుట ఈ మార్గముననే సాధ్యము. భారతము మున్నగు గ్రంథములకు విజ్ఞానము ప్రధానము, దానినే బ్రహ్మకోశము అందురు. భాగవతమునకు అనుభూతి ప్రధానము. బ్రహ్మకోశ మనబడు పద్మకోశము వికసించి మకరందమును చిమ్మినపుడే సార్థకత. ఈ రహస్య ముల కనుగుణముగా భాగవత గ్రంథమున వ్యాసుని రచనయు, శైలియు మాధుర్య ప్రధానములు.

– [శ్రీ. భా. ప్ర. I. పే. 14-15]

## భారతీ సంప్రదాయము

భారతి అనగా వాక్కు. భా+రతి=వెలుగు, ప్రేమ–అని యర్థము. ఈ సృష్టి యంతయు భగవంతుని వాక్కుయొక్క యుచ్చారణ రూపమని వేదము చెప్పుచున్నది. ఈ యుచ్చారణ నాలుగు స్థితులలో దిగివచ్చును.

1) ఉచ్చరించువాడు. 2) ఉచ్చరించవలెనను సంకల్పము. 3) అభిప్రాయముగ విప్పారిన భావము. 4) తననుండి వెలుపలకు ఉచ్చరింపబడిన వాక్యమువంటి నామరూపాత్మకమైన సకలచరాచర సృష్టి ప్రపంచము. ఈ నాలుగును సృష్టికర్తయైన బ్రహ్మముఖములుగ పురాణమర్మవిదులు వర్ణింతురు. శాస్త్రజ్ఞులు వానినే పరా, పశ్యంతి, మధ్యమ, వైఖరి అను పేర్లతో వ్యవహరింతురు. ఇందు మొదటి మూడు వాక్కులును గుహలో (ఉచ్చరించువాని లోపల) నుండును. వెలువడిరావు. నాలుగవది ఉచ్చరించు వానికన్న వేరుగా వెలువడును. ఈ విధముగా సరస్వతీ ఋక్కులు కీర్తించుచున్నవి. జనన మరణాత్మకమైన, దేశకాలాత్మకమైన ఈ సృష్టి యంతయు భగవంతునిలో నాల్గవ భాగమనియు, మిగిలిన మూడు భాగములును అమృతత్వమను వెలుగుగ (మొదట చివరలేని స్థితిలో) నిమిడి యున్నవనియు పురుషసూక్తము కీర్తించుచున్నది. ఈ తత్త్వమును సమన్వయించి, రూపకల్పన చేసి, బ్రహ్మముఖమున భారతి వెలువడినదని పురాణజ్ఞులైన ఋషులు వివరించిరి. భగవంతునినుండి సృష్టి ఇట్లు దిగివచ్చుటను దానిని ఉపమానముగా స్వీకరించి సాధకు డెవడికివాడు తనవాక్కు తాను వినుచు తపస్సుచేయు మార్గమొక్కటి ఋగ్వేద కాలమునుండి అనుస్యూతముగ వచ్చుచున్నది. ఓంకారము నుచ్చరించి, దానిని వినుచుండుట వలన సాధకుడు వానియందు ప్రవేశించును. ఈ ప్రవేశించుటలో అనుభవించు సోపానములే ధారణ, ధ్యానసమాధులుగా యోగమార్గమున పేర్కొనబడినవి. దాని సమగ్రమైన అభ్యాసమును బ్రహ్మవిద్య యనిరి. బ్రహ్మము అనగా బృంహణశీలము లేక తననుండి తాను విస్తరించుకొనుట అని అర్థము. కనుకనే సృష్టి యంతయు బ్రహ్మస్వరూపము.

– [శ్రీ. భా. ప్ర. I. పే. 45-47]

# భారతీయ ధర్మము - మ్లేచ్ఛ ధర్మము

జగచ్చైతన్యము నుండి సృష్టి పుట్టుచున్నదిగాని, అజ్ఞానము నుండి పుట్టుటలేదు. జగత్సంకల్ప ప్రతిబింబమైన సూర్యుని త్రయీమయ కాంతి నుండి జగత్తులు పుట్టుచున్నవిగాని, దానికి పాదమైన మట్టినుండి కాదు. మొదట దేవతలు చైతన్యస్వరూపులై యుద్భవింతురు. తరువాత శక్తులు ఆవిర్భవింతురు. వారివారి సంగమున పంచభూతములు, గ్రహగోళములు, దేహములు దిగివచ్చును. ఇది జ్ఞానమార్గము. మట్టినుండి నాగరికులు పుట్టిరనుట మ్లేచ్ఛమార్గము. సంకల్పమునుండి కర్మ పుట్టునుగాని, చేతుల కాళ్ళ నుండి పుట్టదు.

చీకటిలో నీడకు చంద్రకిరణములకే గాదు, సూర్యకిరణములకుకూడ తప్పదు. కాని చీకటి అంటకుండుటయే కిరణముల విశిష్టత, కలియుగమున ప్రకాశించు వేదధర్మమే కృతయుగమునకు ధర్మబీజము. ఫాల్గుణము తర్వాత చైత్రము వచ్చును. మానవ మానగతికి అతీతమైన కాలగతి చాల పెద్దది. ఆ చైత్రమునకు వ్యవధానమున్నపుడు శిశిరము భరించి వేదమును ధరింపక తప్పదు. వేదశిశువును పోషించి పెద్దవానిని చేయుట మన ధర్మము. పెద్దవాడై ప్రతిప్రకాశత్వము చూపుట వాని ధర్మము.

సర్వము ధర్మమునందే ప్రతిష్ఠితము. వేదసంప్రదాయము వారికి ధర్మమునందే జీవితగతులు నడచును. మ్లేచ్ఛ సంప్రదాయమున జీవితము కొరకే ధర్మము వినియోగపడవలసి యుండును. వారి సృష్టిలో జీవితమున కగ్రస్థానము, ధర్మమునకు దాసస్థానము. తత్ఫలితముగా జీవనోపాధులు వేరుగా సాధించుకొనవలసి యుండును. వాని ననుసరించి అర్థకామములు. వానికి దాస్యము చేయు 'వినత'గా ధర్మము అణగిమణగి యుండును. ఈ మార్గ మవలంబించినవారు ఒకరికొకరు దాసులగుదురు. పొట్టకోసము వృత్తుల నవలంబింతురు. మన మార్గమున వృత్తుల వినియోగము స్వధర్మానుష్ఠాన సాధన. పొట్టలు నింపుటకు ప్రయత్నమక్కరలేదు. మనమార్గ మవలంబించుటలో మాత్రము పూర్వముకన్న కొంచెమెక్కువ ప్రయత్న మావశ్యకము.

తెక్కిన మార్గములు నిలబడవు గనుక, వచ్చినను పోవుచుండును. అవి మారును; ఇది మారదు.

– [క్రీ. మ. పే. 14-16]

## భూగోళము - సప్తద్వీపబీజములు

ఉత్తర దక్షిణ ధృవములను కలుపునట్టి రేఖయే మేరుదండము (Axis of Rotation). దానియందు ఏడు శక్తికేంద్రములు ఏర్పడును.

1) దక్షిణ ధృవము లేక మందరపర్వతము. ఇది జంబూద్వీప లక్షణములు కలది. 2) ప్లక్ష ద్వీపము. 3) శాల్మలి ద్వీపము. 4) కుశ ద్వీపము. 5) క్రౌంచ ద్వీపము. 6) శాక ద్వీపము. 7) పుష్కర ద్వీపము లేక ఉత్తర ధృవము. ఈ మేరుదండము ననుసరించియే మన వెన్నెముక ఏర్పడును. అందు జంబూద్వీప బీజమే మూలాధారము. ప్లక్షద్వీపము స్వాధిష్ఠానము. శాల్మలీద్వీపము మణిపూరకము. కుశద్వీపము అనాహతము. క్రౌంచద్వీపము విశుద్ధి. శాకద్వీపము ఆజ్ఞాచక్రము. పుష్కర ద్వీపము సహస్రారము.

– [శ్రీ. భా. ప్ర. XIII. 3వ చిత్రము]

## భూతములు

భూతములనగా పంచభూతములు, వానివలన ఆకారము పొందు జీవులును. భూ యనగా పరిణమించుట, పుట్టుట. పరిణమించునవి భూతములు. అవి ఆకాశము (వెలుగు), వాయువు (కదలిక), అగ్ని (వేడి), అపస్సులు (ప్రవహించునవి), పృథివి (భౌతిక పదార్థము). వీనివలన నాలుగు రకములైన జీవరాసుల శరీరములు కలుగును.

– [పు. సూ. పే. 8]

## భూపద్మము

కేంద్రము నుండి పరిధులవై పునకు సప్తద్వీపముల, సప్తసాగరముల ఏర్పాటున్నది. కేంద్రమున జంబూద్వీపము లేక మన భౌతిక భూగోళమున్నది. దానిచుట్టును లవణ సముద్రమున్నది. దానికి వెలుపలి యావరణముగా నున్నది ప్లక్షద్వీపము. దానిచుట్టును ఇక్షుసముద్రము. దాని బహిరావరణమే శాల్మలీ ద్వీపము. దానిచుట్టును సురా సముద్రము. దాని బహిరావరణము కుశద్వీపము. దానిచుట్టును నేతి సముద్రము. దాని బహిరావరణము క్రౌంచద్వీపము. దానిచుట్టును క్షీరసాగరము. దాని బహిరావరణము శాకద్వీపము. దానిచుట్టును పెరుగు సముద్రము. దాని బహిరావరణము పుష్కరద్వీపము. దానిచుట్టును శుద్ధజల సముద్రము.

– [శ్రీ. భా. ప్ర. 13 సంపుటము 1 పవిత్రము]

## భూమి

భూమి యనగా భూగోళమొక్కటియే యని యర్థముకాదు. భౌతిక పదార్థముగా సృష్టించబడినది ఏదైనను అని యర్థము. "భూమి" యను శబ్దమునకు సంస్కృతమున "ఆధారస్థానము" అని యర్థము.

– [పు. సూ. పే. 4]

## భూలోకము - ఆధ్యాత్మిక క్రమశిక్షణ

సమస్త సృష్టికిని క్రమశిక్షణకు వలయు విద్యాలయము వంటిది భూలోకము. మనోబుద్ధ్యహంకారాది ప్రజ్ఞలును, వాని నధిష్ఠించి యున్న దేవతలు, దానవులు మున్నగు శక్తులును క్రమశిక్షణ పొందుట భూలోక నివాసమునసే సాధ్యము. సృష్టియంతయు నొకరాష్ట్రముగా, రాజ్యాంగముగా పరిపాలింపబడుట ఈ భౌతిక సృష్టియైన భూలోకమయు దేహధారణము (Constitution) వలననే సాధ్యము. ఈ ప్రయోజనము కొరకే గ్రహగోళములకును, జీవులకును శరీరము లేర్పడుట, భౌతిక సృష్టి, జనన మరణములు,

జీవన విధానము, క్రమపరిణామము అను కక్ష్యలును, తరగతులు ఏర్పడినవి. ఇదియే ప్రాథమిక విద్యాలయము. ఇందలి క్రమశిక్షణమునకు ఫలితమే జ్ఞానానుభవము. ఇందు తీర్ణతయే మోక్షానుభవము.

– [శ్రీ. భా. ప్ర. III. పే. 21]

## భైరవము

దీనిని మంత్రశాస్త్రమున పాతాళశక్తి (Sub-Conscious Effort) అని సంకేతింతురు. అశ్వమను పదమునకు అ+శ్వ (రేపు, నిన్నలేనిది)= నిత్యనూతనము, శాశ్వతము అను నర్థములు గలవు. శ్వ అను పదమునకు రేపుయని యర్థము. కాలముచే రేపు అనునది కత్తిరింపబడగా మృత్యువు పొందిన శరీరమునందు 'శ్వ' అను పదము 'శవ' సంకేతమును పొందును. మరియు 'శ్వ' అనునది నాదముతో సంధానము చేయబడినపుడు 'శ్వా' అను సంకేతము పొందును. ఈ శబ్దమునకు 'కుక్క' అని యర్థము. అది వినబడని నాదమును వినగల జంతువు. మన శరీరమున నాదోత్పత్తికి ప్రథమ ప్రయత్నముగా గుర్తింపబడిన సంకేత జంతువు భైరవము. ఈ విధముగా గంభీరము, గూఢము, గాఢము అతిప్రాచీనము అగు 'శ్వ' పదమునుండి పుట్టినవే అశ్వము, శ్వాస, శవము, విశ్వము అను పదములు.

– [స. సూ. పే. 27]

## మణి

ఈ పదమునకును, "రత్న" శబ్దమునకును స్వయంప్రకాశమగు మనో ధర్మముల సముదాయమని అర్థము. మరియు అగ్నిజ్వాలలోని శోభలనియు అర్థము. (అగ్నిని "రత్నధాతమమ్" అని ఋగ్వేదము కీర్తించును). ఆత్మ సంయమము కలిగినపుడు దారమున నమర్చిన రంగుల నవరత్నముల మాలిక వలె మానసికములైన శక్తులు, అనగా సంకల్పశక్తి, వాక్కు, అర్థము మున్నగునవి చక్కని కూర్పుగా నిముడును. వాని అనుకూలతకు ప్రతిబద్ధము చేయుటకు పనికివచ్చునవే భూషణాదులలో వాడుకొను నవరత్నములు.

– [శ్రీ. సూ. పే. 20]

## మన్వంతరములు

ఈ సృష్టి సప్తలోకముల వ్యాప్తిగా నేర్పడుననని వేదములందును, ఉపనిషత్పురాణేతిహాసములందును చెప్పబడినది. అగ్నిహోత్రుని వంశము వారు 49 మంది యని భాగవతము, భారతము మిగిలిన పురాణములందును వర్ణింపబడినది. ఈ అగ్నులందరును జీవసృష్టికి మూలమైన వెలుగులు. వారి ననుసరించియే (7×7=49). ఈ సృష్టి మూలకథ వివరింపబడినది.

బ్రహ్మాండ మనబడు పిండము (Foetus) దితి గర్భమున పెరుగు చుండగా ఇంద్రుడు గర్భమున ప్రవేశించి వజ్రముతో కొట్టెనట. పిండము 7 ముక్కలై రోదించినది. ఇంద్రుడు "మారుద" (ఏడువకుము) అని పలికెనట. అప్పుడు వారు మరుత్తులై సృష్టిలోనికి దిగి వచ్చిరట. ఈ వేద శాస్త్రదర్శన వ్యాఖ్యానమైన కథ వాల్మీకి రామాయణమున విశ్వామిత్రునిచే రామలక్ష్మణులకు చమత్కారముగా చెప్పబడినట్లు బాలకాండలో నున్నది. ఈ లెక్కల నుండియే 7 జాతుల సృష్టి జీవులు కాలక్రమమున పరిణామము చెందుచున్నవి. అందు నాల్గవజాతి నడిమిజాతి. అందే దేహనిర్మాణము, స్త్రీ పురుష భేదము పుట్టును. ఈ సమన్వయము నందలి విశేషాంశము లన్నియు సవిస్తరముగా హెలీనా పెట్రోనా బ్లావెట్‌స్కీ రచించిన గుప్తవిద్య (Secret Doctrine) అను గ్రంథమున చదువకొనవచ్చును.

(చూ. శ్రీ. భా. ప్ర. XII. అనుబంధము)

7×7=49 అను పరిణామ ప్రక్రియ ననుసరించియే మన భూగోళ ముపై ఒక్కొక్క మన్వంతరమున 7 వివిధ లక్షణములు గల నరజాతు లేర్పడుచుండును. అందొక్కొక్క జాతిలో 7 ఉపజాతు లేర్పడుచుండును. వీరు మన్వంతరమందలి కాలవిభాగముల ననుసరించి మన భూమిపై జీవించు చుందురు. ఒక్కొక్క జాతికి, ఉపజాతికి ప్రత్యేక లక్షణములుండును. ఒక ఉపజాతి తర్కముగాని, సత్యగ్రహణముగాని, మంచిచెడ్డల నిర్ణయముగాని ధర్మశాస్త్రాదులుగాని మిగిలినవానికన్న వేరుగా నుండును. ఇందు 7 జాతు లకు సంబంధించిన మనువులు ఈ జాతిలక్షణముల కధిపతులై కాలస్వరూ పులై వర్తింతురు. ఎండాకాలము, వానాకాలము, చలికాలము ఎట్లు కాల

స్వరూపములై ప్రభావము చూపుచున్నవో అట్లే యీ మనువులును. 14 మన్వంతరములలో నొక్కొక్కదాని యందు 7 గురు మనువులు వర్తింతురు. అందొక్కొక్క మనువు కాలమున మరల 7 గురు మనువులు అంతర్దశలవలె వర్తింతురు. ఇన్ని విభేదములును పువ్వులరేకలుగా 49 ఉపజాతులు వర్తించుటతో ఒక మన్వంతరము జరుగును. 71 మహాయుగముల కాలము ఒక మన్వంతరము. దీనికి సంధికాలములు కూడ కలుపుకొన్నచో 72 మహాయుగముల కాలము ఒక మన్వంతరమని ఆర్యభట్టు తన గ్రహగణితమున పేర్కొనెను. ఇట్టి మన్వంతరములు 14 ఒక బ్రహ్మపగలు అనబడును. అంతేకాలము ఒక బ్రహ్మరాత్రి అగును. రాత్రింబగళ్ళు పర్యాయత్వము చెంది ఈ సృష్టి యందొక్కొక్క బ్రహ్మాండమునకు కారణమగుచున్నది. బ్రహ్మపగటి యందు సృష్టియంతయు నొక శ్వాసగా వెలువడును. బ్రహ్మరాత్రి యందు ఉచ్ఛ్వాసముగా లోనికి పోవును. అట్టి బ్రహ్మయొక్క అహోరాత్రములు 360 ఒక బ్రహ్మసంవత్సరము. అట్టివి 100 సంవత్సరములు బ్రహ్మయువు లేక మహాకల్పము అనబడును. [మన్వంతరాధిపతులైన పెద్ద మనువులను Root Manus అనియు, చిల్లర మనువులను Seed Manus అనియు H.P. Blavatsky గుప్తవిద్య (The Secret Doctrine) యను గ్రంథమున వ్యవహరించినది.]

– [శ్రీ. భా. ప్ర. XIII. పంచమస్కంధము-గ్రంథగ్రంథులు XVI-XVIII]

## మహాన్యాసము

మహాన్యాస పూర్వక రుద్రాభిషేకమున రెండు భాగములున్నవి. ఎ) న్యాసవిద్య బి) అభిషేకార్చనములు. అందు మొదటిదియగు న్యాస విద్యలో సాధకుడు తన దేహమందలి ఆపాదమస్తకము భాగములను అవయవములను, కోశములను, వ్యూహములను రుద్రునియందలి విశ్వరూపమున భాగములుగా విడిచిపెట్టును. తన దేహాదులు తనవి కావనియు భగవంతుని వనియు భావన స్థిరము చేసికొనుట నభ్యసించును. దానితో తాను అహంకార మగుట మాని భగవన్మయుడగుచున్నాడు. తనలోని అష్టప్రకృతి దివ్యత్వము చెంది, తొమ్మిదవదియగు పరాప్రకృతిగా స్వరూపమును గుర్తించుచున్నది.

దుర్భావములు మాయమై, స్వపరభేదములు మాయమై శివము, శివతరము అగు భావము నిండును. అప్పుడు జీవుడు శివుడగుచున్నాడు. అతని యందు గల దివ్యప్రకృతి శివామూర్తిగను, పురుషుడు శివమూర్తిగను, సదాశివుడు ఈ రెండింటియందు అంతర్యామిగను, ప్రసన్నమగుచున్నారు. అందలి మొదటి ఇద్దరికిని ప్రతీకలే పానవట్టము, లింగము అను భాగములతోకూడిన సదాశివలింగము.

దానికిముందు 4 దిక్కులు, ఊర్ధ్వదిక్కు, అధోదిక్కు శివమయముగా నిర్మాణము చేయబడుచున్నది. ఈ మానసిక నిర్మాణమే శివాలయమునకు మూలప్రతీక. ఇందు నాలుగుదిక్కుల అంచులతో కూడిన నలుచదరమైన పీఠము ఆ దిక్కులను బంధించు శిఖరములే ఊర్ధ్వమున, అథస్సున గోపురములుగా నేర్పడుచున్నవి. ఇందలి ఊర్ధ్వభాగమైన సగభాగమే స్వీకరింపబడి ప్రాచీన ఈజిప్టు ఆగమశాస్త్రమున పిరమిడ్ అను స్థూపముగా రూపొందినది. దక్షిణ భారతదేశమునుండి ప్రాచీనకాలమున వైవస్వత మనువు సకల యజ్ఞ విద్యలతోపాటు ఈ విద్యనుగూడ శిష్యులతో ఈజిప్టు దేశమునకు నడిపించుకొని పోయి స్థాపించెను. (చూ. "Hidden Life in Freemasonry" by C.W. Leadbeater). ఇందు 4 దిక్కులు, ఊర్ధ్వము, కలసి అయిదంచులు. దీనితోకూడిన మంత్రతంత్ర భావనయే పంచాంగ రుద్రవిద్య అనబడును.

– [రుద్రాభిషేకము - పరిచయము]

## మేరువు

మేరువనగా మేరుదండము ను (Earth Axis) ఉత్తరధృవము పొడవకు పొడిగింపగా ముప్పదియారు లక్షల యోజనముల యెత్తుననున్న ఒక బిందువు. అచ్చటినుండి చూచినచో సూర్యుడు గ్రహములును కుమ్మరిసారెపై నిలిపినట్లున్న ఈ మేరువునకుపైన ధృవపదమున్నది. [ధ్రువపదమనగా ఉత్తర ధ్రువము కాదు]. ఇది ధ్రువతారకు ఇంచుమించుపైన ప్రదేశము. దీనికిపైన ఆకాశగంగ అనబడు కోటానుకోట్ల తారకలున్నవి. వీనికిపైన విష్ణుపదము అనబడు తారకయున్నది. దీనినిగాని, ఆకాశగంగను గాని ధ్రువపదమని

పెద్దలు పేర్కొని యుండవచ్చును. ధ్రువపద మనగా ధ్రువునకు దర్శనము కలిగించు మార్గము కావచ్చును. ధ్రువపదమునుండి సప్తద్వీపముల మండల మైన భూపద్మము మీదకు అటు నిటు సరళరేఖలు పొడిగించినచో పుష్కర ద్వీపము (Outermost of the Seven Spheres around the Earth Centre) కటునిటు నిమ్నపాతములు (Tangents) ఏర్పడును. ఆ రెంటి నడుమగల శంకువు (Cone) కొసనే మేరుశిఖరాగ్రము లేక చతుర్ముఖ బ్రహ్మ నగరము అని వర్ణించిరి. దాని కటునిటు లోకాలోక పర్వతమున్నది. ఇది గాక సూర్యునినుండి మన భౌతిక భూగోళముపైనున్న ఉత్తర దక్షిణ ధ్రువ ముల వైపునకు రేఖలు పొడిగింపగా ఏర్పడిన శంకువును సూర్యరథమని వర్ణించిరి. (ఈ ధ్రువ పదమునుండి ఉత్తరధ్రువము వరకు గల దూరము 36 లక్షల యోజనములు.)

– [శ్రీ. భా. ప్ర. XIII. పే. XXVI-XXVII]

## మంత్రము

1) మంత్రముయొక్క నిర్వచనము : మంత్రమను పదమునకు రహస్యమని అర్థము. దీని రహస్యార్థ మేమనగా, ధ్యానము నాధార ముగా జేసికొని, మిమ్ములను కాపాడి, రక్షించునట్టి శబ్దము. మనన మంటే ధ్యానం చేయడం. "మననాత్ త్రాయతే" - ధ్యానంచేస్తే రక్షిస్తుంది గనుక మంత్రమనబడినది.

2) మన ముద్దేశించిన కార్యసిద్ధి కొరకు, శబ్దమును మాత్రమే వినియోగించి నపుడు అది మంత్రమనబడును. ఉద్దేశించిన కార్యసిద్ధికి, పంచేంద్రి యములను, ఇంద్రియార్థములను సద్వినియోగము చేసినపుడు ఆ విధానము తంత్రమనబడును. తంత్రమును గూర్చి నవీనకాలమునకు చెందిన పాశ్చాత్య పరిశోధకులు ఇచ్చిన తుచ్ఛమైన అర్థములను గూర్చి మనం అప్రమత్తంగా ఉండాలి.

3) ఉచ్చరింపబడిన శబ్దము ప్రాణమయ తరంగములచే ఉద్బుద్ధము చేయబడినపుడు, దానికొక సంకల్పము నాధారముగా స్వీకరించినపుడు,

ఆ శబ్దమును మంత్రమందురు. అపుడా శబ్ద మితరులలో తన ప్రభావమును చూపించును. ఏ విధముగా సంభాషణలో వాడబడిన పదములు మనకు తెలియని విధముగానే, ప్రేమ, ద్వేషము, కోపము మొదలగునవి పుట్టించుచున్నవో, ఆ విధానముననే, సక్రమముగా వాడి, ప్రయోజనమును పొందినపుడు, ఆ శబ్దము మంత్రమనబడును.

4) ఓజస్సు : ఓంకారమును జనింపజేయునట్టి ధాతువు. ఈ ధాతువు మనము తల్లిగర్భములో ఉండగనే, మన ఊపిరితిత్తులను, గుండె కాయను స్పందింపజేయుట ప్రారంభించును. ఐదవ ఆరవ మాసముల లోనే హృదయ స్పందనము ప్రారంభమగును. పుట్టిన క్షణమునుండి, ఈ ఓజస్సు ఊపిరితిత్తులను శ్వాస చేయించును. ఈ ధాతువు జీవుని మనస్సున 'సోహం' అను శబ్దముల నుత్పాదింప జేసి, ఈ శబ్దముల శక్తిచే, ఉచ్ఛ్వాసనిశ్వాసల నుత్పాదింప జేయును. శ్వాసకు కావల్సిన ఘర్షణ, ఇందలి హల్లులగు సకార హకారముల వలన పుట్టింపబడును. అంటే మీరు కళ్ళుమూసుకుని శ్వాస కాస్సేపుచేస్తూ, గమనిస్తున్నట్లయితే పీల్చుచున్నపుడు ముక్కుసందు ఉంటుంది. ఇది శ్వాసయొక్క అంత ర్ద్వారము. సకారము పుడ్తుంది లోపలికి. గాలి వదుల్తున్నపుడు శ్వాస యొక్క బహిర్ద్వారము కంఠము నందుంటుంది. హకారము పుడుతుంది బయటికి. కనుక తంత్రశాస్త్రజ్ఞులు ఈ రెండు హల్లులకు 'అతడు, నేను' అను నర్థము నిచ్చిరి. ''సో'' అనేది ఇవతలికి తీస్తే, వ్యాకరణరీత్యా ఏమవుతుంది ? 'సః' అవుతుంది. అంటే "అతడు". 'అహం' పద మునకర్థము "నేను". కనుక ఈ రెండు ధ్వనులును "నీకు'' ''నాకు'' సమానముగా తెలుపబడినవి. ఈ రెండు హల్లులను తొలగించినచో, అక్కడ వున్నది అందరిలో ఉన్న ''నేను" అనబడు ''ఓం''. వేద ములేకాక, ప్రతి మంత్రతంత్రగ్రంథము దీనితోనే ప్రారంభించును. ఇందు 'సో' అనునది పురుషునకు, 'హం' అనునది ప్రకృతికి చిహ్నా ములుగ తెలుపబడినది. ఈ కారణముచేతనే పురుషసూక్తము సకార ముతోను, శ్రీ సూక్తము 'హ' కారముతోను ప్రారంభించును.

(చూ. ('తంత్రము')

– [శ. ని. త. శా. పే. 94-95]

## మంత్ర వాక్కు

అచేతనములలోను, సచేతనములలోను, విచేతనములలోను మానవులచే గుర్తింపబడుచున్న వాక్కొకటి యిమిడియున్నది. అది మానవుల వాక్కుల ఉచ్చారణమునకు కారణము. అది అచేతనములలో నిద్రవలెను, మానవునిలో తన యునికిని గుర్తించు తెలివివలెను ఇమిడియున్నది. అది ఉచ్చరింపబడి నపుడు, వినబడినపుడు వ్యక్తమైన సృష్టివలె నుండును. ఈ ప్రవృత్తి లేనపుడు లీనమై యుండును. గుర్తింపబడినపుడు మాత్రము మనకు జ్ఞప్తికి వచ్చును. ప్రవృత్తి యందును, అప్రవృత్తి యందునుగూడ అంతర్యామియే యుండును. ఈ అంతర్యామి తత్త్వమునే వేదములు గానము చేసినవి. ఉపనిషత్తులు బ్రహ్మమని గుర్తించినవి. భాగవతము వేణుగానమని గుర్తించినది.

– [మం. జా. తొలిపలుకు (i)]

## యజ్ఞము

ఈ మొత్తము సృష్టి ప్రారంభమై వ్యక్తమగుట, మరీచులు పుట్టుట, జ్యోతిర్గోళము పుట్టుట, దానినుండి లోకములు పుట్టుట ఒక పెద్దపని. సృష్టి పుట్టి వర్తించుటయే ప్రయోజనము. జగద్ధితమనబడు సృష్టి కర్మయే కార్యము, కారణము, ఫలము అగుచున్నవి. అందలి అంతర్యామియే అన్నియును. "యజ్ఞభుక్, యజ్ఞకృత్, యజ్ఞః" అని విష్ణుసహస్రనామము చెప్పు చున్నది. ఫలితము కోరకయే చేయబడుపని గనుక యజ్ఞము. దీనికి విధాన మెచ్చట నున్నది ? దేనినిచూచి నేర్చుకొనవలెను ? దానియందే యున్నది. అది పుట్టుటతో దేవతలు మేల్కొని దానిని పుట్టించుచున్నారు. నిద్ర మేల్కాంచినవాడు తన దినచర్య ప్రారంభించును. మేల్కాంచుట తాను చేసినదికాదు. అట్లే ఈ యజ్ఞము దేవతలను పుట్టించగా దేవతలు యజ్ఞమును పుట్టించుచున్నారు. వారికెట్లు తెలియును ? మెలకువ వచ్చుట వలననే, అటుపైన తెలియుటకూడ సహజము. పుట్టినవానికి శ్వాసపీల్చవలెనని ఎట్లు తెలియును ? వయస్సునుబట్టి కామము, దాంపత్యము ఎట్లు తెలియుచున్నవి? అట్లే దేవతలకును సమస్తము తెలియుచున్నది. అంతకుముందు జరిగిన యజ్ఞమునుండి తాము మేల్కొనుట యజ్ఞమందలి భాగము. మేల్కొనిన

దేవతలు మరల అట్లే ప్రవర్తించుట, యజ్ఞమునుండి యజ్ఞము చేయుట. నిప్పు పుట్టినపుడెల్ల కాలును. నీరు ఏర్పడినపుడెల్ల పల్లమునకే ప్రవహించును. ఇట్లే సమస్త సృష్టిధర్మములు. పుష్పము వికసించుటయే ధర్మము. అది అప్రయత్నము (Automatic). దానిలో అందరి ప్రయత్నములును ఇమిడియున్నవి.
4 ఈ యిమిడియున్న ధర్మములే ఆ దేవతలు మొట్టమొదట నేర్చుకోవలసిన ధర్మములయ్యెను. మఱ్ఱిచెట్టు చనిపోయిన తర్వాత మఱ్ఱిగింజ నుండి మరల అట్లే అంకురించును. అపుడు గింజలోని దేవతలను ప్రజ్ఞలు మేల్కొని మఱ్ఱితనము తమకు సహజముగా ప్రవర్తింతురు. అపుడు చోటులో మరల మఱ్ఱిచెట్టు రూపమున తమకు వసతి ఏర్పడును. ఇట్లు విస్తరించిన వారై సృష్టియందు వసతు లేర్పరచుకొనుచున్నారని చెప్పబడినది.

అంతకుముందుకూడ వారున్నారు. మఱ్ఱిగింజలో గూడ మఱ్ఱిచెట్టున్నది. లేనిచో ఎట్లు మొలచును ? అట్లే సృష్టికిముందు "కృష్ణంనియానం" అని చెప్పబడిన నల్లని ఆకాశపు చీకటియందు వీరందరును సాధ్యస్థితిలో నున్నారు. మన యింటియందు మనము నిద్రించుచున్నప్పుడు మనకిల్లు, పరిసరములు లేవు. అట్లే సాధ్యస్థితిలో దేవతలు నిద్రించుచున్నారు, గనుక తమకుతాము లేరు. (అంతర్యామి వున్నాడు.) తమకు సృష్టియు లేదు. ఇది సాధ్యస్థితి. ఇట్టి లేకపోవుటయేగాని సృష్టిలో దేనియందును అసలు లేకపోవుట లేదు. "నత్వేవాహం జాతు నాసంనత్వం నేమే జనాధిపః", లేనిదానికి ఎన్నడును అస్తిత్వము కలుగదు, ఉన్నదానికి లేకుండుట ఎప్పుడును వుండదు.'' అని గీతలో కృష్ణుడు చెప్పెను. ఇట్టి వేదమనబడు అసత్యస్థితినుండి ఉన్నది యనబడు సత్యస్థితికి దేవతలు మేల్కొనుట యజ్ఞమందలి భాగము. అటుపైన తమ కర్తవ్యము దానియందలి భాగమే. అది తమకు తెలియుట దానియందలి భాగమే. ఈ చివరి భాగము వేదమనబడును. ఈ మూడు భాగములును కలిసి యజ్ఞ మనబడును.

(చూ. సిద్ధులు - సాధ్యులు)

– [సు. సూ. పే. 175-177]

## యజ్ఞ స్వరూపము

యజ్ఞమను పదమునకు నిష్కామముగా చేయు ఆరాధనమని, అది కర్మ స్వరూపమని గీతాచార్యుని సమన్వయము. సనాతన ధర్మమైన వేదమును దర్శించిన ఋషుల సమన్వయముకూడ అదియే. కనుకనే పూర్వులు తమకన్న పూర్వులకడ నుండి దీనిని తెలిసికొని యాచరించినారని కృష్ణుడు గీతలో హెచ్చరించెను. భగవద్గీతలో తాను నూతన సిద్ధాంతమును ప్రతిపాదించుచుంటినని అతడు చెప్పలేదు. సనాతన ధర్మమును తానిచ్చుచున్నాననియు, "తాను" ఈ ధర్మముయొక్క స్వరూపమే యనియు, జీవుడు దానిని మరచినపుడెల్ల తానొక వ్యక్తిగా నవతరించి దానిని స్థాపించెదనని చెప్పెనేగాని, నాది క్రొత్త సిద్ధాంతమని చెప్పలేదు. యజ్ఞమను పదమునకు నిష్కామ కర్మాచరణమనియు, దేవతలు అను పదమునకు సృష్టిని నిర్వహించుచున్న ప్రజ్ఞలనియు వేదమందు ప్రామాణికముగా నున్న నిర్వచనమునే పునరుద్ధరించెను. [నడిమికాలమున పండితులు ఇంద్రాది శబ్దములను వ్యక్తుల పేర్లుగా పొరబడి వారిని తమ కోరికల ప్రకారము దేవతలుగా వ్యవహరించి జంతువులను బలి యిచ్చుట కలవడి, మద్యమాంస మైథునాది లోలురై కామాత్ములు, స్వర్గపరులునై వ్యవహరించుట వలన యజ్ఞమను పదమున కర్థము భ్రష్టు పట్టించిరి. అందువలన కృష్ణుడు ఆ పదముయొక్క అసలైన యర్థమును పునరుద్ధరించవలసి వచ్చెను.]

— [శం. రా. I. పే. 87-88]

## యోగము - ఆధ్యాత్మిక పరిణామము

సృష్టి పరిణామమున అత్యున్నతమైన అవకాశము నరజన్మము. భౌతిక పరిణామమున మానవశరీర నిర్మాణము పరిపూర్ణతకు దగ్గరపడిన స్థితి. అట్లే జీవపరిణామమున మానవస్థితి ఉత్తమ పరిణామము. ఇంతవరకీ భూమిపై జరిగిన దేహపరిణామములోని సర్వజీవరాసుల స్థితులును మానవదేహ నిర్మాణమున సంస్కారములుగా నిలిచియున్నవి. ఇంతవరకీ భూమిపైగల ప్రస్తుత జీవసృష్టిలో అనేక మానవజాతులు అలలు అలలుగా వ్యక్తమగుచున్నవి.

ఒక్కొక్కజాతి కొన్నివేల సంవత్సరముల కాలము కొన్ని ప్రత్యేక లక్షణములతో, కొన్ని ఆధ్యాత్మిక ధర్మములతో ప్రవర్తించి వెడలిపోవును. ఇట్లు ఏడు జాతులు (ఏడు తరగతుల జాతులు) వచ్చిపోయిన వెనుక, మరల అదే వరుసలో మరి ఏడుజాతులు మండలావృత్తి చెందుచుండును. (శనివారమైన తరువాత మరల ఆదివారముతో మొదలై వారములు తిరిగి వచ్చినట్లు.) ఇట్లు పదునాలుగు జాతులు జరిగిన తరువాత మహావికాసము కల జాతి యొకటి యుద్భవించి వర్ధిల్లును. శుక్లపక్ష తిథులలో వెన్నెలకు పూర్ణిమ ఎట్టిదో, మానవ పరిపూర్ణవికాసమునకు ఈ జాతి అట్టిది. అటుపైన మరల పదునాలుగు జాతులు వర్తించి, వెడలిన తరువాత, ఒక జీవప్రళయము కలుగును. బహుళపక్ష తిథుల చివర అమావాస్యవలె ఇది వర్తించును. ఈ మానవజాతుల కాల పరిణామమునే ఒక్కొక్కదానిని ఒక్కొక్క మన్వంతరమని పెద్దలు వ్యవహరింతురు. ఆ జాతి మొత్తమును నడుపునట్టి సమాహార ప్రజ్ఞనే 'మనువు' అందురు. ఈ ప్రజ్ఞ సంపూర్ణముగా వికసించి, ఒక జీవుడిగా అభినయించి, అనేక జన్మలెత్తుచు, వలసిన తావులందెల్ల జాతి వికాసములగు మార్పులను కలిగించుచుండును. ఈ జీవినే ఆ మన్వంతరమునకు సంబంధించిన మనువను రాజర్షిగా పెద్దలు చెప్పుదురు. ప్రస్తుతము ఉన్న మానవజాతి, అట్టివానిలో ఐదవజాతి. దీని కధిపతి ఐదవ మనువగు వైవస్వత మనువు. అతని అధ్యక్షతక్రింద ప్రస్తుతపు మానవ పరిణామము జరుగుచున్నది. ప్రతి జీవియు కాలక్రమమున ఆధ్యాత్మిక పరిణామమును పూర్తిచేసుకొని తరువాతి వారి పరిణామమునకు సహకరించుచు పనిచేయును. అట్టివారు మూడు వర్గములుగా నున్నారు. 1) ఋషులు 2) దేవతలు 3) పితరులు (పితృదేవతలు). అందు ఋషులు మానవజాతికన్న పైపరిణామము వారు. వారిలో నొకవర్గమువారినే దివ్యజ్ఞాన శాస్త్రజ్ఞులు 'మాస్టర్స్' అని వ్యవహరించుచున్నారు. వారు సంసారజీవుల ఆధ్యాత్మిక పరిణామమునకు సహకరించుచుందురు. వారు చేయవలసిన సేవ చిరకాలము గనుక వారు మృత్యుంజయులై సూక్ష్మశరీరములతో చిరజీవితము సాధించి అవశ్యకతనుబట్టి భౌతిక శరీరములను ధరించుచు, విడుచుచుందురు. మృత్యుంజయత్వము వలన అన్ని జన్మలలోను తామెవ్వరో తమ కార్యక్రమ మెట్టిదో జ్ఞప్తి యుండును.

ప్రతి మానవునకు అంతవరకు జరిగిన సృష్టి పరిణామము పూర్వజన్మలుగా వర్తించి ప్రస్తుతజన్మలో ఆ మొత్తము సంసారము బీజరూపముగా నుండును. ఈ బీజప్రాయమగు అనుభూతి యంతయు, అతని కుండలిని అను శక్తియందు అంతర్లీనమై యుండును. అన్నిటికన్న ముందు పరబ్రహ్మ మున్నది గనుకను, దానినుండియే జీవుడు వచ్చెను గనుకను, పరబ్రహ్మాను భూతి (ఆనందము) మొదటి సంస్కారముగా నుండును. తద్భిన్నములుగా శాఖోపశాఖలుగా బయలుదేరిన ఇతర సంస్కారములన్నియు మరల ఆ అనుభూతి వైపునకే మానవుని మొగ్గ జేయుచుండును. కనుక ప్రతి మానవుడును తానెరిగిన ప్రకారము, తన సంస్కారము ననుసరించి, ఆనందము పొందుటకు యత్నించుచుండును.

పై చెప్పిన కుండలినీశక్తి అనగా మానవునిలో ప్రాణముగా బంధింపబడిన ప్రజ్ఞయేగాని మరియొకటి కాదు. నీటియావిరి ఘనీభవించి నీరుగా మారినట్లు అపారప్రజ్ఞ క్లుప్తము చేయబడి కుండలినీ శక్తిగా మానవునిలో బద్ధమై యున్నది. మన చుట్టునున్న ఆకాశమున గల మహాప్రాణశక్తి (Plenty of Prana) కిని మనలోని కుండలినీ శక్తికిని, ధారావాహినియైన సంబంధమున్నది. ఇది నదికిని, కాలువకును గల సంబంధము వంటిది. ఈ సంబంధమునకు మానవ శరీరములోని భౌతిక పదార్థధర్మమడ్డువచ్చును. నీరు ఘనీభవించి మంచుగడ్డయైనపుడు తాత్కాలికముగా పగులుట, ఘర్షణ చెందుట అను ధర్మము లావేశించినట్లు, మానవ శరీరము ధరించిన ప్రజ్ఞకు పరిమితత్వము, ఘర్షణపడుట, మంచిచెడ్డ లనుభవించుట అను లక్షణము లావేశించును. వానినుండి విముక్తిచెందుట యోగస్థితి అనబడును. శరీరముండగనే దీనిని సాధించుట మాస్టర్స్‌యొక్క రాజయోగ మార్గము. అందు తనకు శరణాగతినొచ్చిన వారికి అయస్కాంత స్పర్శచే ఇనుమునకు వలె నిట్టి స్థితిని కల్పించుట మొట్టమొదట శ్రీకృష్ణుడు చేసినపని. మరల మాస్టర్ సి.వి.వి. నూతన మార్గమున ఈ స్థితిని ప్రసాదించినారు. "ప్రణత నిజజనాన్ స్వాత్మ తుల్యాన్ కరోతి" అని వారిని గూర్చి నాడీగ్రంథము చెప్పుచున్నది. నమస్కరించినవారు తనలోనివారై తనవారు కాగా తనంతటి వారినిగా వీరనుగ్రహించుచున్నారని ఇందలి భావము.

కుండలినీశక్తి స్వయంప్రకాశకము, స్వతంత్రము. మాస్టరుగారికి ఆత్మ సమర్పణము చేసిన జీవుల కుండలిని మహాప్రాణముతో నొకటి యగుసు. భూగ్రహము యొక్క కుండలినితో స్పందించుట నేర్చుకొనును. క్రమముగా నితర గ్రహముల కుండలినితో శ్రుతిగలిపి ఆరోహణము చేయుచు, మన సౌరకుటుంబము యొక్క కుండలినితో నైక్యమై బ్రహ్మాండ కుండలిని యను పరాశక్తిగా వికాసమందును. ఇదియంతయు శరీరము నందుండగనే జరుగ వలెను. దీనినిబట్టి యొక అంశము స్పష్టమగుచున్నది. మాస్టరుగారి మార్గ మున యోగస్థితి, ధ్యానము, సమాధి యనునవి బాహ్యప్రపంచ మెరుగని నిద్రవంటి [పరి]స్థితులు కావు. బహిరంతర లోకములలోని ప్రజ్ఞల సమాహార వికాసము (Simultaneous Conscious Co-existence of all Planes) యోగమని మాస్టరుగారు నిర్వచించిరి. దానికై పనిచేయు కుండలిని యొక్క శక్తి ప్రజ్ఞామయ విద్యుత్తు (Intelligent Electricity) అని వారు నిర్దేశించిరి.

ఇంద్రియములను, మనస్సును నిరోధించుట వీరి మార్గము కాదు. యోగ ప్రజ్ఞా పుష్పము, ప్రజ్ఞా కేంద్రమునుండి పరిధికి వికసించునేగాని, వెలుపలి నుండి యత్నించి రేకలను విడదీయరాదు. వీరుపదేశించిన సమాధి ప్రజ్ఞా మయమేగాని జడముకాదు. ఈ ప్రజ్ఞ యున్నచోట మృత్యువుండదు. భౌతిక పదార్థ ధర్మములు వర్తించి, దేహపదార్థము జీవినుండి కేంద్రచ్ఛేదము నందుటయే మృత్యువు. ఇది పదార్థమునకు అనగా భౌతికస్థితిలో మాత్రమే వర్తించును తప్ప ప్రజ్ఞకును, యోగస్థితి చెందిన మనోబుద్ధీంద్రియములకును వర్తింపదు.

కుండలిని తన లక్షణములచే ప్రస్తుత మానవజాతిలో త్రయీమూర్తి (Triple) గా నున్నది. సృష్టి పరిణామమున గల మూడుదశల అనుభూతు లను గలిగియున్నది. ఖనిజస్థితి (Mineral State), వృక్షస్థితి (Plant State), జంతుస్థితి (Animal State) అనునవియే ఈ Triple యొక్క మూడుదశల అనుభూతులు. నాలుగవది సగము తలయెత్తిన అనుభూతిలో ప్రస్తుతము మానవజాతి వర్తించుచున్నది. కనుకనే కుండలిని మూడు చుట్టలు చుట్టుకొని తలయెత్తి యున్నదని తాంత్రిక యోగాచార్యులు వర్ణించారు.

ఆదిశక్తియొక్క ప్రణాళిక ననుసరించి ఆధునిక యుగమున నీ కుండలిని మాస్టర్ సి.వి.వి. గారిలో నాలుగవ యుద్బోధమును బొందినది. అదియే ఆనందానుభూతి. వీరి యోగమార్గము మన శరీరమున నిట్టి అనుభూతిని కలిగించు మార్పులను కొనివచ్చుటతో నారంభించును. ఇందు నాడీ మండల మున ఉన్న కేంద్రములు పునర్నిర్మాణము చేయబడి నూతన కేంద్రము లేర్పడును. ఆ కేంద్రములవెంట ప్రసరించు ప్రాణశక్తి ఒక నూతన తేజో మయ సూక్ష్మశరీరమును నిర్మాణము చేయును. ఇది అనుభూతి శరీరము. దీనినే ప్రాచీన శాస్త్రజ్ఞులు అంతఃకరణ శరీరమని వ్యవహరించితిరి. అంతః కరణ నిర్మాణము అను నీ శాస్త్రమును 'Seven Rays and Initiations' అను గ్రంథమున జ్వాల్‌కూల్ మహర్షి తన శిష్యురాలగు Alice A. Bailey రచనద్వారా లోకమున కందించి యున్నారు. ఈ శరీరమున వర్తించుచు అనుభూతిమయుడైన పరిపూర్ణ జీవి పరబ్రహ్మమును నిరంతరముగా ననుభ వించుచు భూమిపై వర్తింపగలడు. ఇట్టి యోగికి వృత్తిధర్మములు మానుట, అరణ్యములలో, గుహలలో ధ్యానమను పేర నిమగ్నుడగుట ఆవశ్యకత లేదు. వివాహము, సంతానము ఐహికధర్మములు దీనికి ప్రతిబంధకములు కాక, దీని యందంతర్భాగములగును. శ్రీకృష్ణుడు సంసారము వీడుటగాని, జటావల్కలములు ధరించి అడవులకు బోవుటగాని చేయలేదు. అట్టి మార్గ ములలో సాధనచేయుచున్న ఋషులందరు శ్రీకృష్ణుని పరబ్రహ్మముగా నమస్క రించి తరించిరి. ఆధునిక యుగమున మాస్టరుగారి నాశ్రయించి సంసార బంధమును తరించినవారిలో సన్యాసులు, పండితులు, వేదవిదులు, శాస్త్రజ్ఞులు, పామరులు అన్ని తరగతుల వారును ఉన్నారు.

— [మాస్టర్ సి.వి.వి. పే. 27-32]

## యోగ విద్య - భగవద్గీత

యోగాభ్యాసము, యోగజీవితము, దైవయోగము అని యోగవిద్య మూడు విభాగములు. అందు మొదటిది వ్యక్తిచే నభ్యసింపదగినది మాత్రమే. ఇందు కర్మయోగము, జ్ఞానయోగము, భౌతికదేహ శిక్షణము, ప్రాణగతులను సక్రమము చేయుట, క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగము మున్నగు సాధన మార్గము

లిమిడియున్నవి. ఇక రెండవది యగు యోగజీవితము దీనికి పరమావధి. ఇతరులతో నెట్టి సంబంధము కలిగియుండవలెనో అది యిచ్చట సాధింప బడును. ఇందు సాంఖ్యయోగము, జ్ఞానవిజ్ఞాన యోగము, అక్షర పరబ్రహ్మ యోగము ముఖ్యముగా నభ్యసించబడును. దానితో విశ్వరూప సందర్శన యోగము సిద్ధించును. విశ్వమనబడు దేవుని స్వరూపము దర్శించబడును. అటుపైన దర్శింపదగినది దైవయోగము. ఇది వ్యక్తిగత సాధనకు సంబంధించినది కాదు. సకలమును సమర్పణబుద్ధితో ఆహుతి చేసి విరజము అన బడు సన్యాసయోగమున నిలిచి కేవలము సాక్షిగా దర్శింపవలసిన స్థితి. లోకమున మంచిచెడ్డలతో సంబంధ ముండదు. వానిని తన సత్కర్మలు సరి చేయుచుండును. అవి తన యస్తిత్వమునకు సంబంధించినవి కాకయే నడిచి పోవుచుండును. మనకు ఆ కర్మలతో ప్రసక్తి లేకయే అస్తిత్వము నడచును. పనులు జరుగుచుండును, గాని మనము చేయుచుండము. అట్టి స్థితిలో జీవుడు దైవముతో యోగము చెందియుండును. అపుడు సిద్ధించునవి భక్తి యోగము, పురుషోత్తమ ప్రాప్తియోగము. ఇందు వ్యక్తి సాధించునదేదియు లేదు. వ్యక్తి వ్యాపించునదియు, దర్శించునదియు, దర్శింపబడిన వస్తువుగా మారునదియు నుండును. అట్టి స్థితిలో దేహము, మనస్సు అడ్డురాకుండవలెను. అట్టి సమగ్రయోగమును దర్శించి అటుపైన భౌతిక దేహములోనికి దిగిన వాడు దైవయోగమునకు గల విఘ్నములగూడ తొలగింప సమర్థుడు.

– [శ్రీ. భా. ప్ర. VI. పే. 129-130]

## యోజనము

యోజన మనగా దూరమును కొలుచునట్టి విభాగమని అర్థము వచ్చినది. ఈ పదమునకు మొదట నిట్టియర్థము వున్నట్లు కనబడదు. అతికించునది, అతుకు అని ఈ పదమునకర్థము. (మూడతుకులతో జీవుడు దేహబద్ధుడగు చున్నాడనగా ద్రవ్యమయము, శక్తిమయము, ప్రజ్ఞామయము అను మడతలచేనని యర్థము) జ్యోతిర్గోళమునందు పృథివి, అంతరిక్షము, దివము అని మూడతుకులున్నవి. ఇవి భూతత్త్వము, చంద్రతత్త్వము, ఆదిత్యతత్త్వము అను లక్షణములు కలవి.

– [స. సూ. పే. 58]

## రజస్సులు

సత్యలోకమునుండి మిగిలిన ఆరు లోకములు దిగివచ్చును. ఇవియే ఆరు రజస్సులు. రజస్సు అనగా రేణువు లేక పరమాణువు. సత్యలోకము నుండి మిగిలినవి ఆరును వేరుగా దిగివచ్చును. గనుక ఈ లోకములలో రజస్సులుండును. ఏ లోకమునకు సంబంధించిన రజస్సు ఆ లోకమున కుండును. భూలోకమునకు సంబంధించిన రజస్సునందు మిగిలిన స్థూల లోకముల, సూక్ష్మలోకముల రజస్సులు ఇమిడియున్నవి. భౌతిక రజస్సుల అల్లికతో పాంచభౌతిక సృష్టి యేర్పడుచున్నది. సూక్ష్మలోకముల రజస్సు లతో అందలి సృష్టి యేర్పడుచున్నది. ఇన్నిలోకముల రజస్సులును ఒకదాని యందొకటి పేర్చి బిగింపబడి యున్నవి. వానిలో సృష్టి రూపమేర్పడు చున్నది. అదియే సృష్టికర్త దేహము. అందు సృష్టి జీవుల దేహము లేర్పడు చున్నవి.

— [సు. సూ. పే. 49]

## రథము

రథము, రథపతి, సేనలు, సేవానులు, క్షత్తుడు, సంగ్రహీత అను శబ్దములన్నియు రుద్రుని రూపముల నుద్దేశించినవి గనుక విశేషార్థద్యోతక ములు. రథమనగా శరీరము. రథపతి యనగా జీవుడు. సేన అనగా దేహ మున పనిచేయు దేవాదిగణము. సేనానియనగా వానిలో ఒక్కొక్క గణమున కధిపతి. వీరు ఇంద్రియములు, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము మొదలగువారు. క్షత్తుడు అనగా అంగరక్షకుడు. దేహమును రక్షించు సప్తధాతువులు మొదలైన రూపములవాడు. సంగ్రహీత యనగా వీరిని కూర్చువాడు లేక ప్రాణము. వీరందరును రుద్రరూపులుగా నమస్కరింపబడు చున్నారు.

పై శబ్దముల సామాన్యార్థములు:

1). రథపతి యనగా సేనానాయకుల పదవులలో నొకటి. యుద్ధాదులందు ఒక సంఖ్యగల రథములకు బాధ్యుడుగా నడిపించువాడు.

2) సేనలు అనగా యోధుల దళములు.

3) సేనానులు అనగా ఒక చిన్న దళమున కధిపతులు.

4) క్షత్ర యనగా శత్రువులను గాయపరచువాడు, తన పక్షమును గాయ పడకుండునట్లు రక్షించువాడు. అంగరక్షకుడని యర్థము.

5) సంగ్రహీత యనగా సేనలను లెక్కల ప్రకారము దళములుగా కూర్చువాడు.

— [రు. సూ. పే. 64]

## రాజర్షులు : మనువు, ఇక్ష్వాకువు

సూర్యునిలో 'సేన'ను ప్రజ్ఞ మేల్కొనుటే సూర్యు డుద్భవించుట. దాని నుండి ఏర్పడిన గోళాకారమైన వెలుగు వివస్వంతుడు. అందుండి వెలువడు కిరణములు జగత్తును పుట్టించి, శాసించును. ఇదియే మనువు. శాసించు శక్తివలన ఈ కిరణములలోని ప్రజ్ఞ ప్రభువుగా చెప్పబడినది. అందు సకల సృష్టిధర్మమగు పరిపోషకత్వము, భాసిల్లుచున్నది. ఈ ప్రజ్ఞయే మొదటి రాజర్షి. వానినుండి సౌరకుటుంబములలోని గోళములు, అందు మన భూగోళము పుష్పవించినవి. అటుపైన భూగోళముపై జీవరాసుల నుద్భవింపజేసి, పోషించు ప్రజ్ఞ లుద్భవించినవి. వారే భూమిపై మొట్టమొదటి రాజర్షులు' వారి తేజస్సుతో నిండిన మానవదేహములతో మనభూమిపై మనువు, ఇక్ష్వా కువు, జనకుడు మున్నగు రాజర్షు లుద్భవించిరి. వీరు రాజులుగా పరిపాలించి, ఋషులుగా యోగమార్గమును తమ ప్రజల కుపదేశించిరి. వీరి పాలన, పోషణలక్రింద ప్రజలు యోగమార్గమును సాధించి, ధర్మబద్ధమైన జీవనము చేయుచుండెడివారు.

— [శం. రా. I. పే. 125]

# రామం భజే శ్యామలం

రామునుడు కర్కాటక లగ్నమందు పుట్టెను. లగ్నము బృహస్పతికి ఉచ్చయనగా జాతకుడు సకల భూతములకు అభయమిచ్చువాడు. జ్ఞాన సుఖములు కలుగజేయువాడు. అంగారకుడు ఉచ్చ అనగా జాతకుడు యుద్ధ మందు చతురుడు. చంద్రునికి స్వక్షేత్రమనగా మనస్సుకు అధిష్ఠాన దైవం చంద్రుడు. రాముని మనస్సు ఎప్పుడు షోడశ కళలతో నిండివుండి లోకము నకు శాంతి చేకూరుస్తుంది. కాబట్టి ఎల్లవేళలా రాముడు షోడశకళాపూర్ణుడు. శుక్రుడు మీనరాశిలో ఉన్నాడు. అనగా అనిమిషరాశి మీనరాశి. శుక్రుడు అనిమిష రాశియగు మీనరాశిలో ఉండగా రాముడు జన్మించటంవల్ల అతడు జగన్మాతృత్వం కలవాడైనాడు. ఈ తత్త్వమునే శ్యామల వర్ణతత్త్వ మందురు. ఇది ఆకాశమునందు కన్పించు వర్ణము. రాముడు నీలదేహుడుగా వర్ణింప బడినాడు. "రామం భజే శ్యామలం" అను సంప్రదాయక స్తోత్రము నందీ యర్థమే ఇమిడియున్నది. మంత్రశాస్త్రమున శ్యామలాదేవి యను దేవత ఈ వర్ణమునకు, తత్త్వమునకు అధిష్ఠాత్రి. ప్రాచీనశాస్త్రము ననుసరించి తెలుపు మున్నగు ఏడురంగులును శ్యామల వర్ణమునుండి ఉద్భవించి అందంతర్లీన మగుచున్నవి. కన్నులకీ వర్ణము మిక్కిలి ఆరోగ్యప్రదము. ఈ వర్ణము జలముగను, దానియందు కన్నులు లగ్నమైనపుడు మీనములుగను వర్ణింప బడినవి. శుక్రగ్రహము శ్యామల వర్ణముతో గూడిన తెలుపుతో కన్పించును. దీనినే శుక్రవర్ణమనిరి. ఆకాశమున మీనాకారమగు రాశికిని, నీలవర్ణముగా దిగివచ్చు అవతారమూర్తికిని చాల సంబంధమున్నది. కనుకనే మొదటి యవ తారము మీనము. (పాశ్చాత్యుల పురాణముల ననుసరించి గూడ అవతార మూర్తియగు రక్షకుడు మీనాకృతిగా స్తుతింపబడినాడు.) ఈ మీనరాశిలోని మీనములు కన్నులుగా శ్యామలమగు అనంతకాల తత్త్వమును రెప్పపాటు వేయక చూచుచున్న పరదేవతయే మీనాక్షిగా తంత్రగ్రంథములందు వర్ణింప బడినది. శుక్రుడు నవమమగు మీనమున ఉచ్చయందుండగా అవతరించిన వాడు, దేవితో దిగివచ్చిన అనిమిషమూర్తియని ఇందలి భావము. ఇట్టి అనేక కారణములనుబట్టి ప్రకృతి రహస్యోన్మీలనమగు శ్రీ విష్ణుకును రామాయణ

మందలి సీతారామ తత్త్వమునకును సంబంధ మున్నదని సంప్రదాయజ్ఞులు చెప్పుచున్నారు.

— [రా. ప్ర. పే. 15-17]

## రుద్ర ధనువు

రుద్రుని ధనుస్సు నందలి బాణము అనగా మనము చేయు నమస్కార ముద్ర. రుద్రునకు చేసిన నమస్కారము విశ్వమందెక్కడ నున్నను మనలను రక్షించునని భావము. దుష్కర్మకు ఫలముగా మనమనుభవించు శిక్షయే రుద్రుని బాణము మనలను హింసించుట. దుష్కర్మలకు తావులేకుండ సర్వదా శివార్పణముగా సత్కర్మ లాచరించుచున్నపుడు మన శివార్పణ బుద్ధియే మనమెక్కడ యున్నను, ఎట్టిస్థితిలో నున్నను రక్షించును. రుద్రుని అమ్ములపొది అనగా మన దుష్కర్మలయొక్క నిలువ. సర్వము శివార్పణ ముగా సత్కర్మ లాచరించువారి పూర్వ దుష్కర్మలను కూడ శివుడు తొల గించునని తాత్పర్యము.

— [రు. సూ. పే. 35]

## రుద్ర సూక్తము

నమకమను పేరుతో జగత్ప్రసిద్ధమైన ఈ రుద్రసూక్తము యజుర్వే దము నందలి ప్రధాన మంత్రభాగములోనిది. ఋగ్వేదమునందును, అథర్వణ వేదమునందును గూడ నిందలి మంత్రభాగము లున్నవి. శ్రీ సూక్త, పురుష సూక్తములతో సమానమైన బహుళ ప్రచారము దీనికి గలదు. దీని ప్రభావము గూడ అమోఘము. ఆపదలు, రోగములు, దారిద్ర్యాది పీడలు, అకాలమరణ ములు వెన్నాడుచున్న వారు దీనిని భక్తితో అనుష్ఠానము చేసి రుద్రు నుపా సించి తమ పూర్వజన్మ కర్మ ఫలములను రహిత మొనరించుకొని సుఖము లను పొందుచున్నారు. వారికి ఇహపర సౌఖ్యములకు మనస్సునందు బాట యేర్పడుచున్నది. కనుకనే ఈ వేద మంత్రమును బహు సంప్రదాయములలో బహు విధములుగా నుపాసించు భక్త జనులున్నారు. రుద్రాభిషేకము, మహా న్యాసము, రుద్రయాగము, లింగప్రతిష్ఠ, నిత్యార్చనము, ఈ మహామంత్రము యొక్క వినియోగముతో నిండియున్నవి.

వేదసంహితల వ్యాఖ్యానములందు దీనికిని వ్యాఖ్యానము లున్నవి. అందు మహామహులైన వ్యాఖ్యాతలకు గూడ దురవగాహములైన విషయములు దీనియందున్నవి. అట్టి సందర్భమున నవీనులైన పాశ్చాత్య వ్యాఖ్యాతలు గూడ దీనికి వివరణము, అనువాదము చేసి యున్నారు. కీత్, గ్రిఫిత్ మున్నగువారు వేదసంహితలతో పాటు రుద్ర సూక్తమును గూడ ఆంగ్లమున కనువదించియున్నారు. కాని ఆ యనువాదములు పదముల కనువాదములే తప్ప భావమును వివరింప గలిగినవి కావు. వానిని చదువుకొనినపుడు మూలము తెలియని నవీనులకు కొందరికి వేదముపై చులకన అభిప్రాయములు కలుగుటకు వీలున్నది. దానిని చూచి నిజమైన భక్తులు బాధపడుట కూడ గలదు. వారందరికిని సంతోషము కలిగించునట్టి టీకా తాత్పర్య వివరణములు రచించుట యనగా వారిలో నున్న రుద్రుని ఆరాధించుటయే !

భక్తులు తనను భగవంతునకు సమర్పణ చేసికొను సాధనలో తాము భగవంతుని మూర్తులగుచున్నారు. వీరందరును సృష్టికర్మయందలి యజ్ఞమునందు ఋత్విక్కులుగా తమ తమ పనుల నాచరించు రుద్రమూర్తులుగనే జీవితము గడుపుదురు. దానిని తెలుపునట్టి మంత్రప్రార్థనమే రుద్రసూక్తము.

ప్రకృతిలో పుష్పములు విచ్చుకొను ఆకారములును, సీతాకోక చిలుకల రెక్కలపై ప్రకృతి పెట్టిన ముగ్గులను గమనించినచో ప్రకృతిలోని శక్తుల యందు యెంత సౌందర్యభావమున్నదో తెలియును. ఆ శక్తులే దేవతలుగా మానవుని మనస్సున గూడ పనిచేసి దైవ సౌందర్యమును మంత్రముల రూపమున నేర్పి ఆరాధన సంప్రదాయములను క్రమశిక్షణము జేసిరి. వానిని స్వీకరించిన మానవుడు వేద గ్రంథములను అందిపుచ్చుకొనెను. సృష్టిలో మొదటి వాక్కులే సారవంతములై ఈ వేద మంత్రములుగా దర్శనమిచ్చినవి. అందు ప్రత్యక్షములైన దేవుని రూపములే దేవతలు. వేద దేవతలలో విష్ణువు, రుద్రుడు ప్రథమగణ్యులు. వారే ఉపనిషత్తులలోను, పురాణములలోను, ఇతిహాసములలోను ముఖ్యస్థాన మాక్రమించిరి. వారి ప్రభావమే వైష్ణవము, శైవము అను సంప్రదాయములుగా ప్రజలలోనికి దిగివచ్చినది. ఇది తెలియక శైవులు, వైష్ణవులు వేరువేరు మతముల వాదనుకొనుచున్నారు.

పాశ్చాత్యులలోనే గాక భారతీయులలో గూడ పూర్వాచార పరాయణులైన శైవులు, వైష్ణవులు ఇట్టి భ్రమకు లోనై వాదించుకొనుచున్నారు. వారిని చూచి శివుడు, విష్ణువు నవ్వుకొనుచుండ వచ్చును. ఇట్టి దుర్భ్రమలను పోగొట్టుకొనుటకు వేదమందలి రుద్రుని, విష్ణువును పరిచయము చేయు టొక్కటే మార్గము. ఈ సూక్తములలోని భావమును సులభశైలిలో వివరించుట దాని కుపకరించును.

ఈ సూక్తమునందు సృష్టిలోని నరులును, పశుపక్ష్యాదులును, ప్రకృతి శక్తులును, రుద్రమూర్తులుగా భావనజేయు సాధన విధానమున్నది. మానవులలో గూడ వివిధ జాతులు, వివిధ వృత్తులవారు రుద్రమూర్తులే ! యుద్ధము చేయువారు, శాంతిని ప్రసాదించువారు, దొంగలు, మోసకాండ్రు, దొరలు, సజ్జనులు, కుక్కలు, కుక్కలను పెంచువారు, అందరును రుద్ర పరబ్రహ్మము యొక్క సగుణమూర్తులే ! ఇంతకన్న విశాలతరమైన దైవభావన ఏమియుండును ? ఇంతకన్న సంసారతరణ సాధన మేముండును ?

— [రు. సూ. పరిచయము V-VIII]

## రుద్రుడు

రుద్రుడనగా రోదసి (Ether) కి అధిపతి. ఇతడు పదకొండు రూపములలో వ్యక్తమగు అంతరిక్ష దేవత. పరమాత్మయొక్క ప్రత్యక్షమూర్తులు (Tangible Entities) లో మొదటివాడు. ఒక్కొక్క బ్రహ్మాండమున దేవతలు మూడు గణములుగా వ్యక్తమగుదురు.

(అ) దివి దేవతలు లేక ఆదిత్యులు (Gods of Radiation)

(ఆ) అంతరిక్ష దేవతలు లేక రుద్రులు (Gods of Vibration)

(ఇ) పృథివీ దేవతలు లేక వసువులు (Gods of Materialisation)

ఆదిత్యులు పండ్రెండుగురు (12). రుద్రులు పదనొకండ్రు (11). వసువులు ఎనిమిదిమంది (8).

ఈ సంఖ్యలనుబట్టి వరుసగా జగతి, త్రిష్టుప్, అనుష్టుప్ అను ఛందస్సులు పుట్టినవి. పదకొండుగురు రుద్రుల రూపమున ప్రత్యక్షమగు రుద్రుడనబడు పరమాత్మతత్త్వము రుద్రసూక్తములోని వేదమంత్రములలో స్థాపించబడినది. ఈ మంత్రముతో మొదలైన సూక్తము "రుద్రాధ్యాయము" అనబడును. 'నమః' అను సంబోధనవలన దీనికి నమకము అని పేరువచ్చినది. ఇది శుక్ల యజుర్వేదమందలి పదునారవ అధ్యాయము. ఇందు పరమాత్మ యొక్క సగుణధ్యానముగా సృష్టిలోని సమస్త రూపములు ధ్యానింపబడును.

శివశబ్దమునకు శుభము, మంగళము, విశ్వశ్రేయము అని అర్థము. శివతమము అనగా అన్నిటిని మించిన శుభము. అదియే శివత్వము, శివసాయుజ్యము, బంధమోచనము అనబడును, రుద్రుడు ధరించిన ధనుస్సు మన శిరస్సున బ్రహ్మరంధ్రము నుండి ముందువైపునకు భ్రూమధ్యము వరకు నుండును ఇచ్చట మన్యువు అనబడు శక్తియుండును. శివుని ధనుస్సునకు రెండవసగము బ్రహ్మరంధ్రము నుండి వెనుకకు మెడవరకు వ్యాపించియుండును. మన శిరస్సున కనుబొమ్మల నుండి మెడవరకు అడ్డముగా వ్యాపించిన రేఖయే శివధనుస్సు. కనుకనే శివుడు కపాలము ధరించెనందురు. శిరస్సుపై నున్న ఆకాశమున గూడ ఉదయము నుండి అస్తమయము వరకు సూర్యునిదారి (Arc) శివుని ధనుస్సు. అందు అహోరాత్రములు పుట్టును గనుక, శివుడు మహాకాలుడు అందురు. మనస్సు, ఇంద్రియ ప్రవృత్తులు కపాలము క్రిందనుండి రుద్రగ్రంథి (Medulla) మీదుగా పనిచేయును. ఐదు జ్ఞానేంద్రియములను, ఐదు కర్మేంద్రియములను, మనస్సును, ఆశ్రయించి రుద్రుని 11 రూపములు వ్యక్తమగును. ఇవియే శివుని బాణములు.

– [రు. సూ. పే. 18-20]

## వజ్రము - ఇంద్రుడు - రుద్రుడు

ఇంద్రియముల కధిపతియైన మనస్సును ఇంద్రుడంటారు. ఈ ఇంద్రుడు ఆకాశంలోని మనస్సులో ఒకభాగం కనుక ఆకాశంలోని ఇంద్రుడు మాటిమాటికి జీవులలోకి ఇంద్రుడుగా సర్వదేవతలతోపాటు పిలువబడుతూ ఉంటాడు. ఈ

సృష్టిఅనే యజ్ఞంలోనికి పలుమార్లు పిలువబడుతూ ఉంటాడు కనుక ఇంద్రునికి పురుహూతుడు అను పేరు వచ్చినది (పురు = అనేక పర్యాయములు; హూతుడు=ఆహ్వానింపబడువాడు). ఇంద్రుని ఆయుధం వజ్రం. వజ్రానికి దశారము, శతారము, సహస్రారము అనే మూడు స్థితులున్నాయి. దశారము అనగా దశ+అరము=పది అంచులుగలది అని అర్థము. ఈ అంచులే ఐదు కర్మేంద్రియములు, ఐదు జ్ఞానేంద్రియములు. వీనికి నడుమనున్న మనస్సు అధిపతిగా నిర్వహిస్తూ ఉంటుంది. మనస్సుతో కలిసి మొత్తము పదకొండు గురు దేవతలు (శక్తులు) మనలో పనిచేస్తూ ఉంటాయి. ఆ పరిస్థితిలో వారిని రుద్రులు అంటారు. దేవతల లెక్కలో ఏకాదశ రుద్రులున్నారు. మనస్సనే ఇంద్రుడే రుద్రుడుగా వేదములలో కీర్తింపబడినాడు. ఇంద్రియముల ద్వారా అనుభవిస్తున్నపుడు ఆ మనస్సే ఇంద్రుడు. ఇంద్రియములను దమించి తాను వానిలోనికి అంతర్యామిత్వం పొందుతున్నప్పుడు ఆ మనస్సే రుద్రుడు. అందువలననే వేదములలో ఇంద్రుడు, రుద్రుడు, రెండువిధాల వైభవంగల ఒకే దేవతగా వర్ణింపబడినారు. ఈ సంప్రదాయాన్నే వేదవ్యాసుడు తన మహాభారతంలో వివరిస్తూ ఇలా కీర్తించాడు —

వజ్రస్య భర్తా భువనస్య గోప్తా
వృత్రస్యహన్తా నముచేర్నిహంతా ।
కృష్ణోవసానో వసనే మహాత్మా
సత్యాన్ృతే యో వివినక్తి పూర్వం ॥

యోవాజినం గర్భమపాం పురాణామ్
వైశ్వానరం వాహన మభ్యుపైతి ।
నమోస్తు తస్మై జగదీశ్వరాయ
లోకత్రయే శాయ పురందరాయ ॥

మనచుట్టూ ఒక ఆవరణలో జ్ఞానేంద్రియములు, దానికి బహిరావరణలో కర్మేంద్రియములు పనిచేస్తూ వున్న వ్యూహాన్నే ఒక రేఖాచిత్రంగా ఊహిస్తే వజ్రాయుధం అవుతుంది. ఈ వజ్రమే పరిపూర్ణమైన యోగిలోని తేజస్సును ప్రకటించే దశలో శతారము (నూరుఅంచులు గలది), సహస్రారము (వేయి

అంచులు కలది) అగు యంత్రములుగా భూషింపబడినాయి. ఈ సహస్రార మునే యోగులు యోగాభ్యాస పరమావధియైన ఏడవ చక్రంగానూ, వైష్ణవా గమము సుదర్శనమనబడు విష్ణుచక్రంగానూ కీర్తించినాయి. ఇదే సర్వతో ముఖమైన వికాసదశలో "సప్పంజరము" అనబడు ఒక రుద్రరూపంగా యజుర్వేదంలో కీర్తింపబడినది.

యజ్ఞంలో ఈ వజ్రాదికములైన ఆయుధముల ఆకారాలు ప్రత్యక్షం కావాలి. అనగా హోమధూమములు ఆయా ఆకారాలు కట్టుకొని మనకు కనిపించాలి. అప్పుడు యజ్ఞసిద్ధి కలిగినట్లు గుర్తు. అట్టి యజ్ఞం జరిగిన ప్రదేశం బహిర్వ్యాప్తమైన సిద్ధాశ్రమము. దానిని సంకల్పించే స్థానమైన మనలోని మనస్సు అంతర్వ్యాప్తమైన సిద్ధాశ్రమము. ఈ రెండు విధముల యజ్ఞాన్ని ఋషులయెడల ఫలవంతం చేసిన కారణంగా రాముడు యజ్ఞరక్షకుడు, యజ్ఞస్వరూపుడు అయిన దేవుడుగా గుర్తింపబడినాడు.

– [రా. ప్ర. పే. 68-70]

# వషట్కారము (I)

వషట్కార మనగా మంత్రముల చివర యజ్ఞప్రయోగమున 'వషట్' అని చేయు ఉచ్చారణము లేక జీవులు వసించునట్లు చేయునది. వషట్ అనగా పుట్టుక.

– [శ్రీ. భా. ప్ర. III. పే. 92]

# వషట్కారము (II)

అవ్యక్తము నుండి సృష్టి వ్యక్త స్థితిలోనికి ఉచ్చరింపబడును. అట్లు ఉచ్చరింపబడిన సృష్టిని "వషట్" లేక వసతి అందురు. అనగా వసించు చున్నదని అర్థము. క్రతువులలోను, హోమములయందు, హోతచే ఈ వషట్కారము ఉచ్చరింపబడును. అట్లుచ్చరించుట వలన అతడు తాత్కాలిక ముగా సృష్టికర్త యగుచున్నాడు. దీనిని ధ్యానముచేయుచు ఉచ్చరించువాడు పరమాత్మయందు మేల్కొనును.

(అనువాదం : డా॥ పి. జగన్మోహనరావు)

– [వి. స. నా. స్తో. పే. 2]

## వహ్ని

అగ్నికే వహ్ని అని పేరు. ''వహ్ని'' అనగా వహించుట. ఒక స్థితినుండి ఇంకోస్థితికి మార్పుతెచ్చేదే వహ్ని. పంచభూతములలో అగ్ని అనునది మిగిలిన నాలుగు భూతములకును, స్థితిభేదమును, ఒక స్థితినుండి ఇంకొకస్థితికి మార్పును కలుగజేయును. ఉదాహరణకు ఒక మంచుగడ్డను వేడిచేయగా నీరు అవుతుంది. మరలా ఈ ద్రవాన్ని వేడిచేస్తే అది ఆవి రౌతుంది. అంటే ద్రవం వాయువుగా మారుతుంది. చోటులోనుంచి పరమా ణువులు పుడతాయి. పరమాణువుల్లో నుంచి సూక్ష్మద్రవ్యం పుడుతుంది· అంటే వాయుస్థితి ఏర్పడుతుంది. దానినుంచి ద్రవస్థితి, దాన్నుంచి ఘనస్థితి వస్తుంది. అగ్నికాక మిగిలిన నాలుగు భూతముల అవరోహణ క్రమమిది. అగ్ని ఈ క్రమమున ద్రవ్యమును ఒకస్థితి నుంచి వేరొకస్థితికి తెచ్చును. అందుకని దానిని ''వహ్ని'' అంటురు. అంటే వహించువాడు అని అర్థము.

– [శ. ని. త. శా. పే. 5]

## వానరులు

వానరులు మనకు ముందుతరాలలో పరిణతి చెందని మానవులను అభి ప్రాయము కొందరికి కలదు. వానరులనగా కేవలము కోతులని వారి ఊహ. మహాప్రజ్ఞావంతులైన వానరులు రామకార్య నిమిత్తము దార్శనిక జ్ఞానము కలిగి మానవాతీతమైన శక్తులు కలిగిన తైజసులు. అనగా తేజోరూపులు. వారిని భౌతికశరీరము లేనివారిగా బ్రహ్మ సృష్టించాడు. వారు యోగులు. యోగి అనగా చిత్తవృత్తి నిరోధము చేయువాడు. బ్రహ్మకు ఒక ఆవులింత వచ్చెను. అందుండి నక్షత్రములకు అధిదేవతయైన ఒక ఆకారము ఋక్షాకృతి యైనవాడు, అతనికి కావలసి వచ్చెను. అతడే జాంబవంతుడు. ఇంద్రునిచూచి నీ అంశవలన రామకార్యమునకు తోడ్పడు కుమారుని సృష్టించమని చెప్పెను. అతనే వాలి. మహాబలశాలి. భూగోళమంతా తిరిగి సముద్రా లలో స్నానంచేసేవాడు. రావణాసురుడు ఈతనిని అవమానించినపుడు తన వాలము చుట్టబెట్టి తనస్నానం అయిన తరువాత వదిలిపెట్టగలిగిన

ప్రజ్ఞావంతుడు. సూర్యునిపిలిచి నీవుకూడా ఒక కుమారుని సృష్టించమని బ్రహ్మ చెప్పెను. సూర్యుని కుమారుడు సుగ్రీవుడు. అదేవిధంగా బృహస్పతి కుమారుడు తారుడు. కుబేరుని కుమారుడు గంధమాదనుడు, విశ్వకర్మ కుమారుడు నలుడు, యంత్రనిర్మాణము చేయగలవాడు. అగ్నిహోత్రుని కుమారుడు నీలుడు. అశ్వినీదేవతల కుమారులు మైందుడు, ద్వివిదుడు. వీరు మహాభిషక్కులు. వరుణుని కుమారుడు సుషేణుడు. వాయునందనుడు ఆంజనేయుడు. ఇలా అనేక వానరులను దేవాంశలచేత కిన్నెర, గంధర్వ స్త్రీలయందు బ్రహ్మ సృష్టించెను. వారంతా కామరూపులు; తేజోమయులు. కాని భౌతికంగా ఎలుగుబంట్లవలె, కొండముచ్చులవలె కనబడెడివారు. అందులో ఆంజనేయుడు రుద్రాంశ కలిగి అఘోరముఖముతో అనగా సౌమ్యరూపంతో ఉంటూ, శత్రువులకు మాత్రం ఘోరంగా కనిపించేవాడు. మహాబుద్ధివంతుడు, సూక్ష్మబుద్ధి, సూక్ష్మరూపము కలవాడు. రామ సుగ్రీవుల మైత్రికి కారణభూతుడు. పరాక్రమవంతుడు, పర్వతములు, చెట్లు ఆయుధములుగా ఉపయోగించువాడు. మహాధ్యానపరుడు. కాబట్టి వానరులందరూ ఇటువంటి పరాక్రమవంతులు. వారు కొన్నిదళములుగా ఏర్పడి ఒక్కొక్కగుంపు ఒక్కొక్క నాయకుడి చేతిక్రింద వర్థిల్లుతున్న సమయంలో రావణవధ గురించి రాముడు భౌతికశరీరంతో అవతరించాడు.

— [రా. ప్ర. పే. 19-20]

## వ్యాసుడు - వేద విభాగము

ఆషాఢ పూర్ణిమనాడు వేదవ్యాసుడుగా గురుపీఠ మలంకరించిన పరాశరపుత్రుడగు కృష్ణద్వైపాయనుడు బ్రహ్మవాదులైన ఋషులతో గుహాముఖమున పద్మాసనాసీను డయ్యెను. అర్ధరాత్రమున సత్యవతీదేవి జ్యోతిర్మూర్తియై వేదమయ దేహముతో సత్యవతి యనబడు పశ్యంతీ వాక్కుగా వారికి సమాధిలో దర్శన మిచ్చెను. గుహలోనికి వెడలిపోయిన పరాశరుడు పరావాక్కుగా వారందరకిని ఆత్మరూపమున అనుభూతు డయ్యెను. వ్యాసుడు మధ్యమా వాక్కుతో శ్రుతి గలిపి సరస్వతిగా వెలిగెను. మిగిలిన ఋషులను వైఖరీ వాక్కుగా స్పందింపచేసి వాగ్రూపుడై స్పృశించెను. ఆ గుహాముఖము

నుండి దిగువ లోయలమీదుగా ప్రసరించుచున్న పున్నమి వెన్నెలలతో నిండిన యాకాశము దేశ కాలాత్మకమైన గోళముగ గిరగిర తిరుగుచు వేద మయమైన అండముగా వారిని తన డొక్కలో నిలిపెను.

ఉత్తర దక్షిణ ధృవములు, ఉదయాస్తమయ సీమలైన తూర్పుపడమరలు దేశాత్మకమైన నాలుగువేదముల సంహితగా వ్యాసుని మనస్సున విభాగము పొందెను. జీవుని గమనమైన శ్వాసను వ్యాసుడు సామవేదముగా వారికిదర్శనము చేయించెను. దానిని ప్రస్తారము చేయించి గాంధర్వమగు సంగీతవిద్యను లోకమున వ్యాపింపజేయుటకై జైమినిమహర్షి నభిషేకించెను. జైమినికి దర్శనమందు సామవేద మొక వేణువునుండి వెలువడుచున్నట్లు, సాగర వనపర్వత సీమలను మాధుర్యమున ముంచెత్తుచున్నట్లు పొడచూపెను. ఆ గానమునకు సంవత్సర మండలి పగళ్ళన్నియు తెల్లని ధేనువులై, రాత్రులు కపిల గోవులై పరుగెత్తి ఎవరినో వెదకుచున్నట్లు గోచరించెను.

ఋగ్వేదము కంఠనాదమైన ప్రణవముగా, వైఖరీ వాగ్రూపుడగు వ్యాసునకు ప్రసన్నమయ్యెను. దాని విభాగములను విస్తరింపజేయు మని పైలుని ఆదేశించెను. పైలునకు ధ్యానమున ఆ కంఠనాదము ఆహతము, అనాహతము అను రెండు విధములుగా గోచరించి కాలగతిలో అహోరాత్రములుగా పనిచేయుచుండెను. అందు పగలు సూర్యరశ్మితో కూడిన సగమునకు ఇంద్రప్రమిత అని పేరుపెట్టెను. రాత్రి సగమునకు బాష్కలుడు అని పేరుపెట్టెను. అహోరాత్రమూర్తులగు ఇద్దరును తెల్లని, నల్లని రూపముల తోడి ఇరువురు బాలకులుగా గోవుల మధ్య చరించుచున్నారు. అందు నల్లనివాడు వేణుగానముగా సామమును ప్రస్తరించుచున్నట్లు తెలివి కలిగెను.

పగళ్ళు వర్షఋతువున ధారాపాతమైన వర్షమునకు చెఱువులుగా, దొరువులుగా నేర్పడుచున్నవి. వాని సమీపమున నిద్దరు బాలకులును తమ పరివారముతో తిరుగుచున్నారు. దొరువులందు, చెఱువులందు కప్పలు బెక బెక లాడుచుండగా ఆ బాలకులు గంతులుపెట్టుచుండిరి. ఆ నల్లనివాడు తన చిందులతో కప్పల బెక బెకలకు లయలేర్పరచె అనేక వైఖరులలో తాళములు మార్చుచు వేణువు నూదుచుండెను. అందుండి మాండూక్యమను వేద

సంహిత విచిత్ర గీతికలతోడి ఛందస్సులుగా శాశ్వతలోకమునుండి వ్యక్త మయ్యెను.

ముప్పది గడియల వెన్నెల రాత్రిని నాలుగు సమభాగములు చేసి ఆ నల్లనివాడు మరల నాలుగు విధములైన సంగీతములతో వేణువు నూదెను. అందలి నాలుగు గతులకును బోధి సంహిత, ఆదిమాధవ సంహిత, యాజ్ఞవల్క్య సంహిత, పరాశర సంహిత యని పైలుడు నామకరణము చేసెను. మాండూక్యగతులయందు మనస్సు లయము చెందిన శకపూర్ణుడు, వేదమిత్రుడు అను ఋషు లిద్దరును రెండు రూపములతో కాలరూపమైన వేదమును దర్శించిరి. అందు శకపూర్ణుడు అహోరాత్రముల యందలి కాలమానమును మూడు సమభాగములుగా నేర్పరచెను. అందుండి మూడు పాదముల ఛందస్సులు పుట్టినవి. అందు ఒక్కొక్క పాదమును ఎనిమిది సమభాగములుగా విడదీసి గాయత్రీ ఛందస్సును గానముచేయు విధానమును ప్రకటించెను. ఆ యిరువది నాలుగు భాగములతో రచింపబడిన సంహితలు కృతు లనబడినవి. మరల మూడు పాదములకు మూడు విధములైన గమనములు కనిపెట్టెను. వానిని వరుసగా వైతాళికము, క్రౌంచము, బలాకము అని పేర్లు పెట్టెను. అందు వైతాళికము నుండి తాళగతులు లేని ఆలాపన గీతికలు పుట్టినవి. క్రౌంచము నుండి పుట్టిన గీత సంహితలు పఠించుచున్నపుడు కణుజుపిట్టల కూతలవలె వినిపించు చుండెను. బలాక గీతములు ఆకాశమున కొంగలు బారులు తీర్చినట్లు మాత్రాగణ ఛందస్సులలో వివిధములుగా వెలువడినవి.

వేదమిత్రుడు అహోరాత్ర కాలగమనమును అయిదు సమభాగములుగా చేసెను. వానితోగూడిన యహోరాత్ర పురుషుని పంచాయుధధారియైన వేదపురుషుడుగా దర్శించెను. అంతైదింటి గాన విశేషములను వేరు వేరుగా అయిదుగురు ఋషుల కుపదేశించెను. వారు ముద్గలుడు, గోముఖుడు, వాత్స్యుడు, శాలీయుడు, శరుడు అనువారు. ఈ అయిదు సంహితలును కాలక్రమమున మహాసంహిత లనబడినవి. వానియందలి క్రమమున అధిలోకము, అధిజ్యోతిషము, అధివిద్యము, అధిప్రజము, అధ్యాత్మము అనబడు ప్రకరణములలో బ్రహ్మవిద్య సమన్వయింపబడినది. వేదమిత్రుడు కనిపెట్టిన మూడు విభాగములకు వరుసగా కాలయని, కఠాజవుడు, గార్గ్యుడు ఆచార్యులయిరి.

జీవుల కాచరణీయమైన సత్కర్మరూపమున యజుర్వేదమును దర్శించి వ్యాసుడు వైశంపాయనునకు ప్రసాదించెను. అతడు కాలస్వరూపమైన దిన చర్యను యజస్సుగా ధరించి అహోరాత్రములను ఇరువదియేడు సమభాగములుగా చేసెను. అది పద్య గద్యాత్మకమైన నక్షత్ర సంహితగా కూర్పు చేయబడెను. దానినుండి ఖగోళ పరిభ్రమణ విశేషములు ఋషిలోకమునకు వెదజల్లబడెను. కృత్తిక మొదలు భరణి వరకును గల నక్షత్రములు తన దేహ భాగములుగా నొక శిశువు రూపము దాల్చెను. అతడు అనంతకాలగుహలో నుండి వెలువడెను. గిరగిర తిరుగుచు తోడి బాలురతో వానవల్లప్పలాడుచు సంవత్సర పరిభ్రమణము చేసెను. ఈ మొత్తము విజ్ఞానమును స్వీకరించిన యాజ్ఞవల్క్యుడు తన ముఖమునుండి తేజోరూపమున ఆ మొత్తమును వెడల గ్రక్కెను. మిగిలిన ఋషులందరును ధ్యానమున దానిని గ్రోలుచుండగా తెల్లవారుజామున తిత్తిరిపక్షుల కూతలు వినిపించెను. ఆ తీతువుల కూతలతో లయ కలిపి నల్లని బాలకుడు మరియొక వైఖరిలో వేణుగానము చేసెను. అది ప్రళయాత్మకమైన వాతావరణమును పుట్టించెను. అహోరాత్రములు మున్నగు కాలమాన విభాగములు ఆయుర్దాయ స్వరూపములైన ఛందస్సులుగా వెలువడి మరల నాదములోనికి లీనమగుచుండెను. ఆ తిత్తిరిపక్షుల కూతల నుండి వెలువడిన తైత్తిరీయ మనబడు వేదసంహిత గద్యపద్యాత్మక మంత్రభాగ మయ్యెను.

సామవేదము రూపమున కాలమానమును వ్యాసుడు జైమినిమహర్షి కుపదేశించెను. దాని గమనము ననుసరించి ప్రణవము నుచ్ఛ్వాస నిశ్వాసల రూపమున న్యాసము చేసి జైమినిమహర్షి ప్రాణాయామ మనుష్ఠించెను. ఉచ్ఛ్వాసమునందు అయిదువందల మాత్రలు, నిశ్వాసమునందు అయిదువందల మాత్రలు కాలమానముగా జైమినికి సుదీర్ఘ సామమయ ఛందస్సులు గమనికకు వచ్చెను. అందుచ్ఛ్వాసమందలి అయిదువందల కాలమూర్తులును ఉదీచ్య సామగులనియు, నిశ్వాసమందలి అయిదువందలును ప్రాచ్య సామగు లనియు సంకీర్తింపబడెను. అట్టి యుచ్ఛ్వాస నిశ్వాసముల జంట నొక్కొక్క దానిని ఒక్కొక్క హంసగా ఛందస్సులను కల్పించి జైమిని గగనయానమునకు విడిచిపెట్టెను. వానిని మరల కూడదీసి గుంపులుచేసి

ఇరువది నాలుగు సంహితలుగా దర్శించెను. అందు కృష్ణపక్షములుగా పండ్రెండు గుంపులు నల్లనివి, శుక్లపక్షములుగా పండ్రెండు గుంపులు తెల్లనివి దర్శ పూర్ణిమాసముల పద్ధతిలో పంచిపెట్టబడెను. దీనినుండి సూర్య చంద్రాత్మకమైన జ్యోతిష్టోమవిద్య యుపదేశింపబడెను. అందు తెల్లని గుంపులకు శుక్ల యజుస్సు లనియు, నల్లని గుంపులకు కృష్ణయజుస్సు లనియు జైమిని నామకరణము చేసెను.

ఈ ఋషులు చేసిన దేశకాలాత్మక, నాదాత్మక ప్రయోగములలో శ్వాసలు సామలుగాను, ఋక్కులు కంఠనాదాత్మకమైన యుచ్చారణములుగాను పుట్టినవి. సామలైన శ్వాసలనుండి ఋక్కులైన సప్తస్వరములు పుట్టి సప్త ఛందస్సులుగా నిబద్ధము చేయబడినవి. అందు ఋక్కుల నుండి మరల సామలు పుట్టించబడుటలో గాంధర్వవిద్యయగు సంగీతము సప్తస్వరములతో మూడు స్థాయిలతో నేర్పడినది. వేదపురుషునకు సప్తస్వరములు పరిధులుగా నేర్పడినవి. మూడుస్థాయిలలో సప్తస్వరములు గుణింపబడి ఇరువదియొక్క సమిధలుగా సంవత్సర యజ్ఞము పురుషుని ఆయుర్దాయమునకు కాలమాన మైనది. ఋక్కులనుండియు, సామలనుండియు యజుస్సులు ఋషుల దిన చర్యగా పుట్టినవి.

ఆ తెల్లవారుఝామున సంవత్సర పురుషుని గమనమంతయు సమగ్రమైన బ్రహ్మవిద్యగా అపౌరుషేయమైన గ్రంథరూపమున పునరుద్ధరింపబడెను. అందు శుక్లపక్షములు స్త్రీలుగా, వారి నడుమ కృష్ణపక్షములు నల్లని బాలకుని రూపముగా మండలాకృతియైన నాట్య ముత్పన్న మయ్యెను. ఆ నృత్తమునకు రాసమండల మనియు, ఆ విద్యకు తాండేయ మనియు జైమిని పేర్లు పెట్టెను.

ఈ మొత్తము నొక నల్లని బాలకుడు వేణువునుండి యూదుచుండగా అవ్యక్తమైన బ్రహ్మము నదీ పర్వత వన ప్రదేశములుగా నేర్పడి అతని విహారస్థాన మయ్యెను. ఈ మొత్తము దృశ్యమును వ్యాసునితో పాటు మిగిలిన ఋషులందరును సత్త్వమయమైన ధ్యానమున దర్శించిరి. అందు చతుర్ముఖుడు, ఇంద్రుడు, సప్తఋషులు, మరువులు, సనక సనందన సనత్కుమార సనాతనులు వ్యక్తమగుచు వర్తించి, నర్తించి లీనమగుచుండిరి. ఈ మొత్తము

కాలము, చలికాలము అను విభాగము లేర్పడును. ఇదియే గాయత్రియొక్క మూడు పాదములకు వ్యక్తస్వరూపము.

ఇట్లుగాక 365 దినములుగల సంపత్సరమును 32చే భాగించినచో 11 లబ్ధము, 13 శేషము వచ్చును. 13 అను శేషము కశ్యపుని భార్యలు, దక్షుని పుత్రికలు పదముగ్గురను సూచించును. ఇన్ని విభాగములు తన యందుగల కశ్యపప్రజాపతి యీ మంత్రజపము చేయుటచే రుద్రుల తత్త్వమును తనయందు ఆవేశింపజేసుకొని తన పదముగ్గురు భార్యలతో గృహస్థుడయ్యు నిర్లిప్తుడై సృష్టి కార్యమున స్థానము పొందెనని యర్థము.

– [శ్రీ. భా. ప్ర. V. పే. 108]

## విరాట్

విరాట్ అనగా విశేషముగా ప్రకాశించునది యని అర్థము. ఒక వెలుగు ముద్ద మొట్టమొదట వెలువడును. దానిచుట్టు నున్న చీకటికన్న అది భిన్నమై యొక నూతనమైన యనుభూతిని గలిగియుండును. ఆ వెలుగునకు తానున్నానని జ్ఞప్తి కలుగును. అదియే ప్రతి సృష్టికిని మొదటి సంకల్పము. అది మన మనుదినము నిద్రమేల్కాంచు క్షణమువలె నుండును. అట్టి వెలుగుతో జేయబడిన గ్రుడ్డును విరాట్ అందురు. ఈ వెలుగు అదివరకు "స్వ" త్వమున నిమిడియుండును. అది యిట్లు బయటకు వెలుగగా తనకును చుట్టునున్న చీకటికిని స్వ, పర భేదము అనుభూతమగును. ఇందలి మొదటి వెలుగే రాబోవు సృష్టికి మొదటి వెలుగై, పుట్టబోవు జీవుడు నేర్చుకొనబోవు జ్ఞానముగా ఏర్పడును. అందుండి జీవుడు వివిధ రూపములలో జన్మించి, యీ జ్ఞానము నేర్చుకొని సంసారమనబడు వృక్షముగా విచ్చుకొనును.

పురుషుని నుండి విరాట్ కలిగెను. విరాట్‌నుండి పురుషుడు కలిగెను– అని చెప్పుట యెట్లనగా, 'నరునినుండి వీర్యము గర్భమున బడెను. గర్భము నుండి మరల నరుడే యుద్భవించెను' అని చెప్పుట వంటిది. ఇందు మొదటి పురుషుడు తండ్రి వంటివాడు, రెండవ పురుషుడగు జీవుడు పుత్రునివంటివాడు.

– [పు. సూ. పే. 11-12]

## వివస్వంతుడు

''నేను'' అనబడు వెలుగు తరగనిది. ఎప్పుడు నుండునది. ఇది మొదట వివస్వంతునిలో మేల్కొనును ఆకాశమని మనము గమనించు చోటులో ''నేను'' అను ప్రజ్ఞ మొదట మేల్కొనుటయే సూర్యు డుద్భవించుట. (దీనిని Solar Awakening అందురు.) దీనినే 'నేను' సూర్యునకు యోగము వివరించితిని, అని కృష్ణుడు చమత్కరించెను. మనము నిద్రనుండి అనుదినము మేల్కాంచుట ఎట్టిదో సూర్యు డుద్భవించుట గూడా అట్టిదే. మనము నిద్ర నుండి మేల్కాంచినపుడు మనలో 'నే' నను వెలుగు మనస్సునకు గోచరమగును. ఆ వెలుగు ''నే నుపదేశించితిని'' అని చెప్పుచున్నట్లు భావించుటయే ఇందలి మార్గము. వివస్వంతుడనగా వివిధ కిరణములతో వసించువాడని, తన వెలుగులతో నివాసమేర్పరుచుకొన్నవాడని, తనచుట్టును వెలుగుల వస్త్రము నల్లుకొన్నవాడని అర్థము. ఆకాశమున 'నే' నను ప్రజ్ఞ మేల్కొనుటయే కిరణము లేర్పడుట. ఇందు చూచువాడు వేరుగా నింకను నేర్పడకుండుటచే, చూడబడు వాడుకూడ నేర్పడక వెలుగు మాత్రముండును. అదియే యోగస్థితి.

దానినుండి సూర్యుని కిరణము వేరగుట అను స్థితి ఏర్పడును. (దీనిని Awakening of the Solar Mind.) అందురు. ఈ వేరైన కిరణములే మనువులు. ఈ గోళాకార మేర్పడగా వాని నడుమనున్న ఆకాశమే ఇక్ష్వాకువని పేర్కొనబడినది. (దీనిని Awakening of Planetary Mind of the Earth అందురు.) మనము పుట్టకమునుపున్న చోటు మనము పుట్టిన తరువాత మనలోనున్న చోటగుచున్నది కదా ! ఇట్లే ఒక ప్రజ్ఞామయ పురుషుడైన సర్వాంతర్యామి మూడు విధములుగా భాసించి వివస్వంతుడు, మనువు, ఇక్ష్వాకువు అని వ్యవహరింప బడుచున్నాడు. యోగస్థితి ఈ విధముగా మూడు స్థితులగుచున్నది.

– [శం. రా. I. పే. 124-125]

## విషువము

ఉత్తర విషువము, దక్షిణ విషువము అను రెండుభాగము లేర్పడినవి. ఈ విషువము నుండియే సంవత్సర ప్రారంభము పొగతోకూడిన మంటవలె నేర్పడుచున్నది. ఇందు పొగ, మంట యనునవి దేహములకు, ఆత్మకును లక్షణములు. దేహమువైపునకు ఆత్మతేజము దిగివచ్చునట్టి ధూమ మార్గము, ఆత్మవైపునకు దేహము వినియోగముగా వెలుగుచున్నట్టి అర్చిర్ మార్గము కలిగిన ఈ సృష్టి వర్తించుచున్నది. వీనినే ఉత్తరాయణము, దక్షిణాయణము లందురు.

(చూ. శుక్లగతి-కృష్ణగతి)

– [ను. సూ. పే. 162]

## విష్ణుతత్త్వము

(1) విష్ణువనగా అన్నిలోకముల యందును అంతర్యామిగ నున్న వెలుగు.

(2) దీనికి మూడు పాదములున్నవి. ఒకటి స్థూలసృష్టి, రెండవది సూక్ష్మప్రజ్ఞ యనబడు వెలుగు. మూడవది ఈ రెండింటియందున్న అంతర్యామి. ఇందు మొదటిరెండును సామాన్యమానవుల కంతుపట్టును. మూడవది విష్ణువున కొక్కనికే అంతుపట్టును. అనగా మానవుడు మానవుడుగా అర్థము చేసికొనుట కంతుపట్టదు. విష్ణువునందు తాను సమర్పణము కాగా తానును విష్ణువైనందు వలన అంతుపట్టును.

(3) అంతర్యామి ప్రజ్ఞయే విష్ణువు. జీవప్రజ్ఞయే ఇంద్రుడు. ఇద్దరును వృక్షము, పుష్పమువలె సృష్టికర్మను నిర్వహించుచు ఇంద్రావిష్ణువు అన బడుదురు.

(4) భౌతిక మానవదేహమున వామనుడుగా విష్ణువు పుట్టును. అతడు ఇంద్రుని సంపదను యాచించుటతో ప్రారంభించి రెండు పాదములతో భూమ్యాకాశముల నడుమ నున్నదానిని కొలచును. మూడవదియైన పరమ పదముతో త్రివిక్రముడై అంతర్యామిత్వము నొందును.

(5) విష్ణువు తన్ను దానముచేసి సృష్టి యంతర్యామి యగుచున్నాడు. జీవుని యహంకారము తనకున్నదానిని దానముచేసి బలిచక్రవర్తి యగుచున్నది. దానిని విష్ణువు తన మూడవపాదముతో ఆక్రమించి తన స్థితిలోనికి స్వీకరించుచున్నాడు. ఇంద్రుడు తన సామ్రాజ్యమైన జీవప్రజ్ఞను స్వర్గముగా పొందుచు, పోగొట్టుకొనుచు, ఇంద్రుడుగనే మిగిలిపోవుచున్నాడు.

(6) ఈ సృష్టియందు సర్వము విష్ణువే అయివుండగా – ఇతర వస్తువులు, సంబంధములు, కష్టసుఖములు, ధర్మాధర్మములును - లేనివి ఉన్నట్లు కనిపించునట్లు చేయు శక్తియొకటి యున్నది. అదియే శాంబరి యనబడు మాయ. దాని కధిపతి శంబరాసురు డనబడు అజ్ఞానము.

(7) నవద్వారములతో దేహములు కోటలుగా అల్లిన శంబరాసురుడు 9 సంఖ్యచే తెలియబడుచున్నాడు. ఇంద్రుడు 'నేను' అనబడు 1 సంఖ్యచే తెలియబడుచున్నాడు. అతడు విష్ణుప్రజ్ఞ యగు పూర్ణత్వము నుండి (0 నుండి) ఉద్భవించుచున్నాడు. అతడు యుద్ధమున శంబరుని తాకుట వలన శంబరుని కోటలు మాయమై ఇంద్రావిష్ణువులు మిగులుచున్నారు. ఈ సూత్రము $9+1=10$ అను సత్యమున దర్శనమిచ్చును.

(8) ఇంద్రుడు విష్ణుని ధ్యానించుట యోగవిద్య అనబడును. దీని వలన ఇంద్రునకు శంబరాసుర వధ సాధ్యమై జీవులు పరమపదమును అనుభవించుచున్నారు.

– [వి. సూ. పీఠిక]

## వృత్రాసురుడు

త్వష్టప్రజాపతి కుమారుడు త్రిశిరుడు తపస్సు చేయుచుండగా, అతని తపశ్శక్తిచేత తన పదవికి భంగం వస్తుందేమోనన్న భయంవల్ల ఇంద్రుడు వాని శిరస్సును ఖండించెను. అది తెలిసిన త్వష్టప్రజాపతి కోపించాడు. ఒక మహాయజ్ఞంచేసి ఈ బ్రహ్మాండం అంతా నిండిపోయే ఒకభూతాన్ని సృష్టిచేసి ఇంద్రుడిపైకి పంపాడు. ఆ భూతమే వృత్రాసురుడు. అధికారపు హోదాలో తనకు అపకారం చెయ్యనివానిని, తపస్సంపన్నుని చంపిన ఇంద్రుని

అధర్మమే ఆ వృత్రాసురుని ఆకారంలో అతనిమీదికి వచ్చింది. దేవతలందరితో కలిసి ఇంద్రుడు వృత్రాసురుని ఎదిరించబోయి దానిలోపలికి వెళ్ళిపోయాడు. అధర్మంవల్ల అంకురించిన అంధకారం అనే వృత్రాసురుని గర్భంలో చీకటి వాళ్ళందర్నీ ఆవరించింది.

ఇంద్రుడు ఏమీ ఆలోచనలు తట్టక మూఢుడై పోయాడు. అప్పుడు బృహస్పతి ఉపదేశపూర్వకమైన తనవాక్కు శక్తితో ఇంద్రునకు వివేకం కలుగజేశాడు. వజ్రాయుధాన్ని గూర్చి వానికి ప్రబోధం చేశాడు. వజ్రాయుధ నిర్మాణం ఎలా జరగాలో ఆ విధానాన్ని బ్రహ్మ ఉపదేశించాడు.

దధీచి అనేమహర్షి మహాదాత, ఆశ్రితవత్సలుడు. అతడు తపస్సు చేసుకుంటున్నాడు. ఆయన వెన్నెముకతో వజ్రాయుధం తయారు చెయ్యాలి. దేవతలంతా ఆ మహాముునిని ప్రార్థించి, వాని వెన్నెముకను దానం చెయ్యమని కోరారు. ఆయన అంగీకరించి శరీరం విడిచాడు. ఆయన వెన్నెముకతో వజ్రాయుధం తయారైంది. దానిని ప్రయోగించి, ఇంద్రుడు వృత్రాసురుని చంపాడు. ఇందులో ఒక చక్కని పురాణతత్త్వం ఉన్నది. మనలోనున్న ధీశక్తియే, (బుద్ధిబలము, వివేకము) దధీచి మహర్షి. ఆ శక్తి నాధారము చేసికొని యోగసాధన చేయటంవల్ల మనలో వజ్రమువంటి ఆత్మజ్ఞానం ఆవిర్భవిస్తుంది. దానితో అహంకారం, మూర్ఖత నశిస్తాయి.

వృత్రాసురవధ కథ శాశ్వతమైన మానవకథ. అది మనందరిలో ఎల్లప్పుడూ జరుగుతూ ఉండాలి. కనుకనే వేదాలు, బ్రాహ్మణాలు, పురాణాలు, కావ్యాలు మొదలైన మహాగ్రంథాలన్నిటిలో ఈ కథ వర్ణింపబడినది. పాశ్చాత్య పురాణాల్లోకూడా పురాణపురుషుడు Dragon అనే మహాభూతాన్ని చంపటం, రక్షకుడు సైతానును జయించటానికి శ్రమపడటం విస్తారంగా వర్ణించబడ్డాయి. ఋగ్వేదంలో వర్ణింపబడ్డ ప్రధానకథల్లో వృత్రవధ ఒకటి. అందులో ఇంద్రుడు వృత్రాసురుణ్ణి నరికి ముక్కలుచేసిన వెనుక దట్టమైన డుంగలమధ్య వాని శరీరఖండాలను పడవైచి దగ్ధంచేసినట్లున్నది.

'అతిష్ఠంతీ నామ్ అనివేశనీనామ్
కాష్ఠానామ్ మధ్యే నిహితం శరీరం.' — ఋగ్వేదము

దీని అర్థం ఏమిటంటే —

అతిష్ఠంతీనామ్ = అస్థిరములైనవానికి;

అనివేశనీనామ్ = సందు లేక పేర్చబడినవానికి;

కాష్ఠానామ్ = దుంగలకు; మధ్యే = నడుమను;

శరీరం = (వృత్రుని) దేహము; నిహితం = ఉంచబడినది.

ఇందులో చక్కని అంతరార్థం వున్నది. కాలమానంలో క్షణంలో అంతర్భాగాన్ని కాష్ఠ అంటారు. కాలరూపుడైన ఇంద్రుడు భూతరూపుడైన (పంచభూతాల రూపంలోవున్న) వృత్రుని (ఆవరణమయ దేహము గల వానిని) చంపెను. అనగా భౌతిక జగత్తులోని అస్తిత్వాన్ని సూక్ష్మరూపమైన ప్రజ్ఞ కరిగించి తనలోకి మార్చుకుంటూ ఉంటుంది. కనుక ఎక్కడా స్థాయి లేకుండా తీవ్రవేగంతో ప్రయాణం చేస్తున్నది. అతి సూక్ష్మమయినవగు ఈ కాష్ఠలు, అను కాలవిభాగము నడుమ ఈ మన భౌతికశరీరము ఉంచబడి స్థూలసృష్టి నడుస్తూ వున్నది అని సమన్వయం. భౌతికమైన పదార్థం తాత్కాలికంగా అచేతనం (అందులోని చైతన్యం సుప్తావస్థలో ఉంటుంది). కనుక మేల్కొంచిన చైతన్యానికి ఇది తాత్కాలికంగా శత్రువు. ఆ చైతన్యంచుట్టూ ఈ స్థూలపదార్థం వృత్రములు (పొరలు)గా క్రమ్ముతూ వుంటుంది. అది ఆసురశక్తి [అసు+ర+శక్తి=ప్రాణములను కొనివచ్చునట్టి లేక సంబంధించునట్టి శక్తి.] ఇంద్రుడు వృత్రాసురుని చంపటం అనగా చైతన్యం జడపదార్థాన్ని తనలోకి మార్చుకొనటం అని అర్థం. ప్రకృతిలో ఎల్లప్పుడూ జరుగుతూ ఉంటుంది. మనలో ఈ పని యోగాభ్యాసంవల్ల జరుగుతుంది.

వృత్రాసురుణ్ణి సంహరించిన వెనుక గొప్ప ఆకలి ఇంద్రుని ఆవరించింది. అతనికి బ్రహ్మహత్యాపాపం అలముకొన్నది. అప్పుడు దేవతలు, ఋషులు కలిసి పుణ్యతీర్థములలో ఇంద్రుణ్ణి స్నానంచేయించారు. అనగా ప్రాణమయ శరీరంలోవున్న ఇంద్రియాధిష్ఠాన దేవతలు, ఇంద్రియాతీతులైన ఋషులు కలిసి వెన్నెముక ఆధారంగా చేసిన సాధనవల్ల జీవునకు ఆకలిదప్పులను, జననమరణములను దాటించే జ్ఞానతీర్థంలో స్నానంచెయ్యటం సంభవిస్తుంది. దేవతలూ, ఋషులూ తోడ్పడి శరీరంలో ఉండి గంగ, యమున,

సరస్వతి (ఇడ, పింగళ, సుషుమ్న) అను పుణ్యనదులు సంగమించిన, హృదయోద్భవమైన దివ్యప్రేమ ప్రవాహంలో స్నానం చేయించుతారు.

– [రా. ప్ర. పే. 39-43]

## వృత్రుని కథ - అంతరార్థము

నారాయణ కవచరూపమున తన కంతర్యామిత్వము నుపదేశించిన వానిని హత్యచేయుటలో వృత్రాసురుడు పుట్టెను. ఇచ్చట అసురత్వ మింద్రునిది; అసురబాధ పొందిన వాడింద్రుడు. దానికి నిమిత్తమైన కర్మఫలమే వృత్రుడు. వృత్రునిలో నున్నది నారాయణ ధర్మమేగాని అసురధర్మము గాదు. కనుకనే ఇంద్రునకు వృత్రుడు నారాయణ ధర్మము నుపదేశించును. మన శత్రువుగా పనిచేయువాడు గూడ నారాయణుని మూర్తులలో నొకడే. మన అజ్ఞతనుబట్టి వానితో శత్రుమిత్రత్వాదు లేర్పడుచున్నవి. ఈ కథలో రాక్షస ప్రవృత్తి కలవాడు ఇంద్రునిగను, వానిని బాధపెట్టినవాడు పరమ భాగవతోత్తముడుగను వర్ణింపబడినది. కర్మబంధము అని అర్వాచీన వేదాంతులచే ఏది వివరింపబడెనో అదియే వేదఋషులచేత వృత్రకథగా చెప్పబడెను.

కాలస్వరూపమై వృత్రుని శరీరమున్నదనియు దానిని మంచి సంస్కారములతో దహించినచో రజస్తమస్సులు దగ్ధమై త్రైగుణ్య విషయమైన వేదము నిస్త్రైగుణ్యముగా వెలుగొందునని అర్థము. ఈ కథలోని మరియొక రహస్యమేమనగా వృత్రాసురపీడ ఇంద్రుని మనోధర్మము నాశ్రయించి యున్నదిగాని, వృత్రుని దేహము నాశ్రయించలేదు. ఇట్టి పవిత్రమైనకథ వేదములమీదుగా ఉపనిషత్తులమీదుగా ఇతిహాస పురాణములలోనికి వచ్చినది. ఈ కథయొక్క హృదయము భాగవతమునందు వివరింపబడినంత విశదముగా ఇతర పురాణేతిహాసములలో వివరింపబడలేదు. కొంచెము శ్రద్ధాసక్తులతో చదువుకొనువారి నీకథ క్షాళనము చేయును. అసురధర్మమును పోగొట్టి భాగవత ధర్మమును ప్రసాదించును. ఈ కథ సర్వజనాదరణీయమైన ఆధునికలోకమున పరమభాగవత ధర్మమును విస్తృతిచేసి కర్మబంధమునుండి జీవులను రక్షించును.

– [శ్రీ. భా. ప్ర. XV. ఉపోద్ఘాతము VII-VIII]

# వేదము (1)

ఈ సృష్టి సమస్తమును నడుపుచున్న విజ్ఞానకోశము. ఇది సృష్టిలో అంతర్యామిగా నిమిడియున్న సృష్టిధర్మములను సృష్టించుచుండును. దీనిని బ్రహ్మయనికూడా అందురు. దీనిని గూర్చిన గ్రంథములను గూడా వేదములు అందురు. అవి వేదవ్యాసునిచే నాలుగుగా విభజింపబడినవి. సృష్టి ధర్మములలో ఈ విభాగమంతయు ముందునుండి దర్శింపబడినదిగాని, గ్రంథమును విభజించుట వేదవ్యాసుని కాలమున జరిగినది.

**వేదములు నాలుగు :** ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అధర్వణవేదము. ఒక్కొక్క వేదమునకు మంత్రభాగము (సంహిత) బ్రాహ్మణము (బృంహాణము లేక వివరణము), ఆరణ్యకము (అరణి విద్య), ఉపనిషత్తు (మోక్షధర్మము నుపదేశించునది) అని నాలుగు భాగములుండును. ఉపనిషత్తును తెలియనివారు వేరే వాఙ్మయమని భ్రమపడుదురు. సంహితల నుండియు, ఆరణ్యకముల నుండియు సంతరింపబడిన మోక్షవాక్యములే ఉపనిషత్తులు. ఈ భ్రమ కలిగిన వెనుక కొన్ని ఉపనిషత్తులు వేరుగా రచించుట జరిగినది. ఈ నాటికీ జరుగుచున్నది.

– [శ్రీ. భా. ప్ర. I. పరిశిష్టము 414-15]

# వేదము (2)

వేదము మూడు విధములు. ఋక్కు, యజుస్సు, సామము. అందు స్తుతిరూపములైన వాక్కు (సంకల్పము నుండి యావిర్భవించుచున్న వాక్కు) "ఋక్కు" అనబడును. గాన స్వరూపమగు నాదానంద వాక్కు 'సామ' మనబడును. అది గానము చేయబడుటలో గల యక్షర గణగణన జ్ఞానము, తాళలయలు, గతులు మున్నగునవి 'ఛందస్సు' లనబడును. ఆ వాక్కులోని యనుభవమునే యజ్ఞములోనికి సమన్వయము చేసినచో అది 'యజు' స్సనబడును.

వేదమంతయు మొదట అఖండమైన వాక్కు. అది మనలో ఆవిర్భవించి మన కంఠమున ఉచ్చరింపబడుటకు వ్యక్తమగు సమయమున ఋక్కుగా

సాక్షాత్కరించును. దానిని నుచ్చరించుటకు శ్వాసగా వర్తించు మన ప్రాణ స్పందన మొకగానము. అదియే సామము. ఉచ్చరించు విధానమంతయు ఛందస్సులు. ఉచ్చరింపబడిన వాక్కులోని అర్థము యజ్ఞముచేయుట యందలి విధానమును మనకు దెలియజేయును. ఈ స్థితిలో దానిని యజుస్సందురు. ఋక్కులోను, సామలోను సర్వమంత్రములును పాదములలో బద్ధమై యుండును. యజుస్సులలో మాత్రము కొన్ని పాదబద్ధములు. కొన్ని అపాద బద్ధములైన వాక్కులు.

ఈ విధానమున మొదట ఋగ్వేదము, తరువాత సామవేదము, తరు వాత యజుర్వేదము పుట్టినవని తెలియుచున్నది. కాని యీ ఋగ్వేదము సర్వహుత మనబడు యజ్ఞవిధానమునుండి పుట్టినది గనుక యజుర్వేదము నుండి పుట్టినది. ఈ మూడు నొకదాని నుండి యొకటి వ్యక్తమగుచు మూడును గలిసి ప్రణవాకారమై అవ్యక్త లోకములందు నిలిచియుండును. లోకములు వ్యక్తమగునప్పుడివి మూడును నొకదానివెంట నొకటి చొప్పున మూడు విధములుగా వ్యక్తమగును. అనగా యజుస్సునుండి ఋక్కు, ఋక్కు నుండి సామము. సామమునుండి మరల యజుస్సు వ్యక్తమగుచుండును. ఋగ్వేదమన్నిటికన్న ముందు పుట్టినదియని చరిత్రకారులు చేయు ఊహ బాహిరము.

ఈ మూడును ప్రతిజీవి యందును సర్వవేళల నుండును. అధిప్రజమగు యజ్ఞమున జీవి యజుస్సుతో పురుషసూక్త విధానమున గర్భమందు బద్ధు డగును. అతడు జన్మించిన క్షణముననే సంకల్పము కంఠధ్వనిగా రూపొం దును. ఆ ధ్వనిని ఉచ్చరించుటతో శ్వాసయను గాన మారంభించును. ఆ శ్వాసబలమున చైతన్యముకలిగి క్రమముగా బహిరంతర్లోకముల ప్రజ్ఞ వికసించుటలో అహోరాత్రాది కాలమానము, ఋతు సంవత్సరాదిమానము జ్ఞాతమగును. ఇది సంగీత శాస్త్రజ్ఞునకు క్రమముగా లయ జ్ఞానము దర్శన మిచ్చుట వంటిది. అటుపై నతడు మొదట ఉచ్చరించిన వాక్కునే అర్థవంత మైన వాక్కుగా వాడుట కారంభించి, జీవిత విధానమునంతయు ఆ వాక్కు వలననే తెలిసి యనుసరించును. ఇట్టి ఉదాహరణములు, దృష్టాంతములు,

ఉపమానముల సాహాయ్యమున ఈ పురుషసూక్తము నందలి హృదయమును క్రమముగా అవగతము చేసికొనవలెను.

ఋక్కు, సామ, యజుస్సు అను మూడింటికి సంబంధమే త్రయీవిద్య. దీనివలననే అఖండమగు వాక్కు, ప్రణవము, అకార-ఉకార-మకారములుగను అఖండమగు కాలము, భూత భవిష్య ద్వర్తమానములుగను, క్రియాశక్తి సమన్వితుడైన అఖండాంతర్యామి పురుషుడు, ప్రథమ పురుష, మధ్యమ పురుష, ఉత్తమ పురుష మనబడు విభాగములుగను, సృష్టిలో వ్యవహరింప బడుట జరుగుచున్నది. ఒకే పురుషుడిట్లు మూడు వర్ణములుగా వీక్షింప బడుటనే 'త్రిపద, గాయత్రీ ఛందస్స'ని మంత్రద్రష్టలగు ఋషులు చెప్పు చున్నారు. ప్రణవోపాసనము వలన ఇందలి రహస్యము సమ్యగ్దర్శనమై అనుభూతిలోనికి వచ్చును. ప్రణవోచ్చారణ రహస్యములన్నియు శతపథ బ్రాహ్మణము నందును, ఛాందోగ్యోపనిషత్తు నందును గలవు.

(చూ. వ్యాసుడు — వేదవిభాగము)

— [పు. సూ. పే. 21-24]

## వేదము - జీవుడు

జీవులకు జ్ఞానము కలుగుటకుకూడ వానిలోనున్న పరబ్రహ్మ జ్ఞానమే కారణము. అది తన హృదయ స్పందనముగా, ప్రాణాపానములుగా, శ్వాసగా, నాదముగా, వాక్కుగా, శబ్దార్థములుగా వెలువడును. దాని యర్థ మంతయు భగవంతుడే. దానినుండియే ఆచరింపబడు కర్మలును వాని ఫలిత ములును, వెలువడుచుండును. వానివెంట ప్రయాణముచేయు మనస్సు వాని లోని అంతర్యామియైన భగవంతునినుండి వేరుగా పరుగెత్తుట కారంభించును. అప్పుడు వాక్కుయొక్క శబ్దార్థములు తన కల్పన ననుసరించి సృష్టించుకొన బడును. సహజముగా శబ్దము వేదమై పరబ్రహ్మమునే యుపదేశించుచున్నను, దానిని వాడుకొని జీవుడు తన యర్థముల యందన్వయించుకొనును. దానికి ఫలితముగా తానాచరించుకొనదలచిన కర్మలును, దానియందు తానభిలషిం చిన ఫలితములును అల్లుకొనును. అనగా జీవుడు మూఢుడగును, మోహము చెందిన వాడగును.

ఎదుటనున్న వస్తువును మరచి, దానితో చేయబడిన వస్తువును గుర్తుంచుకొనుట మోహము. మట్టిని మరచి కుండను గుర్తుంచుకొనుట, మానవుని మరచి యొక మతస్థునిగా, నొక కులమువానిగా మున్నగు విషయములను గుర్తుంచుకొనుట, అట్లే మానవుని మరచి శత్రువుగా లేక చుట్టముగా గుర్తుంచుకొనుట, మోహమున కుదాహరణములు. శబ్దమయమగు వేదమును మనము సంకేతించుకొనిన శబ్దార్థములుగా, వివిధ శాస్త్రాదులుగా గుర్తుంచుకొనుట వలన జీవుడు మూఢుడగుచున్నాడు. శాస్త్రాదుల నభ్యసించుటకు ఈ మూఢత్వ మావశ్యకమేయైనను, అందంతర్యామిని మరచి, శాస్త్రాదులను గుర్తుంచుకొనుట భేదములను పుట్టించును గనుక దుఃఖహేతు వగుచున్నది.

– [శ్రీ. భా. ప్ర. III. పే. 26]

## వేదము - త్రేతాగ్నులు

పావకుడు, పవమానుడు, శుచి యనువారు త్రేతాగ్నులు. త్రేతాగ్నులు అనగా మూడగ్నులని సామాన్యార్థము. త్రయీవిద్య అనబడు వేదమున అంతర్యామిగా వర్ణింపబడిన అగ్నినుండి యీ ముగ్గురును పుట్టుదురు. అందు పావకుడు దగ్ధముచేయు నగ్ని (Combustion), పవమానుడు వాయువునుండి పుట్టిన అగ్ని (Pulsation or Respiration), శుచి యనువాడు ద్రవ్యమును నిజస్వరూపముగా పరిశుభ్రము చేయు నగ్ని (Burning Flame). ఈ మూడగ్నులను గూర్చి వేదములు, అందు ముఖ్యముగా అగ్నిసూక్తములు చెప్పుచున్నవి. వానికి శాస్త్రీయమైన వివరణము మొట్టమొదటగా ఆంగ్లమున Blavatsky రచించిన "Secret Doctrine" అను గ్రంథమున నొసగబడినది. అందు ఆమె గురువు జ్వాలాకూలుడు చెప్పిన అంశములున్నవి. తరువాత ఇరువదియవ శతాబ్దమున ఈ జ్వాలాకూలుడే తన శిష్యురాలగు Alice A. Bailey ద్వారా "A Treatise on Cosmic Fire" అను మహా గ్రంథముగా వివరించెను.

ఈ మూడగ్నులలో ప్రాణమయుడైన రెండవఅగ్ని ద్రవ్యమయమైన దేహమునందు వర్తించును. అందు ప్రాణమయ కోశమువలన ప్రాణాపాన గతులు, అన్నమయకోశము వలన ద్రవ్యపరిమాణము గరిమ వర్తించును.

ఇంక శుచియను అగ్నివలన జీవించియున్న దేహములకు శుచిత్వము సిద్ధ మగుచున్నది. జన్మమను యజ్ఞమునందు పావకుడు దక్షిణాగ్నిగను, పవమా నుడు ఆవహనీయముగను, శుచి యనువాడు గార్హపత్యముగను వర్తించు చున్నారు. అందు దక్షిణాగ్ని దేహమునకు దక్షిణము లేక దిగువగా నుండి దాంపత్యమునకు కారణమగుచున్నది. ఆహవనీయము మేధాశక్తికిని, గార్హ పత్యము ఆహారపచనమునకును అధిపత్యము వహించుచున్నవి. ఈవిధముగా మనుష్యగర్భమున పుట్టియు వారు ముగ్గురును తమ ప్రభావము వలన అగ్నులుగానే పనిచేయుచుండిరని చెప్పబడినది. ప్రభావము అనగా ప్రభ లేక ప్రకృష్టమైన వెలుగని చమత్కృతి.

(చూ. త్రేతాగ్నులు)

– [శ్రీ. భా. ప్ర. XI. పే. 3-4]

## వేదవాదరతులు

కృష్ణుడు చెప్పిన వేదవాదరతులు, భౌతికవాదులు. ఓట్లు బిచ్చగాంద్ర వంటివారు. గీతలో కృష్ణుడు నిందించినది వేదవాదులనే కాని వేదములను కాదు. వేదోక్తకర్మలు స్వర్గఫలము కొరకు చెప్పబడినవి అని వాదించు దరిద్రులు వేదవాదులు. అమూల్యమగు వేదమును దాని వినియోగమును తెలియలేక క్షుద్రముగా వినియోగించువారు – టెంకాయకొట్టి కొబ్బరి పార వైచి, పెంకును నూరి ఉంగరములు చేసికొని అలంకరించుకొనువారి వంటి వారు. ఇందు దోషము వారిదేగాని వేదమునకు సంబంధించినది కాదు.

– [శం. రా. I. పే. 33]

## వేదసూక్తములు - విష్ణుని అంతర్యామిత్వము

విష్ణుసూక్తములను శ్రద్ధతో అధ్యయనము చేయువారికి సామర్థ్యము, దర్శనజ్ఞానము, సంపద, ఆరోగ్యము, మోక్షప్రాప్తి కలుగును. పురుష సూక్తము, జీవుడను పురుషునియందు దర్శనమిచ్చుచున్న పరమపురుషుని దర్శింపజేయు పురుషోత్తమ ప్రాప్తియోగము. శ్రీ సూక్తము నామరూప

గుణాత్మకమైన ప్రకృతిలోని పరాప్రకృతిని జగన్మాతగా స్థాపించుచున్నది. రుద్రసూక్తము ఈ దృశ్యప్రపంచమందలి సమస్త రూపములను అంతర్యామి రూపములుగా స్థాపించుచున్నది. సరస్వతీసూక్తము ఈ సృష్టి సమస్తమును సృష్టికర్తయొక్క ఉచ్చారణ రూపమైన వాక్ప్రవాహముగా దర్శింప జేయుచున్నది. ఇన్నిటి యందలి అంతర్యామిని విష్ణుసూక్తము స్థాపించుచున్నది.

— [వి. సూ. పీఠిక]

## వేదార్థము

వేదమునందు వేదార్థమే ప్రధానముగాని అభిదార్థము, లక్షణార్థము, వ్యంగ్యార్థము ప్రధానముకావు. వ్యంగ్యార్థము మాత్రమే ప్రాధాన్యము వహించినపుడు దానిని ధ్వనియందురు. ఈ ధ్వనిభాషలోనే కథాంశములు, రహస్యములు బోధించినచో దానిని వేదార్థమందురు.

— [అ. దే. ఉపోద్ఘాతము]

## వేది

వేది యనగా యజ్ఞవేదిక లేక యజ్ఞమునకు కేంద్రమున గల అరుగు. సృష్టి యజ్ఞమున సూర్యుడే యజ్ఞవేదిక. వానిచుట్టును సృష్టియజ్ఞము జరుగుచుండును. వానియందే అగ్నిహోమస్వరూపమై యుండుచు, కిరణాది వ్యూహముల రూపమున దేవతలను, లోకములను వెలువరించుచుండును. నరునిలోని "ఇది" అనబడు భాగ మెచ్చటనున్నదో అదియే యజ్ఞవేది; అదియే ఈ దేహమనబడు పృథివీతత్త్వమునకు పరమైన అంతము లేక మిక్కిలి లోపలి భాగము. ఇది శిరస్సున భావమయముగా నుండును. కనుక శిరస్సే ఈ దేహమున యజ్ఞవేదిక.

— [సు. సూ. పే. 142]

## వైవస్వతుడు

సూర్యునియొక్క పుత్రుడు వైవస్వతుడు. పురాణములలో గూడ యముడు సూర్యునియొక్క పుత్రుడుగా వర్ణింపబడ్డాడు. శరీరం వదిలిపెట్టటాన్ని మనం మృత్యువని పొరపాటుగా పిలుస్తున్నాం. దీని రహస్యమేమిటంటే మృత్యువనేటు వంటిది లేదు. శరీరములు వస్తూపోతూ వుండటం సహజం. నిద్రరావటం, నిద్రనుంచి మెలకువ రాపటం ఎలా మృత్యువుకావో, అలాగే శరీరం వదలిపెట్టటం, శరీరం ధరించటంకూడ మృత్యువు కాదని తెలియ జేయటం అనేది కఠశాఖలో ప్రస్తావనమైనటువంటి భాగం. ప్రకృతిలో జరుగుతున్న ప్రక్రియలను పరిశీలిస్తే అసలు నిజమేమిటో తెలుస్తుంది. మనకు నిద్రరావటం, మెలకువ రాపటం ఎలా మృత్యువుకావో, శరీరం వదలి పెట్టటం, ధరించటంకూడా అలాగే మృత్యువుకాదు. వేటినైతే జనన మరణా లనుకుంటున్నామో అవి నిజంగా జననమరణాలుకావు. ప్రకృతిసిద్ధమైన సహజ ప్రక్రియలు.

– [క. ఉ. పే. 5-6]

## శతధన్వుడు

నూరుధనుస్సులు కలవాడనగా నొకేమారు నూరు ధనుస్సులయంత ప్రయోగముతో దుష్టసంహారము చేయువాడు. మరియు అక్షము, ధనుస్సు అను పదములకు సంకేతార్థమున్నది. చక్రాకారమైన ఆకాశపరిధికి సూర్యుడు కేంద్రము. కేంద్రమునుండి పరిధికి ప్రసరించు కిరణములదారులు అక్షములు (Spokes). సూర్యునిచుట్టును గ్రహాదులు తిరుగుట కేర్పడిన మార్గములు ధనుస్సులు. వేదవాఙ్మయమున ధనుస్సు, ధన్వ అను పదములు పరిధి భాగములకు (Arcs) పర్యాయములుగ వాడబడినవి. సూర్యుడు వేలకిరణము లతో అక్షములుగా దారులేర్పరచి చక్రాకారమైన తారాత్మక సృష్టిని సంవత్సరమూర్తిగా త్రిప్పుచున్నాడని భావము.

– [రు. సూ. పే. 71-72]

## శిపివిష్టుడు

జలములను పానము చేయునవి సూర్యకిరణములు. వానియందు అంతర్యామిగ ప్రకాశించి భూమికి జీవుల రూపమున దిగివచ్చి మరల దప్పిక రూపమున జలములను పానముచేయు వివిధ మూర్తులు కలవాడు. ఇచ్చట సృష్టి స్థితి లయములలో స్థితి కారకుడైన అంతర్యామి లేక విష్ణుమూర్తి అని యర్థము. కనుకనే "శిపివిష్టుడు" అనగా విష్ణువని పురాణములు కీర్తించును. నారాయణుడు అను పదమున కిది వ్యాఖ్యానము. నారము అనగా జలములు. జలములే తమ అయనములు లేక మార్గములుగా కలవాడు నారాయణుడు. ఈ అయనములు ఉత్తరాయనము, దక్షిణాయనము అని రెండువిధములు.

– [రు. సూ. పే. 72]

## శుక్లగతి - కృష్ణగతి

సూర్యోదయము నుండి మరల సూర్యోదయము వరకుగల కాలమును రెండు భాగములు చేయగా రెండవభాగము రాత్రి. రాత్రికాలమున జీవుడు చక్షురింద్రియ ద్వారమున బాహ్యప్రపంచమున చీకటి అనుభవించును. ఈ కాలవిభాగమునందు అనగా రాత్రియందు భూమిపైనున్న జీవులకు సూర్య బింబము క్రిందివైపున తిరుగుచుండును. ఈ స్థితిలో పృథివీతత్త్వమునకు పైస్థానము, సూర్యునకు క్రిందిస్థానము ఏర్పడును. అనగా ఆత్మజ్ఞానమునకు క్రిందిస్థానము లేక దానియెడల జీవికి నిద్రావస్థ అగుచున్నది. రాత్రికిని, నిద్రకును, సృష్టియొక్క భౌతికస్థితికిని, జీవియొక్క మృత్యు స్థితికినిగల సామ్యమును సంప్రదాయజ్ఞులు సాధించిరి. దీనికన్నిటికిని దక్షిణాయనము తోను, కృష్ణపక్షముతోను సామ్యమున్నది. వీనిస్థితి ననుభవించు జీవప్రజ్ఞ కృష్ణగతిలో పోవుచున్నదందురు. ఇదియే పితృయానము. పగటికిని, జాగ్రదవస్థకును, జీవచైతన్యమునకును, శుక్లపక్షమునకును ఉత్తరాయణము నకును అట్టి సామ్యమే ఉన్నది. ఈ స్థితి ననుభవించుచున్న జీవిని శుక్లగతి పొందుచున్నాడందురు. "ఇవి రెండును జగత్తునకు శాశ్వతమైన దారులు" అని భగవద్గీత చెప్పుచున్నది.

– [సు. సూ. పే. 66-67]

# శింశుమార చక్రము

శింశుమార మనగా నొకజాతి తాబేలు. శింశుమార చక్రమనగా తాబేలు దేహాకారముగా నూహింపబడిన తారకా చక్రము. ఆకాశమున మనకు కనిపించు తారకలు అసంఖ్యాకములు. అందొక్కొక్కటి యొక్కొక్క సౌర కుటుంబము. అందు మనకు మిక్కిలి దగ్గరగానున్న తారకయే మన సూర్యుడు. మిగిలినవానిలో మన సూర్యునికన్న మిక్కిలి పెద్ద తారకలు కూడ చాలాగలవు. [జ్యేష్ఠ (Antares) అను తారక మనకందుబాటులో నున్న వానిలో మిక్కిలి పెద్దది. కనుకనే జ్యేష్ఠయని దానికి పేరుపెట్టిరి].

ఇట్టి తారకలు సౌరకుటుంబము పైనను, తద్ద్వారమున భూమిపైనను ప్రభావము చూపుచుండును. భూమిపైగల జీవరాసులు, అందు నరులు, వారి జాతుల ప్రత్యేక లక్షణములు ఈ తారకలచే ప్రభావితమగుచుండును. అంతేకాదు, అరుదుగా కొందరు వ్యక్తులుకూడా ఒక్కొక్క తారకా ప్రభావమున పుట్టుచుందురు. వారు నరజాతికి కావలసిన కొన్ని ధర్మములను ప్రవేశింపజేసి స్థాపింతురు. రాముడు, కృష్ణుడు, బుద్ధుడు, మైత్రేయుడు, మాస్టర్ సి.వి.వి. మొదలైనవారు అట్టివారు. వారు కాలకాలములందును భూమికి దిగివచ్చి ధర్మసంస్థాపనము చేసిపోవుటను గూర్చిన కాలజ్ఞానమంతయూ యీ తారకల జ్ఞానముపై నాధారపడి యున్నది. మనకొక్కొక్క తారక ప్రభావము తెలిసిన కొలదియు కాలజ్ఞానము కలుగును.

ఇతిహాస పురాణములలో చెప్పబడిన కథలలో చాలావరకు ఈ తారాకా ప్రభావముల కర్తవాదములున్నవి. భాగవతమున దీనికి కావలసిన విజ్ఞాన మంతయు పంచమస్కందమున నివురుగప్పిన నిప్పువలె యున్నది. ఈ తారకల స్థానములను ప్రత్యేకముగా గుర్తించుటకై ఒక్కొక్కదానికే సార్థకమైన నామకరణము. కొన్ని తారకల గుంపుల ఆకార విశేషములు వర్ణింపబడినవి. అట్టి వాటిలో ముఖ్యమైనదే ఈ శింశుమార చక్రము. భూమిమీద నిలబడి చూడగా భూమధ్యరేఖకు ఉత్తరము వైపునగల ఆకాశపు డిప్పయందలి తారకా వ్యూహము ఇందు చెప్పబడినది. మన ఉత్తరధ్రువమున కెదురుగా ధ్రువతార యున్నది. దానికన్న ఎత్తుగా మనకు కనిపించు తారకలులేవు. కనుక ధ్రువ

తారనుండి మనవైపునకు దిగువుగా ఈ గుంపు గుర్తింపబడినది. తోకచివర ధ్రువతారయుండి పైనుండి దిగువుగా దిగుచున్న తాబేలు అకారములో మిగిలిన తారకలన్నియును దేహస్థానముల యందుపదేశింపబడినవి. దీనితోక నుండి సూటిగా దిగువ మన భూమియొక్క ఉత్తర ధ్రువమున్నది. దీనినుండి దక్షిణ ధ్రువమునకు పొడిగింపబడిన రేఖనూహించినచో మేరుదండమన బడును. ఈ మేరుదండమును ఉత్తరముగా పొడిగించి ధ్రువతారకు కలిపినచో తాబేటిని రెండు సమభాగములుగ చూపించురేఖ యేర్పడును. దాని వర్ణనమే ఈ శింశుమార చక్రముగా యీ రేఖకు అటునిటు తారకలు న్యాసముచేసి చెప్పబడినవి.

— [శ్రీ భా. ప్ర. XIII. పే. 19-20]

## శ్రీ

దక్ష సంతతులైన సంసారబద్ధులలో శివశక్తి ప్రాణస్వరూపిణియై యుండును. సంసారమందలి మానావమానములను భరింపని స్థితికి తెచ్చి జీవునకు వైరాగ్యము కలిగించి, యోగమార్గము పట్టించును. దానితో జీవునకు దేహసంబంధము తెగిపోవును. ఈ శక్తినే శ్రీవిద్యాపరులు "శ్రీ" యందురు. తాంత్రికులు కుండలిని యందురు.

— [శ్రీ. భా. ప్ర. VIII. పే. 51]

## శ్రీ చక్రము - ఒక సమన్వయము

పురుష దేహమునకు ద్వారములు తొమ్మిది. స్త్రీ దేహమునకు సంతతిని కనుటకు పదియవ ద్వారము కల్పింపబడినది. ఇది తంత్ర శాస్త్రమున గుప్తముగా ఈ దిగువ విధమున సంకేతింపబడినది :

1 = జీవుడు; 9 = పురుషదేహము; 10 = స్త్రీ దేహము. జీవుడు దేహము ధరించినపుడు 1+9=10. ఇచ్చట 10 అనగా జీవుడును, అతడు గర్భస్థుడైన అండము. స్త్రీ పురుషులు భౌతిక సంయోగము చెందినపుడు 9+10=19=1+9=10. స్త్రీ గర్భమును ధరించి సంతతిని కనుట కిది

సంకేతము. ఇందు పనిచేయు సంఖ్యలే గర్భధారణమునకు పనిచేయు దేవతలు. మనము వినియోగించు నట్టివి అంకెల బొమ్మల పేర్లుగాని అంకెలు కావు. అంకెలు బొమ్మలకును పేర్లకును అందవు. అవి ప్రకృతిలోని ప్రజ్ఞలైన దేవతలే కాని మన కందునట్టి బొమ్మలును, పేర్లును కావు. కనుకనే లోక వ్యవహారమున మన మెరిగిన జీవు లందరును పేర్లు, ఆకారములు మాత్రమే కాని జీవులు కారు. వానియం దంతర్యాములై జీవులుందురు. వారు విత్తన ములుగా నుండగా వారియం దంతర్యాములై అంకెలుగా నుందురు. వారే ప్రజాపతు లనబడు దేవతలు.

తంత్ర గ్రంథములలోని అంకెల తత్త్వమునకును, పురాణములలోని ప్రజాపతుల సర్గమునకునుగల చక్కని సంబంధమును బుద్ధిమంతులుధ్యానమున సాధింపవలెనే గాని అది పుస్తకములలోని కెక్కదు. ఈమొత్తము తత్త్వమును 'శ్రీ విద్య'గా ప్రదర్శించిన ఆదిశంకరులు సౌందర్యలహరిలో యీ దిగువ విధముగా వివరించిరి :

శివుడు శక్తి=2; త్రిమూర్తులు=3; వారి శక్తులు లేక భార్యలు=3; పరాశక్తి=1. మొత్తము 2+3+3+1=9. ఈ తొమ్మిది తత్త్వములను శ్రీ చక్రమందలి తొమ్మిది త్రిభుజములుగా నుపదేశించిరి. అందు నాలుగు త్రిభుజములు శ్రీకంఠులు లేక ఊర్ధ్వ ముఖములు. అయిదు త్రిభుజములు శివయువతులు అధోముఖములు. వీనితో నవాత్మ యనబడు తొమ్మిది యంకెల తత్త్వమైన సృష్టి మూలము 9×3=27 నక్షత్రములుగా నేర్పడి చంద్రుని గమనముతో స్త్రీ గర్భకారణమై 28వ దినము ఋతుకాలమైనది. స్త్రీ స్వరూపమైన మాతృదేవత పదునారు చంద్రకళలను స్వీకరించి, జీవుల చైతన్యముగా విచ్చుకొనుచు షోడశి యనబడుచున్నది. ఒక్కొక్క కళ నాలుగు వాక్కుల యుచ్చారణగా వ్యక్తమగుచు 16×4=64 అల్లికలుగా సృష్టి యేర్పడినది. ఇవి సృష్టిదారముల అల్లికలు. అల్లిక యనుటకు సంస్కృతమున తంత్ర మని పేరు. ఇవియే చతుష్షష్టి తంత్రములు. అంతే గాని 64 గ్రంథములని గాదు. ఇన్నిటియందు అంతర్యామిగా స్వతంత్రమైన నీ తంత్ర మున్నది అని శంకరుడు అమ్మవారిని స్తుతించిరి.

భూమి, జలము, వాయువు, అగ్ని, ఆకాశము అనునవి పంచభూతములు. మనస్సు, బుద్ధి, అహంకారము అనునవి పంచభూతములతో చేయబడిన యంత్రములు నడుపుటకు పెట్రోలు వంటివి. ఈ ఎనిమిదియు నా ప్రకృతులని భగవద్గీతలో కృష్ణుడు జెప్పెను. ఇవి కాక తొమ్మిదవది నా దివ్య ప్రకృతి యనియు, అదియే జీవులకు తల్లి యనియు కూడ చెప్పెను. ఇదియే ఆదిశంకరులు చెప్పిన అమ్మవారు. ఇన్నిటియందు గల అంతర్యామియే అయ్యవారు లేక భగవంతుడు. కనుకనే అమ్మవారు అయ్యవారు అతని అంతర్యామిత్వములోనివే. "నేనే యీ సృష్టికి తండ్రిని తల్లిని సృష్టికర్తను తాతను," అని కృష్ణుడే గీతలో చెప్పెను.

— [శ్రీ. భా. ప్ర. పే. 64-66]

## శ్రీనివాస విద్య

పురుషసూక్తములతోబాటు శ్రీ సూక్తమునకు స్థానమున్నది. "సహస్ర శీర్షా" యని ప్రారంభించు పురుష సూక్తమునకును, "హిరణ్యవర్ణామ్" అని ప్రారంభించు శ్రీ సూక్తమునకును మొదటి అక్షరములైన "స" కార "హ" కారములలో "సోహం" అను మంత్రము దర్శింపబడినది. ఇది మానవుల ఉచ్ఛ్వాస నిశ్వాసముల యందు సహజమైన హంస మంత్రమై యొప్పారుచున్నది. సోహం అను మంత్రమున ప్రణవమైన ఓంకారము దాగియున్నది. అది ఎట్లనగా సోహం మంత్రములోని హల్లులైన, 'స' కార 'హ' కారములను తొలగించినచో 'ఓం' అని మిగులును. దీని నాధారముగాగొని శ్రీ సూక్త, పురుష సూక్తముల యుపాసనా సంప్రదాయ మొకటి యేర్పడినది. అది యెట్లనగా పురుష సూక్తమున అనుష్టుప్ ఛందస్సులో నున్న మొదటి పదునైదు ఋక్కులను, శ్రీ సూక్తమందలి మొత్తమైన పదునైదు ఋక్కులను స్వీకరించి విదర్భితముచేసి గానము చేయుదురు. కృష్ణపక్షమున మొదట పురుషసూక్తములోని మొదటి మంత్రమును తరువాత శ్రీ సూక్తములోని మొదటి మంత్రమును అటుపైన పురుష సూక్తములోని రెండవ మంత్రమును ఈ విధముగా అల్లికచేసి గానము చేయుదురు. శుక్లపక్షమున శ్రీ సూక్తమున మొదటి ఋక్కుతో ప్రారంభించి అట్లే చేయుదురు. ఇట్లు నలుబది దినములు

ఉపాసించుచు మారేడు చెట్లక్రింద నివసించి, భిక్షాటనముచేసి, మారేడు దళములతోను, పద్మములతోను హోమము చేయుదురు. అనుదినము మంత్రాంతమున భాగవతములోని నారాయణ కవచము పారాయణచేయుదురు. దీనివలన భోగ మోక్షప్రదమైన వెలుగు భక్తు నావేశించి, ఏడుతరముల వరకు నిహపర సౌఖ్యప్రదమగును. ఈ యుపాసనాక్రమము "శ్రీనివాస విద్య" యందురు. తిరుపతి యందలి వేంకటేశ్వరుని పీఠము ఈ మార్గమున ప్రతిష్ఠితమైనదని యొక సంప్రదాయము. దీనికి నిదర్శనముగా ప్రతి శుక్ర వారము వేంకటేశ్వరునకు మారేడు దళములతో నభ్యంగనము జరుగు చుండెడిది.

– [శ్రీ. సూ. పరిచయం 5-6]

## శ్రీ విద్య

మోక్ష విద్యలలో మొదటిదిగా తంత్రములయందు పేర్కొనబడిన శ్రీ విద్యకు శ్రీ సూక్తమే మూలము. శివశక్త్యాత్మకమైన సృష్టి తంత్రమున, శివుడు నిర్వికారుడు గనుక శక్తినే శ్రీమూర్తిగా నారాధించుట, ఆమెను పరమాత్మగా దర్శించుట శ్రీ విద్యయొక్క సారాంశము. ఇక పదునెనిమిది పురాణములను, ఉపపురాణములను పరిశీలించినచో లక్ష్మీ వైభవమును వర్ణించుట, లక్ష్మిని స్తుతించుట లేనిగ్రంథము లేదనియే చెప్పవలెను. "కమలనయన ! నీవు కలవాడు – కలవాడు ! లేనివాడు – నీవు లేనివాడు!" అని శ్రీనాథుడు కాశీఖండమున వ్యాసుడు చేసిన కొల్హాపుర లక్ష్మీస్తుతిలో కీర్తించినమాట సత్యము. లోకమున సంపదను మానవుల మనస్సులచే ప్రసారము చేయించగల ధనమునకే ఎంత వ్యామోహమున్నదో మనము చూచుచున్నాము. ఇకదానికి మూలమైన వస్తుసంపదపై మానవునకు గల భావబలమెంతటిదై యుండవలెను ? దానిని సక్రమమైన మార్గమున నిలిపి న్యాయపథమున నిహపరసౌఖ్య సమన్వయము చేయగల శక్తియే శ్రీ దేవత. కనుక జ్ఞానులకు శ్రీ సూక్తముపై నింతటి విలువయుండుట, ఫలా పేక్షగల యజ్ఞానులకు దానిపై ఇంత వ్యామోహముండుట సహజమే యనిపించును.

– [శ్రీ. సూ. పే. 6-7]

# శ్రీ సూక్తము

శ్రీ సూక్తమని ప్రసిద్ధిచెందిన ఈ మంత్రమయ మహాసూక్తము ఋగ్వేదము నందలి పరిశిష్ట సూక్తములోనిది. భరతభూమి యందు ఆసేతు హిమాచలము వ్యాప్తిలోనున్న వేదసూక్తములలో నిదియొకటి. ఇందు కీర్తింపబడిన దేవత శ్రీదేవి. వేదసంప్రదాయము ననుసరించి దేవతలనగా దేవుడగు పరబ్రహ్మమునకు ప్రతినిధులైన మూర్తులు. వేదములందు, ఉపనిషత్తుల యందు, పురాణముల యందు, తంత్రముల యందు, స్తోత్రముల యందు కీర్తించబడిన దేవతలు పలువురున్నను, దేవుడొక్కడేయనియు, దేవతలందరు వాని రూపాంతరములనియు భారతీయ సంప్రదాయము.

వేదము ననుసరించి భగవంతుడు పురుష మూర్తిగను, స్త్రీ మూర్తిగను దర్శింపబడెను. సృష్టిలో జీవులు స్త్రీ పురుషభేదమున వర్తించుచుండుటయే దీని సత్యత్వమునకు నిదర్శనము. దేవుడు సత్యత్వమున కతీతుడు. వాని నుండి దేవతలు నుద్భవించుటకు కావలసిన శక్తియొక్కటి వానియందే యిమిడియుండ వలెననుట బుద్ధికి సహజముగా గోచరించు సత్యము. అట్టి శక్తిని వేదములలో అదితి అనిరి. ఆమెనుండి దేవతలును, సమస్తమును జన్మించుట జరుగుచున్నది. వారిలో శ్రీదేవి యను దేవత నామము, రూపము, పరిణామములతో సృష్టి సంపదగా వ్యక్తమై అంతర్యామి వైభవముగా వర్తించును. ఈ దేవత పరమాత్మయొక్క విష్ణుతత్త్వము నాశ్రయించి యుండుటచే శ్రీదేవి యని పిలువబడును. లక్ష్మి యనగా లక్షణము లేక చిహ్నము. నామరూపాది చిహ్నముల కధిదేవత యగుటచే లక్ష్మియనియు వ్యవహరింపబడును. సూర్యమూర్తియగు భగవంతుని కిరణరూపమును ఆశ్రయించి యుండుటచే హిరణ్మయి, సూర్య అను పేర్లతోగూడ వ్యవహరింపబడును. వెన్నెల రూపమున చంద్రు నాశ్రయించి యుండుటచే చంద్ర యనియు కీర్తింపబడును.

సుప్రసిద్ధమైన శ్రీ సూక్తము భోగ మోక్షప్రదమైన మంత్రోపాసనగా భారత భూమియందు భక్తిమార్గ మవలంబించిన యాస్తిక బృందముచే నుపాసింపబడుచున్నది. ప్రత్యేకముగా శ్రీ సూక్తము పారాయణ చేయుట

తంత్ర ఆగమ వైదికమార్గములలో యజ్ఞస్వరూపముగా, వ్రతహోమాది నిష్ఠలతో ననుష్ఠానము చేయుట, మరియు నే దేవతోపాసనము నందైన శ్రీ సూక్త విధానమున షోడశోపచార పూజ చేసికొనుట యను వివిధ మార్గములలో దీని వినియోగము సుప్రసిద్ధము. తంత్రోపాసనాక్రమమున ఆయురారోగ్య ఐశ్వర్యాది ఫలసిద్ధికోరి వ్రతానుష్ఠానము చేయువారు నియమిత కాలము మారేడు చెట్టుక్రింద నివాసముండి. మారేడు పండ్లను ఆహారముగా స్వీకరించి, మారేడు ఆకులతో హోమతర్పణము చేయుమార్గ మొకటికూడా కలదు. "వనస్పతిస్తవ వృక్షోఽథ బిల్వః" అను శ్రీ సూక్త వాక్యమున దీని సూచన యున్నది. వేదమార్గ ప్రతిష్ఠాపకులైన శ్రీ విద్యారణ్యస్వామి ఈ యుపాసన చేసి సిద్ధుడై యొక కొండగుహాలోవుంచి బంగారమును త్రవ్వించి, విద్యానగర రాజ్యస్థాపనకై హరిహర బుక్కరాయలకు తోడ్పడినట్లు జనపరంపర కూడా కలదు.

— [శ్రీ. సూ. పరిశయం పే. 3-5]

## సగరపుత్రుల కథ - అంతరార్థము

అనంతతత్త్వము మహావిష్ణువని, పరమశివుడని, పరబ్రహ్మమని, పరాదేవియని ఆయా మతాల శాస్త్రజ్ఞులచే వివిధములైన పేర్లతో వ్యవహరింపబడుతుంటుంది. దానినుండి సృష్టి సంకల్పం బయలుదేరిన వెనుక పరమాణువులు సృష్టింపబడతాయి. అవి ఎల్లప్పుడు ఒకేక్రమం ననుసరించి ఆకారాదికము కల్పించుకుంటాయి. (నీటినుండి మంచుగడ్డలు కట్టుకొన్నట్లు, పానకం నుండి పటికబెల్లం అచ్చులు కట్టినట్లు, సముద్రజలమునుండి ఉప్పురాళ్ళు కట్టినట్లు కట్టుకుంటాయి. ఈ వివిధ పదార్థముల స్ఫటికములకు దేని నిర్దిష్ట రూపాదికము దానికి ఉంటుంది.) ఈ పరమాణువుల నుండి అణువులు మొదలైనవి కట్టుకుంటాయి. అనంతతత్త్వమైన మహావిష్ణువు నుండి పరమాణువులు కట్టుకునే సంకల్పశక్తి రజస్సనబడుతుంది. ఇది బ్రహ్మతత్త్వము. మరల సృష్టి పూర్తిఅయిన వెనుక ఈ అణువులు లీనమవుతాయి. ఇలా లీనమయ్యేశక్తి తమస్సు అనబడును. ఇది రుద్రాత్మకము. ఈ రెండుశక్తులను సృష్టి, లయము అంటారు. ఈ నడుమ ఉన్నదానిని స్థితి అంటారు. అది సత్త్వగుణాత్మకము.

అది విష్ణుశక్తి అనబడుతుంది. ఈ మూడుశక్తులు త్రిమూర్త్యాత్మకములు. సృష్టికి ముందున్న మహావిష్ణుత్వమే ఈ స్థితిలో విష్ణుశక్తిగా భాసించి, సకల జగన్నాటకమునకు అధ్యక్షత వహిస్తుంది. కనుకనే వేదాలు విష్ణువును స్తుతించే సూక్తాలలో ఆ తత్త్వము మాత్రచేత పరమము (పరిమాణమునకు అవ్వలనున్నది) అనియు, రజస్సులను నిర్మాణము చేయునది అనియు, మూడు పదములలో విక్రమించునది అనియు స్తుతించారు.

ఈ మహాశక్తి అణువులు కట్టుకొన్నది మొదలుగ మరల అణువులు భస్మమయ్యే వరకుగల స్థితులకు రెండువిధములైన కొలతలు ఉన్నాయి. అందు ఒకటి దేశాత్మకము. ఇది అండాకారముగ వర్తిస్తుంది. రెండవది కాలాత్మకము. ఇది మండలాకారముగ వర్తిస్తుంది. అందు మొదటిది పరిభ్రమణాత్మకమైన సంకల్పకేంద్రము నుండి ప్రకృతి పరిధివరకు తేజోరూపంలో వ్యక్తమవుతూ ఉంటుంది. ఈ వ్యక్తత్వంలోని గమనంలో కాలపరిభ్రమణం వర్తిస్తూ వుంటుంది. ఈ మొత్తం దేశకాలాత్మకమైన తత్త్వం సగరుడుగ ఈ కథలో రూపించబడినది. అందు ఒక మండలాకృతమైన పరిభ్రమణం మొత్తం ఆరు సంఖ్యచేత అధిష్ఠింపబడి వుంటుంది. (సంఖ్యలన్నీ సృష్టి నిర్మాణాత్మక దేవతా ప్రజ్ఞలలో ఒకగణము.) ఈ సృష్టి వర్ధిల్లడము పదేసి పదేసి సంఖ్యలుగ జరుగుతుంది. (పురుషుడు దశాంగుళుడుగా వ్యక్తమగునని పురుషసూక్తము చెప్పుచున్నది. అందుచే మండలాత్మకమైన ఒక సృష్టి అంతము అరవై సమభాగములుగ విభజించబడినది. $(6 \times 10 = 60)$. దీని ననుసరించియే మన ప్రాచీనులు అహోరాత్ర పరిణామమును అరవై ఘడియలుగ అందొక్కొక్క ఘడియ 60 విఘడియలుగ విభజించినారు. మొత్తం $(60 \times 60 = 360)$ అంతర్భాగాలు. దీని ననుసరించియే పరిభ్రమణాత్మకమైన మానవునకు మూడువందల అరవై భాగలు (డిగ్రీలు) వచ్చినవి. ఈ మానంలోనే జ్యోతిశ్చక్రము (రాశిచక్రము) వర్తిస్తుంది. ఇక దీనిఅభివృద్ధికి సంబంధించిన దశాంగుళత్వమైన మానము $6 \times 10 = 60$. $60 \times 10 = 600$. $600 \times 10 = 6000$. ఇలా అంతులేకుండా విచ్చుకొంటుంది. అందు మూడులోకములలో మూడుపర్యాయములుగ విచ్చుకొన్న ఈశక్తుల మొత్తము అరవైవేలమంది సగర పుత్రులుగ రూపింపబడినది.

మహావిష్ణువు స్థితికారకుడైన విష్ణువుగా దిగివచ్చిన వెనుక ఈ సృష్టి లోని దేశకాలాత్మక తత్త్వములలో అంతర్లీనుడై కనబడకుండ వుండిపోతాడు. దానినే కృష్ణతత్త్వము అని, నీలదేహము అని, కపిలవర్ణము అని వివిధములుగ శాస్త్రములు కీర్తించినవి. అందు కపిలుడనగా సృష్టి తత్త్వములోని అంతర్భాగములకు, తద్ జ్ఞానమునకు అధిపతి. ఆ జ్ఞానమునే ప్రాచీనులు సాంఖ్యమందురు. సృష్టి అండంలోకి విష్ణువుగ దిగివచ్చినపుడు అతడు మొట్టమొదట సృష్టితత్త్వములను వేర్వేరుగా ఏర్పరచి కేకతో ఆహ్వానించినట్లు సంకల్పించి ఆకారాదికములకు, సంఖ్యా పరిగణనాత్మక సాధనములకు ప్రథమ కారణమవుతాడు. అట్టి స్థితిలో అతనిని విశ్వకర్మ అని వేదములు, కపిలుడని ఉపనిషత్ పురాణాది శాస్త్రములు సంకేతించినవి. సంకల్పాత్మకముగ అతడు దేవతలను కేకపెట్టి పిలిచిన ఉచ్చారణమే పురుషమేధము అనబడే యజ్ఞంలో కేకఅయి ప్రకృతిని సకల సృష్టికిమాతగా, జీవుని శరీరముగా ఏర్పాటుచేస్తుంది. దేవతకొరకై ఇలాపెట్టే కేకనే దేవహూతి అని పురాణములు సంకేతించినవి. కపిలుడు సాంఖ్యశాస్త్రమును భూమిపై ప్రవర్తింప చేయడానికి దేవహూతి గర్భంలో బాలుడై జన్మించాడు. అతడు గర్భస్థుడైనపుడే దేవహూతిని పిలిచి ఇరువదినాలుగు తత్త్వములుకల జగన్నిర్మాణమును బోధించునట్లు భాగవతాది పురాణములు ఉపదేశించుచున్నవి. ఈ విధంగా సృష్టిలో యజ్ఞాత్మకమైన కర్మను ప్రవర్తింపజేసే శక్తులను సిద్ధులు (Principles) అంటారు. కపిలుడు ఈ కారణంచేత ఒక మహాసిద్ధుడు. యోగసిద్ధిచేత ఈ స్థితిని దర్శించినవారిని కూడ సిద్ధులంటారు. అది సామాన్యార్థము. యజ్ఞప్రవర్తకులు అయిన దైవశక్తులను సిద్ధులని వ్యవహరించుట విశేషార్థము. ఈ సిద్ధులు దేవతలకన్న పైస్థాయిలోనివారు, దైవములనబడువారు. ఈ కపిలుని గూర్చి చెప్పుచునే భగవద్గీతలో శ్రీకృష్ణుడు అర్జునునకు తన విభూతులను తెలుపుచు "నేను సిద్ధులలో కపిలుడను మునిని," అని చెప్పెను. కపిలుడు తల్లి కుపదేశించిన సాంఖ్యాత్మకమైన జ్ఞానములోని ఇరువదినాలుగు తత్త్వము లేవనగ పంచభూతములు, పంచకర్మేంద్రియములు, పంచజ్ఞానేంద్రియములు, పంచతన్మాత్రలు, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అనబడునవి. వీని కవ్వల ఇరువది అయిదవవాడు పురుషు డనబడు తానే.

దేశకాలాత్మగములై అంతర్భాగములన్నియు పరిభ్రమించి వచ్చి పురుషుడైన ఈ కపిలునియందు లీనమవుతాయి. దానినే సగరునిపుత్రులు అరువదివేలమంది కపిలుని దృష్టిలో భస్మమయినట్లుగా నిరూపించటం జరిగినది. సృష్టికిముందు సమస్తమయిన తత్త్వము సమానమైన వేగాత్మకమై ఉంటుంది. అది కదలియు కదలదు. దానియందు అంతరము నుండియు నుండదు. (All Neutral). ఈ తత్త్వము దేశకాలాత్మకంగా సదా వక్రత పొందినపుడు సమమైన తన వేగాత్మకతను కోల్పోతుంది. ఈ మార్పునే అసమంజసుడు (అ+సమ+అంజసుడు) అని పేర్కొనుట జరిగినది. ఈ మార్పునుండి సూర్యాత్మకమైన కిరణము మహాకాశమునుండి వ్యక్తమగును. ఈ మార్పునే అంశుమంతుడని చెప్పినాడు. ఈ విధంగా సూర్యవంశము యొక్క మొదటిశక్తుల అవతరణము కీర్తించబడినది. సూర్యవంశము అనగా ? సూర్యుని కిరణములనుండి దిగివచ్చిన వంశమని మాత్రమేకాదు. సూర్యులు నిర్మాణం కావడానికి పూర్వముకల దేవతాత్మక శక్తుల వంశక్రమమని అర్థము. సూర్యాత్మకము, చంద్రాత్మకము అయిన తేజస్సులు సృష్టి సంకల్పము ప్రారంభమునుండి ఉన్నాయి. వాని వ్యక్తరూపములైన గోళాకారాలే మన మెరిగిన సూర్యుడు, చంద్రుడు.

– [రా. ప్ర. పే. 95-100]

## సత్త్వస్థితి

వ్యవసాయాత్మకము కాని బుద్ధి అనేక శాఖలుగా పెరుగెత్తును. దాని వలన కామ, క్రోధ, భయ, లోభాదులు మనస్సుయొక్క వికారములుగా నుద్భవించి, బహుశాఖలుగా పెరుగెత్తుచుండును. వివిధ కర్మలు నిర్దిష్ట ఫలముల కొరకేయని విశ్వసించు స్వర్గపరులు ఎప్పుడును దుస్థితిని పొందుచున్నారు.

లోకమున ఆచరింపవలసిన కర్మల నంటియే వాని యనుభవరూప విజ్ఞానముండును. ఆ యనుభవము భోగైశ్వర్య దృష్టి మూలమున మనస్సు కలుషితమైనపుడు తానుపొందు విజ్ఞానముకూడ కలుషితముగా నుండును.

ఈ కాలుష్యము సత్త్వరజస్తమస్సులు అనబడు త్రిగుణముల యొక్క సమ్మిశ్రమమున నేర్పడిన తన ప్రకృతి ననుసరించి యేర్పడును. అట్లు జ్ఞానమంతయు త్రిగుణముల లక్ష్యములుగా కలుషితమగుచుండును. జ్ఞానమే వేదము. బుద్ధియోగము పొందనివారికి ఈవేదము తన త్రిగుణములచే కలుషితమగును. అట్లుకాక కర్మాచరణ కౌశలమునందు లోకహితార్థమై మనస్సును వినియోగింపగా, ఆ మనస్సుతోపాటు త్రిగుణములు కరిగిపోయి వేదము పరిశుద్ధముగా భాసించును.

మనస్సునుండి పనిచేయు కామాత్మునకు ద్వంద్వములు సాక్షాత్కరించును. ద్వంద్వములనగా సుఖదుఃఖములు, లాభాలాభములు, జయాపజయములు మున్నగు జంటలు. మనస్సుతో పనిచేయుచున్నంతకాలము నివి తప్పవు. వీనినుండి బుద్ధిలోనికి చేరుకొనుటయే సత్త్వస్థితి. ఫలితమునుండి మనస్సు లోకహితమునకు చేరుకున్ననేగాని ఇది సాధ్యముగాదు.

— [శం. రా. I. పే. 36-37]

## సన్న్యాసి

కర్మలను సన్యసించుట, కర్మల నాచరించుట అను రెండిటిలో సామాన్యముగా కర్మల సన్యసించిన వానిని సన్న్యాసి అందురు. కర్మలనగా మనము చేయునవి అయినచో నిది సత్యమే. కాని కర్మలు, మనచే చేయబడునవికాని, మనము చేయునవి కావు. చేయుట, చేయకపోవుట అనునది ఇష్టానిష్టములనుబట్టి ఏర్పడదు. కొన్ని చేయవలెనని అనుకొని కూడ మానుదుము. చేయరాదు అనుకొనికూడ కొన్నిటిని చేయుదుము. ఈ పనులన్నియు మన స్వభావము ననుసరించి ప్రకృతి మనచే చేయించుకొనునుగాని, మనము చేయుట, మానుట అనునది సత్యముకాదు. కర్మలాచరింపక మానినచో మానుటవలన స్వభావము సన్యసింపదు కదా! కనుక కర్మల నాచరింపక మానుటవలన ఫలములపై సన్న్యాసము రాదు. ఫలాపేక్ష విడచుట నభ్యసించుచు, సత్కర్మ లాచరించుట వలన అహంకార మమకారములు తొలగును. ఇదియే సన్న్యాసము.

— [శం. భా. I. పే. 171-172]

## సప్త కిరణములు - సప్త స్వరములు

సప్తస్వరములు స్త్రీలుగను, సప్తకిరణముల ప్రజ్ఞలు పురుషులుగను వర్ణింపబడిరి. ఈ ఏడుగురిలో ఆరుగురు జంటలుగా వర్తింతురు. సప్తస్వరములలో షడ్జము మిగిలిన ఆరు స్వరములకును మాతృకమైన స్వరము. ఇది ఆరు స్వరములను పుట్టించుచు ఆరు స్వరముల యందును పుట్టును. రంగులలో నీలము ఆకాశము. దానినుండి మిగిలిన ఆరు రంగులును పుట్టుచున్నవి. నీలము కలిసి ఏడై తెలుపున లీనమగుచున్నది. షడ్జమునుండి బయలుదేరిన ఆరు స్వరములకు తర్వాత మరల రెండవ షడ్జముండును. మొదటి షడ్జమునకు ఆరు స్వరములును బిడ్డలవంటివి. తెలుపు రెండవ షడ్జము వంటిది. రంగులలో నీలము, స్వరములలో షడ్జము ప్రత్యేకత వహించియుండగా, మిగిలిన ఆరు స్వరములలో ఆరురంగుల జంటలు, వర్తించుచున్నవి. స్వరమునుండి రంగు పుట్టుట, రంగునుండి స్వరము పుట్టుట వేదవిద్య యందు ప్రసిద్ధము.

— [సు. సూ. పే. 76-77]

## సప్తతంతువు

సత్యలోకమున నేర్పడుచున్న సప్తతంతువు అనబడు యజ్ఞరహస్యము వేదఋషులచే సుపర్ణసూక్తమున దర్శింపబడినది. ఏడురంగుల కిరణముల తోను, సప్తస్వరములతోను అల్లిక చేయబడియున్న సృష్టి యజ్ఞము ఇందు వర్ణింపబడినది. సూర్యుని రూపమున నేర్పడిన సృష్టిదేహమైన రథమునకు సప్తతంతువులుగా నివి కట్టబడియున్నవి. దేవతలకుగూడ తెలియనట్లు నిహితమై యున్నవి. వానినుండి ఏడురంగులు, ఏడు స్వరములు, ఏడు లోకముల ప్రజ్ఞలు పుట్టి వెలువడుచున్నవి. అవి నరదేహమున సప్తధాతువుల నల్లుచున్నవి. ఈ అల్లిక పడుగుపేకలుగా దేహనిర్మాణము జరుగుచుండగా, దానికి కారణములై సూర్యునినుండి ఏడుదారములు దిగివచ్చుచున్నవి. కనుక నిలువుపోగులుగా వర్ణింపబడినవి. వీనివలననే వెన్నెముక ఏర్పడి అందు షట్చక్రములు, సహస్రారము అనబడు ఏడు కేంద్రము లేర్పడు చున్నవి. ఇవి ఏడు విధములైన ప్రజ్ఞలకును, వానినుండి వెడలుచున్న

శక్తులకును ముడులుగా నేర్పడినవి. తల్లిగర్భమున ఈ వెన్నెముక యందు ఏడుచోట్ల దారములతో కట్టి బిగింపబడినట్లు వెన్నెముక నిర్మింపబడి దాని చుట్టును దేహమల్లబడును.

— [సు. సూ. పే. 44-45]

## సప్తర్షులు - సూర్యులు

తాము ఆచరించవలసిన ధర్మముల తత్త్వములను, తమ్ము నియమించిన వాని తత్త్వమును చర్చించినవారు సప్తర్షులు. అనగా ప్రజ్ఞలు. వీరే మానవు నిలో కూడా ప్రజ్ఞలుగా పనిచేయుచు, మనస్సు ద్వారమున ప్రకాశించి శాస్త్రముల పుట్టుకకు, అధ్యయనమునకు, బోధపడుచు కొనుటకు కారకులగు చున్నారు.

వీరు దేవతలనుండి పుట్టినవారుగా చెప్పబడిరి. వెలుగులనుండి పుట్టిన వారని అర్థము. ఈ వెలుగులు లేక దేవతలు సూక్ష్మలోకములలో కేవలము ధర్మములుగా నుండును. వారినుండి ఉద్భవించు ప్రజ్ఞలే ఋషులు. ఋషుల వలన సృష్టిధర్మముల క్రమము గుర్తింపబడి కూర్పు చేయబడును. దేవతల వలన సృష్టియజ్ఞమునకు ప్రవర్తనము, వినియోగము కలుగును. దేవతలు సౌరకుటుంబములను, జీవులను సృష్టింతురు. వానిని నివాసములుగా గొని ఋషులు ధర్మాచరణమునకై (సృష్టిధర్మముల ప్రవర్తనమునకై) వ్యక్తమగు చుందురు. దేవతత్త్వమున బ్రాహ్మణులు, క్షత్రియులు అనబడు వెలుగుల ప్రజ్ఞల సంబంధమే ఋషులకు, దేవతలకు నడుమ వర్తించును. దేవతలచే వెలుగులే నివాసములుగా ఋషుల కొరకు కల్పింపబడినవి. ఆ వెలుగులే సూర్యుని వెలుగులు. అందు వర్తించుచు, రంగుల స్వరముల రూపమున జ్ఞానమును, ధర్మములను వ్యాపింప జేయుదురు.

ప్రతి సూర్యుని యందును ఈ ఋషులందరు నుందురు, కాని ఒక్కొక్క సూర్యుడు ఒక్కొక్క ఋషి ధర్మమునకు ప్రధాన నివాసముగా నుండును. ఇన్నికోట్లనుండి సూర్యులును ప్రధాన ఋషుల లక్షణములచే ఏడు (7) గణములుగా నున్నారు. ఏడు గణముల సూర్యులలో ఒక్కొక్క గణము

నుండి ఒక్కొక్కడు చొప్పున వేరై, ఏడుగురు సూర్యుల చొప్పున గుంపులుగా నేర్పడుదురు. అందు ఏడుగురు సూర్యులొక్కొక్క గుంపుగా నేర్పడునపుడు, ఏడుగురు ఋషులకు సంబంధించిన సూర్యులు ఒక ఆకారము కట్టుకొందురు. ఇట్టి ఏడుగురు సూర్యుల గుంపు లనేకములున్నవి. మనకు కనిపించు సప్తర్షి మండలము, కృత్తికల గుంపు మొదలైనవినిట్టివే. సప్తర్షి మండలమున వశిష్ఠుడు ప్రత్యేకత వహించి మిగిలినవి సామాన్యత వహించును. కృత్తికలు ఆరుచుక్కలొక గుంపై, వారి నడుమ ఏడవవాడు దృశ్యాదృశ్యుడుగా వర్తించు చున్నాడు.

సప్తర్షి ధర్మముల స్థితికి పరిణామము చెందిన సూర్యులందరును ఏడేసి మంది చొప్పున గుంపులై కట్టుకొందురు. ఇంకను ఈ సప్తఋషుల పరిణామ స్థితిని చేరుకొనని క్షుద్రసూర్యులు వేరుగా వర్తింతురు. వారియందు ఈ సప్త ర్షుల ధర్మములు ఇంకను వ్యక్తముకావు. ఇట్టి క్షుద్రసూర్యులు అయిదుగురు కలసి ఒక గుంపుగా నేర్పడి, ఒక సప్తర్షి మండలముతో సంబంధము పెట్టు కొందురు. ఇది గురుశిష్య సంబంధము వంటిది. ఈ అయిదుగురు ఆ ఏడు గురు కలసి ఒక ద్వాదశాదిత్య మండలమై ఒక కేంద్రముచుట్టును, పరిభ్ర మించుచుండును. ఇట్టి ద్వాదశాదిత్య మండలములు కొన్ని కోట్లున్నవి. మనకు సంబంధించిన సూర్యుడు తన ద్వాదశాదిత్య మండలమున గల క్షుద్ర సూర్యులైదుగురిలో నొకడు. వానిపై సప్తర్షి మండలము ప్రభావము పడి, ఋషిప్రజ్ఞల యుపదేశమునకు సహాయము చేయుచుండును.

ఈ సప్త ఋషులనుండి ఆధ్యాత్మిక కిరణములు ఏడు విధములుగా మన సూర్యునకు ప్రసాదింపబడుచుండును. వానిని స్వీకరించి అతడు మిగి లిన గ్రహములతోపాటు మన భూమికిని ప్రసాదించుచుండును. దాని ననుసరించి ఈ భూమియందలి నరజాతులుకూడా ఏడు విధములైన ఆత్మ లక్షణములు కలవారుగా నుందురు. అందొక్కొక్క జాతిని పరిపూర్ణతకై నడిపించుటకు ఆ ఋషిధర్మము ప్రధానముగా గల మానవుడు ఈ భూమిపై జన్మలెత్తుచు తన కర్తవ్యమును నిర్వహించుచుండును. అట్టి దేహధారులగు ఋషులు ఏడుగురు ఎప్పుడును ఈ భూమిపై గురుత్వము వహించుచుందురు. వారివలననే వేదము ఆయా కాలములలో, ఆయా భాషలలో వివదింపబడి

గ్రంథస్థమగుచుండును. ఈ సంప్రదాయమునకు చెందిన రాజయోగసాధకులు తమ వెన్నెముకలో షట్చక్రములయందును, సహస్రారము నందును, సప్త ఋషులను న్యాసముచేసి ధర్మానుష్ఠానముచే ధారణ, ధ్యాన, సమాధులను పొందుచున్నారు. మరికొందరు భ్రూమధ్యమునుండి ఫాలముపై నూర్ధ్వముగా కృత్తికలను న్యాసముచేసి మూడవనేత్ర మనబడు గ్రంథిని విప్పారజేసి, ఈ ఋషుల జ్ఞానము ననుభవించి జీవించుచున్నారు. వారు తమ కర్మల నిబంధనల నుండి బ్రహ్మాండ దివ్యకర్మ ననుష్ఠించు నధికారమునకై మోక్షము పొందుచున్నారు. ఈ ఋషులలో ఒక్కొక్కనికే ఒక్కొక్కస్రాత లేక స్థాపకుడు వుండును. అతడు ఆ సూర్యునకు చక్షువైన అదృశ్య సూర్యుడు. వాని నియమమున ఆ సూర్యమండలము పుట్టును.

– [సు. సూ. పే. 78-71]

## సప్త వ్యాహృతులు

ఈ సృష్టిని ఉద్భవింప జేయు వ్యాహృతులు (ఉచ్చారణములు) ఏడుగా చెప్పబడినవి. అందు భూః, భువః, సువః అనునవి మూడును ముఖ్యములు. వీనిని మొదట వేరుగా చెప్పుటయు పిదప మిగిలిన నాల్గింటితో కలిపి ఏడుగా నుచ్చరించుటయు వేదమంత్ర వినియోగమున కనిపించును. దీని ననుసరించియే మొదట భూమి, చంద్రుడు, సూర్యుడు అనబడు నాభులు ముఖ్యముగా పనిచేయుచున్న వనియు, అంతకన్న వేరుగా భూమిచుట్టును ఏడును పనిచేయుచున్నవనియును గ్రహింపవలెను. అందు మొదటి మూడును ప్రధాన ధర్మములుగను (Solar Principle, Lunar Principle, Earth Principle) మిగిలినవి ఏడును వేరుగా గ్రహములను, దేహధాతువులను ఉత్పాదించు ప్రజ్ఞలనియును (Planetary Principle) గ్రహింపవలెను. దీని ననుసరించియే మొదట మూడు వ్యాహృతులు, తరువాత ఏడు వ్యాహృతులు ప్రాణాయామాదులలో నిమిడియున్నవి.

ఈ సృష్టి సంపూర్ణముగా వ్యక్తమగుటలో $3 \times 7 = 21$ సమిధులుగా నేర్పడి సృష్టియజ్ఞము జరుగుచున్నదని పురుషసూక్తము చెప్పుచున్నది. మొదటి మూడు వ్యాహృతులును ఇతరేతము (Objectivity) నకు కారణ

మగు త్రికోణశక్తిగా పనిచేయును. మిగిలిన నాలుగును ఆ శక్తికి పీఠమగు చతుష్కోణశక్తిగా పనిచేయును. ఈ విషయమును వివరించినవి ప్రాచీన తంత్రగ్రంథములు. ఈ శక్తులు ఛందోగణములు (Groups of Periodicities) గను, వాగ్గణములు (Group of Utterances) గను మన యందే ర్పడుచున్నవి. చతుష్కోణముపై నిలబడిన త్రికోణాకారముగా నివి యేర్పడును.



ఈ త్రికోణములే దళములుగా మొత్తము ఒక పద్మమువలె వ్యక్తమగును. దీని ననుసరించియే అంకెల కధిదేవతలగు ప్రజాపతులు $3 \times 4 = 12$ గాను పేర్పుచేసి సంవత్సరము, అందలి మాసములు కల్పించుచున్నారు. ఇట్టి పేర్పులే యజ్ఞమందలి ఇటుకల పేర్పులుగా చయనవిద్య చెప్పుచున్నది. ఈ పేర్పుతోకూడిన జీవప్రజ్ఞ ఆకాశాండమున పద్మకోశముగా నేర్పడును. అందు తూర్పు, పడమర, ఉత్తరము, దక్షిణము, ఊర్ధ్వము, అధస్సు అను దిక్కులేర్పడును. దీనితో చతురస్రముపై నొక పద్మకోశము, దిగువ నొక పద్మకోశము ఏర్పడును. దీనీ రూపకల్పనమును రుద్రాభిషేక మందలి మహాన్యాసమున గుర్తింపవచ్చును. ఈ పద్మకోశమునే గాయత్రీ ధ్యానమున "అరవింద యుగళము" (Double Pyramid) అని చెప్పిరి.



– [ను. సూ. పే. 31-33]

## సరస్వతీ నది

వెన్నెముక లోపలి భాగమునుండి దిగువకు దిగివచ్చునట్టి బ్రహ్మ యొక్క వాక్ప్రవాహమే సరస్వతీ నదియని చెప్పబడినది. అది శిరస్సున బ్రహ్మ లోక ప్రజ్ఞగా, కన్నులనుండి సూర్యాదిలోకముల వెలుగైన దృష్టిగా, కంఠమునుండి శబ్దమయమైన వేదప్రపంచముగా వెలువడును. హృదయము నుండి ప్రేమ సంకల్పమైన లక్ష్మీనారాయణ స్థానముగా వ్యక్తమగును. నాభి నుండి చరాచర సృష్టిని నిర్మాణ సమర్థమైన చతుర్ముఖుని జన్మస్థానముగా వెలువడును. వెన్నెముక చివరి భాగమునందు గృహస్థాశ్రమమునకు నిలయ మైన దాంపత్యస్థానముగా వ్యక్తమగును. అందు స్త్రీ పురుష దేహములు వేరు వేరుగా నేర్పడుట వలన శుక్రశోణిత బిందువులుగా సంయోగము చెందును. ఈ సంయోగమే బిందుసర మనబడు కోనేరు. సరస్వతీ నదీజలము సుషుమ్న యనబడు వెన్నెముకలోని ద్వారమున దిగివచ్చి యిందు బిందుసర మేర్పడును. దానిలో పలువిధములైన జీవులు జలచరములై తిరుగుచుండును. అనగా గర్భధారణమున కనుకూలమైన శుక్రశోణిత బిందువులలో నిమిడి, దేహోత్పత్తికై వేచియుండును.

దీనికొరకేర్పడిన పాంచభౌతిక దేహనిర్మాణమే కర్దముని యోగమాయచే నిర్మింపబడిన దివ్యవిమానము. ఇది యంతయు మొట్టమొదటి భౌతికశరీర సృష్టికిని, స్త్రీ పురుష శరీర నిర్మాణమునకును, గర్భధారణమునకును, బ్రహ్మ ప్రజాభివృద్ధికిని సంబంధించిన అర్థవాదమైన ఇతిహాసము. దీని పవిత్రతను నిలుపుటకే వివాహము, గృహస్థాశ్రమము, పాతివ్రత్యము, ఏకపత్నీవ్రతము మొదలగు ధర్మములు వేదఋషులచే శాసింపబడెను.

(చూ. బిందుసరము)

– [శ్రీ. భా. ప్ర. VI. పే. 136-137]

# సరస్వతీ సూక్తము

1) మననుండి ఉచ్ఛ్వాస నిశ్వాసలు అప్రయత్నముగా నెట్లు వెలువడునో అట్లే కంఠధ్వనియు, దానిచే నిర్మితములయిన అకారాది క్షకారాంతము వర్ణములును వెలువడును. వానియందు అంతర్వాహిని భావస్వరూప మైన సరస్వతి ప్రవహించి ఉచ్చారణ రూపము నొందును.

2) మననుండి వాక్కు వెలువడినట్లే చోటురూపముననున్న సృష్టికర్త నుండి ఈ సృష్టియంతయు నొక యుచ్చారణముగా విప్పబడెను.

3) ఈ రెండును ఒకేవిధముగా మూడు స్థాయిలలో వెలువడును. మన కంఠమునుండి మంద్రము, మధ్యము, తారము అను స్థాయులు వెలువ డును. సృష్టికర్తనుండి పృథివి (Matter), అంతరిక్షము (Space), దివము (The Light of Consciousness) ఉచ్చారణగా వెలువడును అవియే మానవునిలో దేహము, ప్రాణము, ప్రజ్ఞ అను లోకములుగా వెలువడును.

4) ఈ మూడింటిలో నొక్కొక్క దానినుండి ఏడేసి లోకము లనబడు పొర లుచ్చరింపబడును. దేహమున సప్తధాతువులు (Seven Tissues) ప్రాణమున సప్త వ్యాహృతులు (సప్తస్వరములు), ప్రజ్ఞలో సప్త ప్రజ్ఞలు విచ్చుకొనును. సృష్టిలోనికి దిగివచ్చు పురుషునకు త్రైవిధ ములుగా ఏడు పరిధులు (Seven Layers) ఇరువదియొక్క సమిధ లుగా నిర్మాణమగును.

5) ఈ మొత్తము వాక్కునే ప్రణవమందురు. ఇది హంస (శ్వాస) వాహన ముగా వాగ్దేవి రూపమున దిగివచ్చును. ఈ దిగువచ్చుట నాలుగు స్థితులలో జరుగును. :: (A) సంకల్పము (B) భావము (C) మానసిక వాక్యము (D) వైఖరీ వాక్కులో దిగివచ్చు భాషా వాక్యము. వీనినే వరుసగా పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరి వాక్కులు అందురు. అవియే బ్రహ్మయొక్క చతుర్ముఖములు. అందు

మొదటి మూడువాక్కులు మనలోపల గుహలో నుండును. నాల్గవ దానిని మానవు లుచ్చరించుచున్నారు.

6) అట్లే సృష్టిలోనికి సృష్టిగా దిగివచ్చు పురుషుడుకూడ మూడుభాగములు తనలోని అమృతత్వమున అంతర్లీనముగ నుంచి నాల్గవ భాగమును ఈ దేశకాలాత్మకమైన సమస్త సృష్టిగా నుచ్చరించుచున్నాడు.

7) మూడు స్థాయులలో, ఏడు లోకములలో, నాలుగు స్థితులలో పైచెప్పిన విధముగా దిగివచ్చుచున్న వాక్కు జనులకు కామధేనువు. ఆమె నుపాసించి యొకరితో నొకరు సంభాషించుకొని తమకు కావలసిన వానిని మానవులు పొందుచున్నారు. అట్టివారికి నాలుగు ధారలుగా ఈ ధేనువుతన క్షీరమును వర్షించి వారల పోషించుచున్నది.

– [స. సూ. విద్యాదేవత (4)]

## సర్ప దోషము

సంతానదోషం ఉన్నవారికి సుబ్రహ్మణ్యారాధన చెయ్యమని చెప్పే సంప్రదాయం ఒకటి మనదేశంలో ఉన్నది. సుబ్రమణ్యేశ్వర స్వామిని సర్పాకారంతో పూజచేసే ఆచారం సంతానప్రదమైన మహిమతో సంబంధించి ఉన్నది. అది అవగతమైనగాని ఈ మొత్తము సంప్రదాయం అవగతంకాదు. ఇక్కడ ఈ విషయంలో కొంత వివరణం అవసరం.

శిరస్సు దగ్గరనుండి వెన్నెముక చివరిదాక మనుష్యుని శరీరం లోపలి భాగం ఒక పడగవిప్పిన సర్పాకారంలో ఉంటుంది. దానిపై నుండి క్రిందకి వరుసగా సహస్రారము, మిగిలిన ఆరు చక్రములు ఉన్నాయి. ఈ ఏడు కేంద్రములును ఒకదారికి ఏడు మలుపులు. వెన్నెముక చివర మూలాధారము దగ్గర మన జీవితమనే సర్పముయొక్క తోక ఉన్నది. మన శిరస్సుమీద దాని పడగ వున్నది. ఈ మొత్తం సర్పాకారంలో వున్న ఒకదారి అవుతుంది. ఇదే మానవ ప్రజ్ఞనుండి దైవప్రజ్ఞ వరకు దేవతలు (సృష్టిశక్తులు) వేసినదారి.

ఈ దారివెంబడి యోగులు, యోగాభ్యాసంలో ప్రజ్ఞామయమైన ప్రయాణం చేస్తారు. ఈ దారిలో తగిలే ఏడు కేంద్రాలనే కొందరు ఏడు కొండలుగా కీర్తించారు. అందువలననే ఏడుకొండలస్వామి అయిన వేంకటేశ్వరుడు శేష శైలము (పాముదారిగల కొండదారి) పైనున్నాడు. లోపలిలోకంలో ఉన్న ఏడుకొండలస్వామికి బాహ్యరూపమే బయటలోకంలో ఉన్న ఏడుకొండల స్వామి. లోపలి ప్రజ్ఞను తెలుసుకునేందుకే బాహ్యప్రపంచంలో పుణ్యక్షేత్ర యాత్రలు చేయటం జరుగుతుంది. ఈ విధంగా శేషుడు, సుబ్రహ్మణ్యుడు సర్పాకారమైన దేవతలుగా ఉత్తమదైవాన్ని చేరుకునే మార్గాలుగా శాస్త్రాలలో సంకేతింపబడినారు. వేంకటేశ్వరుని సుబ్రహ్మణ్యస్వామిగా ఆరాధించే సంప్రదాయం కూడ దక్షిణభారతదేశంలో ఉన్నది. సు+బ్రహ్మణ్యుడు — అనగా బ్రహ్మప్రజ్ఞ గలవాడు. అనగా ఆనందమయ కోశాన్ని చేరుకున్న వాడు అని అర్థము.

సప్తధాతుమయమైన మానవ శరీరమంతా ఈ వెన్నెముకలోని నాడీ మండలము ప్రభావంతో ప్రజ్ఞావంతమై నిర్వహింపబడుతున్నది. సమస్త నాడీ మండలానికి కేంద్రము వెన్నెముక మొత్తమే. ఈ సప్తధాతుమయమైన మానవశరీరం పూర్వసంస్కారములతో నిండివుంటుంది. అందు కొన్ని సంస్కారములు మంచివి, కొన్ని చెడ్డవి వుంటాయి. మానవజన్మమంతా మంచి సంస్కారములతో ప్రభావితం చేయబడుతూ, చెడ్డసంస్కారములతో కలుషితం చేయబడుతూ ఆయా విధములైన మంచిచెడ్డ ప్రవృత్తులను మనస్సునందు ఆపాదిస్తూ సుఖదుఃఖ సమ్మిశ్రితంగా జీవితం సాగిపోతుంది. అన్ని సంస్కారములలో ముఖ్యమైనది కామ సంస్కారము. ఇది సమస్త సృష్టి నిరంతరాయంగా నడవడానికి దేవతలు కనిపెట్టిన ఒక విచిత్రానుభూతి. ఈ సంస్కారముతో పవిత్రము చేయబడిన మానవజన్మయే ధన్యమైనది.

జీవుని శరీరధారణకు కామసంకల్పము ముఖ్యమైన నిమిత్తకారణము. దానికొరకు సృష్టింపబడినవే పురుషులలో శుక్రము, స్త్రీలలో శోణితము అనబడు ధాతువులు. పురుషునిలో ప్రవేశించిన జీవి పునర్జన్మకు ప్రేరేపింపబడి కర్మాధీనుడై శుక్రకణమునందు ప్రవేశిస్తాడు. ఆ శుక్రకణము శోణిత సంయోగము చెంది జీవుడు గర్భస్థుడవుతాడు. మన అన్నమయ శరీరంలోనున్న

సప్తధాతువులలో శుక్రధాతువు అతిసూక్ష్మము. శుక్రకణములు సర్పాకృతిలో వుంటాయి. ఎవడు కామ ప్రవృత్తిలో అపచారం చేస్తాడో వాడు ఈ సర్పాన్ని హత్యచేసినట్లు. అనగా సర్పస్వామి అయిన సుబ్రహ్మణ్యునికి తీరనిదోషం ఆచరించినట్లు. దానివలన స్త్రీ పురుషుల శరీరంలో సర్పదోషం అనబడే దోషం ఏర్పడుతుంది. దీనవలన సంతానదోషం ఏర్పడుట జరుగును. అంతేకాదు, యోగాభ్యాసంలో ఊర్ధ్వగతి కల్పింపబడినపుడు శుక్రధాతువే వెన్నెముక లోపలి బ్రహ్మరంధ్రములో అంతకన్న సూక్ష్మమయిన తేజోమయ ధాతువులుగా రూపొందుతుంది. అట్టి సూక్ష్మపరిణత తేజస్సునే యోగులు కుండలినీ అను సర్పంగా సంకేతించారు. ఈ శుక్రము ఊర్ధ్వగతి పట్టినపుడు ఓజస్సు, సహస్సు, బలము, భ్రాజస్సు, తేజస్సు దేవతల ధామముగా పరిణమిస్తుందని వేదమంత్రములు చెపుతున్నవి. అనుదినము సంధ్యలయందు సాధకుడు గాయత్రిని "ఓజోసి, సహోసి, బలమసి, భ్రాజోసి, దేవానాంధామ నామాసి" అని కీర్తించుచున్నాడు. అటుపైన ఈ తేజస్సు ఈ విశ్వసృష్టి చేయబడుచున్న తేజస్సయినసూల ప్రకృతిగా మనలో అనుభూతమవుతుంది. దానినే ఈ విశ్వంయొక్క ఆయుర్బలంగా సాధకుడు ధ్యానంచేస్తాడు.

ఈ రీతిగా గర్భధారణమునకు కారణములైన పితృలోకములకు, ఊర్ధ్వ గతికి కారణమైన దేవలోకములకు శుక్రధాతువే మానవునకు నిచ్చెనవంటిది. శీలసంపదతో శుక్రసంపదను భద్రపరచుకొని దేవ, పితృలోకములందు తన ఋణము తీర్చుకోగలిగినవాడే సుబ్రహ్మణ్యుడు కాగలడు. అతడే సరిఅయిన గృహస్థుగా సత్సంతతిని, సరిఅయిన బ్రహ్మచారిగా సద్గతిని పొందగలడు.

– [దా. ప్ర. పే. 85-89]

## సహస్రాక్షుడు

వేయికన్నులు కలవాడు ఇంద్రుడు. మేఘముల నుండి మెఱపుల రూపమున లైన కన్నులతో చూచువాడు. ఇంద్రుడు రుద్రుని మూర్తులలో నొకడుగా చెప్పబడినది. అంతేగాక కంటికి నాధారమైన సూర్యకిరణము కన్నుగా వర్ణింపబడుట వేదపురాణ కవి సమయము. ఈ యర్థముననే ఇంద్రుడు అహల్యా జారుడని వేదములయందు కీర్తింపబడెను. అహస్సు లీనమగునట్టి

రాత్రి అహల్య అనబడును. ఆమెను జరింపచేయువాడు అనగా కనుపింప కుండ చేయువాడు ఉదయ సూర్యుడు. మరియు సంవత్సర చక్రమున దక్షిణాయనమున ప్రవేశించు వర్షాకాలపు సూర్యుడనియు నర్థము. అహల్యనగా నాగలిపెట్టుటకు తగినభూమి. అహల్య అనగా నాగలికి తగులని వేసవికాలపు భూమి. ఆమెను జరింపచేయువాడు వర్షాకాలమున మేఘములను కూర్చుకొను సూర్యుడు. కనుకనే ఇంద్రుడు మేఘాధిపతియని వర్ణింపబడుట.

ఈ మంత్రార్థమే వేదార్థ ప్రతిపాదకమైన ఇతిహాసముగ రామాయణమున కీర్తింపబడెను. ఎట్లనగా సూర్యకిరణమునుండి దిగివచ్చు సంవత్సర సృష్టి దేవతలు భూమిపై జీవులను పరిపాలించుటకు వచ్చిన సూర్యవంశపు రాజులుగా చెప్పబడెను. అందు మేఘము నీలదేహుడగు రాముడిగా రూపింపబడెను. వేసవికాలపు భూమి అహల్యగా అచేతన స్థితిగా నుండగా రామ పాదస్పర్శ విమోచనము కల్గించి ఆమెను హల్యగా మార్చినది. అనగా నాగలి కనుకూలముగా పాకము తెచ్చినది. అటుపైన నాగటి చాళ్ళయందు మేఘము వర్షించుట సీతాకల్యాణముగా, ఇంద్రధనుస్సు శివధనుస్సుగా రూపింపబడినది. (సీత యనగా నాగటిచాలు) అన్నిటికిని సార్థకమగు నామమే సహస్రాక్షుడు.

— [రు. సూ. పే. 71]

## స్వధ

స్వధ యనగా పితృదేవతల ఆహారము. పితృదేవతలను ఉద్దేశించి పలుకు యజ్ఞవాక్కు కూడ స్వధ యనబడును. స్వ+ధ=తన్ను తాను ధరించుట యని యర్థము. ఆహారమును స్వీకరించు శక్తియు, దేహధాతువులను పోషించు శక్తియు స్వధ. దీనివలననే ద్రవ్యమునకు, జీవునకు తినబడునది, తినువాడు అను సంబంధ మేర్పడుచున్నది. పితృదేవతలు స్వధవలన ఏడవ ధాతువగు శుక్రమును పొందుచున్నారు. అది చనిపోయినవారి దేహాకల్పనము చేయును.

— [సు. సూ. పే. 130]

## సంకేత నామము

కొందరు దేహము విడిచి తన్నుతాను జ్ఞప్తియందుంచుకొనుట అభ్య సించి, అందు సిద్ధులైన పిదప రాబోవు జన్మలన్నియు నొక్కరుగనే యనుభ వింతురు. దీని సహాయమున శతాబ్దముల, సహస్రాబ్దముల తరబడి ఒకే కార్యసాధనలో నుండగలుగుట సిద్ధించును. ఋషులలో చాలమంది ఇట్టివారే. వేయి సంవత్సరముల సత్రయాగము చేయుటకు నైమిశారణ్యమున చేరిన వారిలో చాలమంది ఇట్టివారే. సామాన్యముగా నీ విద్యను సాధించినవారు గుంపులుగా పనిచేయుచు నొకరి నొకరు గుర్తుంచుకొందురు. ఇట్లు గుర్తించుట సుగమమగుటకై ఇన్ని జన్మలలో నొకే సంకేత నామము ధరించియుందురు. నారదుడు, విశ్వామిత్రుడు, వశిష్ఠుడు, శక్తి, పరాశరుడు మున్నగు ఋషులు యుగయుగములలో వర్తించి బ్రహ్మవిద్యకై కృషిచేయుట పురాణములలో కనిపించును. ఇట్టివారే చిరంజీవులు.

## సంగము - దానిని జయించుట

మన పరిసరముల యందుగల వ్యక్తులతోను, వస్తువులతోను, సన్ని వేశములతోను, మనస్సునకు విడదీయరాని సంబంధముండును. ఇది యభ్యా సము వలన నేర్పడును. దీనినే సంగము అందురు. బంధువులను, మిత్రులను, విడువలేకుండుట, నివసించిన యిల్లు విడిచిపోలేక పోవుట, పొలముపై గల యాపేక్ష, ఆర్జింపబోవునట్టి ధనముపై గల యభిలాష, దానితో మనము కొన బోవునట్టి, సాధింపబోవుచున్నట్టి విషయములపై నాసక్తి, ఆర్జింపబోవు జ్ఞానము నందభిలాష, ఆదర్శములపై గల అనుబంధము మున్నగునవి యన్నియు సంగమున కుదాహరణలే. అట్లే కొన్ని యాహార పదార్థములపై గల అభిరుచు లును. వీని యందభిమానము, ఇవి సమకూడనపుడు దుఃఖము, విఘ్న కారణములైన వారిపై కోపము, ప్రాముఖ్యము వహించునేగాని, వీనివలన మనస్సు కలవరపడుచున్నదనియు, శాంతి చెడుచున్నదనియు జ్ఞానము కలుగదు. ఈ సంగములన్నియును మనస్సుపైననే యాధారపడి యున్నవి. కనుక

పరిస్థితులను చక్కజేసికొనుటకు పరిసరములతో పెనుగులాడి లాభము లేదు. మనస్సును మరలింప గలిగినచో సంగము మాయమై పరిస్థితులు చక్కబడును. వాయువులను నియమనము చేయువిధానము వలన మనస్సు సంగములనుండి మరలును. మరల వలెనను సంకల్పముగూడ నుండవలెను. ఈ సంకల్పముతో కూడిన మనస్సు, వాయువులును కలసి కరగిపోయి, బుద్ధి యనబడు ధర్మమేర్పడును. పటికబెల్లము ముక్కలు దేనికది వేరువేరుగా నున్నను నీటిలో నుంచినపుడు కరగి, ఆ మొత్తము పానకమనబడు నొకేవస్తు వగుచున్నది. అట్లే సంకల్పమున కరిగిన మనస్సు, ప్రాణప్రవృత్తులును బుద్ధి స్థితిని పొందుచున్నది.

లోకవిషయములను గూర్చి "ఇది ఇట్లుండవలెను. ఇది యిట్లు జరుగవలెను" అనుకొనుట కోరిక యగునుగాని సంకల్పము కాదు. మనస్సును, వాయువులను బంధించుట యందు సమన్వయింపబడిన కోరిక సంకల్పమగును గాని కోరికకాదు. కోరికల వలన కోరినవారి వాసనలు మనస్సున కంటి దుఃఖములు కలుగును. వస్త్రమున ఏ వాసనగల వస్తువునుంచి బంధించిన ఆ వాసన వస్త్రమున కంటును. అట్లే తలచిన వస్తువుల కర్మవాసనలు మనస్సున కంటి సంగములగును. వస్త్రమున నిప్పుకణిక నుంచి బంధించినచో, దానివాసన వస్త్రమున కంటక, వస్త్రముకాలి నిప్పులో లీనమగును.

అట్లే మనస్సును వాయువులతో లయముచేసి సంకల్పముతో బంధించినచో, మనస్సునకు సంకల్ప వాసనలంటక, మనస్సు బుద్ధిలోనికి మాయమగును. అప్పటినుండి లోకవ్యవహారముల యందుగూడ మనస్సు రూపమైన, ఇంద్రియ ప్రవృత్తుల రూపమైన బుద్ధియొక్కటియే పనిచేయుచుండును. ఈ విధముగా సాధకుడు తన యింద్రియముల ప్రవృత్తులను మాయము చేయును. దీనినే మనస్సును హృదయమున నిరోధించుటయని గీతలో కృష్ణుడు చెప్పెను. దీనినే చిత్తవృత్తి నిరోధమని యోగమునకు నిర్వచనముగా పతంజలి చెప్పెను.

— [శ్రీ. భా. ప్ర. III. పే. 14-16]

## సంధ్య

జడమునకును చేతనమునకును నడుమనున్నది మెలకువ వచ్చుచున్న స్థితి. అదియే సంధ్య. అందు దేవాసుర శక్తులు సమ్మిశ్రితములై ఎర్రగా వ్యాపించును. కనుకనే సంధ్యలు జీవులకెర్రగా కనిపించును. మరియు దేవతలు, పితృదేవతలు చేయుచున్న బ్రహ్మాండ పిండాండ సృష్టిలో చైతన్యము ప్రాణముగా ప్రసరించి కాలువలు కట్టుటకు సంధ్యారాగము సృష్టింపబడును. కనుకనే గర్భమునందలి పిండములలో రక్తము, రక్తనాళములు సృష్టింపబడును. మనదేహమున రక్తమొక్కటే ప్రాణమునకు ఉపాధియైన నివాసస్థానము. రక్తములేని జీవులైన క్రిమికీటకాదులలో చైతన్యము కొంచెమే మేల్కొనును. ఖనిజములలో నింకను తక్కువ మేల్కొనును. వృక్షములలో రక్తముసృష్టింపబడక రసముమాత్రముసృష్టింపబడుటచే లోపలి దేవతలుకాక, వెలుపలి దేవగణములు సూర్యరశ్మి రూపమునను, జలరూపమునను, ఖనిజములలోని రసాయనికములైన ధర్మముల రూపమునను మేల్కొని యుందురు. రసమున కధిపతి సోముడు. అతడు చంద్రకిరణముల మార్గమున పనిచేయును. రక్తమున కధిపతి అర్యముడు. వానినే పురాణములు అరుణుడు లేక అనూరుడు అని చెప్పును. వాడు సంధ్యల మార్గమున అంగారకుడను గ్రహము నుండి ప్రసరించును. కిరణముల మార్గమునను పనిచేయును.

దైత్యులందరును సంధ్యాదేవి వెంటపడినట్లు చెప్పబడినది. రక్తమునుండి శక్తి వ్యక్తమై ప్రాణముగ వ్యాపించుటయు, దానివెంట కామక్రోధాదులు పుట్టుటయు దీని యర్థము. దీనిని ప్రాణమయ కోశముగా, అంతకు ముందటి మహామోహ పంచకమును అన్నమయ కోశముగా, రెండు దేహములు ధరించి విడిచిపెట్టి చతుర్ముఖుడీ కోశములను జీవులకిచ్చి, అటుపైన మనోమయాది కోశములుకూడ ధరించి విడచును. (దీని యర్థవాదమే భాగవతమున చెప్పబడిన సంధ్య వృత్తాంతము).

– [శ్రీ. భా. ప్ర. VI. పే. 95-96]

## సాశనములు, అనశనములు

అశనమనగా తినుట. తినుటయను ధర్మము గలిగిన సమస్త జీవులును సాశనములు, ఖనిజములు మొదలగువానికీ ధర్మము లేకుండుటచే నవి అనశనములు. సృష్టిలో భౌతికముగా నీ రెండువిధములైన వస్తువులే యుండును. ఖనిజాదులు అశనరూపమున జీవులుగ పరిణమించుట జననము. జీవులు ఖనిజాదులలోనికి అనశనత్వము పొందుట మరణము.

— [ప్ర. సూ. పే. 10]

## సాంఖ్యము - యోగము

మనము చేయు పనులలో మంచి పనులేవో, చెడ్డ పనులేవో తెలుసుకొనుటకు మంచి మనస్సు కావలెను. మనస్సు మంచిది కావలెనన్నచో ఆహార విహారములు, వాతావరణము, అభ్యాసము మంచివి కావలెను. మంచిపనులు చేసినచో మంచి మనస్సు నిలబడును. మంచి మనస్సునకు మాత్రమే మంచి పనులేవో తెలియును. మంచి పనులేమో తెలిసికొని ఆచరించుట నారంభింపవలెనా ? లేక మంచిపనులు చేసి మంచి మనస్సును సాధించవలెనా ? మంచి పనులతో నారంభింపవలెనని, యొకపక్షము వారును, మంచి మనస్సుతో సాధన మారంభింపవలెనని రెండవపక్షము వారును వాదించుకొనుచుండిరి. మొదటి పక్షమువారిని యోగులనియు, రెండవ పక్షమువారిని సాంఖ్యులనియు వ్యవహరించిరి. సుఖదుఃఖములను, లాభాలాభములను, జయాపజయములను సమబుద్ధితో మనసుండి తొలగించి కార్యనిర్ణయము చేయుట సాంఖ్యమార్గము. సాధకుడు బుద్ధిని యోగమందు నిలుపవలెను. యోగమనగా జతపరుచుట, బుద్ధిని కర్మాచరణముతో జతపరపవలెను. అప్పుడు మాత్రమే కర్మయొక్క బంధము విప్పుకొనుట సాధ్యపడును. కనుక సాంఖ్యమున బుద్ధిని పదును పెట్టి, యోగమున ఆచరణలో పెట్టవలెను. (అన్నము వండుట తెలిసినవాడు తదాచరణశ్రమ తప్పించుకొనినచో ఆకలితీరదు కదా !)

— [శం. దా. I. పే. 27-28]

## సాంఖ్య యోగము

నారాయణ, వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న అను నాలుగు వ్యూహములును జీవులలో మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అనబడు అంతఃకరణ చతుష్టయముగా పనిచేయు చుందురు. చిరకాలము కర్మఫలములలో చిక్కుకొని తపించుచున్న జీవులకీ దేవతలు తోడ్పడి, సమయము వచ్చినప్పుడెల్ల తమ్ముగూర్చి తమకు జ్ఞప్తిచేయుచుందురు. దానితో సృష్టి పరిణామ క్రమమున వివేకము, వితర్కము, విచారము, జిజ్ఞాస, సహనము, మోక్షేచ్ఛ మున్నగు గుణములు వికసించును. వాని వలన యోగదృష్టి చెదురుమదురుగా నలవడుచుండును. అనేకజన్మలలో కూడబెట్టుకొనిన యోగదృష్టి వలన యోగాభ్యాసమునందు నిష్ఠ కుదురును. తపస్సు అభ్యాసమగును. సమాధి నిలబడును. అందరిలో నొక్కనినే చూచి సంతోషకరమైన యొంటరితన మనుభవింతురు. వారిచే దర్శింపబడు నొక్కడే ఆ విద్య నుపదేశించుటకు, కపిలుడై జన్మించెను. అతడు సాంఖ్య యోగముల నుపదేశించును. సాంఖ్య యోగ మనగా కలిగిన జ్ఞానముతో సత్కర్మాచరణమును కలుపుట. ఇచ్చట సాంఖ్యము, యోగము అనునవి రెండంశములుగాని, సాంఖ్య యోగమన్నది ఒకేయంశము కాదు. "జనులకెల్ల శుభము సాంఖ్యయోగము" అని ద్వితీయ స్కందమున నుపదేశింపబడినది.

సాంఖ్యమనగా వ్యక్తి కతీతమైన సంపూర్ణజ్ఞానము. యోగమనగా దానిని మనమాచరించు కర్మతో సమన్వయించి సంధానము చేయుట. కొందరు సాంఖ్యయోగ మన్నది యొకే యంశమును తెలుపునని వ్యాఖ్యానించిరి. ఇది సరికాదు. ద్వితీయ స్కందమున మూలశ్లోకమున

"ఏతావాన్ సాంఖ్య యోగాభ్యాం స్వధర్మ పరినిష్ఠయా ।
జన్మలాభః పరః పుంసామంతే నారాయణ స్మృతిః ॥"

అని చెప్పబడినది. ఇచట "సాంఖ్య యోగాభ్యాం" అని ద్వివచనము విడదీసి చెప్పబడుటచే సాంఖ్యము, యోగము సాధకుని రెండు లక్ష్యములే గాని యొకటికాదని నిశ్చితమగుచున్నది.

మరికొందరు సాంఖ్యమార్గము, యోగమార్గము వేరువేరు సాధనములని భావింతురు. ఇదియును సప్రమాణముకాదు. "సాంఖ్య, యోగములనువేర్వేరుగా చెప్పువారు పిల్లకాయలు. పండితులట్లు చెప్పరు. "సాంఖ్యము సాధన చేసిన ఫలితము యోగమే, యోగము సాధన చేసిన ఫలితము సాంఖ్యమే" యని భగవద్గీతలో కృష్ణుడు చెప్పెను.

— [శ్రీ. భా. ప్ర. VI. పే. 148-149]

## సిద్ధులు - సాధ్యులు

దేవతలందరును తమతమ కార్యక్రమములనుబట్టి సృష్టి ధర్మముల రూపమున గుంపులు గుంపులుగా నేర్పడుచున్నారు. వారు నిర్వహించు కార్యక్రమముల ఫలితమే ఈ విశ్వముయొక్క రూపముగా నిలబడియున్నది. మన శరీరమున రక్తము, మాంసము మొదలైన ధాతువులును, కన్నులు, ముక్కు, చెవులు మొదలగు నింద్రియములును వేరువేరుగా పనిచేయునట్లే ఈ సృష్టి కార్యమున దేవతలు వేరువేరుగా పనిచేయుచున్నారు. వారికి ధర్మములే కాని మనస్సు లేదు. వారిచే నిర్మింపబడిన జీవులకు మనస్సుకూడ వారిచేతనే నిర్మింపబడి యేర్పడుచున్నది. ఈ దేవతలందరు సృష్టికిముందు అవ్యక్తమున దాగియుందురు. (మనకు నిద్రలో ఇంద్రియములు, మనస్సు మనయందు దాగియున్నట్లే.) అట్టి స్థితిలో దేవతలను సాధ్యులందురు. మనకు నిద్రనుండి మెలకువ వచ్చినట్లే ఒకసృష్టికి మెలకువ వచ్చును. అప్పటినుండి ఆ సృష్టి కారంభమైన దేవతలు వ్యక్తమై తమయందు తాము మేల్కొని పని చేయుచుందురు. అపుడు విశ్వరూప మేర్పడును. ఆ స్థితిలో దేవతలు సిద్ధులనబడుదురు.

— [శం. రా. II. పే. 133-34]

## స్థితప్రజ్ఞుడు

ప్రజ్ఞ ఇంద్రియములందు, మనస్సునందు పనిచేయుచున్నప్పుడు బహిర్ముఖముగా వర్తించును. బుద్ధియందు పనిచేయుచున్నప్పుడు మనస్సును, ఇంద్రియములను వెలిగించును గాని వర్తింపదు. అట్టి ప్రజ్ఞ అంతర్ముఖముగా నుండును. దర్పణగోళములోని దీపమునుండి వచ్చు కాంతికిరణములవలె మనస్సు, ఇంద్రియములుకూడా అట్టి ప్రజ్ఞకు అంతర్ముఖములుగా నుండును. అట్టి స్థితిని స్థితప్రజ్ఞ లేక సమాధి యందురు.

మనస్సునకు గోచరించు దృశ్యమే జగత్తు లేక సంసారము అనబడును. మనస్సున సంకల్పములు బుద్ధికి ఉన్ముఖములగుట వలన పరిహరింపబడును. అవు డింద్రియములుకూడా సంకల్పశూన్యములై తనలో భాగములగును. అప్పుడు దృశ్యమానమగున దంతయు సంసారముగా వర్తించుట మాని "తాను" గా వర్తించును. ఈ అనుభవము చెందువాడు తనయందు తాను సంతుష్టుడగును. తక్కినవారి సంతుష్టికి ఒక బాహ్యకారణము కావలెను. అది కుదరనప్పుడు అసంతుష్టి అనుభవమగును. స్థితప్రజ్ఞునకు సంతుష్టి ప్రధాన కారణమై జీవిత సన్నివేశములు సంతుష్టికి కార్యరూపములగును.

అట్టివాని మనస్సు దుఃఖమునందు ఉద్వేగము చెందదు; దుఃఖకారణము లచే ఆకర్షింపబడదు. బాహ్యవిషయము దుఃఖకారణములగుట వాటిని గురించి భావించుట వలన. వాటిని గురించి ఏ భావనయు లేనప్పుడు అవి దుఃఖకారణములు కావు. స్థితప్రజ్ఞునకు అకారణసంతుష్టి లోపలనుండి వెలుగుచుండును గనుక, బాహ్యవస్తువులు సుఖదుఃఖములకు కారణము కాకుండును. అట్లే అకారణ సంతుష్టిని అభ్యసించిన వానిపంచేంద్రియములను దుఃఖాదికారణములు స్పృశించవు. దీనికి మనస్సు, ఇంద్రియములు, శరీరము, బుద్ధి ననుసరించిన కార్యక్రమములో నిమగ్నమై యుండుట మాత్రము ఆవశ్యకము. అందుచే బుద్ధి యోగమునకు కర్మయోగము దేహమువంటి అంగమగుచున్నది. ఏ పనియు చేయకుండ ధ్యాన ప్రయత్నము చేయువారు చిరకాలము విఫల మనోరథులగుచుండుట ఈ కారణముననే.

దుఃఖములయందు ఉద్వేగము కలుగకుండ వలెనన్నచో సుఖముల యందు కోరిక కలుగరాదు. సుఖపడరాదని యర్థముకాదు. సుఖపడుమార్గము లన్నియు యోగికి దోహదము కావలెనన్నచో వానిపై నతని మనస్సు ప్రసరింపరాదు. కార్యప్రధానముగా వానికి రాగము, భయము, క్రోధము తొలగి పోవును. "వీతరాగ భయ క్రోధః" అను సమాసమునకు తొలిగిన రాగభయ క్రోధములు కలవాడు అని అర్థముకాని, వానిని తొలగించుకొనినవాడు అని అర్థముకాదు. మనస్సు బుద్ధివైపు ఉన్ముఖమై అనుభూతి నిమగ్నమై యుండుట వలన ఈ రాగాదులయందు మౌనము సిద్ధించును. స్థితప్రజ్ఞుడు రాగాదుల యందు అట్లు మౌనము వహించును. అందువలన అతనిని 'ముని' అని యందురు.

— [శం. రా. I. 47-49]

## సుపర్ణ సూక్తము - సమన్వయము

వేదమంత్రము లనబడు భాగములన్నియు దేహభాగములుగా ఒక పురుషుడున్నాడు. వానిదేహ వ్యాప్తియే ఈ సృష్టియనియు, అందు బీజరూపము లైన భాగములుగా జీవుల మున్నామనియు తెలియును. ఇట్లు తెలుసుకొనుటలో క్లేశమెక్కువ లేకుండుటకై ఈ సమగ్ర స్వరూపమును గూర్చి వివరించునట్టి సూక్తములు కొన్ని ఈ వేదమునందే యున్నవి. (సూక్తములనగా కొన్ని మంత్రముల సమూహమగు పాఠములు.) అవియే పురుష సూక్తము, శ్రీ సూక్తము, విష్ణు సూక్తములు, నారాయణ సూక్తము, రుద్ర సూక్తము, విశ్వేదేవతల సూక్తములు, అగ్ని సూక్తములు, సుపర్ణ సూక్త మనబడునవి. వీనిలో నొకటి గనుకనే ఈ సుపర్ణ సూక్తము వేదార్థ ప్రతిపాదనము నందు సమగ్రమై ప్రాముఖ్యము వహించుచున్నది. దీని సమగ్రత్వము ఉపదేశ పూర్వకముగా వివరించుటకే ఇతిహాస పురాణములలో గరుడోపాఖ్యానము వైభవోపేతముగా రచించబడినది. ఇందలి సుపర్ణుడు అందు గరుత్మంతుడుగా వర్ణింపబడెను.

"ఇంద్రుడు, మిత్రుడు, వరుణుడు, మాతరిశ్వుడు, యముడు, వసువనగు పేర్లతో ఒకేసుపర్ణుడగు గరుత్మంతునిస్తుతించుటతెలిసినవారు చేయుచున్నారు"

అని ఈ సూక్తమున 46వ మంత్రము కీర్తించుచుండగా, వేద గ్రంథముల చూడకయే వాటిలో బహుదేవతారాధన మున్నదను అజ్ఞానుల యభిప్రాయములు మనకు ప్రమాణముకాదు.

ఈ సూక్తము "అస్య వామస్య" అను మంత్రముతో ప్రారంభ మగును. దీనియందు ముగ్గురు సోదరులు వర్ణింపబడిరి. సృష్టియంతయు మూడు లోకములుగా వ్యక్తమగును. అందు మొదటిది వెలుగుల లోకము (దివము). అది అంతర్యామి ప్రజ్ఞతో నిండిన వెలుగు. అవ్యక్తమునుండి సూర్యునిగా వెలుగు రూపమున వ్యక్తమగుచున్నాడని చెప్పుటకే మొదటి మంత్రమున నెరసినజుట్టు కలవాడని చమత్కరింపబడినది. అతడు హోమము చేయువాడు అనగా అగ్నిద్వారమున అవ్యక్తమును వ్యక్తములోనికి, వ్యక్త మును అవ్యక్తములోనికి కొనిపోవుచుండునని యర్థము. (హోతయని వర్ణింప బడినాడు.)

అతని సోదరుడు ఎల్లప్పుడు తినుచుండునట. అనగా ఇముడ్చుకొన బడునది, ఇముడ్చుకొనువాడు అని నిద్దరుగా నేర్పడుచున్నారు. ఆహారరూప ములను తినుచు, శరీరరూపములను పెంచుకొనువాడగు ఈ రెండవవాడు శక్తిమయుడు లేక ప్రాణమయుడు. అనగా ఈ ప్రక్రియలో బ్రహ్మాండ సృష్టిలో భౌతిక లోకములను, పిండాండ సృష్టిలో శరీరధాతువులను పేరుకొనునట్లు చేయును.

ఈ మూడవవాడు ప్రజల కధిపతి. అనగా జీవులుపుట్టుట కధిపతి. పాలన పోషణములను గూడా చేయుచుండును. స్త్రీ పురుషాది భేదములను పుట్టించును. ఒకజీవి కింకొకజీవిని ఆహారముగా నేర్పరచును. సూర్యరశ్మి నుండి రంగులను పుట్టించును. గనుక ఏడుగురు కొడుకులు గలవాడుగా వర్ణింపబడినది. వానివలన పుట్టిన ఖనిజములు మున్నగు వస్తువులను కలుగ జేయును. చెట్ల ఆకులను పుట్టించి తన ఆకుపచ్చరంగు కిరణమును ఆహార ముగా చేయును. ఉచ్ఛ్వాస, నిశ్వాసములను, వానినుండి కంఠస్వరములను వ్యక్తము చేయును. వానినుండి అక్షరములను, పదములను, అర్థమును, వాఙ్మయమును, విజ్ఞానమును, వివిధత్వమును కలుగజేయును. కనుక నతడు

ప్రజల కధిపతి. సృష్టిలో ప్రజాపతు లనబడు కాలపు కొలతల ప్రజ్ఞలు వాని నుండియే పుట్టును. గ్రహముల పరిభ్రమణము, దాని కాలవిభాగము, సంవత్సరము, ఋతువులు మొదలగు వైభవములను కలిగించు ఛందస్సు లనబడు దేవతలు వానియందే పుట్టుదురు.

ఈ సృష్టియంతయు ఏడు లోకములుగా దిగివచ్చును గనుక, వానికి ఏడుగురు కొడుకులని పల్కింపబడినది. భౌతికశరీరమున ఏడు ధాతువులున్నవి. జిజ్ఞాసువగు ప్రజ్ఞకు ఏడు కక్ష్యల ద్వారములు తెరచికొనును. వాని సాధన కొరకే షట్చక్రములు, సహస్రారము ఏర్పడినవి. మనస్సునకు ఏడు పొరలున్నవి. కంఠనాళమునకు మూడు స్థాయిలలో ఏడు లోకములున్నవి. సూర్యకిరణములు ఏడు రంగులలో విస్ఫారును. భూమిచుట్టును గల మారుత మండలములు ఏడు. పరమాణువులు ఏడవస్థితిగా వ్యక్తమగును. పంచభూతములు, ప్రాణము, మనస్సు ఏడు వ్యూహములుగా పనిచేయును.

ఈ ముగ్గురిలో మొదటివాడు వేదాంతశాస్త్రము నందలి బ్రహ్మము. రెండవవాడు పురాణముల యందలి విష్ణువు. మూడవవాడు చతుర్ముఖబ్రహ్మ. ఈ ముగ్గురితోడి సృష్టి దేహమే సుపర్ణుడగు గరుత్మంతుడు. వాని మూపున అంతర్యామియే హరియై దిగివచ్చును. ఈ అంతర్యామియే విష్ణుసూక్తమున మూడడుగులలో దిగివచ్చిన విష్ణువుగా చెప్పబడినాడు. (ఇతడువేరు, త్రిమూర్తులలోని విష్ణువు వేరు.)

భువనములకు రక్షకుడు, ఇన్నిటి యందంతర్యామియై గోపనము చేయబడియున్నాడు. అనగా దేహాదులయందు వ్యూహములను పశువులను బంధించుచు, గోపుడై పాలించుచున్నాడు. (గోపుడనగా గోవులను పాలించువాడు. ఈ అభిప్రాయమే ఋషులచే కృష్ణకథ యందు నిబద్ధము చేయబడినది.) ఇందరిలో నొక్కడే అంతర్యామిగా నున్నాడు గనుక అతడే ఇనుడనబడుచున్నాడు. అనగా సూర్యునిగా దిగివచ్చి తరువాత సృష్టి నేర్పరచెను. ప్రతి హృదయమునందును తానుగా నున్నాడు గనుక ఆత్మయని అర్థము. సూర్యుడే జీవరాసుల కాత్మయని వేదమంత్రములే చెప్పుచున్నవి. సూర్యుడే ఆత్మకారకుడని జ్యోతిశ్శాస్త్ర చెప్పుచున్నది.

సుపర్ణసూక్తము ఋగ్వేదమున మొదటి మండలమున 164వ సూక్తము. దీర్ఘతమసుడను ఋషి ఈ సూక్తములకు మంత్రద్రష్ట. 52 మంత్రములు గల సుపర్ణసూక్తమునందు అనాదిగా నుపదేశింపబడుచున్న జ్యోతిర్విద్య, మోక్షవిద్య ముఖ్యముగా ప్రతిపాదింపబడినది. అక్షివిద్య, దహరవిద్య, అంతరాదిత్య విద్య, పంచాగ్నివిద్య అనబడు విద్యలు ఈ సూక్త మంత్రములలో ఆయా స్థానములందు స్వరూప నిరూపణముగా చెప్పబడియున్నవి. ఇందు మొత్తముమీద విశ్వేదేవతలు, వాగ్దేవత, ఆపస్సులు, సోముడు, అగ్ని, సూర్యుడు, వసువులు, శకధూమము, మంత్రాధి దేవతలుగా స్థాపింపబడిరి. వీరందరు తనలోని భాగములుగా గల సుపర్ణుడు, సూక్తము మొత్తమునకు ప్రధాన దైవతము.

(చూ. సుపర్ణుడు – మనువులు)

– [సు. సూ. పీఠిక, సూక్తముల వివరణ ననుసరించి సంగ్రహింపబడినది]

## సుపర్ణుడు

సుపర్ణుని వృత్తాంతమే ఒక పొడుపుకథగా విప్పి చెప్పుకొనదగినదై యున్నది. సూర్యుడే ఇతని శిరస్సు. వెలుగే ఇతని చూపు. ఏడులోకముల సృష్టియే ఇతని దేహము. తననుండి వచ్చుచున్న కిరణములే గోవులు. ఆ కిరణములు భూమిని తాకునట్టి భాగములే పదములు. వానితో భూమియందలి జలములను ఆవిరులుగా గ్రోలుచున్నవి. కిరణముల నుండి వెలువడు వెచ్చదనము, వెలుగు ఈ సృష్టికి పోషకములైన క్షీరములు. సూర్యునిచుట్టును ఏర్పడునట్టి వెలుగులకక్ష్యలే వస్త్రము అల్లుకొనినట్లు వివిధ గ్రహకక్ష్యలుగా నేర్పడి, భౌతికమనబడు భూలోకము వరకును దేహము అల్లుకొనుట జరుగుచున్నది.

– [సు. సూ. పే. 52]

## సుపర్ణుడు - మనువులు

మొత్తము సృష్టి వ్యూహమును జ్యోతిర్గోళమందు గల వ్యూహముగా, తన దేహనిర్మాణముగా సుపర్ణుడు పట్టియుంచెను. కనుక అంతర్యామి పురుషునకు వాహనముగా పనిచేయుచున్నాడు. అతనిరెక్కలు ఈకలవలె కిరణములు నలుదిక్కులకు వ్యాపించుచున్నవి. ఈ కిరణములచే నిర్మింప బడిన అనేక విభాగములుగల చక్రములు తిరుగుచున్నవి. వీనివలన గ్రహ ములు, సంవత్సరమాసములు ఏర్పడి భూమిపై జీవరాసుల సృష్టి ఏర్పడినది. జీవులు బయలుదేరి వేరువేరుగా తమ తమ ప్రవర్తనములతో తిరుగుచున్నారు. వీరందరియందు గూడ ఈ సుపర్ణుని దేహనిర్మాణ వ్యూహమే వేరువేరుగా వ్యక్తిగతముగా నేర్పడినది. అది ఈ దిగువ స్థితుల నిముడ్చుకొని యున్నది :

(A) ముగ్గురు పురుషులు (పు. సూక్తమునందలి మొదటి మంత్రమున వర్ణింపబడిన ముగ్గురు సోదరులు.)

(B) అందు ఒక పురుషునినుండి ఏర్పడిన ఏడుగురు పురుషులు.

(C) జ్యోతిర్మండలమను రథము.

(D) రథమున కేడుగుర్రములుగా ఏకచక్రమగు బింబమునకు ఏడు కిరణము లుగా ఈ గుర్రములు పనిచేయుట.

(E) ఏడుస్వరములు ఛందస్సులుగా పుట్టుట.

(F) పండ్రెండంచులు, అయిదంచులు, ఆరు అంచులుగల చక్రములు పుట్టుట.

(G) ఏడు కిరణములనుండి సూర్యుడు గాక మిగిలిన అయిదు గ్రహములు, చంద్రుడు, మొదట రజస్సులుగా పుట్టి, సుడిగుండములైన చక్రము లుగా తిరుగుట.

(H) గ్రహగోళములు మున్నగు నిర్మాణము, పై చక్రముల నిర్మాణము, ఏకకాలికముగా నేర్పడుట.

(I) భూగోళము కేంద్రముగా గోవు అనబడు జ్యోతిర్మండలము, దాని గమనము గర్భముగా నేర్పడుట.

(J) సూర్యోదయ సూర్యాస్తమయములు, మధ్యాహ్నము, అర్ధరాత్రము అను పాదములపై గోవు నిలబడుట.

(K) అహోరాత్రములు మున్నగు రూపమున ఆ సుపర్ణుని రెక్కలేర్పడుట.

(L) అంతర్యామి పురుషుడు, జీవుడు అను రెండు సుపర్ణము లేర్పడుట.

(M) ఈ రెండును సృష్టియందు విత్తనము, వృక్షము సంబంధమేర్పడిన పండును ఉపయోగించుచు వృక్షము నాశ్రయించి యుండుట.

(N) వీరు కారణముగా ఈ వృక్షమునుండి జీవకోటులు అనేక సుపర్ణులుగా నేర్పడుట.

ఈ పదునాలుగు స్థితులే తరువాత పురాణేతిహాసములలో ఈ వేదార్థ మును అర్థము చేసికొనగలుగునట్లు పదునలుగురు మనువులుగా వర్ణింపబడిరి. వాని కాలపు కొలతలే మన్వంతరములు. ఈ మన్వంతరముల కొలతలే తిథులుగా సూర్యచంద్రుల గతుల వలన భూమిపై చిన్న పన్నాలో నేర్పడినవి. అనేక సుపర్ణులు జీవులుగా నేర్పడినవి. ఇన్నిటికిని వేరువేరుగా జనన మరణములు, మొదలగు రెప్పపాటులు వర్తించుచున్నవి. ఇవి మనస్సు దేహేంద్రియములు అను వ్యూహములకు వర్తించుచున్నవిగాని, జీవులుగా తిరుగుచున్న సుపర్ణులైన ప్రజ్ఞలకు వర్తించుట లేదు. వారు అమృతస్వరూ పులు. ఈ అమృతమును (అనంతత్వమును) నిమేషముల నడుమకు తెచ్చు కొని పంచుకొనుచున్నారు. అమృతమునుండి భాగమును పంచుకొను చున్నారు. అమృతమునే పంచి తెచ్చుకొని తినుచున్నారు. అనగా జనన మరణాతీతులు తమ స్థితిని జనన మరణాదుల నడుమ అనుభవించుచున్నారు. నిమేషత్వము మనస్సు మున్నగు వ్యూహములకున్నను వారికి లేదు. శ్వాస, గుండె కొట్టుకొనుట మున్నగునవి ఆత్మకు లేవు. కాలవిభాగముగూడ లేదు.

— [సు. సూ. పే. 103]

## సృష్టి యజ్ఞము

యజ్ఞము చేయుటకు యజ్ఞశాల వుండును. దాని ఆవరణములు ఏడుగో చేయబడనవి. అనగా ఏడావరణములలో నీ యజ్ఞము చేయబడును. సమిధ లనగా హోమము చేయబడు పుల్లలు. ఇరువదియొక్క సమిధలతో నీ సృష్టి యజ్ఞము నడచును.

పురుషుడంతర్యామి కనుక ఈ యజ్ఞశాల వాని దేహమే. ఈ సమిధలు వాని జీవితమున హోమము చేయబడు సంబారములే. వాని జీవితము సంవత్సర స్వరూపము (యజ్ఞోవై సంవత్సరః). మండలాత్మకము గనుక అనంతము. అందు నిత్యము వ్యయమగుచుండు కాలాదులు సమిధలు. జీవులుకూడా పురుషుని ప్రతిబింబమే; కనుక జీవుని శరీరమునకు ఏడావరణ ములు (సప్తధాతువులు), ఇరువదియొక్క సమిధలు. 7 అను సంఖ్యలో నున్న తత్త్వమే పరిధులు; 3×7 అను సంఖ్యయే సమిధలు. భౌతిక సృష్టిలో 7, మానసిక సృష్టిలో 7, దివ్యసృష్టిలో 7, (Physical, Mental and Spiritual Planes of Existence). యజ్ఞ పరిభాషలో వీని వివరణ ఈ క్రిందివిధముగా నుండును.

అ) గాయత్రి మున్నగు ఛందస్సు లేడును వేదమును నడిపించు నడకలు. అవియే పరిధులు. ఈ ఛందస్సులే యజ్ఞశాలా నిర్మాణమున (ఆహవ నీయమనబడు అగ్నికి) మూడావరణములు (పొరలు). మూడుత్తర వేదికలు, ఆదిత్యుడు (ఆత్మ) అనబడు ఏడు వస్తువులు.

12 మాసములు, 6 ఋతువులు, 3 లోకములు (అసావాదిత్యుడు-Objectivity of the Creator of the Creation), అనునవి 21 సమిధలు.

(ఆ) ఇవియే భూతసృష్టిలో నీ క్రిందివస్తువులుగా వ్యక్తమగును. పరిధు లనగా నలుదిక్కుల నేర్పాటు చేయబడునవి. అవి 5 భూతములు (States of Matter) అహంకారము, బుద్ధియనునవి. ఇవియే మూడు తెట్లుగా మూడులోకములలో 21 సమిధలుగా వ్యక్తమగును.

5 భూతములు, 5 తన్మాత్రలు, 5 జ్ఞానేంద్రియములు, 5 కర్మేంద్రిములు, 1 మనస్సు.

అందు పృథివి (Solid), ఆపస్ (Liquid), తేజస్ (Fire), వాయువు (Gas), ఆకాశము (Objectivity of Space Charged) అనునవి పంచ భూతములు. ఇంక పంచతన్మాత్రలేవి యనగా శబ్దము (Sound), స్పర్శము (Touch), రూపము (Shape), రసము (Taste), గంధము (Smell). ఇక జ్ఞానేంద్రియములు : చెవి, చర్మము, కన్ను, నాలుక, ముక్కు. ఇక కర్మేంద్రియములు : వాక్కు (కంఠనాళము), పాదములు, చేతులు, మూత్రద్వారము, ఆసనము.

– [పు. సూ. పే. 15-16]

## సోమ యాగము

సోమయాగ మనగా కంఠమునుండి వచ్చు నాదము నుపాసించి పవిత్రులగుట. ఈ దేహము పిండగా వచ్చిన సారమే కంఠధ్వని. దానిని పిండి దేవతలకు, ఇంద్రునకు, పరమపురుషునకు సమర్పించు నాదోపాసనమే సోమ యాగము. ఈ సోమమును పిండుటకు రెండు తిరుగటి రాళ్ళుండును. వానిని గ్రావాణములు అందురు. "గ్ + రావాణములు" అనగా కంఠమందలి గకార స్పర్శచే రావము నుత్పాదించునట్టి స్వరపేటికలని చమత్కృతి. సంగీత సాధనము అని అర్వాచీనులు దేనిని సాధించిరో దానినే గాంధర్వ సాధనమను పేరుతో సాధించి సోమయాగముగా లోకమున కిచ్చిరి. సామము, సోమము, స్తోమము, సుష్నము, స్తుతి, స్తవము అను పదములన్నియు ఒకే సాధనమును తెలుపును.

ఈ రెండు సంప్రదాయములును ఎరుగని వేదబాహ్యులైన పండితులు పశుయజ్ఞమనగా జంతువులను బలియిచ్చు యజ్ఞమనియు, సోమయాగ మనగా సోమమను దుంపరసమును నైవేద్యము పెట్టి తామునుపుచ్చుకొను యజ్ఞమనియు వర్ణించిరి. ప్రాచీన యుగములలో సంప్రదాయ మెరుగనివారు భారతవర్షమునకు దండెత్తివచ్చి స్థిరపడిన వెనుక పండితులై బ్రాహ్మణులుగా ముదిరిపోయి ఇట్టి భ్రష్టసంప్రదాయము లేర్పరిచి యుందురు. వీనిని వేదముతో కలగా

పులగము చేయగా నేడు మనము చూచుచున్న వేదవాఙ్మయము ఏర్పడినది. "ఓషధిని పిండి సోమమును పానము చేసితి మనుకొనుచున్నారు." అని వీరిని పరిహాసము చేసిన మంత్రములు కూడ నేటి ఋగ్వేదమున నున్నవి. దీని వలన సోమమనగా కేవలము దుంపతెంపిన రసము మాత్రమే కాదని స్పష్ట మగుచున్నది. ఆధునిక పాశ్చాత్యులలో కొందరు సోమమనగా నొకవిధమైన మద్యము కావచ్చునని రచించిన మ్లేచ్ఛులుకూడ నున్నారు.

— [శ్రీ. భా. ప్ర. XVI పే. 36-37]

## సోముడు

సోముడూ గంధర్వుడు. అతనికొరకే సోమముగా వాక్కు, సంగీతరూప మున సంవత్సరసృష్టి పుట్టుచున్నది. దానిని పిండుటకే దేహాదుల నిర్మాణము. ఇదియే సోమయాగ మనబడు సంకేతము. సోముడు గంధర్వుడై సంగీతము పాడుచుండగా పరిభ్రమణము పుట్టి, అందుండి సూర్యోదయము రూపమున ఇంద్రుడు అహస్సును కలిగించుచున్నాడు మరల సోముడు సముద్రమున కధిపతియై పశ్చిమమున వరుణుడను పేర ఈ సమస్తమును మరల అవ్యక్త మను చీకటిలోనికి కొనిపోవుచున్నాడు. సోముడును ఇంద్రుడును కలసి తూర్పుపడమరల నేర్పరచి రజస్సులను పుట్టించుచున్నారు. వీరిద్దరే ఇంద్ర సోములు, మిత్రావరుణులు, ఇంద్రావిష్ణువులు, అగ్నావిష్ణువులు, అశ్వినులు అను వేరువేరు స్థితులలో ఈ సృష్టి చక్రమును నిర్వహించుచున్నారు.

— [సు. సూ. పే. 98]

## సోముడు - చంద్రుడు

చంద్రుడు మూడు విధములైన దేహములు కలిగియున్నాడు :

ఎ) మనోమయ దేహము : దీనివలన భూమిపై నున్న మనుష్యులకు, పశుపక్ష్యాదులకు, సరీసృపములకు మనస్సు ఏర్పడి పనిచేయుచున్నది. మనస్సు సహాయమున లోపల వెలుపలయను భేదము జీవుల కేర్పడును. దీనితో రక్షణము, పోషణము మున్నగు క్రియలను నిర్వర్తించుకొను

చున్నారు మానవులు లోకవ్యవహారములన్నిటిని మనస్సుతోనే నిర్వహించుకొందురు. దీనివలన పరిసరములు గుర్తించుటకు వీలగునే గాని, కర్తవ్య నిర్ణయమునకు మనస్సు పనికిరాదు. మనస్సు సహాయముతో జీవుడే బుద్ధియను సాధనరూపము ధరించి మంచిచెడ్డలను, కర్తవ్యమును నిర్వర్తించుకొనుచుండును.

బి) **అన్నమయ దేహము :** ఇది భౌతిక దేహము. దీని నిర్మాణము గర్భధారణము వలన జరుగును. గర్భమునందు చంద్రుని ప్రభావము పనిచేసి పిండము పెరుగుట, అవయవములు ఏర్పడుట జరుగును.

సి) **అమృతమయ దేహము :** అమృతమనగా తరగకుండుట. దేహ నిర్మాణము ప్రారంభమునుండి ఇంద్రియములు, మనస్సు పనిచేయుట ప్రారంభమై అనుక్షణము అదే ప్రక్రియ నడుచుచుండునట్లుగా చేయు నదే అమృతత్వము. మరియు జీవునకు అనేక జన్మలు, సృష్టిపరిణామమునకు తండ్రులు బిడ్డలుగా దిగివచ్చి తరములు నడచుచుండుట ఈ అమృతత్వములోని భాగములు.

చంద్రుడు వృక్షములకు ప్రాణ సంతృప్తిని చేకూర్చును. అనగా వెలుతురు, గాలి, నీరు స్వీకరించునట్టి సామర్థ్యము నేర్పరచును. ఇది ఉచ్ఛ్వాస నిశ్వాసములకు మూలమైన స్పందన లక్షణము వలన జరుగును. వీనికి కావలసిన కిరణములను చంద్రుడు సోముడను గంధర్వుని నుండి స్వీకరించును. కనుక సోముడనుపేరు స్థూలముగా చంద్రునకుకూడ వాడబడుచున్నది. సోముడు తాళలయాత్మకమైన సామవేద ధర్మమును పుట్టించును. దానివలననే వృక్షములు, మిగిలిన జీవులుకూడ గాలి, నీరు, ఆహారము స్వీకరించుట, విడచిపెట్టుట చేయగలుగుచున్నారు. వృక్షములుకాక మిగిలిన జీవులలో హృదయస్పందనము, ఉచ్ఛ్వాస నిశ్వాసములు కూడ ఈ తాళలయాత్మకమైన సామవేద ధర్మము ననుసరించియే ఏర్పడుచున్నది.

– [శ్రీ. భా. ప్ర. XII. పే. 75-76]

## హరి

నిశ్వాసాత్మకమైన 'హ' కారమును కంఠనాదమైన ఘోషముతో కలిపి యుచ్చరించినచో శ్వాసకు కారణమైన ప్రణవము వైఖరీ వాక్కులోనికి దిగి వచ్చి వినిపించును. దీనినే "నారాయణుడు హరియై దిగివచ్చుట" అని భాగవతమువర్ణించును. వాగ్రూపమైన ప్రణవమును తననుండి జీవులశ్వాసలుగా నుచ్చరించుట బ్రహ్మనేర్చిన విద్య. ఈ ఉచ్చారణము వలననే జీవరాసులు సృష్టింపబడుట లేక నారాయణుడు జీవులలోనికి దేహముతో నవతరించుట జరుగుచున్నది.

వైఖరీ వాక్కుగా చతుర్ముఖ బ్రహ్మనుండి యీ సృజనాత్మకమైన ప్రకృతి వాగ్రూపిణియైన సరస్వతీమూర్తిగా దిగివచ్చినది. దానికి ప్రతీకగనే జీవులకు శ్వాసావయవములు, కంఠధ్వని యంత్రమైన స్వరపేటికలు కలిసిన చోటేర్పడి విశుద్ధి చక్రముగా జీవుల కోశములను పరిశుద్ధి చేయుటకు వేచి యున్నది. ఎవడుచ్చరించునో వానిని ఆ నాదస్వరూపుడే పరిశుద్ధి చేయును. కేవల శాస్త్రవాక్యములుగా ఉచ్చరింపబడినపుడు అదే సరస్వతి శబ్దార్థరూపము లుగా మాత్రమే గోచరించును. దానివలన పాండిత్యభారము తప్ప ప్రయోజనము లేదు. ఎవరు దైనందిన లోకవ్యవహారమునకై ఈ ఉచ్చారణమును వాడుకొందురో వారికి ఆమె గృహక్షేత్ర ధన దారాది బంధనములుగా మాత్రమే గోచరించి సంసార జీవితమునుండి ఉద్ధరింపలేక వేచియుండును.

ఎవరు కంఠనాదము నుచ్చరించుచు దానినే వినుచుందురో వారికి సరస్వతియే హరిపదము నిచ్చును. వాక్కును వినియోగించి యితర విషయములను నేర్చుకొనుట ఆర్జించుట అను దాని ప్రాధాన్యముతగ్గి, ఆమెనే యుద్దేశించి ఉచ్చరించుట, వినుట, అను నంశమునకు జీవులు ప్రాధాన్యము నీయవలెను. "ఈ జీవులు నాతో చూచుచునే నన్ను చూడరు. నా వలన వినుచునే నన్ను వినరు", అని సరస్వతి పలుకుచున్నట్లు ఋగ్వేదమున సరస్వతీసూక్తములు వర్ణించుచున్నవి.

– [శ్రీ. భా. ప్ర. XI. పే. 15-16]

## హరిపాదము

హరిపాద మనగా హరియందు నాలుగవవంతయిన ఈ సమస్త సృష్టియును, మరియు మనయందున్న హరియందు నాలుగవవంతయిన వైఖరీ వాక్కునందు ఉచ్చరింపబడు ప్రణవగానము.

– [శ్రీ. భా. ప్ర. III. పే. 7]

## హ్రీం - హిరణ్యవర్ణాం

1) కిరణ మయములగు వర్ణముగలది. అనగా సూర్యుని కిరణములలో గల అన్ని వర్ణములు తన రూపముగా గలది. సూర్యరశ్మి కంటికి బంగారు వర్ణమువలె కనిపించినను, తత్త్వముచే స్వచ్ఛమైన వర్ణము కలది. భూమికి దిగివచ్చుసరికి ఏడురంగులు మొదలు వేన వేలు కిరణములుగా పరిణామము చెందును. అటుపైన అనేక వర్ణములతో నిండిన అణుమయ భౌతికపదార్థముగా రూపుకట్టును.

2) హకారము, రేఫము అనబడు వరేణ్య వర్ణములు గలది. అందు హకారము నిశ్వాసమగు సృష్టి బహిర్గత తత్త్వము. రేఫము కంఠము నుండి నాదమును వెలువరచు మొదటి ఛందస్సు. ఈ రెండును కలసి "హ్రీం" అను వర్ణము పుట్టి, అందుండి హరి, హర శబ్దములు దిగి వచ్చును. తరువాత మంత్రములలో "ఈం" లక్ష్మీబీజముగా చెప్ప బడినది. హ్ర+ఈం – హ్రీం అనునది శక్తిబీజము.

– [శ్రీ. సూ. పే. 9-10]



# కులపతి గ్రంథముల సంకేతనామ వివరణ

1. పు. సూ. — పురుష సూక్తము
2. శ్రీ. సూ. — శ్రీ సూక్తము
3. రు. సూ. — రుద్ర సూక్తము
4. వి. సూ. — విష్ణు సూక్తము
5. స. సూ. — సరస్వతీ సూక్తము
6. సు. సూ. — సుపర్ణ సూక్తము
7. తై. ఉ. — తైత్తరీయోపనిషత్తు
8. క. ఉ. — కఠోపనిషత్తు
9. శ. ని. త. శ. — శరీరనిర్మాణ తత్త్వశాస్త్రము
10. శం. రా. — శంఖారావము
11. మం. గీ. — మంత్రగీత
12. అ. దే. — అశ్వినీ దేవతలు
13. శ్రీ. భా. ప్ర. — శ్రీమద్భాగవత ప్రకాశము
14. రా. ప్ర. — రామాయణ ప్రసంగములు
15. మం. జా. — మంత్రజాలము
16. పు. మే. — పురుషమేధము
17. పు. పు. — పురాణపురుషుడు
18. క్రీ. మ. — క్రీడామయుడు
19. సీ. వి. వి. — మాష్టరు సీ.వి.వి.
20. ప్రా. ప — ప్రాక్-పశ్చిమములు
21. వి. స. నా. స్తో. — విష్ణుసహస్రనామ స్తోత్రము

# INVOCATION

*May the light in Me be the light before me*
*May I learn to see it in all.*
*May the sound I utter reveal the light in me,*
*May I listen to it while others speak.*

*May the silence in and around me present itself,*
*The silence which we break every moment,*
*May it fill the darkness of noice we do*
*And convert it into the Light of our background.*

*Let virtue be the strength of my intelligence,*
*Let realization be my attainment,*
*Let my purpose shape into the purpose of our earth,*
*Let my plan be an epitome of the Divine Plan.*

*May we speake the silence without breaking it*
*May we live in the awareness of the background,*
*May we transact light in terms of jay*
*May we be worthy to find place in the Eternal Kingdom*
*OM.*

Master E.K.